It is evident that the crash programme of publications is the highlight of the departmental activities.

I am highly grateful to the Government of Andhra Pradesh for their keen interest in developing this department

March 1986 (Sd ) V V L Narasimha Rao,
Hyderabad-1 Director,
A P G O M L & R I,
Hyderabad

---

P S In the first line at page 7 of this 'Preface' please substitute 'Hanuma' for Vasudeva at Sl No 21 and Vasudeva, for Mahipati at Sl No 22

The Synonyms like Mahidhara',' Bhupala', 'Dharaniramana', Dharanipa and 'Mahipati are common suffixes to the rulers of the progeny

Please see Sri T R's introduction in Telugu at page 96 also

# ఆళ్వారాచార్యుల చరిత్ర తత్త్వం

## శ్రీ తిరుమల రామచంద్ర

దేవర్షి అయిన నారదునికి ఒకానొకప్పుడు మనస్సు శోక వ్యాకులమయింది — ఎన్నో విద్యలు నేర్చాను, వాటి పరమార్థాన్ని తెలుసుకో లేకపోయాననే-అని బ్రహ్మ మానస పుత్రుడై విజ్ఞాని అయి విరాజిల్లే సనత్కుమారుని వద్దకు పోయి తన వ్యాకులతను ఇలా వివరించారు "ఋగ్వేదం భగవోఽధ్యేమి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థం ఇతిహాస పురాణం పంచమం వేదానాం వేదం పిత్ర్యం రాశిం దైవం నిధిం వాకో వాక్య మేకాయనం దేవవిద్యాం బ్రహ్మ విద్యాం భూత విద్యాం క్షత్ర విద్యాం నక్షత్ర విద్యాం సర్ప దేవ జన విద్యా మేతద్భగవోఽధ్యేమి, సోఽహం భగవో మంత్ర విదేవాస్మి నాత్మవిత్ "[1] అంటే-"భగవన్ నేను ఋగ్వేదాన్ని, యజుర్వేదాన్ని, సామవేదాన్ని, నాల్గవదైన అథర్వణ వేదాన్ని వేదాలలో ఐదవదైన ఇతిహాస పురాణ సంచయాన్ని, పితృలోకానికి సంబంధించిన వేదాన్ని, గణితాన్ని, భాగ్యాన్ని, నిధి నిక్షేపాల విద్యను, సంవాదాలను, ప్రాపంచిక విద్యను, దేవ విద్యను, బ్రహ్మ విద్యను, భూత విద్యను, క్షత్ర విద్యను, నక్షత్ర విద్యను, విషవిద్యను, సర్వదేవతలకు, సర్వ ప్రాణులకు సంబంధించిన విద్యలను, అధ్యయనం చేశాను కాని, భగవన్, నేను కేవలం మంత్రాలను తెలుసుకొన్నాను కాని, ఆత్మను, వాటి అంతర్యాన్ని తెలుసుకోలేకపోయాను ఇదే నా శోక కారణం దీనిని పోగొట్టి నాకు శాంతి కలిగించు" అని ప్రార్థించాడు.

### హృదయ ప్రాధాన్యం

సనత్కుమారుడు అతని ప్రార్థన మన్నించి, కేవలం విద్యా సంపాదనం ప్రధానం కాదని, ఆ విద్యలతత్త్వం సర్వశ్రేష్ఠం, సర్వసారం, సర్వాంతరం అయిన ప్రాణం ప్రధాన మని బోధించి, నారదుని శోకవిముక్తుని చేశాడు బుద్ధి కన్నా హృదయం మనకు సన్నిహిత మని దీని భావం

భాగవతావతరణం గురించి కూడ ఇలాటి గాథే ఉంది వేదాలను విభజించి మహా పురాణాలు రచించి, మహాశాస్త్రాలు ప్రవచించి, బ్రహ్మసూత్రాలు నిర్వచించి ఋషీశ్వరులకే

1 ఛాందోగ్యోపనిషత్తు 7 । 2 ।

తంమానికమైన వ్యాసమహర్షి చిత్తశాంతిలేక ఏకాంతంలో విచారగ్రస్తుడై ఉండగా, త్రిభువన పర్యాటకుడైన నారదుడు కాకతాళీయంగా వచ్చి, విచారకారణమేమని ప్రశ్నించాడు. వ్యాస మహర్షి తన ఆవేదన తెలిపాడు. అప్పుడు నారదుడు

'అంచితమైన ధర్మచయ మంతయుఁ జెప్పితి వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁగాక వీకు నీ
కొంచెము వచ్చు టెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా'"[2]

అని వివరించి కేవలం మనో బుద్ధులపై ఆధారపడే శాస్త్ర సముదాయం శాంతి కలిగించలేదని, హృదయ కవాటం తెరిచి భగవంతుని అర్చించి సంకీర్తనం చేయడమే ముఖ్యమని ఉపదేశించాడు. ఆ ఉపదేశానుసారం వ్యాసమహర్షి భక్తియుక్త చిత్తంతో సంపూర్ణుడైన సర్వేశ్వరుని ధ్యానించి మనస్సును ఏకాగ్రం చేసి

"అవనీ చక్రములోన నే పురుషుఁ డే యామ్నాయమున్ విన్న మా
ధవుపై లోకశరణ్యుపై భవములం దప్పింపఁ గాఁ జాలు భ
క్తి విశేషంబు జనింప దట్టి భువనక్షేమంకరంబైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్"[3]

మానవుడు ఎంత తపోధనుడైనా, యోగి అయినా హరిభక్తి విరహితుడైతే ఎట్టి శాంతిని పొందలేడని ఈ రెండు కథల అంతర్యం. "బౌద్ధికమైన అవగాహన మాత్రమే మానవుని హృదయాన్ని సంతృప్తి పరచలేదు. మనము కేవలము బుద్ధితోనే జీవింపలేము. మన భావాలకూ, ఉద్వేగాలకూ స్థానమైన హృదయం బుద్ధికంటే సన్నిహితం. హృదయం సంతృప్తి పొందకపోతే మానవుడు సుఖంగా ఉండలేడు. బుద్ధి మనస్సుకు శాంతి కలిగింప జాలదు."[4]

## భక్తితత్త్వం

ఈ విధంగా భగవంతుని మనస్సుతో కాక హృదయంతో చూడడం భక్తి. రాధాకృష్ణ పండితు డన్నట్లు "ఈ భక్తి ద్వారా మానవుడు తనకు భగవంతునితో గల సంబంధాన్ని వి

---

2 భాగవతం 1 1 96 3 భా 1 1 186 4 స్వామి అతులానంద వేదాంత కేసరి పుట 12 1927

దాని విశదంగా గ్రహించి, చివరకు తనకు అన్య భూతుడైన పరమాత్మకు శరణాగతుడవుతాడు"[5] ఈ భక్తిని పూర్వులు ఎలా నిర్వచించారో చూద్దాం

భక్తి శబ్దం భజ్ అనే ధాతువు నుంచి పుట్టింది భజించడం, కొలవడం, శరణాగతుడు కావడం దీని అర్థాలు

"అర్చత ప్రార్చత ప్రియమేధా సో అర్చత
అర్చంతు పుత్రకా ఉత పురం న ధృష్ణ్వర్చత।
అవ స్వరాతి గర్గరో గోధా పరిసనిష్వణత్
పింగా పరి చ నిష్కదద్ ఇంద్రాయ బ్రహ్మోద్యతమ్"[6]

"పాడండి పాడండి ప్రియమేధా పాడు బాలురారా గానం చేయండి దుర్గం రక్షణం అయిన ఆ భగవంతుణ్ని కీర్తించండి గర్గరం పెద్దగా పలుకు గాక! పిల్లా నిక్వణాలు ప్రతిధ్వనించు గాక! తీగలు తమ స్వరాలను అంతటా వ్యాపింపజేయు గాక! పరమేశ్వరుని కై మన కీర్తనము ఊర్ధ్వ రాగంలో ప్రసరించు గాక!" అని వేదఋషులు భక్తి పారవశ్యంతో సర్వేశ్వరుని సంకీర్తనం చేశారు

మానవుని ఆవిర్భావంతోనే భక్తి ఆవిర్భవించిన దన్నప్పుడు వేదఋషులు భక్తితో కీర్తించడం సహజాతి సహజం భక్తిని పలువురు ఋషులు, ఆచార్యులు వివిధరీతుల నిర్వచించారు "భక్తి రీశ్వర విషయా సానురక్తి రితి యుచ్యతే"[7] పరమాత్మ పరమైన అనురక్తే భక్తి అని శాండిల్య భక్తి సూత్రవ్యాఖ్యాత స్వప్నేశ్వరుడు నిర్వచించాడు ఇది "నిరంతర ప్రేమ ప్రవాహః"[8] నిరంతర ప్రేమప్రవాహమన్నారు భగవద్రామానుజులు ఈ నైరంతర్యంతోపాటు గాఢత్వమూ దీనిలో ఉండాలని విష్ణుపురాణ వచనం.

"యా ప్రీతి రవివేకానాం విషయే ష్వన పాయినీ,
త్వా మనుస్మరతః సా మే హృదయా న్మాపసర్పతు"[9]

"అవివేకులకు విషయ సుఖాలలో ఎలాంటి ఎడతెగని గాఢమైన ప్రేమ ఉంటుందో అలాంటిది భగవంతుణ్ణి ధ్యానించే భక్తుని హృదయం నుండి పోరాదు" నారద భక్తి సూత్రాలు

---

5 డా సర్వేపల్లి రాధాకృష్ణ ఇండియన్ ఫిలాసఫీ సం 2 పుట 705 6 ఋగ్వేదం 8 69 8-9 7 శాండిల్య భక్తి సూత్రం 1 6 8 భగవద్రామానుజులు, శ్రీభాష్యం 9 విష్ణుపురాణం 1 20 17

భక్తిని నిర్వచిస్తూ, వివిధ మతాలు వివరించి, చివరకు తన మతాన్ని నొక్కి చెప్పాయి "పూజాదిష్వనురాగ ఇతి పారాశర్యః కథాదిష్వితి గర్గః నారదస్తు తదర్పితాఖిలాచారతా తద్విస్మరణే పరమ వ్యాకులతేతి "[10] భగవంతుని పూజాదులలో అనురాగం భక్తి అని పారాశర్యుని భావం భగవత్కథలలో అనురాగం భక్తి అని గర్గుడన్నాడు కాని భగవంతునికి తన సకల వ్యవహారాలు అర్పించి, దైవం మరుపునకు వస్తే చింతపడడం భక్తి అని నారదుని మతం దీనినే యామునాచార్యులు

"దర్శనం పరభక్తిస్స్యాత్ పరజ్ఞానం తు సంగమః
పునర్విశ్లేష భీరుత్వం పరమా భక్తి రుచ్యతే "[11]

"భగవత్సాక్షాత్కారం పరభక్తి భగవదైక్యం పరజ్ఞానం భగవంతునితో తనకు వియోగం సంభవిస్తుందేమోనని భయపడడం పరమ భక్తి " అని వివరించారు దీనినే రూప గోస్వామి మరింత ధ్రువపరిచారు

"అన్యాభిలాషితా శూన్యం జ్ఞానకర్మాద్యనావృతమ్,
ఆనుకూల్యేన కృష్ణానుశీలనం భక్తి రుత్తమా "[12]

"ఎలాంటి ప్రతిఫలాపేక్ష లేక, జ్ఞానకర్మ విరహితంగా, కృష్ణుని నిరంతరం అనుకూల మార్గంలో సేవించడమే ఉత్తమ భక్తి "

కర్మ జ్ఞానాది యోగాల కన్నా భక్తియోగం ఉత్తమోత్తమమైందని భక్తాచార్యులందరూ చాటినారు "తదేవ కర్మజ్ఞాని యోగిభ్య ఆధిక్య శబ్దాత్ సాతు కర్మజ్ఞాన యోగేభ్యోఽప్యధిక తరా "[13] "ఆ భక్తి కర్మ జ్ఞాన యోగాల కన్నా గొప్పది " అని శాండిల్యుడు నొక్కి చెప్పాడు "త్రిసత్యస్య భక్తి రేవ గరీయసీ"[14] భక్తికి మించింది మరొకటి లేదు - అని నారదుడూ తన గ్రంథాంతంలో స్పష్టంగా చెప్పాడు

ఈ భక్తికి సాధ్యం కానిది ఏదీ లేదని ప్రాచీన భాగవతాది భక్తి గ్రంథాలు, ఆధునికుల వాక్యాలూ చెప్పుతున్నాయి భాగవతం

---

10 నారద భక్తి సూత్రాలు 1 16–19 11 యామునాచార్యులు ఆగమ ప్రామాణ్యం 12 రూపగోస్వామి భక్తిరసామృతసింధు ప్రారంభం 13 శాండిల్య భక్తి సూత్రం – 1 22, 2 1 14 నారద భక్తి సూత్రం 5 14

"వాసుదేవ కథా ప్రశ్నః పురుషాం స్త్రీః పునాతి చ,
వక్తారం ప్రచ్ఛకం శ్రోతృంస్తత్పాద సలిలం యథా''
''నారాయణపరా'' స్వర్గే న భయశ్చన విభ్యతి [16]

"వాసుదేవుని కథా ప్రసంగాలు పురుషులను, స్త్రీలను, చెప్పేవారిని, ప్రశ్నించే వారిని, ఆతని పాదోదకం లాగ పవిత్రులను చేస్తాయి నారాయణుని నమ్మిన వారు కొంచెమైనా భయపడ వలసిన పనిలేదు '' అని నొక్కి చెబుతున్నది " ప్రేమతో ప్రారంభమై, ప్రేమతో వృద్ధి పొంది ప్రేమతో సమాప్తమయ్యే వాస్తవమైన నిష్కాపట్యమైన భగవదన్వేషణమే భక్తియోగం"[16] అని వివేకానందుడు, "మానవ చిత్తవృత్తులకు ప్రత్యక్ష సంబంధం కలది భక్తియోగం "[17] అని హృషికేశంలోని దివ్యజీవన సంఘాధ్యక్షులైన స్వామి శివానంద సరస్వతి అన్నారు భక్తి అనేది జ్ఞాన యుక్తమైన ఆచరణ మని, అనగా భగవద్భక్తిలో మూఢత్వాలు ఉండరాదని, భక్తి పర్వతాలనైన కదిలిస్తుందని, దానికి అసాధ్యమేదీ లేదని రాధాకృష్ణ పండితుని విశ్వాసం [18]

## శరణాగతి-ప్రపత్తి-భరన్యాసం

ఈ భక్తి పరాకాష్ఠే శరణాగతి శరణాగతికి ప్రపత్తి అని, భరన్యాసమని పర్యాయాలు మన భారమంతా భగవంతునిపై ఉంచి, అనన్య భక్తితో నిశ్చింతగా ఉండడం భరన్యాసం ఈ విధంగా 120 సంవత్సరాలు జీవితాన్ని అసిధారా వ్రతంగా కొనసాగించిన వేదాంత దేశికులవారు

"అహం మద్రక్షణ భరో మద్రక్షణ ఫలం తథా,
న మమ శ్రీపతే రేవే త్యాత్మానం నిక్షిపేత్ బుధః "[19]

'నేను, నా రక్షణ భారం, నా రక్షణ ఫలం నావి కావు, శ్రియః పతి అయిన నారాయణునివే అని వివేకవంతుడు తనను భగవంతునికి సమర్పించుకోవాలి" అని ఉపదేశించారు

ఈ ప్రపత్తి బీజాలు వేదాలలోనే కనిపిస్తాయి, అక్కడక్కడ ''వయం హితే త్వే ఇద్ ఇంద్ర విప్రా అపి ష్మసి త్వ మస్మాకం తవ స్మసి '[20] "దేవా మేము నీ వాళ్ళం మీ పై ఆధారపడి ఉన్నాం నీవు మా వాడివి మేము నీవాళ్ళం " అనే మంత్రాలు ప్రపత్తిని సూచిస్తాయి యజుర్వేదంలోను శరణాగతి విస్పష్టంగా ఈ మంత్రంలో తావవస్తుంది.

---

16 భాగవతం 6 17 28  16 స్వామి వివేకానంద కంప్లీట్ వర్క్స్, సం 3, పుట 31 17 శివానంద సరస్వతి ,నారద భక్తి సూత్ర వ్యాఖ్య పుట 61 18 డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్, ఇండియన్ ఫిలాసఫీ, సం 2 పుట 664-65 19 వేదాంత దేశికుల న్యాస దశకం శ్లో 1 20 ఋగ్వేదం 8 66 13, 8 92 32

"తం పత్నీభి రనుగచ్ఛేమ దేవాః పుత్రైః భ్రాతృభి రుత హిరణ్యైః, నాకం గృభ్ణానాః సుకృతస్య లోకే తృతీయే పృష్ఠే అధి రోచనే దివః"[21] "ఓదేవా! సుకృతం చేసిన వారే ప్రవేశించడానికి అర్హమైన స్వర్గాది లోకాలపై విహరిల్లే త్రిపిష్టపాలను పొందడానికి పత్నులతోను, పుత్రభ్రాతృవర్గంతోను, ధన కనకసహితంగాను పూజ్యుడవు, ఉన్నత గతి ప్రదాయివి అయిన నిన్నే అనుసరిస్తున్నాము—శరణుపొందుతున్నాము

ఇక ఉపనిషత్తులో శరణాగతి ప్రస్తావం చాల చోట్ల కనిపిస్తుంది "ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే"[22] "మోక్షార్థి అయిన నేను నిన్ను శరణు పొందుతున్నాను" ఈ శరణాగతిని తైత్తిరీయారణ్యకం న్యాసవిద్య అని పేర్కొన్నది జిజ్ఞాసువైన అరుణి తన తండ్రి అయిన ప్రజాపతిని ఆత్మ శ్రేయస్సుకు సర్వోత్తమ మయిన ఉపాయం ఏదని ప్రశ్నిస్తారు ప్రజాపతి సత్యం, తపస్సు, దమం, శమం, దానం, ధర్మం ప్రజోత్పత్తి అగ్నిహోత్రం, యజ్ఞం, మానసోపాసన, న్యాసం అనే విధానాలు వివరించి, వీటిలో సర్వోత్తమం న్యాస విధానమని తెలుపుతారు న్యాస మంటే భరన్యాసం—ఆత్మ సమర్పణం భరతా చార్యుడు ప్రపత్తిని నిర్వచిస్తూ,

"అనన్యసాధ్యే స్వాభీష్టే మహా విశ్వాస పూర్వకమ్,
తదేకోపాయతా యాచ్ఞా ప్రపత్తి శ్శరణాగతిః"

ఇతర విధముల సాధ్యపడని తన కోరికను దేవా నీవే యుపాయమై నెరవేర్చుమని ప్రార్థించుటయే ప్రపత్తి అన్నారు[23] భగవద్రామానుజులు ప్రపత్తితో భక్తి సమాప్తి పొందుతుందన్నారు[24]

భక్తులు ఈ భక్తి ప్రపత్తులను వివిధ భావాలతో వ్యక్త పరచడం క్రమంగా పెంపొందింది భగవంతుని తండ్రిగా, తల్లిగా, మిత్రునిగా, సోదరునిగా చూచి మురిసిపోవడం వేదాలలోనే కనిపిస్తుంది ఋగ్వేద ఋషులు అగ్నిదేవుణ్ణి తండ్రిగ, బంధువుగ, సోదరునిగ, మిత్రునిగా కీర్తించారు "అగ్నిం మన్యే పితరం అగ్నిం ఆపిం అగ్నిం భ్రాతరం సదమిత్ సఖాయమ్"[25] కొన్నిచోట్ల తల్లిగాను పేర్కొన్నారు ఋషులు "త్వం హి నః పితా వసో త్వం

---

21 యజుర్వేదం 15 50 22 శ్వేతాశ్వతరోపనిషత్తు 6 18 23 సర్వార్థసిద్ధాంత సౌరభం నం, 7 పుట 22 24 రామానుజులు గీతాభాష్యం 18 66
25 ఋగ్వేదం 10 7 3

మాటా ''[26] ఓ వసూ, నీవు మాకు తండ్రివి నీవే మాకు తల్లివి—అని ఈ మంత్రంలో తల్లిగాను తండ్రిగాను భావించారు వారు సరస్వతిని ప్రార్థించినప్పుడు ఈ మాతృభావం స్పష్టమయింది

> "యస్తే స్తనః శశయో యో మయోభూః,
> యేన విశ్వా పుష్యసి వార్యాణి
> యో రత్నధా వసువిద్ యః సుదత్రః
> సరస్వతి తం ఇహ ధాతవే కః "[27]

"ఓ సరస్వతీ, నీ స్తనాలు నిండారి ఉన్నాయి అవి విశ్వ కల్యాణ కారకాలు వాటితో అన్నీ లను పోషిస్తున్నావు నీవు రత్న గర్భవు వసు గర్భవు వాటిని మాకు ప్రసాదిస్తున్నావు మా పోషణకై వాటిని మా ముందు పెడుతున్నావు" అని వారు స్తుతించారు ఇట్టి తల్లి భావనగం యొక్కలను మనం పెక్కింటిని చూడవచ్చును

అంతేకాక భక్తిలో భేదాలయిన శాంత దాస్య సఖ్య వాత్సల్య మధుర భావాలను కూడ వేదాంలో మనం కనుగొన వచ్చు భగవంతుని ఈ భావాంతో ప్రభువుగా స్తుతించిన మంత్రాలు చాలా ఉన్నాయి "త్రాతార మింద్రం అవితార మింద్రం "[28] రక్షకుడైన ఇంద్రుణ్ణి, పాలకుడైన ఇంద్రుణ్ణి

> "హిరణ్యగర్భః సమవర్తతాగ్రే
> భూతస్య జాతః పతి రేక ఆసీత్
> స దాధార పృథివీం ద్యాం ఉతే మాం
> కస్మై దేవాయ హవిషా విధేమ "[29]

''ఏ దేవుణ్ని మనం ప్రార్థిద్దాము! సృష్ట్యాదిలో గం తేవదేవుణ్ని, సృష్టికి ఏకైక పతి అయిన వానిని, 'ద్యావా పృథివులను నిలిపి ఉంచిన వానిని ప్రార్థిద్దాం'' అనే మంత్రాలలో శాంత భావం గోచరిస్తుంది భగవంతుని పలు విధాలుగా స్తుతించి అనుగ్రహం పొందడానికి ప్రయత్నించడం శాంతభావం వీటిలో దాస్య భావమూ స్పష్టం ''అస్మే తే సంతు సఖ్యా శివాని''[30] నీతు మాతోమైత్రి మంగళకరం కాని!, "భవాను సుమ్నే అంతమః సఖా వృధే''[31]

---

26 ఋగ్వేదం 8 98 11   27 ఋగ్వేదం 1 164 49   28 ఋగ్వేదం ;
29 ఋ 10 121 1   30 ఋ 81   ఋగ్వేదం 8 18 3

మా సంతోషం కోసం, మా సహాయ్యం కోసం నీవు మా దగ్గర ఉండు — అనే మంత్రాలలో సఖ్య భావం విశదమవుతుంది "శిశుం రిహంతి మతయః''[32] స్తోత్రాలు శిశువును ముద్దాడుతున్నాయి 'తం మాతా రేళ్హి స ఉ రేళ్హి మాతరమ్''[33] ఆతనిని తల్లి ముద్దుపెట్టుకొంటున్నది, ఆతడు తన తల్లిని ముద్దుపెట్టుకొంటున్నాడు, "శిశుం న విప్రా మతిభీ రిహంతి"[34] విప్రులు-జ్ఞానులు భగవంతుని శిశువును తల్లి లాలించినట్లుగా తమస్తోత్రాలతో లాలిస్తున్నారు—అనే ఋక్కులలో వాత్సల్య భావం సువ్యక్త మవుతున్నది మధుర భావానికి పెక్కు ఉదాహరణలు ఋగ్వేదంలో లభిస్తాయి "జారః కనీనాం పతి ర్జనీనామ్"[35] యువతులను ప్రియునిలాగ, భార్యలను పతిలాగ నన్ను ప్రేమించు, "జారః కనీన ఇవ చక్షదానః"[36] ప్రియురాలికి ప్రియుడు వరమిచ్చేరట్లుగా మాకు వరాలిమ్ము, "పరిష్వజంతే జనయో యథా పతిమ్"[37] భార్య భర్తను కౌగిలించుకొనేట్లు అనే ఋక్కులు మధుర భావాన్ని సూచిస్తున్నాయని వేరుగ చెప్పనక్కరలేదు

వైదిక ఋషులు ఈ భావాలలోనే గాక భగవంతుని ప్రేమపాత్రంగా, అతిథిగా, మరెన్నో రీతులుగా కైవారాలు చేశారు

"విచక్రమే పృథివీం ఏష ఏతాం
క్షేత్రాయ విష్ణుర్ మనుషే దశస్యన్
ధ్రువాసో అస్య కీరయో జనాస
ఉరుక్షితిం సుజనిమా చకార [38]

పరమాత్మ పృథివిని మనుష్యులకు ఆవాసంగా చేయడానికి ఆక్రమించుకొన్నారు దీన జనులు ఆతనిలో తమకు స్థిరమైన నివాసాన్ని పొందుతున్నారు ఆతడు ఈ క్షితిని మానవుం కోసం విశాలంగా చేశాడు, "విశ్వేషాం అతిథి ర్మానుషాణామ్"[39] ఆతడు సర్వమానవులకు అతిథి, "విశో విశో వో అతిథిమ్''[40] ఆతడు ఇంటింటికీ అతిథి, "ప్రేష్ఠం వో అతిథిం స్తుషే మిత్రమివ ప్రియమ్"[41] పరమ ప్రేమ పాత్రుడైన మిత్రుడిలాగ పి అతిథి అయిన భగవంతుని స్తోత్రం చేస్తున్నాము

---

32 ఋగ్వేదం 9 86 11  33 ఋగ్వేదం 10 114 4  34 ఋగ్వేదం 10 123 1  35 ఋగ్వేదం 1 66 4  36 ఋగ్వేదం 1 117 18  37 ఋగ్వేదం 10 43 1  38 ఋగ్వేదం 7 100 4  39 ఋగ్వేదం 4 1 20  40 ఋగ్వేదం 41, ఋ 8 84 1

"క్రతూయంతి క్రతవో హృత్సు ధీతయో
వేనంతి వేనాః పతయంత్యా దిశః,
న మర్డితా విద్యతే అన్య ఏభ్యో
దేవేషు మే అధితా మా అయంసత" [42]

మా హృదయాలలో వివిధ భావోద్వేగాలు తీవ్రమౌతున్నాయి. ప్రేమ కాంక్షలు ఉదయించి పరలం దిక్కులంతా వ్యాపిస్తున్నాయి. ఈ భావాలంటే ఉపశాంతి కారకాలు వేరే లేవు. నా అభిలాషలు—ఉదాత్తమైన ఆశలు దేవతలపైన—భగవంతునిపైన ఉన్నాయి" ఈ ఋక్కులలో భగవంతుని దీనబాంధవునిగా, అతిథిగా, ప్రేమ పాత్రునిగా భావించడం విస్తారంగా కనిపిస్తున్నది.

## విష్ణు - కృష్ణ - వాసుదేవులు

ఇంతకుముందే చెప్పినట్లు మానవునితోనే పుట్టిన కోమల భావమైన భక్తి వేదాలలో మొలకెత్తి ఉపనిషత్తులలో, పురాణేతిహాసాలలో విశ్వరూపం దాల్చింది. ఈ భక్తి కాలక్రమాన వివిధ దేవతల అధిష్ఠానంగా వివిధ రూపాలు ధరించి ఎందరిన్నో సంస్కారవంతులను చేసింది. ఆ రూపాలలో ఒక్కటి విష్ణువు అంశంగా విస్తరిల్లిన వైష్ణవం. విష్ణుభక్తి ప్రధానమైన మతం ఈ వైష్ణవానికి కూడ ఋగ్వేదంలోనే వేరులు వేయడం కనిపిస్తుందని పండితుల అభిప్రాయం. "విష్ణువును పరదైవంగా భావించి భక్తితో ఆరాధించే ప్రత్యేక సాకార దైవారాధన ప్రధానమైనది వైష్ణవ మతం. కాలాంతరాన ప్రాముఖ్యం వహించిన విష్ణువుకు, వైష్ణవ గాథకు మూలాలు ఋగ్వేదంలోనే కనిపిస్తాయి" అని ప్రొఫెసర్ డి సి సర్కార్ అభిప్రాయం.[43] విష్ణు అనగా వ్యాపనశీలుడు, సర్వవ్యాపి అని అర్థం. ఈ విష్ణువు నేడు వ్యాప్తిలోవున్న వైష్ణవ మతానికి అధిష్ఠాత అయిన దైవమైన విష్ణువు కాడని, నేటి సర్వాధిక్యమూ అనాడు లేదని, ఋగ్వేదకాలం ఇంద్రునికే ప్రాధాన్యం ఉండేదని, విష్ణువు ఇంద్రసఖుడుగానే వర్ణితుడని, మొదట్లో విష్ణునామంతో సూర్యుడే కీర్తితుడని, యజుర్వేద కాలంలో విష్ణువుకు ప్రాముఖ్యం కలిగి యజ్ఞస్వరూపు డయ్యాడని, తైత్తిరీయ, శతపథ బ్రాహ్మణాలలో, సకలాధిపాథుడుగ, యజ్ఞ స్వరూపుడుగ, ఐతరేయ బ్రాహ్మణంలో యజ్ఞ రక్షకుడుగా ప్రశంసితుడైనాడని, ఈ విధంగా

---

42. ఋగ్వేదం 10 64 2   43 ప్రొఫెసర్ డి సి సర్కార్, హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ద ఇండియన్ పీపుల్, పుట 461

విష్ణుపదం వివిధ రూపాలలో పరిణామం పొంది కాలాంతరాన వైష్ణవ సిద్ధాంతానికి అధిదేవతగా వెలుగొందినట్లు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ, ప్రొఫెసర్ ఎం రంగాచార్య, పి టి శ్రీనివాసయ్యంగార్, ప్రొఫెసర్ హేమచంద్రరాయ్ చౌధురి మున్నగు విద్వాంసులు భావిస్తున్నారు [44]

ఈ విష్ణుపదానికి పర్యాయాలుగా నారాయణ, భగ, వాసుదేవ, కృష్ణపదాలు క్రమంగా వ్యాప్తిలోకి వచ్చాయి నారాయణ శబ్దానికి నారాః అయనం యస్య సః—నరులకు ఆశ్రయమైన; నారాణాం అయనం అని పండితులు చెబుతున్నారు మనుస్మృతి దీనిని మరికొంత విస్తరించింది

"ఆపో నారా ఇతి ప్రోక్తాః ఆపో వై నరసూనవః
తా యదస్యాయనం పూర్వం తేన నారాయణః స్మృతః" [45]

నారం అంటే నీరు ఆ నీరే నరులను పుట్టించేది అలాంటి నారం స్థానం కావడంవల్ల నారాయణుడని చెప్పబడుతున్నాడు మహాభారతంలో నారాయణుని నిర్వచనం ఈ విధంగా ఉంది

"ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
అయనం మమ తత్పూర్వ మతో నారాయణో హ్యహమ్" [46]

నారమంటే నీరు ఆ నీరే నరులను ప్రసవిస్తుంది ఆ నీరు మొదట నాకు స్థానం కావడంవల్ల నేను నారాయణుడినయ్యాను—అని నారాయణుడే తనను వివరించినట్లుంది నరాణాం సమూహః నారం తదయనం యస్య సః—నరుల గుంపు నారం ఆ గుంపును ఆశ్రయించినవాడు, నరులందరిలోను ఉన్నవాడు అని వ్యుత్పత్తి చెబితే సర్వకాలాలకు సరిపోతుం దనుకుంటాను నీరు జీవికి మూలం గనుక ప్రాచీనులు నీటిని భగవత్స్వరూపమా శ్రయంగా భావించి ఉంటారు

భగ శబ్దం ఋగ్వేదంలో ఒక దేవతకు పేరు ఈ దైవం ఐశ్వర్య మిచ్చేదిగాను, రక్షించేదిగాను సర్వజ్ఞాన యుతంగాను, యుద్ధంలో సహాయకారిగాను వర్ణితం "తత్ సుతః సవితా భగో ఇంద్రో నో రాధ సాగమత్" [47] సవిత, భగుడు ఇంద్రుడు సంపదలతో వస్తున్నారు అని, "భగ త్రాతః [48]" భగుడు రక్షకుడు అని, 'పూషా భగః ప్రభృథే విశ్వభోజా' [49] విశ్వభోక్త అయిన భగుడు సర్వజ్ఞుడని, "పూషా భగః సరస్వతీ జుషంత" [50] భగో న కారే

---

44 సత్య సిద్ధాంత సౌరభం, సం 7, పుట 88–97  45 మనుస్మృతి 1 10
46 మహాభారతం, శాంతిపర్వం 341 40  47 ఋగ్వేదం 4 55 10
48 〃  49 ఋగ్వేదం 5 41 4  50 〃

హవ్యా మహీనామ్" [61] భగుడు ఇతర దేవతలతో సమానంగా యజ్ఞాలలో హవిర్భాగం పొందుతున్నాడు. అని వర్ణనలున్నాయి విష్ణు భగ శబ్దాలు వేదంలో ఎక్కడా పర్యాయాలుగా లేవని వేదజ్ఞు లంటున్నారు

కాని, ఈ పూర్వోక్త గుణసంపన్నుడైన భగుడనే వైదికదేవుడు క్రమంగా విష్ణుపర్యాయమైనాడని తోస్తుంది ఇన్ని గుణాలనుబట్టి భగ శబ్దానికి తర్వాత తర్వాత ఆరు అర్థాలు రూఢమయ్యాయి, ఆరు గుణాలు గలవాడు భగవానుడుగా రూపొందాడు

"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః,
జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా" [62]

సమగ్రైశ్వర్యం, వీర్యం, యశస్సు, సిరి, జ్ఞానం, వైరాగ్యం—ఈ ఆరూ భగశబ్ద వాచ్యాలని విష్ణుపురాణం నిర్వచించింది విష్ణుపురాణం భ గ అక్షరాలకూ వ్యుత్పత్తి చెప్పింది

"సంభర్తా చ తథా భర్తా భకారార్థో ద్వయాత్మకః,
నేతా గమయితా స్రష్టా గకారార్థ స్తథాయినే" [63]

భకారానికి సంభర్త, భర్త అని రెండర్థాలు సృష్టి కార్యానికి ప్రకృతి సాధనంగా కలవాడు సంభర్త సృజించిన దానిని భరించేవాడు పోషించేవాడు భర్త అట్లే గకారానికి సర్వాధారుడు, సర్వలయకర్త, సర్వ కర్త అని అర్థాలు, కనుక భగవానుడు భగవంతుడు అంటే సృష్టి స్థితి లయ కారుడని అర్థం ఈ పదం క్రమంగా నిఘంటువులకు ఈ అన్ని అర్థాలతోను చేరింది 'భగ శ్రీ కామ మాహాత్మ్య వీర్యయత్నార్క కీర్తిషు" అని అమరకోశకారుడు చెప్పాడు భగవద్రామానుజులు "సర్వహేయ ప్రత్యనీక కల్యాణ గుణవత్తయా, పూజ్యా త్పూజ్యతమో యో ఽసౌ భగవాన్ ఇతి శబ్ద్యతే" [64] అని భగవచ్ఛబ్దాన్ని నిర్వచించారు సర్వహేయ విరుద్ధమైన కల్యాణ గుణాలు కలిగి ఉండడంవల్ల పూజ్యులకన్నా పూజ్యుడైనవాడు భగవాన్ అని చెప్పబడుతున్నాడు అని దీని అర్థం

విష్ణు నారాయణ పదాలకు పర్యాయమైన కృష్ణ వాసుదేవ పదాల విషయంలోను పండితులలో మతభేదాలు చాల ఉన్నాయి కృష్ణ అనే పదానికి సామాన్యార్థం నలుపు కాని, కృష్ణుని అపూర్వ లీలలకు ఆకర్షితులైనందువల్ల కాబోలు నిఘంటుకారులు దానికి "కర్షతి చిత్త

---

61 ఋగ్వేదం 1 3 49 3   62 విష్ణు పురాణం 6 5 72

63 విష్ణుపురాణం 6 5 73   64 రామానుజులు విష్ణు సహస్రనామ భాష్యం

పతి కృష్ణః" మనస్సును ఆకర్షించేవాడు, "సర్వం కరోతీతి కృష్ణః" సకలమూ నిర్వహించేవాడు ఇత్యాదిగా వ్యుత్పత్తులు చెప్పారు. వేదాలలోను, ఉపనిషత్తులలోను కృష్ణుని ప్రసక్తి లేకపోలేదు కాని, ఆ ప్రసక్తి ఇప్పుడు ప్రపంచమంతా వ్యాపించిన కృష్ణునిది కాదు. ఋగ్వేదంలో కృష్ణుడు ప్రతినాయకుడై ఇంద్రుని ప్రత్యర్థిగా ఉన్నట్లు ఒక విచిత్రమైన ఋక్కు ఉంది.

"అవద్రప్సో అంశుమతీ మతిష్ఠ
దియానః కృష్ణో దశభిః సహస్రైః,
ఆవత్ త మింద్రః శచ్యాధ మంత
మపస్నేహితీ ర్నృమణా అధత్త "[65]

వేగంగా వెళ్లగల కృష్ణుడు పదివేల మంది భటులతో అంశుమతి దగ్గర ఋనలు కొడుతూ ఉన్నారు. మహాబలవంతుడైన ఇంద్రుడు అతన్ని పట్టుకొన్నాడు. మానవుల హితంకోరి ఇంద్రుడు అతని క్రూర సైన్యమును మట్టుపెట్టాడు. మరికొన్ని ఋక్కుల్లోను కృష్ణుడు ఇంద్రుని ప్రత్యర్థిగానే వర్ణితుడు. వీరిద్దరూ తరచు యుద్ధాలు చేసేవారని, ప్రతిద్వంద్విత్వం తీవ్రంగా ఉండేదని స్పష్టమవుతుంది.

"ప్రమందినే పితుమదర్చతావచో
యః కృష్ణ గర్భా నిరహన్నృజిశ్వనా,
అవస్యవో వృషణం వజ్రదక్షిణం
మరుత్వంతం సఖ్యాయ హవామహే "[66]

ఋజిశ్వంతునితో మనకు హితం కలిగించడానికి, మనకు మిత్రుడు కావడానికి కృష్ణుని భార్యల గర్భాలను విచ్ఛిన్నం కావించిన వజ్రాయుధధరుడైన, వరప్రదాత అయిన మరుద్గణాలతో పొందుకుంటున్న ఇంద్రునికి మన హవిస్సులను ఇస్తాము.

ఈ యుద్ధంలో కృష్ణుడు గెలిచినట్లు కానరాదు. అయితే, ఛాందోగ్యోపనిషత్తులోని "తద్ధైతద్ఘోర అంగిరసః కృష్ణాయ దేవకీ పుత్రాయోక్త్వోవాచ "[67] అంగిరసుని పుత్రుడైన ఘోర మహర్షి దేవకీ పుత్రుడైన కృష్ణునితో ఇలా అన్నాడు—అని ఈ మంత్రంలో కనిపించే

---

65 ఋగ్వేదం 8.96.13 66 ఋగ్వేదం 1.101.1 67 ఛాందోగ్యోపనిషత్ 8.17.6

కృష్ణుడు ఇంద్రునితో పోరాడినవాడు కాదు నూటపదారేండ్లు జీవించినవాడు [58] కాని, పురాణాల లోను ఇంద్రకృష్ణులకు సంఘర్షణ ఉంది ఆ సంఘర్షణలో కృష్ణుడే గెలిచాడు ఇవన్నిటి వల్ల విద్వాంసులు కృష్ణ పదం, కృష్ణ స్వరూపం కూడ మారుతూవచ్చిందని భావిస్తున్నారు హరివంశ భాగవతాదులలో వర్ణితమైన కృష్ణలీలలు ఋగ్వేదంలో కనుపించే గోరక్షకుడై గోప శబ్ద వాచ్యుడైన విష్ణువుకు సంబంధించిన గాథలనుండి బలవల బలవలుగా వ్యాప్తిచెంది ఉంటా యని ప్రొఫెసర్ డి సి సర్కార్ అభిప్రాయపడుతున్నారు [59] కృష్ణుడు అనార్యజాతి నాయకుడై ఉండి, వైదిక కాలంలో ఇంద్రునికి ప్రతిద్వంద్వి అయి, పురాణకాలంలో అధికవ్యాప్తి చెంది, భగవద్గీతా కాలానికి తన స్థానాన్ని తిరిగి సంపాదించుకొని భాగవతులు వాసుదేవుని తోను, వైష్ణవులు విష్ణువుతోను ఏకత్వం పొందారని డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ భావి స్తున్నారు [60] ఏమైనప్పటికీ వేదసూక్తాల కాలం నుంచి ఉపనిషత్కాలం వరకు కృష్ణుడు వైదిక తత్త్వజ్ఞుడనే సంప్రదాయం ఉండడం స్పష్టం మహాభారతేతిహాసంలో కృష్ణుని చరిత్ర అనార్యనాయకుడుగా, పరమార్థజ్ఞానోపదేశకుడుగా, అనార్యజాతికి అధిదేవుడుగా గోచ రిస్తున్నది కాలాంతరంలో కృష్ణుడు శ్రీ విష్ణు పరిపూర్ణావతారమనే స్థితి కూడ మహాభారతం నుంచే తెలుస్తున్నది [61] అని డాక్టర్ రాధాకృష్ణన్ కృష్ణుని విశ్వాచార్యత్వాన్ని నిర్ధారించారు నవభారత నిర్మాతలలో ఒకరైన వివేకానందులు కృష్ణుని గూర్చి చెప్పిన మాటలు ఇక్కడ ఉట్టంకించడం సముచితం "కృష్ణుడు వివిధ రూపాలలో ఆరాధింపబడుతున్నాడు అతడు పురుషులకే కాక స్త్రీలకు, పిన్నలకేకాక పెద్దలకూ ఆదర్శం ప్రేమ ప్రేమకోసం, విధి - కర్తవ్య నిర్వహణ విధికోసమనే మహాసత్యాన్ని ప్రపంచ చరిత్రలో తొలిసారిగా కనుగొని ప్రకటించిన ప్రథమాచార్యుడు" [62] అని వివేకానందుడు ఎలుగెత్తి కీర్తించారు

వాసుదేవ శబ్దం విషయంలోను పండితులు పెక్కు వాదవివాదాలు చేశారు భారత భాగవత హరివంశాలలోని కృష్ణుడు దేవకీ వసుదేవుల పుత్రుడు వసుదేవసుతుడు కావడం వల్ల వాసుదేవుడైనాడు "కాని ఈ పురాణములకు పూర్వగ్రంథములు వాసుదేవ పదమునకు కృష్ణ శబ్ద సంబంధము గానము ఆ పదము ప్రత్యేకముగ గోచరించును అందుచే నా వాసుదేవుడు కృష్ణ వాసుదేవునకు అన్యుడై యుండవలెను కాలక్రమమున వీరిరువురకును అభిన్నత్వ మేర్పడి

---

58 తిరుమల రామచంద్ర హిందువుల పండుగలు-పర్వములు, ప్రస్తావన 59 ప్రొఫెసర్ డి సి సర్కార్ హిస్టరీ అండ్ కల్చర్ ఆఫ్ ద ఇండియన్ పీపుల్ పుట 483 60 డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్ ఇండియన్ ఫిలాసఫీ, సం 1 పుట 87 61 డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్ ఇండియన్ ఫిలాసఫీ, సం 1, పుట 488 62 స్వామి వివేకానంద కంప్లీట్ వర్క్స్, సం పు 8, పుట 268

యీ కరుగకే భావింపబడి యుండురని తోచును ఈ విధమున శ్రీకృష్ణనామము గూడ కాలాంతర పరిణామము నొంది వివిధ ప్రవంతుల గలిపికొని మహానదు లేర్పడుచందము, అనేక స్వరూప చరిత్రముల స్వీకరించి ఒక మహాశబ్దమై వైష్ణవమతమున ముఖ్యస్థానము నొందినట్లు వృత్తము "[63]

## వైష్ణవమతం - ఆళ్వారులు

ఈ వైదికమైన విష్ణ్వారాధనం వివిధ సమయాల సంప్రదాయాపనదులతో పెనగొని, మహామతమై భారతదేశంలోని ఉత్తరాపథాన్నే కాక ఇతర ద్వీపాంతరా వ్యాపించింది ఉత్తరాపథం నుంచి దక్షిణాపథానికి విస్తరించింది నారాయణ్ వాసుదేవ భక్తి ప్రధానమైన భాగవత వైష్ణవమతం దక్షిణాపథానికి క్రీస్తు పూర్వం మొదటి శతాబ్దంలో వచ్చి వుంటుందని డాక్టర్ రాధాకృష్ణన్ అభిప్రాయపడుతున్నారు * క్రీస్తుశకం మొదటి శతాబ్దంలో వున్న హాల సాతవాహనుడు సేకరించిన గాథా సప్తశతిలో కృష్ణుని లీలలు తెలిపే గాథలున్నందున, ఆ కథలు దక్షిణాన అంత ప్రచారం పొందడానికి రెండు మూడు శతాబ్దాలయినా పట్టివచ్చునని భావిస్తే కృష్ణ భక్తి మతం అంతకు కొన్ని శతాబ్దాలకు ముందే దక్షిణానికి వచ్చి వుంటుందనుకోవచ్చు

ఈ మతవ్యాప్తిని ప్రొఫెసర్ హేమచంద్రరాయ్ చౌధురీ చర్చిస్తూ "ఉత్తర భారతం నుంచి దక్షిణానికి వలస వచ్చిన భాగవత సంప్రదాయానుయాయులలో నాథముని మొదటి వాడు కావచ్చును ఆయన తమిళదేశానికి భాగవతమతాన్ని తీసుకువచ్చి ఉంటాడు "[64] దీనినే ప్రొఫెసర్ టి రాజగోపాల చారియార్ సమర్థించారు వాస్తవానికి ఆళ్వారు దక్షిణా పథానికి వచ్చిన ప్రాచీన బ్రాహ్మణ మతప్రచారకులు వారు వేదాంత తత్త్వపు భక్త్యంశాన్ని ప్రచారం చేశారు ఆ పదానికి ప్రజాభాష వారి మూలి ప్రభావం కలిగించారు "[65]

ఆళ్వార్ అనే తమిళ పదానికి భక్తుడు, భక్తి తన్మయుడు భక్తి నిమగ్నుడు అని అర్థం "ఈ ఆళ్వారులు యోగీశ్వరులు, వీరు విశ్వపౌరులు వీరు సకల మానవాళికి చెందే

---

63 సర్వ సిద్ధాంత సారము, సం పు 7, పుట 61, 62 * డాక్టర్ రాధాకృష్ణన్ ఇండియన్ ఫిలాసఫీ సం పు 2 పుట 667, 64 ప్రొఫెసర్ హేమచంద్ర రాయ్ చౌధురీ మెటీరియల్స్ ఫర్ ది స్టడీ ఆఫ్ ది యర్లీ హిస్టరీ ఆఫ్ ది వైష్ణవ సెక్ట్ పుట, 112, 65 ప్రొఫెసర్ టి. రాజగోపాల చారియార్ వైష్ణవైట్ రిఫార్మర్స్ ఆఫ్ ఇండియా, పుట 8

వారు "66 అని ప్రొఫెసర్ టి ఎం పి మహాదేవన్ అనగా, "ఈ మహా భక్తులు భగవంతుని లోనే జీవిస్తూ, ఆధ్యాత్మిక మహాపురుష వర్గాన్ని నిర్మించారు "67 అని డాక్టర్ రాధా కృష్ణన్ ప్రస్తుతించారు "అపార భగవత్ప్రేమసాగరంలో క్రియాశీల శాంతిని పొందే ప్రేమ తన్మయతా సువర్ణ తరంగిణి ఆళ్వారు ఆతడు సజీవ భగవద్గీత, ఆతడు నిశ్శ్వసిస్తున్న ఉపనిషత్తులు, శాస్త్రాలు, ఆతడు సుందర దేవాలయం, భక్తి పారవశ్యాన్ని ప్రస్తుతించే పల్లవ "68

వీరు ఉత్తరభారతం నుంచి దక్షిణాపథానికి ముఖ్యంగా తమిళనాడుకు వచ్చి వివిధ కాలంలో వున్న విష్ణు భక్తి మతాన్ని తమిళభాషలోనే ప్రచారంచేసి తమిళదేశాన్ని విష్ణు భక్తి ప్రవాహంలో ముంచెత్తడమే కాక తమిళ సాహిత్యాన్ని అమృతమయం చేశారు ఈ ప్రవాహం దక్షిణం నుండి మరల ఉత్తర వాహిని అయి, ప్రవహించి వల్లభుడు మహాపురుషులను అవతరింప జేసింది ఈ ఆళ్వారులు మహాకవులు భక్తి దృష్టితోనే కాక కవితాదృష్టితోను వీరి రచనలు కలకాలం నిలుస్తాయి ఆళ్వారుల పాశురాలు (సూక్తులు) భగవద్భావ పరిపూర్ణాత్మకం హృదయ గానాలని డాక్టర్ రాధాకృష్ణన్ ప్రశంసించారు 69 "వారి పలుకులు అనుభూతి గాంభీర్యపు లోతులనుండి పైకివచ్చిన ముత్యాలు" అని ప్రొఫెసర్ కె శేషాద్రి అంటారు 70 'భగవంతుని అనంత కల్యాణగుణ మహోదధిలోనికి దూరము తొల్చి, ఆతనిలో ఏకత్వము కొరకు తృప్తినొందక ఆర్తిచే ముంచివేయబడి ఆతని గుణాభివర్ణనములో నిలిచి యున్నవారు ఆళ్వారులు వివేక హీనులై దోషభూయిష్ఠులై క్రిందనున్న మానవులను ఆదర్శోపదేశములచేత యథార్థ భక్తిని ప్రదర్శింప పరమాత్మునిచే ఆదేశింపబడి మానవాకృతి దాల్చిన నిత్య స్వతంత్ర భక్త శిఖామణులు ఆళ్వార్లు వారు పరమాత్ముని అమూల్యముగ గ్రహించి యుండుటచే వట్టి భక్తి తన్మయత్వమునొందిరి వారు శ్రీకృష్ణుని ఎక్కువగా కీర్తించిరి "71 అని స్వామి రామకృష్ణానందుల వివరణము

దక్షిణ భారతంలోని శ్రీ వైష్ణవ సంప్రదాయం ప్రకారం ఆళ్వార్లు పన్నెండుగురు శ్రీ వైష్ణవులు అనుదినం వారిని

---

66 ప్రొఫెసర్ టి ఎం పి మహాదేవన్ ఎ సెమినార్ ఆన్ సెయింట్స్, పుట 6
67 డాక్టర్ రాధాకృష్ణన్ సెమినార్ ఆన్ సెయింట్స్, పుట 4 68 ఆరాధన పుట 46, ఏప్రిల్ 1966 69 డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్ ఇండియన్ ఫిలాసఫీ, సంపు 2, పుట 666
70 ప్రొఫెసర్ కె శేషాద్రి సెమినార్ ఆన్ సెయింట్స్, పుట 161 71, సర్వ సిద్ధాంత సారము సంపు 7, పుట 118–119

"భూతం సరశ్చ మహదాహ్వయ భట్టనాథ
శ్రీభక్తిసార కులశేఖర యోగివాహాన్,
భక్తాంఘ్రిరేణు పరకాల యతీంద్ర మిశ్రాన్
శ్రీమత్పరాంకుశమునిం ప్రణతోఽస్మి నిత్యమ్ "

అని స్మరిస్తూ వుంటారు. వీరి తమిళనామధేయాలు వరుసగా ఇవి, పూదత్తాళ్వార్, పొయ్‌గై యాళ్వార్, పేయాళ్వార్, పెరియాళ్వార్ (విష్ణుచిత్తుడు), తిరుమళిశై యాళ్వార్, కులశేఖరాళ్వార్, తిరుప్పాణ యాళ్వార్, తొండరడి ప్పొడియాళ్వార్, తిరుమంగై యాళ్వార్, మధురకవి యాళ్వార్, నమ్మాళ్వార్. పెరియాళ్వార్ కుమార్తె అయిన ఆండాళ్‌ను (గోదాదేవిని) కూడ చేర్చడంతో ఆళ్వార్ల సంఖ్య పన్నెండవుతుంది.

శ్రీవైష్ణవులు వీరి అవతారకాలం గురించి గురు పరంపర ప్రకారం ద్వాపరయుగమని అంటారు. కాని, వారి రచనలభాష, వాటిలోని విషయాలు మున్నగువానిని బట్టి క్రీస్తుశకం తర్వాతేనని ఆధునిక చరిత్రకారుల నిర్ణయం. ఇంతకూ "వివిధాళ్వారుల కాలం గురించి కచ్చితంగా నిర్ధారణ చేయలేము. క్రీస్తు శకం 500 సంవత్సరాలనుంచి మూడు శతాబ్దాల కాలంలో జీవించి వుంటారని సామాన్యంగా అందరూ అంగీకరిస్తున్నారు " అని స్వామి స్మరణానంద అభిప్రాయపడుతున్నారు.[72] మూలాళ్వారులనబడే పేయాళ్వార్, పొయ్‌గై యాళ్వార్, పూదత్తాళ్వార్, వారి సమకాలికుడైన తిరుమళిశై యాళ్వార్ ద్వాపరయుగంలో తొండమండలంలో పల్లవరాజ్యంలో ఉన్నారన్నది సహేతుకంకాదని, పల్లవులు క్రీస్తుశకం నాల్గోశతాబ్దంలో కాంచీపురాన్ని పాలించారని, పూదత్తాళ్వార్ రచనలో నేటి మహాబలిపురమైన మామల్లపురం ఆతని జన్మస్థానమని స్పష్టంగా ఉండడంవల్ల, ఆ మామల్లపురం క్రీస్తుశకం ఏడవ శతాబ్దంలో నిర్మితం కావడంవల్ల ఈ ఆళ్వారు, ఇతని సహచరులు ఏడవ శతాబ్దంలో ఉండివుంటారని ప్రొఫెసర్ టి. ఏ. గోపీనాథరావు అభిప్రాయం.[73] కాని, ఆళ్వార్లు మూడవ శతాబ్దంనుంచి తొమ్మిదవ శతాబ్దం వరకు ఉండివుంటారని డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ అంటున్నారు.[74] మరికొందరు పండితులు ఈఆళ్వార్లను మూడు వర్గాలుగా-ప్రథమ, మధ్యమ, అంతిమవర్గాలుగా విభజించారు. పొయ్‌గై యాళ్వార్, పూదత్తాళ్వార్, పేయాళ్వార్, వీరిసమకాలికుడైన తిరుమ

---

72 స్వామిస్మరణానంద. ప్రబుద్ధభారత, పుట 228, 1981 73 ప్రొఫెసర్ టి. ఏ. గోపీనాథరావు. ది హిస్టరీ ఆఫ్ శ్రీ వైష్ణవాస్, పుట 10 74 డాక్టర్ కె. కృష్ణస్వామి అయ్యంగార్. ఎర్లీ హిస్టరీ ఆఫ్ వైష్ణవిజం ఇన్ సౌత్ ఇండియా, పుట 80

శై యాళ్వార్— ఈ నలుగురు ప్రథమ వర్గంవారు నమ్మాళ్వార్, కులశేఖరాళ్వార్, మధుర కవి యాళ్వార్ పెరియాళ్వార్, ఆండాళ్— ఈ అయిదుగురు మధ్యమవర్గంవారు తొండరడి ప్పొడి యాళ్వార్, తిరుప్పాణి యాళ్వార్, తిరుమంగై యాళ్వార్— ఈ ముగ్గురు అంతిమ వర్గంవారు

పరమకారుణికుడైన భగవంతుడు అనాదికర్మవాసనాదోషదూషితాంతఃకరణులయి అప మార్గంలో ప్రవర్తిస్తోవారిని చూచి, వాళ్లను ఎట్లయినా ఉద్ధరించాలనే సంకల్పంతో భూలోకంలో మానవుడుగా రామకృష్ణాది రూపాలతో అవతరించారు అయినా, ఈ చేతనులు ఆసురభావం అవలంబించి తన ఎడల తగిన భక్తి విశ్వాసాలు చూపక అధోగతికి అభిముఖులుగా ఉండటం చూశారు వారిని ఎలాగయినా గట్టెక్కించాలనే సంకల్పంతో తనను పరివేష్టించిన నిత్యులయిన అనంత గరుడ విష్వక్సేన ప్రభృతులను, తాను ధరించిన శ్రీవత్స కౌస్తుభ వనమాలా వైజయంతీ పంచాయుధాలను పరికించారు వారు, అవి తనకున్నట్టి శక్తిగలవారు, కనుక వారిని ద్రవిడదేశానికిపోయి, కావేరీ, తామ్రపర్ణీ, కృతమాలా (వైగై), పయస్విని (పాలార్) మున్నగు నదీ తీరాలలో ఇష్టమైన చోట్ల, ఇష్టమైన వర్ణాలలో అవతరించి సకల చేతనులను తరతేర్చుదని ఆజ్ఞాపించారు ఆ ఆజ్ఞ శిరసావహించి వారంతా సరోభూతాద్యాళ్వార్లుగా జన్మించి సర్వాధికార మైన ద్రావిడ వేదాన్ని సాంగోపాంగంగా లోకోపకారార్థమై రచించారు— ఇది శ్రీ వైష్ణవుల సాంప్రదాయికంగా ఆళ్వార్ల జన్మవృత్తాంతం గురించి నమ్మేవిషయం కనుక ఇది వైదిక విష్ణు భక్తి సంప్రదాయానికి ద్రావిడ దేశంలోవున్న విష్ణుభక్తి తత్త్వానికి సమన్వయంగా భావించాలి

## మొదటి ఆళ్వార్లు

### సరోయోగి

తొలి ముగ్గురు ఆళ్వారులలో పెద్దవారయిన సరోయోగి (పొయ్‌గై యాళ్వార్)[76] ద్వాపర యుగంలో సిద్ధార్థ నామ సంవత్సరాన ఆశ్వయుజమాసంలో శుక్లపక్షాష్టమీ మంగళవారంనాడు

---

76 ఈ ఆళ్వార్ నిత్యతనియ—

కాంచ్యాం సరసి హేమాబ్జే జాతం కాసార యోగినమ్
కలయే యః శ్రియఃపత్యా రవిం దీప మకల్పయత్

తిరునక్షత్రం తనియ —

తులాయాం శ్రవణే జాతం కాంచ్యాం కాంచన వారిజాత్,
ద్వాపరే పాంచజన్యాంశం సరోయోగిన మాశ్రయే

శ్రవణ నక్షత్రంలో కాంచీపురంలో ఉన్న యథోక్తకారిస్వామి సన్నిధిలో ఒక తామరకొలనిలోని ఒక తామరపూవులో సర్వేశ్వరుని పాంచజన్యాంశలో అవతరించారు ఈయన చెప్పనలవికాని జ్ఞానభక్తి వైరాగ్యాలు కలవారై ఆశ్రితులను ఉజ్జీవింపచేస్తూ ఉండేవారు

## భూతయోగి

ఈ ముగ్గురిలో రెండవ వారయిన భూతయోగి (పూదత్తాళ్వార్) పొయ్‌గైయాళ్వార్ అవతరించిన మరునాటి దినం ధనిష్ఠా నక్షత్రయుక్త నవమినాడు సముద్రతీర మందున్న తిరుక్కడల్మల్లై (మల్లాపురం - నేటి మహాబలిపురం)లో ఒక బండిగురివిందపూవులో మహా విష్ణువు గదాంశలో జన్మించారు భగవదనుగ్రహంతో పరమభక్తి జ్ఞాన వైరాగ్యాలు కలవారై భగవంతునికి అంతరంగభక్తులై ఉండేవారు [78]

## మహాయోగి

వీరిలో మూడవవారైన మహాయోగి (పేయాళ్వార్) పూదత్తాళ్వార్ జనించిన నెలలోనే శతభిషా నక్షత్రయుక్త దశమినాడు మయూరపురంలో (నేటి మద్రాసులోని మైలాపూర్‌లో) మాధవస్వామి మందిర సమీపంలోని కోనేటిలో ఎర్రకలువలో అవతరించి, జనం తన్ను పిచ్చివాడు అని అనుకొనేరీతిగా భగవద్భక్తిలో ఒడలు తెలియక ఉండేవారు వీరు ముగ్గురూ సమీపస్థలాంలో, ఒకరి తర్వాత ఒకరు ఒకదినం వ్యత్యాసంతో జన్మించినా, ఒకరిని మరొకరు ఎరుగరు ముగ్గురూ గ్రామైకరాత్రంగా తిరుగుతూ, భక్తి ప్రచారం చేసేవారు

ఇలా తిరుగుతున్న వీరు ఒకమారు ఒకరాత్రి తిరుక్కోవలూరు (దేహళీనగరం) అనే ఊరిలో ఒక భాగవతోత్తముని ఇంటి అరుగుమీద చేరారు ఆ అరుగు ఒకరు పడుకోడానికి, ఇద్దరు కూర్చోడానికి, ముగ్గురు నిలబడడానికి చాలినట్టిది మొదట సరోయోగి ఆ అరుగుపై చేరారు పిదప భూతయోగి వచ్చారు తర్వాత మహాయోగి సమీపించారు ముగ్గురూ

---

78 ఈ ఆళ్వార్ నిత్యతనియ—

మల్లాపుర వరాధీశం మాధవీ కుసుమోద్భవమ్,
భూతం నమామి యో విష్ణోః జ్ఞానదీప మకల్పయత్

తిరునక్షత్ర తనియ—

తులా ధనిష్ఠా సంభూతం భూతం కల్లోల మాలినః
తీరే ఫుల్లోత్పలే మల్లాపుర్యా మీడే గదాంశకమ్

పరస్పరం కుశలప్రశ్నం తర్వాత విష్ణుభక్తుని తెలుసుకొని ఆ అరుగుమీదే సర్దుకొని నిలబడు న్నారు. వారి ఓరిమిని పరీక్షింపదలచి సర్వేశ్వరుడు అదృశ్యంగా వారి మధ్యకు వచ్చి ఒత్తిడి కలిగించడం ప్రారంభించాడు. చిమ్మచీకటి తమకు తెలియకుండా నాల్గవవారెవరో తమ మధ్య దూరుతున్నట్టు తోచి వారు ముగ్గురూ ఆశ్చర్యపడి, చివరకు అది భగవత్సన్నిధిగా గ్రహించి ప్రార్థించారు. వారికి పరమాత్మ సాక్షాత్కరించాడు. వెంటనే వారు ఆనందోత్సాహాలు పొంగి పొరలగా పాశురాలతో స్తుతించారు. పొయ్‌గైయాళ్వార్ పరవశించి

"వైయందగళియా వార్కడలే నెయ్యాగ
వెయ్య కదిరోన్ విళక్కాగ
సెయ్య సుడరాగియా నడిక్కే
సూట్టినవే ఇడరాళినీంగవే యెన్ఱు"

ధారుణి ప్రమిదగ పారా
వారము ఘృత పూరముగను వనజాతహితుం
దారోపిత దీపముగా
నారతి నిడి సూక్తిమాల హరి కర్పింతున్[77]

అని స్తోత్రం చేయగా, భూదత్తాళ్వార్ ఆనందతుందిలులై

"అన్బే తగళియా ఆర్వమే నెయ్యాగ
ఇన్బురుగు సిందై ఇడుతిరిమానం బురుగి
ఞానచ్చుడర్ విళక్కేత్తినేన్
నారణర్కు ఞానత్తమిళ్ పురిందనాన్"

మనముమ ప్రమిదగ భక్తిని
ననువగు నెయిగాగ ప్రేమ నతి కోజ్జ్వలమై
తనరెడు చిత్తము వత్తిగ
ఘనదీపము నెత్తితివుడు కమలాక్షునకున్[78]

అని కొనియాడారు. వెంటనే పేయాళ్వార్ కనుల నుండి ఆనందబాష్పాలు రాలుతుండగా,

---

77 శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు శ్రీ మహాభక్త విజయం,
గురుపరంపరా ప్రభావం, పుట 587 78 పూర్వపు గురుపరంపరా ప్రభావం పుట 587

"తిరుక్కండేన్ పొన్మేని కండేన్
తిగళుమ్ అరుక్కనణి నిఱముమ్ కండేన్
సెరుక్కిళరుమ్ పొన్నాళి కండేన్
ఎన్నాళివణ్ణ న్పాలిన్ను"

కంటిని మరమున లక్ష్మిని
గంటిని కనకంపు మేను కమలాప్తరుచిన్
గంటిని కర యుగమున నే
గంటిని చక్రాబ్జములను కమలాక్షునెదన్ 78

అని శంఖచక్రాద్యాయుధ హస్తుడు లక్ష్మివిరాజిత వక్షస్కుడు అయిన కమలాక్షుని కీర్తించారు. ఈ ఆళ్వార్లు ముగ్గురూ సంసార సాగరమగ్నులైనవారి అజ్ఞానాన్ని భక్తి యోగంతో పోగొడుతూ, ఎనలేని ఇహలోకంలో దివ్యమహిమలు చూపుతూ తుదకు శ్రియఃపతి ఆజ్ఞ ప్రకారం వైకుంఠ దివ్యధామం చేరారు

పైన పేర్కొన్న మూడు పాశురాలూ ఆ ఆళ్వార్లు ముగ్గురూ రచించిన తిరువందాది అనే దివ్య ప్రబంధాల మొదటి పాశురాలు అందాది అంటే అంతాది అనగా తొలి పద్యాల మొదటి పద్యం చివరి పదం రెండవ పద్యం మొదటి పదమై ఉంటుంది ఒకదాని అంతంతో ప్రారంభమయ్యే రెండవ దాని ఆది అంతాది ఒకవిధంగా ముక్తపదగ్రస్తం ముక్తపదగ్రస్తమైన సమాసాలు, వాక్యాలు ఉన్నాయిగాని, కావ్యమంతా పద్యాంత పద్యాది క్రమంలో రచించే సంప్రదాయంలేదు ఈ ఆళ్వార్లు సాయించిన * మూడు అందాదులు వరుసగా మొదల్ తిరు వందాది, ఇరండాం తిరువందాది, మూన్రాం తిరువందాది అని ప్రఖ్యాతమయాయి తిరు ప్రతిదానికి చేర్చడం శ్రీవైష్ణవ సంప్రదాయం – సిరి అంతాది అని అర్థం

## భక్తిసారులు

తిరుమళిశైయాళ్వార్ (భక్తి సారులు) ఒకరికి జనించి మరి ఒకరి బిడ్డగా పేరు పొందిన వారు కాంచీపురానికి తూర్పున ఉన్న తిరుమళిశై అనే క్షేత్రంలో భార్గవుడనే బ్రాహ్మణునికి కనకాంగి అనే అతని భార్యకు పుష్యమాసంలో మఖానక్షత్రయుక్త శుభదినంలో విష్ణు చక్రాం

---

78 ఆ గురుపరంపరాప్రభావం పుట 667   * అనుగ్రహించిన, ప్రసాదించిన అనడానికి శ్రీవైష్ణవ పరిభాష

కాన ఈయన జన్మించారు [౪౦] తిరుమళిశై క్షేత్రానికి మహీసార క్షేత్రమని, విదేహావన క్షేత్రమని నామాంతరం ఉంది ఈ ఆళ్వార్ ఆకారంలేని మాంసం ముద్దగా జనింపగా, తలిదండ్రులు అనాదరంతో ఒక పేవ తుప్పలో పారేశారు కాని, ఆ మాంసంముద్ద లోకమాత అయిన లక్ష్మీదేవి అనుగ్రహంతో మనుష్యాకృతిపొంది సజీవమై ఏడవసాగింది ఆ ఏడుపును ఆ ప్రాంతానికి వేటకై వచ్చిన తిరువాళన్ (భర్గుడు) అనే వెత్రపు పనివాడు విని పేవతుప్పలో పడివున్న శిశువును చూసి ఇంటికి తీసికొనిపోయి పిల్లలులేని తన భార్యకు అప్పగించారు ఆమె పెన్నిధిని కనిన పేదవలె సంతోషించి పుత్రప్రీతితో పెంచసాగింది ఆమెకు ఆ శిశువును చూడగానే పాలిండ్లలో చేపు వచ్చింది కాని ఆ శిశువు ఆమె పాలు కుడవక మలమూత్రాలు కూడ విసర్జింపక ఆరోగ్యంగా పెరుగడం తలిదండ్రులకేకాక చుట్టుపట్ల వారికికూడ ఆశ్చర్యం కలిగించారు

ఈ వింత చూడడానికి ఒక వృద్ధ దంపతులు కాచిన పాలు పట్టుకొని ఒకనాడు ఉదయం వచ్చి పాలు తాగుమని ఆ శిశువును పలుమారు ప్రార్థించారు దానికి అంగీకరించి ఆళ్వార్ ఆ పాలు స్వీకరించారు, మిగిలినపాలు వృద్ధ దంపతులు ప్రసాదంగా పుచ్చుకొనేవారు ఆ పాలవల్ల ఆ వృద్ధదంపతులకు ఒక కుమారుడు కలిగాడు అతనికి కణికృష్ణ అనే పేరు పెట్టారు

భక్తిసారులు పెరిగి సకల విద్యలూ నేర్చి విష్ణుసర్వోత్తమత్వమందే విశ్వాసం ఉంచి తిరువల్లిక్కేణి (నేటి మద్రాసులోని ఒక భాగం)లోని గజేంద్ర సరస్తీరంలో యోగాభ్యాస నిరతులై ఉండేవారు వృద్ధదంపతుల పుత్రుడైన కణికృష్ణుడూ భక్తిసారుల అనుగ్రహంతో విద్యావంతుడై కవిశిరోమణి అనే బిరుదుపొంది నారాయణపరాయణుడై ఉండేవాడు

---

౪౦ ఈ ఆళ్వార్ నిత్యతనియ —

భక్తిపంచమయ విగ్రహాత్మనే
శక్తితా రజిత బుద్ధి హారిణే,
ముక్తి దాయక మురారి పాదయోః
భక్తిసార మునయే నమోనమః

తిరునక్షత్రతనియ — మఖాయాం మకరేమాసే చక్రాంశం భార్గవోద్భవమ్,
మహీసార పురాధీశం భక్తిసారమహం భజే

భక్తిసారులు మొదట శివభక్తులై శివవాక్కియార్ అని పేరు పొందారని, సమకాలీనులైన పేయాళ్వారుతో ఒకమారు శివకేశవ ప్రాధాన్యంపై జరిగిన వాదంలో పరాజయం పొందడం వల్ల వైష్ణవమతం స్వీకరించారని ఒక కథ ఉంది

ఒకమారు భక్తిసారులు బొంత కుట్టుకొంటుండగా శివుడు పార్వతితో వచ్చి, లలాట నేత్రం తెరచి అతనిని అవమానించబోగా, భార్గవవంశజులైన భక్తిసారులు తమ కుడిపాదంలో ఉన్న తృతీయ నేత్రంతో భయంకరాగ్నిని సృష్టించి శివుని ఫాలాగ్నిని అణచివేశారని మరొక గాథ మరొకమారు భక్తిసారులు తమ బొంతను చూచి ఆక్షేపించిన ఒక ఖేచరునికి తమ మహిమతో రత్నకవచాన్ని, మెడలోని పద్మాక్షమాలతో ముత్యాలహారాన్ని సృష్టించి ఆశ్చర్యం కలిగించారు

ఈ విధంగా భక్తిసారులు అద్భుతాలు చూపుతూ కాంచీపుర సమీపంలోని తిరువెక్కా క్షేత్రంలోని శేషశాయి మందిరంలో స్థిరపడి సేవచేసేవారు ఇంతలో అతనిని వెదుకుతూ కణికృష్ణుడు కూడా అక్కడికి వచ్చిచేరాడు ఆ శేషశాయి కోవెలలో సేవ చేసే వృద్ధదాసి శ్రద్ధాభక్తులకు కణికృష్ణుడు సంతోషించి, ఆమె నిరంతరం భగవత్సేవ చేయడానికి తగిన శరీరదార్ఢ్యం ప్రసాదించుమని తన కవితా వాక్యంతో శేషశాయిని ప్రార్థింపగా, ఆ దాసికి నూతన యౌవనం వచ్చింది దానిని విన్న ఆ పట్టణ పాలకుడు కణికృష్ణుని పిలిపించి తనకూ నవయౌవనం కలిగేట్లు కవితతో శేషశాయిని కోరుమని అర్థించాడు దానికి కణికృష్ణుడు ఒప్పుకోలేదు "నా విషయంలో కవిత చెప్పడానికి ఇష్టపడని నీవు నా రాజ్యంలో ఉండవద్దు" అని రాజు శాసించాడు కణికృష్ణుడు గురువైన భక్తిసారులకు ఈ విషయం విన్నవించి తనకు మరొక ప్రాంతానికి పోవడానికి అనుజ్ఞ కోరగా, భక్తిసారులు "నీవు లేని చోట నేను మాత్రం ఎందుకు!" అని రాజ్యం వదలిపోవడానికి ఉద్యుక్తులై శేషశాయిని సేవించి "దేవా, నీ భక్తులు ఉండరాని చోట నీవును ఉండ తగదు మావెంటరా!" అని ప్రార్థించారు ఆ స్వామి భక్తపరాధీనుడు గనుక శేష పర్యంకాన్ని చుట్టి చంకన పెట్టుకొని బయలుదేరాడు మరునాటి ఉదయం అర్చకులు ఆరాధనకై గర్భాలయం తలుపులు తెరచి చూడగా స్వామి కనిపించలేదు పిదప రాజు తన తప్పు తెలుసుకొని, వారిని మరల కంచికి పిలిపించాడు వారితో పాటు శేషశాయి కూడ తిరిగి వచ్చారు భక్తిసారులు చెప్పినట్లు విన్నందున ఆ స్వామికి యథోక్తకారి అని పేరువచ్చింది

ఒకమారు భక్తిసారులు కణికృష్ణునితోపాటు తిరుక్కుడంద (కుంభకోణం) క్షేత్రానికి వెళ్తూ, దారిలో పెరుంబులియూర్ (బృహద్వ్యాఘ్రపురి) అనే క్షేత్రంలో వేదాధ్యయనపరుల

వీథిలో నడుస్తుండగా, వారు ఏరివరో అప్రాచ్యులని అధ్యయనం ఆపి, వాళ్ళు వెళ్ళిన పిదప మళ్ళీ ప్రారంభించదలచారు కాని, వారికి అధ్యయనం ఆపిన చోటు గుర్తురాలేదు అప్పుడు వారు వారిద్దరూ మహానుభావులని గుర్తించి తమ అజ్ఞానాన్ని మన్నించమన్నారు అప్పుడు భక్తిసారుడు ఒక వడ్ల వడ్లగింజ తెచ్చి గోటితో ఒలిచి చూపించగా, వారికి తాము వదలిన "నైర్ఋతం చరుం పరివృత్త్యై గృహే కృష్ణానాం వ్రీహీణాం నఖ నిర్భిన్నమ్'' అనే వాక్యం జ్ఞాపకం వచ్చింది[81] భక్తిసారుల అద్భుతకృత్యాలు విని అక్కడ యజ్ఞం చేస్తున్న ఒక వైదికుడు అతనిని ఆహ్వానించి అగ్రస్థాన మిచ్చి గౌరవించగా, తక్కిన బ్రాహ్మణులు నిందించారు అప్పుడు భక్తిసారుడు తన వక్షస్సులో జ్వాలామయమైన సుదర్శనం చూపి దుష్టులను లొంగదీశారు ఇలా ఆయన కుంభకోణంలోనే కొన్నేళ్ళు గడిపి విష్ణుసాయుజ్యం పొందారు

భక్తిసారులు నాన్ముగన్ తిరువందాది, తిరుచ్చంద విరుత్తం అనే రెండు దివ్యప్రబంధాలు రచించారు ఇవి సకల వేదాంతార్థాలు ప్రతిపాదిస్తాయి

## తర్వాతి ఆళ్వార్లు

### విష్ణుచిత్తులు

పెరియాళ్వార్ (విష్ణుచిత్తులు) పాండ్యదేశంలోని శ్రీవిల్లిపుత్తూరు (ధన్వినవ్యపురం) అనే దివ్య క్షేత్రంలో వటపత్రశాయి ఆలయంలో పరిచారకులైన ముకుందాచార్యులకు విష్ణు రథాంశలో అనగా గరుడాంశలో జన్మించారు[82] తల్లి పేరు పద్మావతి ఇతనికి మధురాపతి అయిన వల్లభరాయనితో గల సంబంధాన్ని బట్టి ఇతడు 9వ శతాబ్దంలో జన్మించివుంటాడని ప్రొఫెసర్ గోపీనాథరావు అభిప్రాయం[83]

---

81 యజుర్వేదం కాండ 1, ప్రశ్న 8, అను 9, ప 1

82 తిరునక్షత్ర తనియన్

మిథునే స్వాతిజం విష్ణో రథాంశం ధన్వినః పురే
ప్రపద్యే శ్వశురం విష్ణోః విష్ణుచిత్తం పురశ్శిఖమ్

నిత్య తనియన్

గురుముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతి పరిక్లృప్తం శుల్క మాదాతు కామః
శ్వశుర మమర వంద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజకుల తిలకం తం విష్ణుచిత్తం నమామి

83 ప్రొఫెసర్ టి ఏ గోపీనాథరావు ది హిస్టరీ ఆఫ్ శ్రీ వైష్ణవిజం, పుట 28

విష్ణుచిత్తులకు చిన్ననాడు చదువు అంతగా అబ్బలేదు భగవద్భాగవత భక్తి అపారంగా అబ్బింది ఆయన భాగవతంలోని మాలాకారునివలె తామూ పుష్పమాలికలతో స్వామిని సేవించాలని పెద్ద పూలతోట పెంచి, పూలమాలలు కట్టి వటపత్రశాయిని ఆరాధించేవారు

పాండ్యరాజయిన వల్లభరాయలు (వల్లభదేవుడు) పరమార్థపరుడై తత్త్వాన్ని తెలుసుకోవాలని నిర్ణయించుకొన్నాడు తన కొలువుకూటంలో ఒక స్తంభం నాటించి దాని కొనను బంగారు నాణెం సంచిని వ్రేలగట్టించి "ఏ మతస్థుడైనా పరతత్త్వ మిది అని యుక్తులతో ఉపపాదించి సిద్ధాంతంచేసి తనను ఒప్పించినవారు ఈ నాణెం సంచిని తీసుకోవచ్చు ఆ మతాన్ని నేను అవలంబించి, అతనికి శిష్యుడవుతాను " అని ప్రకటించారు దానిని విని దేశదేశాలనుంచి వివిధ మతాలవారు వచ్చారు విష్ణుచిత్తుడు వటపత్రశాయి ప్రేరణతో ఆ సభకు వచ్చి ఇతర మతాలు ఖండించి విశిష్టాద్వైతాన్ని స్థాపించారు వల్లభరాయలు సంతోషించి, అతనికి శిష్యుడై అతనిని ఏనుగుపై ఎక్కించి ఊరేగించి గౌరవించారు

ఆ వైభవాన్ని చూడటానికి వచ్చే అష్టంవలె శ్రియఃపతి, లక్ష్మీదేవి సకల పరివారంతో ప్రత్యక్షంకాగా, వారికి దృష్టిదోషం కలుగుతుందని భయపడిన పెరియాళ్వార్

"పల్లాండు పల్లాండు పల్లాయిరత్తాండు
పలకోటి నూరాయిరమ్
మల్లాండతిండోళ్ మణివణ్ణా ఉన్
శేవడి శెవ్వి తిరుక్కాప్పు "

మంగళము! మంగళము! బహువేల వత్సరాల్
బహుకోటి నూరుల వత్సరాల్ మంగళము
మల్ల గర్వహరణా! మణివర్ణ! నీ
ఇంపగు అడుగులోయి కెంపులకు శ్రీరక్ష [84]

అని ప్రారంభించి, పన్నెండు పాశురాలతో, ఏనుగుకు ఇరువక్కలా వ్రేలాడే గంటలు పట్టుకుని తాళంవేస్తూ, మంగళాశాసనం చేశారు ఈ పల్లాండు మంగళాశాసనం ఇప్పటికీ వైష్ణవ దేవాలయాలన్నిటిలో ప్రతి పూటా పఠింపబడుతూంది

పెరియాళ్వార్ కృష్ణుని అతిమానుష లీలలను వర్ణిస్తూ 472 పాశురాలతో మరొక దివ్యప్రబంధాన్ని రచించారు దాని పేరు పెరియాళ్వార్ తిరుమొళి

---

84 శ్రీ తొమ్మలంటి శ్రీనివాసాచార్యులు సిరినోము, పుట 88

# గోదాదేవి

ఆండాళ్ (గోదాదేవి) విష్ణుచిత్తుని పెంపుడు కూతురు. ఒకనాడు విష్ణుచిత్తులు తన వనంలో పాదులు చేయడానికి భూమిని త్రవ్వుతుండగా, జనకమహారాజుకు సీతాదేవి లభించినట్లు గోదాదేవి లభించింది[86]. విష్ణుచిత్తులు ఆమెను తన భార్యకు ఇచ్చారు. బిడ్డలు లేనందువ వారిద్దరూ ఆమెకు గోద అని పేరు పెట్టి అల్లారుముద్దుగా పెంచిపెద్దచేశారు.

యౌవనవతి అయిన పిదప గోదాదేవికి శ్రీమన్నారాయణునిపై భక్తి పెరిగింది. తన తండ్రి వటపత్రశాయికోసం ఏరుతున్న మాలను మొదట ఆమె తన కొప్పులో ముడుచుకొని బావిలో తన అందచందాలు చూచుకొని తిరిగి ఆ మాలను ఎప్పటివలె తండ్రికి తెలియకుండ పూలసజ్జలో పెట్టేసి. ఇది ఒకమారు తండ్రి కంట పడింది. ఆయన "స్వామికి సమర్పించే పూలదండను నీవు ధరించడం ఉచితంకాదు" అని మందలించి ఆనాడు స్వామికి పూలమాల సేవ మానుకున్నారు. ఆ రాత్రి వటపత్రశాయి విష్ణుచిత్తులకు కలలో కనిపించి ఆండాళ్ ఉపయోగించిన మాలలే తనకు ఇష్టమని, వాటిని ఆవిధంగానే సమర్పించమని శాసించారు. విష్ణుచిత్తులు ఆశ్చర్యపడినా స్వామి శాసనం గనుక అలాగే చేశారు. అప్పటినుండి గోదాదేవికి చూడి కొడుత్తాళ్–తాను మొదట దండలు ముడుచుకొని పిదప భగవంతునికి సమర్పించినది–అని పేరు వచ్చింది. భక్తులను ఏలుకొన్నది గనుక ఆండాళ్ అని పేరు వచ్చింది.

గోదాదేవికి కృష్ణభక్తి తీవ్రమయింది. అతనినే పెండ్లాడవలెననే సంకల్పం కలిగింది. గోపికలు కృష్ణప్రాప్తి కొరకు కాత్యాయనీ వ్రతం ఆచరించినట్లు విని తాను కృష్ణుడవతరించిన మధురకు పోలేదు గనుక, వటపత్రశాయి మందిరమే నందగోపగృహంగాను, తన చెలులే గోపికలుగాను, తానొక విరహిణీ గోపికగను భావించి ధనుర్మాసంలో తెల్లవారుజామున లేచి వటపత్రశాయిని దినమొక పాశురంతో ఆరాధించింది. ఆ పాశురాల గ్రంథ పేరు తిరుప్పావై. ఆవిధంగానే ఆమె కృష్ణవిరహాన్ని 148 పాశురాలతో వర్ణించింది. దానికి నాచ్చియార్ తిరు

---

86 తిరునక్షత్ర తనియన్

కర్కటే పూర్వఫల్గున్యాం తులసీకాననోద్భవామ్,
పాండ్యే విశ్వంభరాం గోదాం వందే శ్రీరంగనాయకీమ్

నిత్యతనియన్

నీలాతుంగ స్తనగిరితటీ సుప్తముద్బోధ్య కృష్ణం
పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయన్తీ,
స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే
గోదా తస్యై నమ ఇద మిదం భూయ ఏవాస్తు భూయః

మొళి అని పేరు దానిలోని ఒక దశకం పేరు వారణ మాయిరమ్ మొదటి పద్యంలో ఆయా రాల్నాన్ని కాని, పట్టాన్ని కాని పేర్కొనటం దివ్య ప్రబంధ పద్ధతి కనుక ఈ దశకానికి వారణమాయిరం అని పేరు దీనిలో గోదాదేవి భగవంతుడు తనను పెళ్ళాడడానికి వేయి ఏనుగుల బలగంతో వచ్చినట్లు కన్న కలను వర్ణించింది.

''వారణ మాయిరం శూళవలం శెయ్దు
నారణ నంబి నడక్కిన్ఱా నెన్రెదిర్
పూరణ పొఱ్కుడం వైత్తు పుఱమెంగుం
తోరణం నాట్ట క్కనాక్కండేన్ తోళీ నాన్''

వేయి ఏనుగుల పరివేష్టించి వెంటరా
నారాయణుడు తానె నడచి వచ్చిన యట్లు
పూర్ణకుంభములతో పురమెల్ల ఎదురుగన
కట్టినటు తోరణాల కలగంటినే చెలి 86

పెరియాళ్వార్ యౌవనవతి అయిన తన పుత్రికకు పెండ్లిప్రయత్నాలు చేయగా మానవ మాత్రుణ్ణి పెండ్లాడనని, భగవంతునే పెండ్లాడుతానని గోదాదేవి తన నిశ్చయం ప్రకటించింది. పిదప తండ్రి నుండి దేశంలో 108 దివ్యతిరుపతులను (దివ్యక్షేత్రాలను) విని, శ్రీరంగనాథుని లోకోత్తర సౌందర్యాది గుణాలు విని అతనినే పెండ్లాడ నిశ్చయించింది అది ఎలా పొసగుతుందా అని ఆలోచిస్తున్న విష్ణుచిత్తులకు శ్రీరంగనాథుడు స్వప్నంలో సాక్షాత్కరించి తాను పెండ్లాడుతానని, శ్రీరంగానికి ఆమెను పిలుచుకొనిరమ్మని చెప్పాడు విష్ణుచిత్తులు ఆమెను శ్రీరంగానికి పిలుచుకుపోయి యథావిధిగా రంగనాథునితో ఆమెకు వివాహం చేశారు ఆమె అప్పుడే రంగనాథునిలో లీనమయింది విష్ణుచిత్తులు తాత్కాలికంగా దుఃఖపడినా, తాను, తన కూతురు ధన్యులమయ్యామని సంతోషపడి శ్రీవిల్లిపుత్తూరుకు తిరిగి వెళ్ళారు

గోదాదేవి మహా కవయిత్రి దానికి కారణం భగవద్భక్తిలో కరగిన ఆమె మనస్సు కవితగా విరుసు కట్టడమే ఆమె కవితకు, తావనకు తిరుప్పావులోని ఒక పాశురం చాలు

''మారిమలై ముళంజిల్ మన్ని కిడం దురంగుం
శీరియ సింగమరి వుత్తు తీవిళిత్తు

---

86 శ్రీ వొమ్మకంటి శ్రీనివాసాచార్యులు సిరిసోము, పుట 78

వేరి మయిర్ పొంగ వెప్పాడుం పేర్న్దు దళి
మూరి నిమిర్న్దు ముళంగి పురప్పట్టు
పోదరుమాపోలే నీ పూవై ప్పూవణ్ణా
ఉన్ కోయిల్ నిన్ఱింగనే పోన్దరుళి కోప్పుడైయ
శీరియ శింగాశనత్తిరున్దు యాం వన్ద
కారియ మారాయ్న్దరుళేలో రెమ్బావాయ్ ''

వానాకర గుహలోన నిండి దాగి
నిండి వెచ్చగ శయనించి యున్న
గండు సింగమ్ము మేల్కాంచి తీవిగ చూచి
నెరి సువాసన జూలు నిక్కపొడువ
ఒళ్లు విదిలించి నల్గడలను దృష్టి సా
రించి గాంభీర్యమౌ గర్జింపుచు వెలు
వలికి వచ్చెడి రీతి స్వామి! నీ కోవెల
వదలి నీ కొలువు సావడికి వచ్చి
సిరులు నెంపైన సింహాసనమ్ముపై
వేంచేసి నీదరి విన్నపమ్ము
లాలింపగావలె, అరసి కర్తవ్యమును
తీర్పగావలె - ఇదె వేడికమ్ము [87]

తిరుప్పావై కొన్ని పదుల భాషల్లోకి అనూదితమైంది. గోదాదేవి అక్కమహాదేవి, మీరమ్మ మున్నగు భక్త కవయిత్రులకు మార్గదర్శిని. ఆమె కవితను ఆధునికులూ మనసార హర్షించారు. "తన ప్రేమికుడికి, తన మనస్సును ప్రముద్రించిన గర్విష్ఠుని తొలుత పూలమాలంతోను, పిదప అమరకవితా (పాశుర) మాలంతోను అలంకరించి చేసింది గోదాదేవి" అన్నారు స్వామి పరమాత్మానంద [88]

## కులశేఖరులు

కులశేఖరాళ్వారు మనకు చాల దగ్గరివారు. ఈయన రచించిన ముకుందమాలాస్తోత్రం తెలుగు దేశమంతటా చాల ప్రసిద్ధం. బమ్మెరపోతనగారు ఈస్తోత్రంలోని చాల శ్లోకాలకు

87 శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు సిరినోము, పుట 27
88 స్వామి పరమాత్మానంద ప్రబుద్ధ భారత, పుట 202 1964.

ప్రహ్లాద చరిత గజేంద్ర మోక్షాదులలో తెలుగు చేశారు. ఈయన ౯వ శతాబ్దంలో చేర దేశాన్ని పాలించిన దృఢవ్రతుడనే చేరవంశరాజు పుత్రుడు. ఈయన పునర్వసు నక్షత్ర యుక్త మాఘశుద్ధద్వాదశినాడు కొల్లి (నేటి క్విలన్) పట్టణంలో జన్మించారు[౮౯]. కౌస్తుభాంశలో జన్మించడంవల్ల తల్లిదండ్రులు కులశేఖరులు అని నామకరణం చేశారు. కులశేఖరులు మహా భక్తులై ఆదర్శ ప్రభువులై కీర్తి పొందడంవల్ల ఈయన పేరు తర్వాత ఈవంశం వారికి బిరుద నామమైంది. ఈ కులశేఖరులలో ఒకరు మహమ్మదీయ మతం స్వీకరించి మక్కా యాత్రకు వెళ్ళి మక్కాలోనే నిర్యాణం పొందారట. అతని సమాధి కూడ అక్కడుందట[౯౦].

కులశేఖరులు విద్యావంతులై రాజ్యకార్యనిర్వహణ దక్షులు కాగానే తండ్రి దృఢవ్రతుడు ఆయనకు రాజ్యమప్పగించి తపస్సు చేసుకోవడానికి భార్యతో సహా అరణ్యానికివెళ్ళి పోయారు. కులశేఖరులు గృహస్థ ధర్మాన్ని రాజధర్మాన్ని, పాలిస్తూ, భాగవత కైంకర్యపరులై ఉండేవారు. నారాయణుడే అనుగ్రహించి వైకుంఠం నుంచి సేనమొదలి యాళ్వారును (విష్వక్సేనులను) పంపి కులశేఖరులకు పంచ సంస్కారాదులు అనుగ్రహించారు. కులశేఖరులు దేహసంబంధులను విడనాడి రాజ్యాన్ని భాగవతాధీనంచేసి విభీషణునిలాగ రామపాదారవిందాలనే ఆశ్రయించారు. కులశేఖరులు రామభక్తి కుంఠితమైన పెరుమాళ్ తిరుమొళి అనే 104 పాశురాల దివ్యప్రబంధం రచించారు. దానిలో వేంకటేశ్వరునిపై తనకుగల అపార భక్తిని కూడ వెల్లువగా పారించారు. అవతారాలలో రామావతారమంటేను, అర్చావతారాలలో వేంకటేశ్వరుడంటేను ఆయనకు అపరిమిత భక్తి. పెరుమాళ్ తిరుమొళిలో ఒక పాశురంలో

ఆనాద సెల్వత్త రంబైయర్గళ్ తరచూళ
వానాళుం సెల్వముం మణ్ణరసుం యాన్వేండేన్
తేనార్ పూం చోలై తిరువేంగడచ్చునైయిల్
మీనాయ్ పిఱక్కుం విధియుడైయే నావేన్[౯౧]

---

౮౯ నిత్యతనియ,

ఘుష్యతే నగరే రంగయాత్రా దినే దినే
తమహం శిరసా వందే రాజానం కులశేఖరమ్

తిరునక్షత్ర తనియ

కుంభే పునర్వసౌ జాతం కేరళే కోళ పట్టణే,
కౌస్తుభాంశం ధరాధీశం కులశేఖర మాశ్రయే

౯౦ వర్ణ సిద్ధాంత సారథం సంపు 7, పు' 184 ౯౧ పెరుమాళ్ తిరుమొ 4 2

"రంభలు నన్ను పరివేష్టింపగా స్వర్గరాజ్య సంపదను నేను కోరను భూలోకరాజ్యాన్ని కోరను తిరుమలలో కోన కొలనులోనే పూంతోటలోని బావులలో చేపనయ్యే భాగ్యం కోరుతున్నాను" అని కోరారు కులశేఖరులు ముకుందమాలాస్తోత్రంలో–

"నాహం వందే తవ చరణయో ర్ద్వంద్వ మద్వంద్వ హేతో:
కుంభీపాకం గురుమపి హరే నారకం నాపనేతుమ్
రమ్యా రామామృదుతనులతా నందనే నాపి రంతుం
భావే భావే హృదయ భవనే భావయేయం భవంతమ్"[92]

"స్వామీ! నేను నీతో సాయుజ్యం కోసం నీ చరణారవిందాలకు నమస్కరించడంలేదు భయంకరమైన కుంభీపాకనరకాన్ని పోగొట్టుకోడం కోసమూ నమస్కరించడంలేదు రమ్యమైన సుందరుల కోమల శరీరాలనే నందనవనంలో విహరించాలనే కాంక్షతో నమస్కరించడంలేదు ప్రతి జన్మలోను నిన్ను నా హృదయంలో భావించుకోవడానికే నమస్కరిస్తున్నాను" అని తన ఆకాంక్షను తెలిపారు నిజమైన భాగవతుడు నిరంతరం భగవత్సంకీర్తనం కోరుతాడే గాని మోక్షాన్ని కూడ కోరడు కులశేఖరులు ఆకోవలోనివారు

ఒకసారి కులశేఖరులు శ్రీరంగ క్షేత్రమాహాత్మ్యం విని శ్రీరంగంలోనే ఎల్లకాలం వసించి రంగనాథుని నిత్యకైంకర్యం చేయాలని నిశ్చయించి ప్రకటన చేయించారు ఆయన శ్రీరంగానికి వెళ్లితే తిరిగిరారని మంత్రులు ఆలోచించి ఏదో సాకుతో విఘ్నం కలిగించేవారు ఆయన దినంలో కొంతకాలమే రాజ్యపరిపాలన వ్యవహారాలు చూస్తూ, తక్కిన సమయమంతా శ్రీవైష్ణవ గోష్ఠిలో గడిపేవారు ఇది చూచి మంత్రులు సహింపక రాజ్యకార్యం కుంటుపడుతుందనే భావనతో ఆయనకు వైష్ణవుల యెడల వైరస్యం కలిగించాలని ఆయన పూజా గృహంలో ఉన్న రత్నహారాన్ని దాచి, శ్రీవైష్ణవులు అపహరించారని నింద మోపారు కులశేఖరులు దానిని విశ్వసింపక నిజానిజాలు తెల్పడానికి ఒక కుండలో నల్లత్రాచును పెట్టించి తన వ్రేలి ఉంగరాన్ని ఆ కుండలోవేసి 'ఈ ఉంగరాన్ని మీరు చేతితో తీయగలిగితే మీ మాట నమ్ముతాను" అన్నారు మంత్రులు ఇంక మొగం వేల వేసుకొన్నారు అప్పుడు కులశేఖరులు "ఈ నిందలు అకారణంగా శ్రీవైష్ణవంపై అభాండాలు వేశారు వారు ఏ తప్పు చేయలేదనడానికి నేను ఆ ఉంగరాన్ని తీస్తాను" అని అంటూ చేయిపెట్టి దానిని తీసి అందరికీ ఆశ్చర్యం కలిగించారు అదిచూచి మంత్రులు భయంతో తమ తప్పు ఒప్పుకున్నారు

---

92. ముకుందమాల।

కులశేఖరులు ఒకమారు రామాయణారణ్యకాండ పురాణం వింటున్నారు ఖరదూషణుల యుద్ధ ఘట్టంలో

"చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణామ్
ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి?"

అనే శ్లోకం విని, రాముడు ఒంటరిగా పద్నాలుగువేలమందితో ఎలా పోరాడగలడని శంకించి అతని సాహాయ్యార్థం చతురంగ బలంతో బయలుదేరారట మంత్రుల ప్రార్థనతో పౌరాణికుడు వెంటనే తర్వాతి శ్లోకాలు చదివి ఖరదూషణాదుల వధ వినిపించగా కులశేఖరులు శాంతించి నగరానికి మరలి వచ్చారు

మరొకమారు సీతాపహరణ ఘట్టంలో పౌరాణికుడు చదివిన "జహార రావణః స్త్వితాం బుధః రోహిణీ మివ" ఆకాశాన బుధుడు రోహిణిని అపహరించినట్లు రావణుడు సీతను అపహరించాడు — అనే శ్లోకం విన్నప్పుడూ కులశేఖరులు చతురంగ బలంతో రావణసంహారానికై లంకకు బయలుదేరారు ఆయన భక్తికి రామచంద్రుడు మెచ్చి ప్రత్యక్షమై తన పార్శ్వమందున్న సీతను చూపగా రాజధానికి తిరిగి వచ్చారు భక్తిపారవశ్యం అలాటిది

కులశేఖరులు ఇలా భగవద్భక్తి బుద్ధితో మరికొంతకాలం రాజ్యంపాలించి, పరమ విరాగులై దృఢవ్రతుడనే తన కుమారునికి రాజ్యం అప్పగించి, శ్రీరంగ యాత్రచేసి, అక్కడ కొంతకాలం నివసించి, తిరుమల మొదలైన దివ్య క్షేత్రాలు సేవించి, నమ్మాళ్వారు అవతరించిన తిరునగరికి వెళ్లి దాని సమీపంలోని బ్రహ్మదేశపురమనే దివ్యదేశంలో తమ 67వ ఏట పరమపదించారు

కులశేఖరులు విభక్తులతో కొనసాగే ఉదాహరణ వాక్యానికి ఆద్యులు

'కృష్ణో రక్షతు నో జగత్త్రయగురుః కృష్ణం నమస్యామ్యహం
కృష్ణేనామరశత్రవో వినిహతాః కృష్ణాయ తస్మై నమః,
కృష్ణాదేవ సముత్థితం జగదిదం కృష్ణస్య దాసోస్మ్యహం
కృష్ణే తిష్ఠతి సర్వలోక మఖిలం హే కృష్ణ రక్షస్వ మామ్"[02]

కృష్ణుడు మనను రక్షించుగాక! కృష్ణునకు నేను నమస్కరిస్తున్నాను కృష్ణునిచేత దేవద్వేషులైన అసురులు చంపబడినారు ఆ కృష్ణుని కొరకు నా నమస్కారం కృష్ణునియందే ఈ

02 కులశేఖరాళ్వార్ ముకుందమాల, శ్లోకం

జగత్తు ప్రభవించింది. నేను కృష్ణునికి దాసుణ్ణి. ఈ జీవలోకమంతా కృష్ణునియందే ఉంటున్నది. ఓ కృష్ణా! నన్ను రక్షించు అని ప్రథమ మొదలు సప్తమి వరకు చెప్పి చివరకు సంబోధనతో ముగించే ఉదాహరణ కావ్య ప్రక్రియ ముకుందమాలతోనే ప్రారంభమైంది.

## మునివాహనులు

తిరుప్పాణి యాళ్వార్ (యోగిమునివాహనులు) శ్రీరంగం సమీపంలోని ఉఱైయూర్ (నిచుళాపురం)లో[౬౩] దుర్మతి నామసంవత్సర కార్తికమాసంలో రోహిణీనక్షత్రయుక్త పూర్ణిమ శ్రీవత్సాంశాన ఒక మాలదాసరికి కుమారులై జన్మించారు[౬౪]. ఈ ఆళ్వారు మాలదాసరికి పుట్టలేదని వరి చెన్నులో జనించి ఆ మళ్ళలో పడి వుండగా, మాలదాసరి చూచి సంతోషంతో తెచ్చి పెంచాడని మరొక గాథ.

తండ్రి భక్తుడు కావడంవల్ల తిరుప్పాణాళ్వారు బాల్యంనుంచే ప్రహ్లాదధ్రువాదులలాగ భక్తితో ఇతరవిషయాలలో అనాసక్తులై ఉండేవారు. ఈ ఆళ్వారుకు విష్వక్సేనులే పంచసంస్కారాలు అనుగ్రహించినట్లు ప్రతీతి. తిరుప్పాణాళ్వారుకు సంగీతమంటే మక్కువ ఎక్కువ. కనుక వీణాపాణి అయి శ్రీరంగనాథుని కీర్తిస్తూ వుండేవారు. పెద్దవారయిన తర్వాత మాలదాసరి ఇంటి నుంచి వెళ్ళిపోయి కావేరీ తీరంలో నివసిస్తూ ప్రతిదినం తెల్లవారుజామున కావేరిలో స్నానంచేసి పాణుడు కావడం వల్ల తనకి జన్మలో శ్రీరంగనాథుని సేవించే భాగ్యం లేదుగదా అని చింతిస్తూ, శ్రీరంగభూమిని తన పాదాలతో తొక్కరాదని, శ్రీరంగనాథాలయం విమానానికి ఎదురుగా దూరంగా నిలిచి వీణవాయిస్తూ భగవద్గుణగానం చేసేవారు.

---

౬౩ దీనిని నిచుళాపురమని అన్నారు

౬౪ తిరునక్షత్ర తనియ

వృశ్చికే రోహిణీజాతం శ్రీపాణం నిచుళాపురే,
శ్రీవత్సాంశం గాయకేంద్రం మునివాహన మాశ్రయే

నిత్య తనియ

శ్రీలోకసారంగ మహామునీంద్ర
స్కంధాధిరూఢం కలయామి నిత్యమ్,
కళంక హీనం కమనీయభక్తిం
కవీశ్వరం గాయకసార్వభౌమమ్

తిరుప్పాణుడు ఇలా కావేరీ తీరంలో భగవన్నామ సంకీర్తనం చేస్తూవుండగా, ఒకనాడు కావేరికి స్నానానికి వచ్చిన శ్రీరంగనాథాలయం ప్రధానార్చకుడు సారంగయోగి, మరికొందరు బ్రాహ్మణులు తిరుప్పాణుడును దూరంగా తొలగిపొమ్మని కేకలు వేశారు. భగవద్ధ్యాన పరవశులై ఒడలెరుంగని స్థితిలో ఉన్న ఆళ్వారు కదలకపోవడంతో ఉగ్రులైన బ్రాహ్మణులు ఆయనను రాళ్లతో కొట్టారు. ఆయనకు తలమీద, ఒంటినిండా గాయాలు తగిలాయి, నెత్తురు ధారలు కట్టింది. అప్పుడు ఆళ్వారుకు బాహ్యస్మృతి కలిగి తప్పు చేసినట్లు గ్రహించి దూరంగా తొలగి పోయారు, మరల సంకీర్తనంలో మునిగిపోయారు.

ప్రధానార్చకుడు సారంగయోగి రంగనాథాలయానికి వెళ్లి గర్భాలయం తలుపులు తీసి చూడగా, రంగనాథుని లలాటంపైన, ఒంటినిండా గాయాలు, రక్తం కనిపించాయి. అతడు ఈ విషయం వెంటనే ఆ ప్రాంతం ఏలే రాజుకు తెలిపాడు. తమవల్ల ఏమి అపచారం జరిగిందో అని ప్రతి ఒక్కరూ చింతించారు.

ఆ రాత్రి శ్రీరంగనాథుడు సారంగయోగికి స్వప్నంలో సాక్షాత్కరించి "తిరుప్పాణి ఆళ్వారు నా ప్రియభక్తుడు. అతడు నీచుడని తలచవద్దు. అతనికి తగిలిన రాతిదెబ్బలు నాకు తగిలాయి. ఆయన వద్దకు వెళ్లి నేను రమ్మన్నానని చెప్పు. అతడు తాను మాలవాడినని రావడానికి సంకోచపడితే బలవంతంగా ఎత్తుకురా" అని ఆజ్ఞాపించారు. సారంగయోగి మేల్కొని రంగనాథుని ఆజ్ఞను పరిసర బ్రాహ్మణులందరికీ తెలిపి, వారందరితో కలిసి కావేరీ తీరానికి వెళ్లారు. తిరుప్పాణుడు తమవద్దకు బ్రాహ్మణులు గుంపుకట్టుకొని రావడం చూసి, తమను వారు మరేమి బాధపెడతారో అని దూరంగా వెళ్లిపోయారు. ఇంతలో సారంగయోగి తిరుప్పాణుడుకు సాష్టాంగ దండప్రణామాలు చేసి రంగనాథుని ఆజ్ఞ తెలియజేశారు. "నేను పంచముణ్ణి, శ్రీరంగక్షేత్రాన్ని కాళ్లతో తొక్కను" అని తిరుప్పాణుడు బదులు చెప్పారు. రంగనాథుని ఆజ్ఞను ఎవరైనా మన్నించక తప్పదంటూ సారంగయోగి తిరుప్పాణుడును బలవంతంగా తన భుజాలపై ఎక్కించుకొని, శ్రీవైష్ణవులు ముందు దివ్యప్రబంధం అనుసంధిస్తుండగా, వెనుక వేద విద్వాంసులు వేదాలు పఠిస్తుండగా, వైభవంతో రంగనాథాలయానికి తీసుకొని వెళ్లారు.

రంగనాథాలయం ప్రవేశించగానే తిరుప్పాణుడు భక్తిపరవశులై సాష్టాంగ దండప్రణామ మాచరించి రంగనాథుని తిరుముఖ మండలం మొదలు తిరువడి వరకు సకలావయవ సౌందర్యాన్ని వర్ణించి, తనివితీర సేవించి, అనుభవించి ఆ అనుభవాన్ని పది పాశురాల ద్రావిడ ప్రబంధంతో వర్ణించారు. ఆ ప్రబంధం పేరు అమలనాదిపిరాన్ దివ్య

ప్రబంధంలో షట్టంగాని, రచనగాని ఆ షట్టం, లేక రచన మొదటి పాశురం—మొదటి పద్యంతో వ్యవహృత మౌతుంది తిరు ప్పాణాళ్వారు ఆ ప్రబంధం చివరి పాశురంలో రంగనాథుని దివ్య సుందర విగ్రహం దర్శించిన పిదప మరొక వస్తువును చూడనని ప్రతిజ్ఞ చేశారు

''కొండల్ వణ్ణనై క్కోవలనాయ్ వెణ్ణెయ్
ఉండవాయన్ ఎన్నుళ్ళం కవర్న్దానై
అండర్ కోన్ అణి యరంగం ఎన్నముదనై
కండ కణ్గళ్ మఱ్ఱొన్ఱినై కాణావే''

ఒంటు ద్రావిన మొయిలు చాయ గోపాలకుని
తెలి వెన్నలను మెసవ
కమ్మనగు అన్యాయము గల మనుని నా మనసు
దినుసు ముచ్చిలువాని
అండాంతరిత జగములన్ని యేలికవాని
ఆ రంగ పతిరాయని
అరయ జాలిన కనుల అన్యగ మానిన ఎనుల
అన్యమును కన నొల్ల [95]

తిరుప్పాణాళ్వారు ఈ విధంగా పాడుతూ అందరూ చూస్తుండగానే రంగనాథునిలో లీనమై పోయారు

తిరుప్పాణాళ్వారును పెరియనంబి (యామునాచార్యుల శిష్యులలో ఒకరు) ఈ విధంగా స్తుతించారు

''ఆ పాదచూడ మనుభూయ హరిం శయానం
మధ్యే కవేర దుహితు ర్ముదితాంతరాత్మా,
అద్రష్టృతాం నయనయో ర్విషయాంతరాణాం
యో నిశ్చికాయ మనవై మునివాహనం తమ్ ''

కావేరి ఒడి నల్లగా శయనించిన హరి
నాపాదమస్తక మ్మనుభవించిన తనివి
కనులతో అన్యమును కానొల్లని వాని
మునివాహనుని నిత్యమును మదిని స్మరియింతు [96]

---

95 శ్రీ బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు సిరినోము, పుట 71   96 పై సిరినోము, పుట 64

భక్తి ప్రధానం గాని కులం ప్రధానం కాదనే మహోత్కృష్ట సత్యాన్ని తిరుప్పాణులు తమ జీవితం ద్వారా ప్రపంచానికి చాటి ఆదర్శప్రాయులయ్యారు

## విప్రనారాయణులు :

తొండరడిప్పొడి యాళ్వార్ (విప్రనారాయణులు) ముముక్షువులకు గొప్ప గుణపాఠం 'బలవా నింద్రియగ్రామో విద్వాంస మపి కర్షతి'–ఇంద్రియ సమూహము దాని శక్తి మంతమైంది ఎంతటి మనస్వి అయిన పండితునైనా సులోలుణ్ని చేయగలదు అని వ్యాస భగవానుడు చెప్పిన సూక్తికి విప్రనారాయణుని చరిత్ర తార్కాణం ఈ చరిత్ర వైరాగ్య శృంగార పశ్చాత్తాప ముముక్షుత్వాది వివిధ భావరంజితం గనుక తెలుగులో కావ్య నాటక నృత్య నాటకాది వివిధ ప్రక్రియలలో వ్యాప్తమైంది ఇది సాధకులకు గొప్ప హెచ్చరిక

విప్రనారాయణులు చోళదేశంలోని మండంగుడి అనే గ్రామంలో పరమ భాగవతులైన దంపతులకు నారాయణుని సంప్రసాదంతో నారాయణుని వనమాలాంశాన ప్రభవసంవత్సర మార్గశిర కృష్ణ చతుర్థి నాడు జ్యేష్ఠానక్షత్రంలో జన్మించారు [97] నారాయణ వరలబ్ధులు కావడం వల్ల తల్లిదండ్రులు నారాయణుడు అని నామకరణం చేశారు విప్ర కులంలో పుట్టడం వల్ల విప్రనారాయణుడు అని పేరు వచ్చింది

తల్లిదండ్రులు విధ్యుక్తంగా సకల సంస్కారాలు జరిపించగా, ఆయన గొప్ప విద్వాంసులయ్యారు విష్వక్సేనుడే పంచ సంస్కారాలు కావించి మంత్రార్థం బోధించడం వల్ల విప్రనారాయణులు భక్తి జ్ఞాన వైరాగ్య సంయుతులై వివాహం మాని తమ ఊరు వదలి శ్రీరంగనాథుని సేవ చేయాలనే తలంపుతో శ్రీరంగం చేరారు పూర్వపు మాలాకారునివలె, పెరియాళ్వారు వలె రంగనాథునికి పుష్పమాలా కైంకర్యం చేయ సంకల్పించి శ్రీరంగానికి

---

97 తిరునక్షత్ర తనియ

కోదండే జ్యేష్ఠనక్షత్రే మండంగుడి పురోద్భవమ్,
చోళోర్వ్యాం వనమాలాంశం భక్తపదరేణుం మాశ్రయే

నిత్యతనియ

తమేవ మత్వా పరవాసుదేవం
రంగేశయం రాజవదర్హణీయమ్,
ప్రాబోధికీం యోఽకృత సూక్తిమాలాం
భక్తాంఘ్రిరేణుం భగవంత మీడే

దగ్గరగా సుందరమైన పూల తోట పెంచి, ఆ తోటలోనే ఒక గుడిసె వేసుకొని నివసిస్తూ పుష్పమాలా కైంకర్యం చేసేవారు, శ్రీవైష్ణవుల యిండ్లలో మధుకరం ఎత్తుకొని జీవయాత్ర కొనసాగిస్తూ, తోటపని పుష్పకైంకర్యం తప్ప మరొకటి లేకుండా ఉండేవారు

ఇలా ఉండగా, శ్రీరంగానికి సమీపంలోని కదంబనూరులో వసించే దేవదేవి అనే వేశ్య తన అక్క మున్నగువారితో నిచుళాపురాధీశ్వరుడైన చోళరాజు కొలువు కూటంలో నృత్యగానాలు జరిపి తన ఊరికి తిరిగి వెళ్లుతూ, దారిలో విప్రనారాయణుని పూల తోట చూచి, దానిలో విశ్రమించి, అక్కడ చెట్లకు పాదులు తవ్వుతున్న విప్రనారాయణుని చూచి నమస్కరించింది నిరంతర భగవద్ధ్యాన పరాయణుడగు విప్రనారాయణుడు ఆమె వైపు చూడలేదు దానికి దేవదేవి కోపించి ఆయనను ఎట్లయినా లోబరచుకోవాలని ప్రతిజ్ఞ చేసి, వెళ్ళిపోయింది మరునాటి దినం ఆమె కాషాయాంబర ధారిణి అయి యోగినివలె వేషం ధరించి, పూల తోటకు వచ్చి తాను వేశ్యనని ఆ వేశ్యా జీవితానికి రోసి, పశ్చాత్తాప పడి వచ్చానని ఆ తోటలోనే వుండి శేష జీవితాన్ని భగవత్సేవలో గడప దలచానని విప్రనారాయణునితో విన్నవించుకుంది అమాయకులైన ఆ ఆళ్వారు ఆ మాటలు నమ్మి, కనికరించి తోట పనిలో తనకు తోడ్పడుతుందనే ఆశతో ఆ తోటలో వుండడానికి అనుమతించారు తాను మధుకర వృత్తితో తెచ్చే అన్నాన్ని దేవదేవికి కూడ ఇచ్చేవారు

ఇలా కొంతకాలం గడిచింది విప్రనారాయణునిలో మార్పేమీ కలుగలేదు కాని, దేవదేవి అతనిని నీడవలె వెన్నంటి పనిచేస్తూ అవకాశం కోసం ఎదురు చూచేది అలాటి అదను రానే వచ్చింది ఒక సాయంకాలం కారుమేఘాలు ఆకాశమంతా కమ్ముకున్నాయి జడివాన ప్రారంభమయింది దేవదేవి విప్రనారాయణుని కుటీరానికి ఎదురుగా ఒక చెట్టు క్రింద ఆ వానలో తడుస్తూ నిలబడింది విప్రనారాయణులు హఠాత్తుగా తల యెత్తి చూడగా దీనాతి దీన దృష్టితో దేవదేవి తడుస్తూన్న దృశ్యం కనిపించింది ఆయన కనికరించి ఆమెను కుటీరంలోపలికి రమ్మన్నారు, ఆమె తడబడుతూ భయం నటిస్తూ కుటీరంలో ప్రవేశించింది ఆమె తడి బట్టలు చూచి విప్రనారాయణులు కరుణించి తన పొడిగుడ్డ ఒకటి ఇచ్చారు ఆమె తన తడిగుడ్డలు మార్చి సేవ నెపంతో అతనిని సమీపించి క్రమంగా లోబరచుకొంది అప్పటి నుంచి అతడు ఆమెకు దాసులయిపోయారు

ఆళ్వారు తన పుష్పకైంకర్యం మరచారు, రంగణ్ణి మరచారు దేవదేవి అతనిని నెమ్మదిగా తన ఇల్లు చేర్చింది ఆళ్వార్ దేవదేవి వ్యామోహంలో ఎవరేమన్నా లెక్కచేయక ప్రవర్తించారు తన ప్రతిజ్ఞ నెగ్గి విప్రనారాయణులు పాదాక్రాంతులయిన తర్వాత, దేవదేవి వైఖరి మారింది దానిని కనిపెట్టి దేవదేవి తల్లి ఆయనను రొక్కమివ్వక తమ యింట ఉండడం ఇక సాధ్యంకాదని స్పష్టంగా చెప్పింది ఒక రాత్రి

"నీ పచ్చై తిరుమణి నీ తిరు చూర్ణంబు
గణికకు వెండి బంగారు లౌనె?
నీ పట్ట గోచియు నీ కావి చేర్పవల్
వారకాంతకు పట్టుచీర లౌనె?
నీ ముష్టి గూడయు నీ తులసీ సరుల్
వేశ్యకు పండుగ వేట లౌనె?
నీ వేద శాస్త్రముల్ నీ సంధ్య జపములు
లంజె సానికి బంగారం గము లగునె?

పెట్ట నోపితిలా యెప్పటి యట్ల యుండు,
పెట్టలేకున్న విడ్చేయు పెందలకడ,
మొదలం గోయింతటికు నొక్క మురుపె గాక
నీ సదాచారమేలయ్య దాసరయ్య?"[98]

అంటూ దయచేయమంది. పెరఁబెట్టి ఇంటి నుంచి వీధిలోకి గెంటింది. విప్రనారాయణుడు అంత అవమాన పడినా, దేవదేవి యింటి అరుగుమీద పడుకొన్నాడు.

రంగనాథుడు అతనిని ఎంతో పరీక్షించదలచాడు. ఒక బ్రహ్మచారి వేషంలో దేవాలయం ప్రవేశించి, బంగారు ఆరాధన పాత్రంలో ఒక దానిని తీసుకొని దేవదేవి ఇంటికి వెళ్ళి, దేవదేవి తల్లిని పిలిచి తాను విప్రనారాయణుని శిష్యుణ్ణని, తన గురువు ఈ బంగారు గిన్నె ఇమ్మన్నా రని అన్నాడు. బంగారు గిన్నెను చూడగనే దేవదేవి తల్లి, దేవదేవి ప్రసన్నలై మునుపటిలాగే విప్రనారాయణుని ఆదరించసాగారు.

తెల్లవారింది. అర్చకులు కోవెల తలుపులు తెరిచి, తిరువారాధనకు ఉపక్రమించగా, బంగారు గిన్నె కనిపించలేదు. వారు కంగారుపడి దేవాలయాధికారులకు జరిగిన దొంగతనం గురించి తెలిపారు. క్రమంగా ఇది నిచుళాపుర రాజుకు తెలిసింది. కాకతాళీయంగా ఆ సమయంలో అక్కడ ఉన్న దేవదేవి పరిచారిక విప్రనారాయణుడు ఒక బంగారు గిన్నెను తన యజమానురాలికి ఇచ్చిన సంగతి తెలియజేసింది. రాజాజ్ఞపై భటులు దేవదేవి ఇల్లు పరిశోధించగా బంగారు గిన్నె దొరికింది. దానితో క్రుద్ధుడైన రాజు విప్రనారాయణుని, దేవదేవిని చెరసాలలో త్రోయించమని ఉత్తరువు చేశాడు.

---

98 సారంగుతమ్మయ వైజయంతీ విలాసము, ప 108

ఆ రాత్రి రంగనాథుడు రాజు కలలో కనిపించి, విప్రనారాయణుడు నిర్దోషులని తానే అతనిని పరీక్షించడానికి అట్లా చేశానని చెప్పాడు రాజు దేవదేవిని, విప్రనారాయణుని వదలి పెట్టాడు విప్రనారాయణుడు తమ చెడు ప్రవర్తనకు పశ్చాత్తాపపడి మునుపటిలాగే వైరాగ్యం వహించి, రంగనాథునికి మాలా కైంకర్యం చేస్తూ జీవితమంతా గడిపాడు రంగనాథుడు ఆయనను తొండరడిప్పొడి (భక్తాంఘ్రిరేణువు) అనే బిరుదంతో సత్కరించాడు

విప్రనారాయణుడు తిరుప్పళ్ళియెళుచ్చి (సుప్రభాతం), తిరుమాలై అనే రెండు ప్రబంధాలు రచించాడు తిరుప్పళ్ళి యెళుచ్చి సుప్రభాత కావ్యాలలో మొట్టమొదటిది వాల్మీకి రామాయణంలో విశ్వామిత్రునిలో,

"కౌసల్యా సుప్రజా రామ పూర్వా సంధ్యా ప్రవర్తతే,
ఉత్తిష్ఠ నరశార్దూల కర్తవ్యం దైవ మాహ్నికమ్ "99

అని రామునికి మేల్కొలుపులు పాడినాడు తర్వాత కాళిదాసు అజమహారాజుకు సుప్రభాతం చెప్పాడు అది ప్రకృతానుప్రవర్తంగా చెప్పినది

"తామ్రోదరేషు పతితం ద్రుమ పల్లవేషు
నిర్ధౌతహార గుళికా సదృశం హిమాంభః,
ఆభాతి లబ్ధ పరభాగతయాధరోష్ఠే
లీల స్మితం సదశనార్చి రివ త్వదీయమ్ "100

"ఓ అజ మహారాజా! మధ్యన ఎర్రగా వున్న చెట్ల చిగురుటాకుల మీద రాత్రి తెల్లని మంచు చుక్కలు పడ్డాయి అవి కడిగిన ముత్యాలలాగ వున్నాయి అంతే కాదు, చక్కని తెల్లని పలువరుస కాంతితో వెలిగిపోయే నీ మందహాసంలాగా మెరిసిపోతున్నాయి" అని ఆ మహారాజును మేల్కొల్పారు వంది మాగధులు విప్రనారాయణుడు ప్రత్యేకంగా రంగనాథుని మేల్కొల్పుతూ ఒక కావ్యం రచించాడు దానిలో పది పాశురాలున్నాయి

"సుడరొళి పరందన సూళ్ దిశై యెల్లామ్
తున్నియ తారకై మిన్నొళి సురుంగి
పడరొళి పశుత్తనన్ పని మది యివనో
పాయిరుళ్ గన్నదు పైంపొళిల్ క్కముగన్

99 వాల్మీకి రామాయణం బాల కాండ, సర్గ 23, శ్లోకం 2 100 కాళిదాసు రఘు వంశం సర్గ 5,

మదిరైక్కుటి పమ్మావైగనా
వైకల్తై కూర్ వ్వదు యారద విదువా
అరులాళి తిగళ్‌దరు తిరిగి యందాళ్క్కె
అరంగరమ్మా! పళ్లి యెళుందరుళాయే "

భాస్కరుని కిరణాలు వ్యాపించె వెలుగెల్ల
గగనమున తారకల కాంతి మాయమై కాక
అలాగె వెంవెల భారె నమ్మర కిరణంబు కూడ
విరిసె పెనుచీకటుల పెను వీక లెట్ల మ
స్థలం చీల్చుకొని విరియు అంబు గత్తుం కావు
లాలంయ పీదు విశాల మందారం మ్మదిగా!
తరుణ తేజోంచిత సుదర్శనోద్యత కరా!
శ్రీరంగశాయి! లే! శేషతల్పము వీడు "[101]

శ్రీరంగంలోని రంగనాథాలయంలో ప్రారంభమైన ఈ సుప్రభాత సంప్రదాయం - విప్రనారాయణుడు ప్రారంభించిన సంప్రదాయం - దేశంలోని వైష్ణవ దేవాలయాలన్నిటా వరిశాఖాలయం మొదలుకొని సర్వత్రా వ్యాపించింది

దేవదేవి కూడ విప్రనారాయణుని సంపర్కంతో జ్ఞానభక్తి వైరాగ్యాలు ముప్పిరిగొనగా తన ఆస్తినంతా రంగనాథునికి సమర్పించి ముక్తి పొందింది

## నమ్మాళ్వారు, మధురకవి యాళ్వారు:

నమ్మాళ్వార్, మధురకవి ఆళ్వార్ గురు శిష్యులు నమ్మాళ్వార్ జననం గురించి శ్రీవైష్ణవ సంప్రదాయంలో వ్యాపించిన కథ యిది శ్రీవైకుంఠంలో లక్ష్మీ సమేతుడై వేంచేసి ఉన్న శ్రీమన్నారాయణుడు ఒక సమయంలో తన ఎదుట బద్ధాంజలితో నిలబడిన అనంతుని కటాక్షించి, "భూలోకంలో బద్ధ జీవుల‌ను ముక్తులను చేయడానికి తామ్రపర్ణీనదీతీరంలోని తిరుక్కురుగూరు (ఆళ్వార్ తిరునగరి) అనే దివ్యదేశంలో విష్వక్సేనుని అవతరింపజేస్తున్నాను కనుక నీవు ముందుగా ఆ ఊరికి పోయి ఒక చింత చెట్టుగా పుట్టి ఉండు" అని ఆజ్ఞాపించాడు అనంతుడు ఆ ఆజ్ఞ ఔదలదాల్చి తక్షణమే భూలోకానికి వచ్చి, ఈశ్వర సంవత్సర చైత్ర మాసంలో తిరుక్కురుగూరులో అంకురించి అర్చావతార మూర్తి ఆదిప్పిరాన్ (ఆదినాథుని) సన్నిధికి ఉత్తర భాగంలో రాత్రి ఆకులు ముడువని చింతచెట్టుగా (నిద్రిత తింత్రిణిగా) జన్మించాడు పిదప నమ్మాళ్వార్ విష్వక్సేనాంశలో కల్యాదిలో అవతరించారు

---

101 శ్రీ పొన్నకంటి శ్రీనివాసాచార్యులు సిరినోము, పుట 49

నమ్మాళ్వార్ ప్రమాది సంవత్సర వైశాఖ శుద్ధ పూర్ణిమనాడు తిరుక్కురుగూరులో జన్మించారు [102] తిరుక్కురుగూరు సర్వ సంపన్నమైనటి దాని పాలకుడు పోర్కారి అతడు పరమ భాగవతుడు, భాగవతాగ్రగణ్యుడు అతని కుమారుడు కారి అతని భార్య ఉదయ నంగ కారి కొంతకాలం అత్తవారింట్లో ఉండి తన పట్టణానికి తిరిగివస్తూ, దారిలో ఉన్న తిరుక్కురుం గుడికి పోయి, అక్కడ వేంచేసి ఉన్న తిరుక్కురుం గుడినంబి అనే విష్ణువును సేవించి తనకొక పుత్రుని ప్రసాదించుమని ప్రార్థించారు స్వామి ప్రసన్నుడై "నేనే నీ గర్భంలో అవతరిస్తాను" అని చెప్పారు దానికి భార్యాభర్త లిద్దరూ సంతోషించారు తర్వాత ఉదయ నంగ గర్భం ధరించి కుమారుణ్ని ప్రసవించింది కారి చాలా సంతోషించి శిశువుకు విధ్యుక్తంగా జాత కర్మాదులు చేశారు

కాని, ఆ తల్లిదండ్రులకు పుత్రజననం వల్ల కలిగిన సంతోషం విచారంగా పరిణమించింది పిల్లడు పాలు తాగలేదు, ఏడవలేదు, కళ్లు తెరవలేదు కారి తన మంత్రులను పిలిపించి ఆలోచించారు వారు "మన కీ వింత శిశువు తత్త్వం తెలియదు సర్వేశ్వరుడైన ఆదినాథునికే తెలియ వచ్చును ఆయన సన్నిధికి తీసుకొనిపోవడం మంచిది అని విన్నవించారు కారి సరేనని ఆ శిశువును తన పరివారం వెంటరాగా దేవ సన్నిధికి తీసుకొని పోయారు అక్కడ ఆ శిశువు కళ్ళు తెరచి అందరూ చూస్తుండగా, పాకుతూ చింతచెట్టు వద్దకు వెళ్ళి దాని కింద పద్మాసనాసీనుడై కళ్ళు మూసుకొని యోగాభ్యాసం చేయసాగాడు అప్పుడు కారి, తక్కిన వారు అతడు భగవదంశ సంభూతుడే అని నిశ్చయించి, అతని తపస్సుకు భంగం కలుగకుండ తగు ఏర్పాటు చేశారు ఆ శిశువు ఈ విధంగా పదహారు సంవత్సరాలు తపస్సు చేశాడు ఆ అపారమైన తపశ్శక్తికి అతని చుట్టూ, ఆ ప్రాంతమంతా దివ్య తేజస్సు వ్యాపించింది

నమ్మాళ్వార్ ఇలా తపస్సు చేస్తుండగా, పాండ్య దేశంలోని కోళూరు అనే దివ్య దేశంలో నారాయణుడనే సామవేదీయ బ్రాహ్మణు డుండేవాడు అతడు మహావిద్వాంసుడు, భగ

---

102 నమ్మాళ్వార్ తిరునక్షత్రతనియ

వృషభే తు విశాఖాయాం కురుకాపురి కారిజమ్,
పాండ్యదేశే కలేరాదౌ శఠారిం సైన్యపం భజే

నిత్యతనియ

మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం యదేవ నియమేన మదన్వయానామ్,
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమ త్తదంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా

సర్వజ్ఞుడు. అతనికి శ్రీ విష్వక్సేనుని గణాధిపులలో ఒకరైన కుముదుడు అనే వాడి అంశతో ఒక కుమారుడు కలిగాడు. అతనికి మధురకవి అని పేరుపెట్టారు తల్లిదండ్రులు[108] మధురకవి పుట్టిన దినం ఈశ్వర సంవత్సర చైత్రశుద్ధ చతుర్థి శుక్రవారం. అతడు చిన్ననాడే వేదాధ్యయనం చేసి, వేదవేదాంగాలు అభ్యసించి తీర్థయాత్ర చేశారు. కొంతకాలం బదరికాశ్రమంలో తపస్సు చేశారు. మధురకవి యాళ్వారు నమ్మాళ్వార్ కన్న వయస్సులో పెద్దవారు.

మధురకవి తీర్థయాత్రలు చేస్తూ అయోధ్య చేరారు. ఒక రాత్రి ఆయనకు దక్షిణం వైపున అపూర్వ తేజస్సు కనిపించింది. అదేమిటా అని ఆయనకు సందేహం కలిగింది. ఇలా రెండు మూడు రాత్రులు వరుసగా ఆ తేజస్సు కనిపిస్తూనే వుంది. ఇక మధురకవి ఊరకుండలేక అదేదో తెల్సుకుందామని దక్షిణ దిక్కుకు అభిముఖంగా బయలుదేరారు. దారిలో తిరుమల, శ్రీరంగం, శ్రీవైకుంఠం మున్నగు క్షేత్రాలు సేవించి, తామ్రపర్ణి దక్షిణ తీరంలోని తిరుక్కురుగూరు చేరి ఆదినాథుని కోవెలకు వెళ్లి ప్రదక్షిణం చేస్తున్నప్పుడు చింతచెట్టు కింద సహస్ర సూర్యతేజస్సుతో వెలిగి పోతున్న నమ్మాళ్వార్ కనిపించారు. వారి దంపతుల నుంచి ఆ తపోధనుని విషయం తెలుసుకొన్న మధురకవి పరమానంద భరితులై నమ్మాళ్వార్‌కు దండప్రణామం చేసి ఆయన దృష్టి మరలించడానికి ఎంతో ప్రయత్నించి విఫలులు కావడం వల్ల ఒక పెద్ద గుండును ఆయన ముందుకు దొర్లించారు. ఆ పెద్ద చప్పుడుకు నమ్మాళ్వార్ కళ్లు తెరిచారు. అప్పుడు మధురకవి కొన్ని ప్రశ్నలు వేయగా, నమ్మాళ్వార్ తగిన సమాధానాలిచ్చారు. "శెత్తత్తిన్ వయిత్రిలే శిఱియదు పిఱందాల్, ఎత్తై తిన్ను ఎంగే కిడక్కుమ్?" అచిత్తు కడుపులో చిన్నది పుడితే ఏమి తిని ఎక్కడ ఉంటుంది?- అచిత్తయిన దేహంలో అణు రూపంలో వుండే ఆత్మ దేనిని తిని ఎక్కడ వుంటుంది?- అని మధురకవి ప్రశ్నించారు. దానికి నమ్మాళ్వార్ "అత్తై తిన్ను అంగే కిడక్కుమ్"- దానిని తిని అక్కడే పడి ఉంటుంది అంటే శరీర గతమైన సుఖ దుఃఖాలు అనుభవిస్తూ, శరీరంలోనే ఉంటుంది- అని సమాధాన

---

108 తిరునక్షత్ర తనియన్

మేషే చిత్రా సముద్భూతం పాండ్యదేశే గణాంశకమ్,
శ్రీ పరాంకుశ సద్భక్తం మధురం కవి మాశ్రయే

నిత్యతనియన్ - అవిదిత విషయాంతరః శఠారేః
ఉపనిషదా ముపగాన మాత్ర భోగః,
అపి చ గుణవశా త్తదేకశేషీ
మధురకవి హృదయే మమావిరస్తు

ఇచ్చారు ఆ శాస్త్రీయ సమాధానాంతం మధురకవి ఆశ్చర్యపడి ఆయన పరమ పురుషుడే గాని సామాన్యుడు కాదని నిశ్చయించుకొని సాష్టాంగ నమస్కారాలు చేసి

"పద్మాసనోపవిష్టం
పర పద యుగళే నివిష్ట చైతన్యమ్,
పరతత్త్వ బోధ ముద్రమ్
పరమాచార్యం పరాంకుశం వందే"

పద్మాసనాసీనుడు, పరమ పద వాసుడైన నారాయణుని పాద పద్మ యుగళంలోనే తన చైతన్యాన్ని ఉంచిన వారు పరతత్త్వాన్ని బోధించే ముద్రతో—చిన్ముద్రాంచిత హస్తంతో-విరాజితుడు, శ్రేష్ఠుడైన ఆచార్యుడు అయిన పరాంకుశ మునికి నమస్కరిస్తున్నాను - అని స్తోత్రం చేశారు

ఆ సమయంలో శ్రీమన్నారాయణుడు వారిద్దరికీ ప్రత్యక్షమయ్యాడు నమ్మాళ్వార్ ఆ దివ్య మంగళ విగ్రహ దర్శనం వల్ల పరవశానందంతో తిరువిరుత్తమ్, తిరువాశిరియమ్, తిరువందాది, తిరువాయ్‌మొళి అనే నాలుగు దివ్య ప్రబంధాలను ఋగ్యజు రథర్వణ సామ వేదాల సారంగా రచించారు భక్తి, విరహం, వాత్సల్యం, వేదాంతం, మధుర భావం-ఒకటేమిటి మనస్సును కరిగించే ప్రతి సున్నిత భావము నారాయణ లక్ష్యమై వరదలై పారింది నమ్మాళ్వార్ పాశురాలలో "భారత దేశపు దక్షిణపు చివరన అవతరించిన నమ్మాళ్వార్ ముని పుంగవుని నుంచి వెలువడిన పారమార్థిక జ్ఞాన ప్రవాహం తన విశాల ప్రసారంతో ఎంతో దూరంలో వున్న గంగా తీరాన్ని కూడ తాకి, దానిని సారవంతం చేసి పవిత్రం చేసింది" అంటారు ప్రొఫెసర్ టి పార్థసారథి[104] వేదార్థాలను, ఉపనిషత్సారాన్ని వివరించడం వల్ల దీనికి ద్రవిడ వేదమని పేరు వచ్చింది వేదోపనిషదర్థాలు వివరించే పాశురాలకు ఒక మచ్చు

"ఉళనెని లుళ నవ నురువ మివ్వురువుగళ్
ఉళ నల నెని లవ నరువ మివ్వరువుగళ్
ఉళ నెన విల నెన విచైకుణ ముడైమైయిల్
ఉళ నిరు తకైమై యొడొళి విలన్ పరందే"[105]

భగవంతుడు ఉన్నాడనువారికీ ఉన్నాడు, లేడనువారికిని ఉన్నాడు ఉన్నాడనువారికి సకల వస్తువులలోను అంతర్యామిగా భగవంతుని అస్తిత్వం ఉంటుంది లేడనువారు ఆ దేవుని

---

104 ప్రొఫెసర్ టి పార్థసారథి వేదాంత కేసరి, పుట 108, 1955

105 తిరువాయ్ మొళి 1 9

అంతర్యామిత్వం మాత్రం గ్రహింపలేరు. భగవంతుడు దృశ్య, అదృశ్య రూపాలలో ఉంటాడు. స్థూల సూక్ష్మ చిదచిద్విశిష్టమై పరబ్రహ్మమైన శ్రియఃపతి అంతటా ఈ రెండు రూపాలలో వ్యాపించి ఉంటాడు.[106] ఈ ప్రకారం

"అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్,
అస్తి బ్రహ్మేతి చేద్ వేద సన్తమేనం తతో విదు రితి"

అనే ఉపనిషద్వాక్య పరిమళాన్ని వెదజల్లుతుంది.

ఆళ్వారులందరి దృష్టిలోను పరమేశ్వరుడొక్కడే పురుషుడు. అందుకే తమపై నాయికా భావం ఆరోపించుకొని తమకు కనిపించిన వివిధ పక్షులను, తుమ్మెదలను, గుల్మాదులను తమ విరహబాధ తెలిపి స్వామిని పిలుచుకొని రమ్మని శ్రియఃపతివద్దకు వాటిని దూతగా పంపుతారు. నమ్మాళ్వార్ ఒక సారస పక్షితో తమ విరహం వెళ్ళబోసుకున్నారు, ఆ పక్షిని తమకు దూతగా పనిచేయమని ప్రార్థిస్తారు.

"అంజిఱైయ మడనారాయ్ అళియత్తాయ్ నీయుమ్ నిన్
అంజిఱైయ శేవలుమాయ్ ఆవా వెన్ఱెనక్కరుళి
వెంజిఱైప్ పుళ్ళుయర్త్తార్క్కెన్ విడుతూదాయ్ చ్చెన్ఱక్కాల్
వన్‌శిఱైయిల్ అవన్ వైక్కిల్ వైప్పుండాల్ ఎన్ శెయ్యుమో"[107]

ఓ సారసపక్షీ, నావలె నీవూ ఆ శ్రియఃపతి వియోగంతో రాత్రంతా నిద్రలేకున్నావే! నా బాధ కళ్లారా చూస్తున్న నీవు చక్కని రెక్కలతో క్షణంలో ఎగిరిపోయి కనికరించి సర్వేశ్వరునికి నా దుస్థితి తెలియజేయవూ! శరణాగత త్రాణదీక్షాదీక్షితుడైన నా స్వామి ఆశ్రిత విరోధి శిక్షకుడై గరుత్మంతుని వాహనంగా స్వీకరించాడు గదా! ఒకవేళ ఆయన నా మాట పెడచెవిని పెట్టినా నీవు నాకై ఈ అవమానం సహించక తప్పదు సుమా![108]

నమ్మాళ్వార్‌కు మరికొన్ని పేర్లున్నాయి. ఆదిప్పిరాన్ ప్రసాదించిన పొగడ పూదండ ధరించడంచేత వకుళాభరణుడని, పరమతాలను నిరసించడంచేత పరాంకుశుడని, శఠమను వాయువును పరచడంవల్ల శఠగోపుడని పేర్లు వచ్చాయి. ఆప్తులందరూ ప్రేమించడంవల్ల నమ్మాళ్వార్— మన ఆళ్వార్ అనే పేరే ఎక్కువ ప్రసిద్ధమైంది. నమ్మాళ్వార్ ఆధ్యాత్మికానంద రసప్రవాహాలు పారించి జీవుల హృదయ క్షేత్రాలు పవిత్రంచేసి తమ 35వ ఏటే పరమపదం పొందారు.

---

106 శ్రీ చరణరేణువు శ్రీ శఠకోపవాఙ్మధు పుట 27

107 తిరువాయ్ మొళి 1.4.1  108 శ్రీ చరణరేణువు శ్రీ శఠకోపవాఙ్మధు, పుట 52

మధుర కవి యాళ్వారు శఠగోపుల వాక్సుధను ప్రచారంచేస్తూ మరికొన్నాళ్ళుండి తనువు చాలించారు. ఆయన శఠగోపులను స్తుతిస్తూ శరణాగతి పొందుతూ పదకొండు పాశురాలతో కణ్ణినుణ్ శిరుత్తాంబు అనే దివ్యప్రబంధం రచించారు. దానిలోని ఒకటి రెండు పాశురాలు

"కణ్ణినుణ్ శిఱుత్తాంబినాల్ కట్టుణ్ణ
ప్పణ్ణియ పెరుమాయన్ ఎన్నప్పనిల్
నణ్ణి త్తెన్ కురుగూర్ నంబి యెన్ఱక్కాల్
అణ్ణిక్కుమ్ అముదూఱుమ్ ఎన్ నావుక్కే" [109]

కరకు చిఱు త్రాటిచే కట్టుబడు
మాయావి ఆ స్వామి నుతించుటె
పూని మా కురుగూరు పతి పేరి నుడువులో
తేనెయో అమృతమో గద నాదు నాల్క [110]

"అరుళ్ కొండాడు మడియవరిన్బుఱ
అరుళినా నవ్వరు మఱైయి న్పొరుళ్
అరుళ్ కొండాయిర మిన్దమిழ் పాడినాన్
అరుళ్ కండీ రివ్వులగనిల్ మిక్కదే" [111]

కృపను కొనియాడ పరవశులగుచు దాసతతి
కృపసేసె గద ద్రవిడ వేద మనుపొత్తు
కృప వేయిపాశురాల్ తీగి తమిళమున పాడె
కృప అరయ నా ప్రభువు దెంత ఉత్కృష్టమో! [112]

మధురకవి గురు మరణానంతరం యాభై సంవత్సరాలు జీవించారని కొందరు వ్రాశారు [113]. మధురకవి యాళ్వార్ తిరుక్కురుగూరులో నమ్మాళ్వార్ల విగ్రహం స్థాపించి, దివ్యరుదాంకిత గాథలు పొగడుతూ విజయ వాహనులు ఊరేగించుతూ ప్రచారంచేస్తుండగా కంబనాథ కవి సమ్మె దొరకదు అన్నట్లు తగిలారట - తమ గురువును అయితేగాని పరవాహనులు ఊరేగించ రాదన్నారట. "మా గురువుగారు తమ ఊరు వదలి రారు. ఆయన రచించిన దివ్యప్రబంధం లోని ఒక పాశురం తీసుకొని వెళ్లి మధురలోని సంఘప్పలకపైన ఉంచు. ఆ పలకపై అది

109 కణ్ణినుణ్ శిరుత్తాంబు పాశురం 1 110 శ్రీ వాఙ్మయం శ్రీనివాసాచార్యులు సిరినోము, పుట 67 111 కణ్ణినుణ్ పా 9 112 శ్రీ వాఙ్మయం శ్రీనివాసాచార్యులు, సిరినోము, పుట 60 113 ప్రొఫెసర్ టి ఎ గోపీనాథరావు ది హిస్టరీ ఆఫ్ ది వైష్ణవాస్, పుట 4

మాత్రం వినిపిస్తే మా గురువుగారు ఓడిపోయినట్లే" అని మధురకవి నమ్మాళ్వార్ల ఒక పాశురం చదివారట. అప్పుడు వాగ్దేవి దానిని పత్రంతో ఘంటం మీద ఉంచి తక్కిన వాటిని కిందికి తోసి వేసిందట. అప్పుడు సంఘంలోని కవులు భయపడి నమ్మాళ్వార్‌ను ధ్యానించి ఇలా అన్నారట:

"ఈ యాడువతో కరుడ క్కెదిరే, ఇరవిక్కెదిర్ మిన్మిని యాడువదో,
నా యాడువతో యారుమాప్పులిమున్, నరి కేసరిమున్నాలై యాడువదో,
పే యాడువదో వళగూర్వశిమున్, పెరుమానడి శేర్ వకుళాభరణన్
ఓ రాయిర మామఱైయిన్ తమిళ్ ఒరు సొల్ పొరుమో ఉలకిల్ కవియే"

ఈగ గరుడుని ఎదుట ఆడినా? సూర్యుని ఎదుట మిణుగురు పురుగు ఎగిరినా? నక్క పులి ఎదుట నటయాడినా? సుందరియయిన ఊర్వశి ముందు దయ్యం నర్తించినా? వేదాన్ని తమిళ భాషలో రచించిన నమ్మాళ్వార్ కవితకు లోకంలోని ఇతరుల కవిత సరిపోలినా?[114]

ఈ సంఘాధికవి ఎవరో! రామాయణం రచించిన కంబని కాకతీయ గణపతి దేవుని కాలంవారు. గణపతి దేవుని ఆస్థానంలో సన్మానం పొందినవారు. నమ్మాళ్వార్ క్రీస్తుశకం 6వ శతాబ్దంలో ఉన్నాడనటం సముచితమని కృష్ణస్వామయ్యంగార్ అంటున్నారు.[115] కనుక ఇలాటి కథలను నమ్మడానికి వీలులేదు. ఏమైనా నమ్మాళ్వార్ తిరువాయ్‌మొழி ద్రవిడ వేదంగా పేరు పొందింది. వేదోపనిషత్సారాన్ని గుబాళింపజేసింది.

## పరకాలుడు

తిరుమంగైయాళ్వారు (పరకాలుడు) జీవితం చాలా విచిత్రమైంది. భాగవతారాధనకు, భగవత్సేవకు దొంగతనం చేసినా తప్పులేదన్నది ఈయన భావం. అందువల్ల తిరుమంగైయాళ్వారు కైంకర్యం అంటే దొంగతనమనే వాడుక కూడా వైష్ణవులలో ఏర్పడింది.

తిరుమంగైయాళ్వారు చోళదేశంలోని చిలాంబరణ్యం సమీపంలోని తిరుక్కురయలూరు (కమలాపూర్ణపురము) అనే పట్టణంలో 8వ శతాబ్దంలో శ్రీమన్నారాయణుని పంచాయుధాలలో ఒకటయిన శార్ఙ్గధనువు అంశలో జన్మించారు.[116] తండ్రి చోళరాజ్యంలోని తిరువాలినాడు అనే

---

114 శ్రీమేడేపల్లి వెంకటరమణాచార్యులు, మహాభక్తవిజయము గురుపరంపరా ప్రభావము పుట 607. 115 డాక్టర్ ఎస్. కృష్ణస్వామయ్యంగార్, ఎర్లీ హిస్టరీ ఆఫ్ వైష్ణవిజం ఇన్ సౌత్ ఇండియా, పుట 84

116 తిరుమంగై తనియన్

కార్తికే కృత్తికాజాతం చతుష్కవి శిఖామణిమ్,
షట్ప్రబంధ కృతం శార్ఙ్గమూర్తిం కలిహ మాశ్రయే

నిత్యతనియన్

కలయామి కలిధ్వంసం కవిం లోక దివాకరమ్,
యస్య గోభిః ప్రకాశాభిః ఆవిద్యం నిహతం తమః

వరగుణాకు పాలకుడైన నీలుడు ఇతనికి తిరువాలినాడుడైయార్ అనే అధికార నామధేయమూ ఉండేది. ఇతడు శివభక్తుడు. ఈ తిరువాలినాడుడైయార్ తన కుమారునికి నీలుడని నామ కరణం చేశాడు. నీలుడు మంచి అంగసౌష్ఠవం కలవాడు, ఆజానుబాహువు, శౌర్య సాహసాలు కలవాడు. సకల శాస్త్రాలలోనూ ధనుర్విద్యలోను ఆరితేరాడు. తండ్రి మరణానంతరం తిరు మంగైయాళ్వారును రాజు చూచి, తండ్రి పదవికి ఆయన అర్హుడని భావించి ఆ పదవిలో నియ మించాడు.

దివ్యారణ్య పట్టణానికి కోసు దూరంలో శ్వేతహ్రదమనే సరస్సు ఉంది. దివ్యారణ్య వాసి విష్ణుభక్తుడైన వైద్యుడొకడు తిరువాచ్యూరులో వెంచేసివున్న స్వామిని దర్శించి తిరిగి వస్తూ, దారిలో శ్వేతహ్రదం దగ్గర ఒక అనాథ అయిన పసిపిల్ల కనిపిస్తే పిలుచుకొని వెళ్ళి తన భార్యకు అప్పగించాడు. భార్య అత్యాదరంగా పెంచసాగింది. ఆ బాలికకు కుముదవల్లి అని పేరుపెట్టారు. కుముదవల్లి నవయౌవనవతి అయింది. వైద్యుడు ఆమె వివాహ ప్రయత్నాలు చేయసాగాడు.

కుముదవల్లి సౌందర్యం గురించి తిరుమంగై యాళ్వారుకు తెలిసింది. ఆ ఆళ్వార్ ఆ వైద్యుని ఇంటికిపోయి కుముదవల్లిని చూచి ముగ్ధుడై తన కిమ్మని కోరారు. వైద్యుడు, అతని భార్య ఆళ్వారు మాటకు ఒప్పుకొన్నా, ఆ కన్య "పంచ సంస్కారయుతుడైన వైష్ణవుణ్ణి తప్ప మరొకరిని పెండ్లాడను" అని నిష్కర్షగా చెప్పింది. ఆళ్వారు వెంటనే ఒక వైష్ణవ గురువును ఆశ్రయించి పంచ సంస్కారాలు పొంది ద్వాదశోర్ధ్వ పుండ్రాలతో వచ్చారు. "సంవత్సరంపాటు దినానికి వేయిమంది వైష్ణవులకు సాపాటు పెట్టి వారి తీర్థ ప్రసాదాలు తీసుకుంటే పెళ్ళాడుతాను" అని అన్నది. దానికికూడ ఆళ్వారు అంగీకరించారు. వారికి వివాహం జరిగింది.

తాను ఒప్పుకున్న తదీయారాధనకు ఉన్న ధనమంతా కరిగిపోగా చోళరాజుకు చెల్లించ వలసిన ధనంకూడా ఆళ్వారు తదీయారాధనకే ఖర్చుపెట్టారు. ఆ కారణంగా రాజుకు నియమానుసారం ధనం చెల్లించలేకపోయారు. రాజు కోపగించుకొని ధనం వసూలు చేసుకొని రావడానికి కొంతమంది అధికారులను పంపాడు. వారు వచ్చి, తిరుమంగై యాళ్వారు చేస్తున్న వైష్ణవ సమారాధనకు ఆశ్చర్యపడి సంతోషించినా, రాజాజ్ఞను పాటించుమని హితవు చెప్పారు. ఆళ్వారు వారి మాటలు వినక వారిని అవమాన పరచి పంపారు. దానితో రాజు మరింత కోపగించి ఆళ్వారును పట్టితెమ్మని సైన్యం పంపాడు. పరకాలుడు ఆ సైన్యాన్ని ఓడించగా రాజు మంత్రిపతి చతురంగ బలంతో వచ్చాడు. కాని పరాజితుడయ్యాడు. రాజు అతనిని నయవంచనతో లోబరచుకోదలచి "నీతో నా కిక వైరం లేదు. నీ పరాక్రమానికి మెచ్చాను. నా వద్ద అనుకూలంగా ఉండు" అని కోరాడు. ఆళ్వార్ ఆ మాటలు నమ్మి రాజధానికి పోగా,

రాజు "పైకం చెల్లించేవరకు నిర్బంధంలో వుంచండి వీడిని!" అని మంత్రికి ఆజ్ఞాపించారు. మంత్రి ఆతనిని ఒక దేవాలయంలో మూన్నాళ్ళు బంధించాడు. మూడోరాత్రి రంగనాథుడు స్వప్నంలో కనిపించి కాంచీనగర ప్రాంతంలోని గుప్త ధనం చూపాడు. ఆ ధనంతో ఆళ్వార్ రాజు కివ్వవలసినది చెల్లించి తక్కినదానితో వైష్ణవ కైంకర్యం ప్రారంభించారు.

ఆ ధనం మాత్రం ఎంతకాలం వుంటుంది? కనుక అతడు వైష్ణవులు కాని వారి ఇళ్లు పేదసాదలు కానివారి ఇళ్లు దోచి, దారులు దోచి, వైష్ణవ సమారాధన చేసేవారు. ఒకమారు ఒక వైష్ణవి దీక్షపడిన పిదప ఇంటిముంగిట్లో పెండ్లిపల్లెం జరుగుతుండగా ఆళ్వార్ తటాలున దోచుకొని పారిపోయారు. ఆ యిద్దరు వైష్ణవులని తెలిసి పశ్చాత్తాపపడి దానిని మరల వారికి అప్పగించారు. శ్రీరంగనాథుడు ఆళ్వారును ఆ దారిలోనే అనుగ్రహించదలచి, తానూ రంగనాయకీ నవవధువుల వేషం వేసుకొని సపరివారంగా ఆళ్వారు కాచిన దారిన బయలుదేరారు. ఆళ్వారు వారిని పూర్తిగా దిలువుదోపిడీ చేశారు. ఒక చిటికెనవ్రేలికి ఉన్న ముద్దుటుంగరం లాగారు. అది బిగిసి రాకపోగా, వ్రేలు కొరికి లాక్కున్నారు. అప్పుడు ఆళ్వారు వరుణ్ణి చూచి, "ఈ ఉంగరం రాకుండ ఏమైనా మంత్రం వేశావా" అని ప్రశ్నించారు. "ఔను. ఆ మంత్రం నీకూ ఉపదేశిస్తాను" అని చెప్పి తిరుమంత్రం ఉపదేశించి నిజస్వరూపంతో ప్రత్యక్షమయ్యారు శ్రీరంగనాథుడు. తిరుమంగైయాళ్వార్ మనసారా రంగనాథుని భక్తి కవితా వేశంతో స్తుతించారు. పిదప శ్రీరంగంలో వసించారు.

రంగనాథస్వామి ఆలయానికి ప్రాకార మంటప గోపురాలు కట్టించాలని నిశ్చయించి, దానికోసం ధనసంపాదన యెట్లాగా అని ఆలోచించారు. నాగపట్నంవద్ద బౌద్ధాలయంలో బంగారు బుద్ధ విగ్రహం వుందని తెలిసి, దానిని మాయోపాయంతో తెచ్చి ముక్కలు చేసి, కరిగించి అమ్మి ఆ ధనంతో ప్రాకారగోపురాదులు నిర్మించారు. చివరకు పనివారికి కూలి ఇవ్వలేక వారినందరినీ ఒక పడవ ఎక్కించి కావేరీనదిమధ్యకు తీసుకొని వెళ్లి ముంచివేసి, మోక్షప్రాప్తి కలుగుతుందని సంతృప్తి పడ్డారు. శ్రీరంగంలోనే సతీసమేతులై నివసించి, చివరకు తిరుక్కురుంగుడిలో ఉండి 105 సంవత్సరాలు జీవించి పరమపదం పొందారు.

తిరుమంగైయాళ్వార్ మహాకవులు. శ్లేష చిత్ర మధుర విస్తర కవిత చెప్పడంలో అసాధారణ ప్రజ్ఞ గలవారు. ఒకప్పుడు ద్రావిడశిశువు అయిన సంబంధర్‌కూ, ఆళ్వారుకూ ఎవరో విషయంలో వాదవివాదాలు జరిగాయని, సంబంధర్ చతుష్కవి శిఖామణి అనే బిరుదు ఆళ్వార్‌కే కనుక ప్రకటించారని పండితులంటారు. ఈయనకు చతుష్కవి స్వామి (నాలు కవిప్పెరుమాన్), కలియన్ (కలిఘ్నుడు), ఆలినాడర్ (తిరువాలినాడుడైయార్-తిరువాలి ప్రాంతాధిపతి), పరకాలన్ (శత్రువులకు యముడు), మంగైవేందర్ (తిరుమంగరు రాజు) మొదలయిన బిరుదు లున్నాయి.

తిరుమంగై యాళ్వార్ ఆరు దివ్య ప్రబంధాలు సాయించారు 1 పెరియతిరుమొళి (1084 పాశురాలు) దీనిలో ఆళ్వార్ భారతదేశంలోని దివ్య క్షేత్రాలు దర్శించి ఐతేసి పాశురాలతో ఆయా పెరుమాళ్లను కుర్తించారు నాలాయిర దివ్య ప్రబంధంలో దాం భాషా కారిక్కాంగం ప్రబంధ మిది 2 తిరుక్కురుందాండకం (చిన్న దండకం - 20 పాశురాలు), 3 తిరునెడుందాండకం (పెద్ద దండకం-30 పాశురాలు) దండక మంటే శ్యామలా దండకం వంటిది కాదు సంస్కృతంలోని దండక వృత్తం కన్నా పెద్ద వృత్తం) 4 తిరువెళుగూర్త్రిరుక్కై (ఒక పాశురం), 5 శిరియ తిరుమడల్ (40 పాశురాలు), 6 పెరియ తిరుమడల్ (78 పాశురాలు మొత్తం - 1253)

తిరుమంగై యాళ్వారు సాయించిన పెరియ తిరుమొళిలోని రెండు పాశురాలు ఉదాహరిస్తాను

'వాడినేన్, వాడి వరున్దినేన్ మనత్తాల్,
పెరున్తుయర్ ఇడుమ్పైయిల్ పిఱన్దు
కూడినేన్, కూడి యిళైయవర్ దమ్మోడు అవర్
దరుమ్ కలవియే కరుది
ఓడినేన్, ఓడి యుయ్‌వదోర్ పొరుళాల్
ఉణర్వెన్నుమ్ పెరుమ్ పదమ్ తెరిన్దు
నాడినేన్, నాడి నాన్ కణ్డుకొణ్డేన్
నారాయణా వెన్నుమ్ నామమ్ "

అనాది భగవత్ప్రాప్తిలేక వ్రాలిందితిని అట్లు వ్రాలింది, మనస్సుచే దుఃఖించితిని అధిక దుఃఖమును కలిగించు దుఃఖరూపమైన సంసారమందు పుట్టింది, యువతులైన స్త్రీలతో సంబంధపడితిని అట్లు సంబంధపడి వారిచ్చు సంసర్గమునే కోరి, పరుగులు పెట్టితిని అట్లు ఎరుగెత్తి ఉజ్జీవింపజేయువది అని చెప్పు అతిప్రియమైన ఒకానొక అర్థము (వస్తువు) వలన జ్ఞాన మనెడి గొప్ప పదవి ఉన్నట్లు తెలిసికొని, బాగుగా ఆలోచించితిని అట్లు ఆలోచించి (అదృష్టవంతుడ నైన) నేను నారాయణ అను తిరునామమును కనుగొంటిని (పెరియ తిరుమొళి, రెండవ సహస్రం మొదటిపత్తు మొదట పాశురం)

"పళ్ళియి లోది వన్ద దన్ శిఱువన్
వాయిలో రాయిర నామమ్
ఒళ్ళియవాగిప్పోద వాఙ్గదను
క్కొన్ఱుమోర్ పొఱుప్పిల్ వాగి

పిళ్ళైయైచ్చీఱి వెగుణ్డు తూణ్ పుడైప్ప
　　పిఱైయెయిర్ట్ర నల్ విఴిప్పేఴ్వాయ్
తెళ్ళియ శింగమాగియ దేవై
　　త్తిరువల్లిక్కేణి క్కణ్డేనే

బడిలో చదివి వచ్చిన తనకుమారుని నోటివెంట సహస్ర నామములు ప్రవాహముగ వచ్చుటతోడనే, అక్కడనే ఆ నామోచ్చారణమునకు తగినట్లుగా ఓర్పును చూపలేనివాడై తన పుత్రునిపై కోపించి, పరాక్రమించి స్తంభమును ఛేదింపగా, దానినుండి బాలచంద్రుని వంటి వంగిన కోరలను, అగ్నిమయములైన నేత్రములను, పెద్దనోరునుగల విశేషమైన నరసింహా వతారమును ధరించిన దేవుని, తిరువల్లిక్కేణిలో సేవించితిని (పెరియ తిరుమొఴి, రెండవ సహస్రం, రెండవపత్తు 3వ పాశురం) *

గోదాదేవితోపాటు పన్నిద్దరు ఆళ్వార్లు రచించిన దివ్య ప్రబంధాన్ని నాథమునులు, వ్యాసులు వేదాలను విభజించినట్లు నాలుగు భాగాలుగా విభజించారు ద్రావిడవేదమని దీనికి పేరుపెట్టి వేదంతో సమానప్రతిపత్తి కలిగించి, విష్ణ్వాలయాలలోను, ఉత్సవాలలోను ద్రావిడ ప్రబంధ పఠనపద్ధతిని ఏర్పాటు చేశారు ఈ ఏర్పాటు వల్ల శ్రీవైష్ణవులకు సంస్కృత ద్రావిడాలు ముఖ్యమై 'ఉభయవేదాంతాలు' అనే విలక్షణ పద్ధతి రూపొందింది [117]

దివ్యప్రబంధం మొత్తం పాశురాలు నాలుగువేలు కావడంవల్ల నాలాయిర ప్రబంధం అని దీనికి పేరు వచ్చింది నాథమునులు నాలుగువేలను విభజించిన పద్ధతి ఇది -

మొదట వేయి -

| | | |
|---|---|---|
| పెరియాళ్వారు (విష్ణుచిత్తులు) | తిరుప్పల్లాండు | 12 |
| " | పెరియాళ్వార్ తిరుమొఴి | 461[118] |
| ఆండాళ్ (గోదాదేవి) | తిరుప్పావై | 30 |
| " | నాచ్చియార్ తిరుమొఴి | 143 |
| కులశేఖరాళ్వార్ | పెరుమాళ్ తిరుమొఴి | 105 |
| తిరుమఴిశైయాళ్వార్ (భక్తిసారులు) | తిరుచ్ఛందవిరుత్తమ్ | 120 |
| తొండరడిప్పొడియాళ్వార్ (భక్తాంఘ్రిరేణువు) | తిరుమాలై | 45 |
| " | తిరుప్పళ్ళియెఴుచ్చి | 10 |

* ఈ రెండు పాశురాలను మిత్రులు ప్రొఫెసర్ డాక్టర్ ముదుంబై నరసింహాచార్యులు (మద్రాసు విశ్వవిద్యాలయం) వ్రాసిపంపారు వారికి కృతజ్ఞతలు

117 సర్వసిద్ధాంత సౌరభము సంపు 7, పుట 161 118 473 అని ఒక లెక్క

| | | |
|---|---|---|
| తిరుప్పాణి యాళ్వార్ (యోగివాహుల) | అమల నాదిపిరాన్ | 10 |
| మధురకవి యాళ్వార్ | కణ్ణినుణ్ శిరుత్తాంబు | 11 |
| | | 947 |
| రెండవ వేయి – | | |
| తిరుమంగై యాళ్వార్ (పరకాలుడు) | పెరియ తిరుమొళి | 1084 |
| ,, | తిరుక్కురుందాండకమ్ | 20 |
| ,, | తిరు నెడుందాండకమ్ | 30 |
| | | 1134 |
| మూడవ వేయి – | | |
| నమ్మాళ్వార్ (శఠగోపుడు) | తిరువాయిమొళి | 1102 |
| నాల్గవ వేయి – | | |
| పొయ్‌గై యాళ్వార్ (సరోయోగి) | మొదల్ తిరువందాది | 100 |
| పూదత్తాళ్వార్ (భూతయోగి) | ఇరండాం తిరువందాది | 100 |
| పేయాళ్వార్ (మహాయోగి) | మూన్రాం తిరువందాది | 100 |
| తిరుమళిశై యాళ్వార్ (భక్తిసారుడు) | నాన్‌ముగన్ తిరువందాది | 96 |
| నమ్మాళ్వార్ (శఠగోపుడు) | తిరు విరుత్తమ్ | 100 |
| ,, | తిరు వాశిరియమ్ | 7 |
| ,, | పెరియ తిరువందాది | 87 |
| తిరుమంగై యాళ్వార్ (పరకాలుడు) | తిరు వెళుక్కూత్తిరుక్కై | 1 |
| ,, | శిరియ తిరుమడల్ | 77½ |
| ,, | పెరియ తిరుమడల్ | 148½ |
| | | 817 |

ఒకటవ, నాల్గవ విభాగాలలో పాశురాల సంఖ్య వేయి లేదు రెండు, మూడు విభాగాలలో వేయికిపైగా వుంది మొత్తం మీద నాలుగువేలు

## వైష్ణవమతం – ఆచార్యులు

వైష్ణవ సిద్ధాంత ప్రచారానికి ఆళ్వారుల తర్వాత ఆచార్యులు పూనుకొన్నారు ఆళ్వార్లకు, ఆచార్యులకు చాల భేదం వుందనవచ్చు ఆళ్వారులు ఆత్మసాక్షాత్కారం పొంది, ఆ దివ్యానుభూతితో భగవద్భక్తులను, భగవత్ప్రాప్తి మార్గాన్ని వివరించి నట్టివారు, ప్రకారాంతరంగా సిద్ధులు వారి వాక్కులు భవభూతి అన్నట్టు "వాచమర్థోఽనుధావతి" ఆచార్యులు సాధకులు,

వారికి ఆర్తి ఉంది కాని, భగవత్సాక్షాత్కారానుభూతి లేదేమో! ఆళ్వార్లలో హృదయానికి ప్రాధాన్యమైతే ఆచార్యులలో మేధకు ప్రాధాన్యం "ఆళ్వార్లను మహాత్ములై బ్రహ్మానుభూతి పొందిన వారు ఆచార్యులు పండితశ్రేష్ఠులై, ఆళ్వార్ల రచనలలోని వాక్యాలు విషయాలను వివరించేవారు వీరు ఆళ్వార్లకన్నా కింది మెట్టు వారనడం సత్యం" [119] అంటారు ప్రొఫెసర్ గోపీనాథరావు కాని ప్రొఫెసర్ మహాదేవన్ దీన్ని ఒప్పుకోలేరు భారతదేశంలో మతం, తత్త్వవిచారం విడివిడిగా లేవు గనుక భారతీయ మహాతత్త్వవేత్తలందరూ మహాత్ములే అని అంటారు ఆయన [120]

ఆళ్వారు తమ వైష్ణవ మతానికి శాస్త్రీయతను కల్పించడానికి ప్రమాణాలు చూపలేదు అలా చూపి ఇతరులను ఒప్పించడానికి ప్రయత్నించలేదు ఇతరులను ఒప్పించవలసిన అవసరమూ వారికి లేదు తాము నమ్మిన దానిని చెప్పేవారు, తదనుగుణంగా జీవితం గడిపేవారు వారి ప్రవర్తనకు ముగ్ధులైన వారు వారికి శిష్యులయ్యేవారు 'శిష్యులు కండి'! అని వారు ఎవ్వరినీ నిర్బంధించలేదు ఆచార్యులకు అలా ప్రమాణాలు చూపి ఇతరులను ఒప్పించవలసి వచ్చింది, దీనికి కారణం అధికారి తారతమ్యం ఆళ్వార్ల భక్తి మతప్రచారానికి అధికారులు ఎక్కువగా సామాన్య ప్రజలు ఆచార్యుల ప్రచారానికి అధికారులు సామాన్య ప్రజలకు ఒక మెట్టు పై తరగతి వారు కనుక వారు ఆ పై మెట్టువారిని తమ మేధతో వివిధ ప్రమాణాల పాండిత్య ప్రకర్షతో ఒప్పించవలసి వచ్చింది తమ మాటలకు గాని, ప్రాచీనుల కథనాల వివరణకు గాని వేదోపనిషదాదుల ప్రమాణాలు చూపితే గాని తెలివిగల జనం నమ్మని పరిస్థితి ఏర్పడింది దీనికి హృదయం కన్నా, మేధ అవసరం ఎక్కువ ఇంత మాత్రాన వారికి హృదయం తక్కువని కాదు యామునాచార్యుల స్తోత్రరత్నం గాని, రామానుజుల గద్యత్రయం కాని హృదయాన్ని కదిలించే మహోదాత్త రచనలే కాని, వారు ఇతరులను ఒప్పించడానికి మేధా విలసితాన్ని వినియోగించుకొన్నారన్నదే తాత్పర్యం వారు ఒక విధంగా మేధా హృదయాలకు సమన్వయమూ సాధించారనవచ్చు ఇలాంటి సమన్వయం, ఆళ్వారుల భావాలకు వేద ప్రామాణ్యానుసంధానం నాథమునులతో ప్రారంభమైందనవచ్చు

## నాథమునులు

ఈయనది శఠమర్షణగోత్రం కనుకనే నేటికీ శఠమర్షణ గోత్రజులకు వైష్ణవులలో ఎక్కువ గౌరవం ఉంది

---

119 ప్రొఫెసర్ గోపీనాథరావు హిస్టరీ ఆఫ్ శ్రీ వైష్ణవిజం, పుట 29

120 ప్రొఫెసర్ టి ఎం పి మహాదేవన్ ఎ సెమినార్ ఆన్ సెయింట్స్, పుట 9

నాథమునులు బహు దీర్ఘజీవి అని, ఆయన వందలేళ్లు జీవించారని పూర్వులంటారు. క్రీస్తు శకం 920లో ఈయన పరమపదించినట్లు రామానుజుల సమకాలికులైన యామునాచార్యుల కాలాన్ని బట్టి అంటారు. ఈ నాథమునులు క్రీస్తుశకం 2వ శతాబ్దం తర్వాత దక్షిణ భారతంలో వ్యాపించిన భాగవత సంప్రదాయాన్ని ఉత్తరాపథం నుంచి తెచ్చిన ప్రముఖులయిన ప్రబంధ సంకలనకారని ప్రొఫెసర్ రాజగోపాలాచారియార్ అభిప్రాయం[121]. చోళ దేశంలోని వీర నారాయణ పురంలో ఈయన జన్మించారు. ఈయన తండ్రి పేరు ఈశ్వర భట్టు. నాథమునులకు పితామహుని పేరు పెట్టారు. ఈయన చిన్ననాటినుంచి కృష్ణ భక్తులు. ఆ గ్రామంలోని మన్నారు కృష్ణుని శ్రద్ధగా కొలిచే వారు. చిన్ననాడే ఊరు వదలి భారతదేశంలోని వివిధ పుణ్య తీర్థాలను సేవించుకొని తిరిగి వచ్చి శాస్త్రాధ్యయన నిరతులై ఉండేవారు.

ఒక నాడు నాథమునుల ఇంటికి ఇద్దరు వైష్ణవులు వచ్చారు. వారు "ఆరా వముదే" అనే తిరువాయ్‌మొళి పాశురం పాడటం విని నాథమునులు ఆశ్చర్యపడి, అది ఎవరి రచన అని ప్రశ్నించారు. ఆ గ్రంథం వివరాలు అడిగారు. కాని ఆ వైష్ణవులు చెప్పలేకపోయారు. నమ్మాళ్వార్ సన్నిధికి వెళ్ళితే ఫలం వుండవచ్చునని తెలిపారు. దాని మీదట నాథమునులు నమ్మాళ్వార్ అవతార స్థలమైన కురుకాపురికి (ఆళ్వార్‌తిరునగరికి) వెళ్ళి అక్కడ మధురకవి ఆళ్వార్ శిష్యుడైన పరాంకుశ దాసును ప్రశ్నించారు. కాని అతడు తన అసమర్థతను తెలిపారు. కాని నమ్మాళ్వారును గురించి తపస్సు చేస్తే ప్రయోజనం వుండగలదన్నారు. నాథమునులు ఆ విధంగానే తపస్సు చేశారు. శఠగోపులు నాథమునులకు సాక్షాత్కరించి తమ గ్రంథాలన్నీ తెలిపి, ఇతర ద్రవిడ దివ్య ప్రబంధాలు సేకరించి నాలుగు భాగాలుగా విభజించుమని ఆజ్ఞాపించారు. ఈ కథను బట్టి నాథమునులు తపస్వులాగ నిరంతరం తిరిగి, తమిళ దేశమంతటా వ్యాపించిన పాశురాలను సేకరించి, ఒకచోట నాలాయిర దివ్య ప్రబంధంగా కూర్చారనడం స్పష్టం. ఈ విధంగా విష్ణుభక్తికి, ద్రావిడ ప్రబంధ సంప్రదాయానికి సమన్వయం కలిగించిన తొలి ఆచార్యులు నాథమునులు.

## యామునులు

ఈ నాథమునుల కుమారులు ఈశ్వరముని. ఈ ఈశ్వరమునికి ధాత సంవత్సరం ఆషాఢ శుద్ధ పూర్ణిమ బుధవారంనాడు ఉత్తరాషాఢా నక్షత్రాన శ్రీమన్నారాయణుని సింహాసన వాంశలో ఒక కుమారుడు జన్మించాడు. అప్పుడు నాథమునులు సపరివారంగా తీర్థయాత్ర

121 ప్రొఫెసర్ టి రాజగోపాలాచారియార్ వైష్ణవైట్ రిఫార్మర్స్ ఆఫ్ ఇండియా, పుట 1

చేస్తూ యమునా తీరంలో ఉన్నారు కనుక, యమునా తీరంలో జన్మించినందున ఆ శిశువుకు 'యమునైత్తురైవన్' (యామునుడు) అని నామకరణం చేశారు [122]

యామునులు మహామేధావులు. ఏకసంథాగ్రాహులు. గురువులు చెప్పే పాఠాలను ఎప్పటికప్పుడు అప్పగించేవారు. అది చూసి గురువులు ఆశ్చర్యపడేవారు. తక్కిన పిల్లలు ఒక సంవత్సరం నేర్చే విద్యను ఈయన ఒక నెలలో నేర్చేవారు. ఈ విధంగా యామునులు పది సంవత్సరాల ప్రాయానికే సకల విద్యలూ మహాభాష్య భట్టర్ అనే గురువు వద్ద నేర్చారు.

ఆ కాలంలో అక్కియాళ్వాన్ అనే చోళరాజ పురోహితుడు దేశంలోని పండితులందరినీ వాదంలో ఓడించి, విద్వజ్జన కోలాహలుడనే బిరుదు పొంది తాను ఓడించిన పండితులందరి నుండి కప్పం పుచ్చుకోవడానికి రాజునుంచి అధికార పత్రం పొందాడు. మహాభాష్య భట్టరు కూడ విద్వజ్జన కోలాహలునికి కప్పం కట్టేవారు. ఒకనాడు పాఠం జరుగుతుండగా అక్కియాళ్వాన్ భటులు వచ్చి మహాభాష్య భట్టరుకు తమ యజమానుని జాబు చూపి కప్పం ఇమ్మని కోరారు. ఆ గురువు వద్ద అప్పుడు ధనం లేనందున దైన్యంతో భటులకు సమాధానం చెప్పుకొన్నారు. ఇంతలో యామునులు కలుగ జేసుకొని, గురువు గారి దుర్దశకు చింతించి, భటుని చేతిలోని కమ్మను లాక్కొని ముక్కలు ముక్కలు చేసి పారేసి మరొక కమ్మపై

"న వయం కవయస్తు కేవలం
న వయం కేవల తంత్ర పారగాః,
అపి తు ప్రతి వాది మస్తక
ప్రకటాటోప విపాటనక్షమాః"

మేము కేవలం కవులమే కాము. కేవలం శాస్త్ర పారంగతులమే కాము. ప్రతివాదుల తలపొగరును అణచి వేయగల దిట్టలం - అనే శ్లోకం భటుని చేతికిచ్చి పంపారు.

అక్కియాళ్వాన్ ఆ శ్లోకం చదివి అగ్గి మీద గుగ్గిలమయ్యాడు. రాజుకు ఈ విషయం వివరించి, తనతో వాదానికి యామునులను ఆహ్వానించ వలసిందిగా కోరాడు. రాజు తన

---

122 తిరునక్షత్ర తనియ
కటే మా స్యుత్తరాషాఢా జాతం యామున దేశికమ్,
శ్రీరామ మిశ్ర చరణ సరోజాశ్రిత మాశ్రయే
నిత్యతనియ
యత్పదాంభోరుహధ్యాన విధ్వస్తాశేష కల్మషః,
వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామ్యహమ్

పురోహితుని మాట మన్నించి మహా విద్వాంసుల గౌరవానికి తగిన పల్లకిని, అధికారులను పంపి యామునులను పిలిపించారు. యామునులు పల్లకి ఎక్కి రాజాస్థానం చేరి

"ఆశైలా దద్రికన్యా చరణకిసలయన్యాస ధన్యోపకంఠా
దారక్షో నీత సీతా ముఖకమల సముల్లాస హేతోశ్చ సేతోః,
ఆచ ప్రాచః ప్రతీచ్య క్షితిధరయుగళా దర్క సోమావతంసా
న్మీమాంసా శాస్త్రయుగ్మ శ్రమ విమల మనా మృగ్యతాం మాదృశోన్యః" ॥౧౫౯॥

పార్వతీదేవి చిగురుటాకుల పెట్టడంతో ధన్యమైన హిమవత్పర్వతం మొదలు రాక్షస రాజయిన రావణుడు అపహరించిన సీతాదేవి ముఖపద్మం వికాసానికి కారణమైన సేతువు వరకు, సూర్య చంద్రులు అలంకారంగా గల పూర్వ పశ్చిమ పర్వతాల వరకు పూర్వోత్తర మీమాంసా శాస్త్రాలలో పరిశ్రమించి నిర్మల మనస్సు గల నాలాంటి వాణ్ని మరొకణ్ని వెదకండి చూద్దాం- అనే బిరుదశ్లోకం చదివారు. అది విని అక్కియాళ్వాన్ చిరాకుపడి యామునులతో వాదించడానికి సిద్ధపడ్డాడు. కాని యామునులు చిన్నవారు కావడంవల్ల "నీవు విద్వాంసుడవైనా చిన్నవాడివి. నాతో వాదించే శక్తి నీకు లేదు. కనుక ఏవైనా మూడు లౌకిక ప్రశ్నలు వేయి. వాటిని నేను ఖండిస్తాను. లేకపోతే నేను వేస్తాను. నీవు ఖండించాలి. నీవు ఖండించకపోతే నేను ఖండిస్తాను. అట్లే నీవూ ఖండించవచ్చు. గెలిచినవాడు ఓడినవాని తలను పాదంతో తన్నాలి" అని నియమం ఏర్పరచాడు, యామునులకు మొదట అవకాశమిచ్చారు.

వారిద్దరూ వాదించ నుండగా రాణికి, రాజుకు ఎవరు గెలుస్తారనే వాదం వచ్చింది. యామునులు గెలిస్తే రాణికి అర్ధ రాజ్యం ఇస్తానని రాజు వాగ్దానం చేయగా, పురోహితుడు గెలిస్తే తాను రాజాజ్ఞకు కట్టుబడి వుంటానని రాణి ప్రతిజ్ఞ చేసింది.

అప్పుడు యామునులు సుదీర్ఘంగా ఆలోచించి మూడు లౌకిక ప్రశ్నలు వేశారు - (1) నీ తల్లి గొడ్రాలు కాదు, (2) ఈ రాజు సార్వభౌముడు, (3) రాజు మహిషి పతివ్రత. తాను ఉండగా తన తల్లి గొడ్రాలు కాదు, రాజు సార్వభౌముడు కాదంటే రాజు ఆగ్రహించవచ్చు, రాజు భార్య పతివ్రత కాదంటే, తలే ఎగిరిపోవచ్చు అని అక్కియాళ్వాన్ నీళ్లు నములుతూ చింతించాడు. యామునులు తన మాటలను తానే ఖండిస్తానంటూ ఈ విధంగా చెప్పారు "సత్పుత్రుని కన్నప్పుడే తల్లి పుత్రవతి అవుతుంది. నీ లాంటి దుష్టుణ్ని కనడం వల్ల నీ తల్లి గొడ్రాలు. ఈ రాజు భూమిలోని ఒక దేశానికి పాలకుడు గాని సకల భూమి పాలకుడు కాదు కనుక సార్వభౌముడు కాదు. పతి మతాన్ని అనుసరించినదే పతివ్రత. ఈ రాణి భర్తకు

---

159 శ్రీ మేడేపల్లి వేంకటరమణాచార్యులు శ్రీ మహా భక్త విజయము గురుపరంపరా ప్రభావము, పుట 609

విరుద్ధమైన మతం అవలంబించడం వల్ల పతివ్రత కాదు ఆ మహా ప్రతిభాశాలి వారి చాతుర్యానికి సభ వారు ఆశ్చర్యపడ్డారు రాణి లేచి వచ్చి యామునుణ్ణి పుత్రవాత్సల్యంతో కౌగిలించుకొని "నన్ను ఆళ వందిరో! — నన్ను ఏలుకొనడానికి వచ్చారా?" అని ఆనందబాష్పాలు కురిపించింది అప్పటి నుంచి యామునుడికి ఆళవందార్ అనే పేరు వచ్చింది యామునుని కీర్తి దశదిశలు వ్యాపించింది రాజు రాణికి వాగ్దానం చేసిన అర్ధ రాజ్యం రాణి కోరిక పై యామునుడికి ఇచ్చారు యామునుడు రాజ్యభోగాలు అనుభవిస్తూ వున్నారు కొంతకాలానికి యామునుని తండ్రి ఈశ్వరముని పరమపదించారు

యామునుల వంటి పండితుడు విశిష్టాద్వైత సిద్ధాంతస్థాపకులుగా ఉండడం మాని రాజ్యభోగాలలో వ్యవహారాలు చేయడం నాథమునుల శిష్యులైన రామ మిశ్రులకు (మణక్కాల్ నంబికి) కష్టమనిపించింది ఆయనను చూచి తగిన హితవు చెబుదామని అంతఃపురానికి వెళ్లారు ద్వారపాలకులు రామమిశ్రులను లోపలికి వదల లేదు అంతమాత్రాన ఆయన పట్టువదలక యామునులను తనవైపు ఆకర్షించడానికి ఆయనకు చాల ఇష్టమైన ఉస్తికూర తెచ్చి వంటవానికి ఇవ్వసాగినారు యామునులు దానిని సంతోషంతో ఆరగించే వారే గాని, దాని వివరాలు అడుగలేదు ఇది పని కాదని రామమిశ్రులు నాలుగునాళ్ళు ఉస్తికూర తెచ్చి యివ్వడం మానివేశారు యామునులు రెండు నాళ్ళ తర్వాత "ఉస్తికూర ఎందుకు వండలేదు?" అని వంటవాణ్ణి అడిగారు "ఒక వృద్ధ వైష్ణవుడు దినమూ తెచ్చి ఇచ్చేవారు రెండు నాళ్లుగా తేవడంలేదు" అని వంటవాడు విన్నవించాడు "ఈ మారు వచ్చినప్పుడు ఆయనను నా వద్దకు తీసుకొని రా!" అని పాచకునికి ఆయన ఉత్తర్వు చేశారు పాచకుడు అలాగే చేశాడు

రామమిశ్రులు యామునుల సత్కారం పొంది, "మీతాతగారయిన నాథమునులు నా వద్ద మీకిమ్మని ఒక నిక్షేపం ఉంచిపోయారు అది శ్రీరంగంలో ఉంది అక్కడికి మీరు వస్తే దానిని అప్పగిస్తాను" అని అన్నారు యామునులు సరే అని ఆయన వెంట శ్రీరంగానికి బయలుదేరారు అక్కడ రామమిశ్రులు యామునులను శ్రీరంగనాథుని సన్నిధికి పిలుచుకొని పోయి, రంగనాథుని పాదారవింద యుగళం చూపి, "ఇదే మీతాతగారు మీకిమ్మన్న నిక్షేపం" అన్నారు యామునులకు జ్ఞానోదయం కలిగి, ఇలాటి పరమ ప్రాప్యం వదలి క్షుద్ర భోగాలలో కూరుకుపోయానే అని చింతించి విరక్తులై పెద్ద కుమారునికి రాజ్యం అప్పగించి సన్యసించారు

యామునులు శ్రీరంగంలోనే స్థిరపడి, వైష్ణవ పీఠాధిపత్యం కూడ స్వీకరించి రంగనాథాలయ నిర్వహణం కూడ ఒప్పుకొని, శిష్య పరంపరతో విశిష్టాద్వైత ప్రచారం చేస్తూ, 120 సంవత్సరాలు జీవించి ఉండి పిదప పరమపదం పొందారు

యామునులు వృద్ధాప్యంలో తమ పీఠానికి భగవద్రామానుజులను అధిపతిగా చేయాలని భావించారు కాని, ఆ కోరిక సిద్ధింపలేదు ఆళవందారు శిష్యులలో పెరియ నంబి (మహా పూర్ణులు), తిరుక్కోట్టియూర్ నంబి (గోష్ఠీపూర్ణులు), పెరియ తిరుమల నంబి (శ్రీశైల పూర్ణులు),

తిరుక్కచ్చి నంబి (కాంచీ పూర్ణులు), తిరుమాలైయాండాన్ (మాలాధరులు) ముఖ్యులు. వీరు ఐదుగురూ భగవద్రామానుజులకు గురువులయ్యారు. వీరిలో పెరియ నంబి (మహాపూర్ణులు) భగవద్రామానుజులకు పంచ సంస్కారం చేశారు.

యామునులు భక్తిప్రధానమైన వైష్ణవ మతానికి విశిష్టాద్వైతంతో, హరి సర్వోత్తమత్వ సిద్ధాంతానికి వేదోపనిషచ్ఛాస్త్రాది ప్రామాణ్యంతో సమన్వయం కుదర్చడానికి ఏడు గ్రంథాలు వ్రాశారు – 1 సిద్ధిత్రయం, 2 ఆగమ ప్రామాణ్యం, 3 పురుష నిర్ణయం, 4 చతుశ్శ్లోకి, 5 గీతార్థ సంగ్రహం, 6 స్తోత్ర రత్నం, 7 మాయా వాద ఖండనమ్. వీటిలో చతుశ్శ్లోకి విశిష్టాద్వైత సారమైన నాలుగు శ్లోకాల స్తోత్రం. స్తోత్ర రత్నం విశిష్టాద్వైతాన్ని వివరించే మధుర భక్తిరస కావ్యం. దీనికి ఆళవందార్ స్తోత్రమని కూడా పేరు.

## రామానుజులు

భగవద్రామానుజులు యామునాచార్యులు ప్రారంభించిన ఉద్యమాలన్నింటిని పూర్తిచేసిన మహాపురుషులు. "ఆస్తికతా సిద్ధాంతానికి జీవబ్రహ్మ విభేద సిద్ధాంతానికి క్రమబద్ధమైన రూపాన్ని ఇచ్చిన ప్రథమాచార్యులు రామానుజులు. ఆయన సామాన్య మనుష్యుల హృదయానికి సన్నిహితులై, వారి మనస్సులలో ఆశలు చిగురింపజేసి, వారికి శాంతి భగవదనుగ్రహాలను ప్రసాదించిన వితరణశీలురు" అన్నారు ఆచార్య పి. నాగరాజారావు.[124] అద్వైతం ప్రకారం ఆత్మ బ్రహ్మలో లీనమైపోతుంది. అలా వారు కోల్పోయిన ఆత్మను వేదాంతులకు రామానుజులు తిరిగి అందజేశారని మాక్స్‌ముల్లర్ పండితుని అభిప్రాయం. "రామానుజులు శంకరుల భావాలనే గ్రహించి, మహామహిత హృదయంతో, సువిశాల పాండిత్యంతో, అద్భుత తత్త్వవివేచనతో విశిష్టాద్వైతాన్ని సమన్వయపరిచారు" అని డాక్టర్ రాధాకృష్ణన్ అన్నారు.[125] జైన బౌద్ధాదులతో ఆస్తికత్వం సడలిపోయి, చిన్న భిన్నమైన హిందూ సంఘాన్ని విష్ణు భక్తి వియద్గంగతో పవిత్రం చేయడం రామానుజుల సంకల్పమని, అందువల్లనే వివిధవర్ణాలలో జనించిన ఆళ్వార్ల దివ్యప్రబంధాలకు వేదసమాన ప్రతిపత్తిని మరింత దృఢపరచి, ఆళ్వారుల విగ్రహాలను వైష్ణవాలయాలలో ప్రతిష్ఠింపజేసి రామానుజులు తమ విశాల హృదయాన్ని ప్రకటించారని, వివిధ దేవతారాధన విభిన్నత్వానికి కారణం కనుక ఆ ఆరాధనలన్నిటిని ఏకంచేసి, సకలదేవతలకు ఆధారభూతుడైన శ్రీమన్నారాయణునే పూజించడం ముఖ్యమని ఏకేశ్వరోపాసన విధానాన్ని స్థాపించి ఆచరణ యోగ్యం చేసినారని శ్రీ అక్కూరి గోవిందా

---

124 ప్రొఫెసర్ పి. నాగరాజారావు ఇంట్రొడక్షన్ టు వేదాంత, పుట 81, 184

125 డాక్టర్ ఎస్ రాధాకృష్ణన్ బ్రహ్మసూత్ర, పుట 51

చార్యులు అన్నారు [126] రామానుజుల పద్ధతిలో భక్తితత్త్వాల వేలికలయిక జరిగింది [127] అందువల్ల విశిష్టాద్వైతం మహోదారమై ప్రపంచంలో ఉండే సకల జాతుల మతాలను తనలో ఇముడ్చుకొనడానికి సంసిద్ధమైంది [128] అందువల్ల రామానుజులు వైష్ణవ సిద్ధాంత ప్రథమాచార్యులు కాకపోయినా, ప్రవర్తకులలో ప్రథములై వైష్ణవ సిద్ధాంత చరిత్రలో సుప్రసిద్ధులుగా పేరుపొందారు [129] రామానుజులు చైతన్య విలసితుడు, ప్రేమస్వరూపుడగు భగవంతుని మనకు ప్రసాదించారని శ్రీమతి అతిమా సేన్‌గుప్త ప్రశంసించారు [130] "రామానుజుల హృదయంగొప్పది శంకరాద్వైతానికి అళ్వార్ల భక్తిని జోడించి విశిష్టాద్వైతం నిర్మించారు అందువల్ల పూర్వాచార్యులందరూ ఆయనలో పునర్జన్మ పొందినట్లవుతున్నది ఆయన సిద్ధాంతంలో ఏకత్వ నానాత్వాలు అద్భుతంగా సమన్వయం చెందుతాయి ' అని సమ్మతించారు స్వామి వివేకానంద

యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మ రుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే,
అస్మద్గురో ర్భగవతోஉస్య దయైక సింధో:
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే [131]

నారాయణుని పాదపద్మయుగ్మమనే బంగారంపై వ్యామోహంతో తక్కినదంతా గడ్డిపరకగా భావించిన దయాసింధువు, మా గురువు అయిన భగవద్రామానుజుని చరణాలకు శరణం- అని శ్రీవైష్ణవులు అనుదినం ప్రార్థించే రామానుజులు నేటి మద్రాసుకు 17 మైళ్ళ దూరంలోని శ్రీ పెరుంబూదూరు (భూతపురి)లో ఆసూరి కేశవ యజ్వ అనే హరీత గోత్రులైన శ్రీవైష్ణవోత్తముని కాంతిమతి గర్భంలో కుమారుడై జన్మించారు [132] ఆనాడు పింగళనామ సంవత్సర చైత్ర శుక్ల

---

126 శ్రీ రామానుజ కీర్తికౌముది భాగం, పుట 64

127 ప్రొఫెసర్ టి రాజగోపాలాచారియార్ వైష్ణవైట్ రిఫార్మర్స్ ఆఫ్ ఇండియా పుట 109 128 ప్రొఫెసర్ మోనియర్ విల్లియమ్స్ హిస్టరీ ఆఫ్ రిలిజియస్ థాట్ అండ్ లైఫ్ ఇన్ ఇండియా, పుట 100 129 డాక్టర్ నికోల్, రామానంద టు రామతీర్థ పుట 11 130 శ్రీమతి అతిమా సేన్‌గుప్త ప్రబుద్ధ భారత, పుట 506, 1959 131 స్వామి వివేకానంద, కంప్లీట్ వర్క్స్, సంపు 8, పుట 265, 132 కూరనాథులు, 133 కల్యబ్దే దిక్య తుంగే యుగజన విదితే వత్సరే పింగళాఖ్యే

చైత్రే మాసే గతేషు ద్వియుత దశదినే ష్వేదమానే హిమాంశా,
పంచమ్యార్ద్రా సమేతే సురగురు దివసే కర్కటాఖ్యే చ లగ్నే
శ్రీమద్రామానుజార్య: సముని నిగమాంతార్థ సంరక్షణార్థమ్

పంచమి గురువారం ఆర్ద్రా నక్షత్రం ఈ పింగళనామ సంవత్సరం కలియుగాబ్దాలు 4118 నాటిదని చెప్పడంవల్ల ఇది క్రీస్తుశకం 1017 అవుతుంది రామానుజులు తెలుగు మాతృభాషగా కలవారనే వాదం ఉంది కాని దీనికి బలమైన ఆధారాలు కానరావు రామానుజుల కాలానికి చోళ చక్రవర్తి కులోత్తుంగ చోళుడు ఇతడు రాజరాజనరేంద్రుని కుమారుడు రామానుజులు తెలుగువారయి వుంటే, అంతటి మహామహుని తెలుగువారు ఆదరించుకోకపోవడం జరిగేది కాదు రామానుజుల వంశంవారైన ఆసూరి వారు గండికోట వైష్ణవులలో నేటికీ ఉన్నారు, వారంతా ద్రవిడ సంప్రదాయంవారే

రామానుజుల తల్లి పేరు కాంతిమతి ఈమె యామునాచార్యుల శిష్యుడయిన పెరియ తిరుమల నంబి (శ్రీశైలపూర్ణుని) సోదరి మరొక సోదరి శ్రీదేవి ఈమెకు పెరియ పిరాట్టి మహాదేవి అని కూడ వ్యవహరించేవారు ఈమె కుమారుడు గోవింద మిశ్రుడు పెరియ తిరుమల నంబి రామానుజులకు లక్ష్మణుడని మహాదేవి కుమారునికి గోవిందుడని నామకరణం చేశారు

రామానుజులు తండ్రివద్దనే వేదవేదాంగాలు చదివారు తండ్రి ఆయనకు పదహారో ఏట వివాహం చేశారు భార్య పేరు రక్షకాంబ తండ్రి కొంతకాలానికి విష్ణుసాయుజ్యం పొందారు రామానుజులకు కూడా గొప్ప పండితులు కావాలనే తృష్ణ ఉండేది, కనుక అప్పుడు కాంచీపురంలో నున్న యాదవప్రకాశులనే మహాపండితుల వద్ద శాస్త్రాధ్యయనం చేయసాగినారు రామానుజుల పినతల్లి కుమారుడు గోవింద మిశ్రుడు కూడ ఆ గురువువద్దనే చదివేవాడు

ఒకనాడు యాదవప్రకాశులు పాఠంలో "తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ" అనే ఛాందోగ్య వాక్యాన్ని వివరిస్తూ,[184] కప్యాసం అనే పదానికి మర్కట పృష్ఠ భాగమనే అర్థం చెప్పి, ఆ హిరణ్య పురుషుని నేత్రయుగ్మం మర్కట పృష్ఠంవలె ఎర్రని ఎర్రకలువవలె ఉన్నదని వివరింపగా, రామానుజుల కళ్ల బాధతో కన్నీరు కురిపించాయి గురువుగారు కన్నీరు కారణ మేమని ప్రశ్నించారు రామానుజులు "భగవద్విషయికమైన శ్రుతికి తమరు అపార్థం కల్పిస్తున్నందుకు దుఃఖపడుతున్నాను" అని నిర్భయంగా పలికారు "అయితే నీవేమి అర్థం చెబుతావు?" అని ప్రశ్నించారు యాదవప్రకాశులు రామానుజులు "కం=జలం పిబతీతి కపిః— ఆదిత్యః తేన అస్యతే వికాస్యతే ఇతి కప్యాసమ్ కపి అంటే నీరు తాగేవాడు, సూర్యుడు అతనితో వికసింపచేయబడినది కం=జలం పిబతి కపిః నాళం తస్మిన్నాస్తే ఇతికప్యాసమ్ నాళంతో కూడినది కం=జలం, అనగా అపి పూర్వక—ఉదకంలో ఉండేది" అని వ్యుత్పత్తులు చెప్పారు[186] మూడు వ్యుత్పత్తులవల్ల "గంభీరాంభస్సముద్భూత సుమృష్టనాళ రవికర

---

184 ఛాందోగ్యం 1 6 7 186 ఈ వ్యుత్పత్తులను ప్రాచీన వ్యాఖ్యాతలైన కందుని నుంచి తీసుకున్నట్లు ప్రొఫెసర్ టి రాజగోపాలాచార్యుల అభిప్రాయం వైష్ణవైట్ రిఫార్మర్స్ ఆఫ్ ఇండియా, పుట 47

వికసింపుండరీకదళామలాయతేక్షణః " లోతైన నీటిలో పుట్టిన, మంచికాడగల సూర్య కిరణాలలో వికసించిన తెల్లతామరరేకులవలె విశాలమైన కన్నులు గలవాడు - అనే అర్థం తెలిసింది ఇది హేళనదర్థం కాదని యాదవ ప్రకాశులు తెలుసుకొన్నారు అప్పటి నుంచి అతనికి రామానుజులపై ప్రేమ నన్నగిల్లి మాత్సర్యం ఏర్పడింది, అతనిని చంపడానికికూడ ప్రయత్నించారు కాశీయాత్రా వ్యాజంతో రామానుజులను ఎలాగుకొని వెళ్ళి గంగలో త్రోసివేయ సంకల్పించారు గురువుగారు కాని, రామానుజులు ఈ విషయాన్ని తన పినతల్లి పుత్రుడైన గోవిందుని నుంచి మొదటే తెలుసుకొని భగవదనుగ్రహంతో తప్పించుకొని కాంచీపురం చేరారు గోవిందుడు తనకు గంగలో లభించిన లింగాన్ని యాదవప్రకాశుల ఆజ్ఞతో స్వీకరించి, కాళహస్తి సమీపంలోని మధురమంగళం గ్రామంలో ప్రతిష్ఠించి పరమశైవుడై పూజించాడు ఎదప అతడు కాళహస్తి దేవాలయానికి ధర్మకర్తగా వున్నాడు అతనికి గంగలో అరచేతిలో లింగం లభించడం వల్ల ఉళ్లంగై కొండార్ంద నాయనార్' అనేపేరు కలిగింది యాదవ ప్రకాశులు యాత్రనుంచి కాంచీపురానికి తిరిగి వచ్చి, రామానుజులను చూచి మొసలి కన్నీరు కార్చి ఎప్పటిలాగే పాఠం చెప్పేవారు

కాలక్రమాన గురుశిష్యు లిద్దరికీ అభిప్రాయ భేదాలు తీవ్రమయ్యాయి ఒకనాడు యాదవప్రకాశులు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ '[188] అనే మంత్రానికి అర్థం చెబుతూ బ్రహ్మం సచ్చిదానంద స్వరూపుడని వ్యాఖ్యానించారు రామానుజులు దానిని ప్రతిఘటించి, బ్రహ్మనికి సత్యజ్ఞానానందాలు లక్షణాలేకాని అవి బ్రహ్మకావని, ఆ పదాలు అసత్య జడ పరిచ్ఛిన్నముల నుంచి వ్యావృత్తం - అనగా అసత్యజ్ఞాన సాంతత్వాలు ఆ బ్రహ్మకు లేవని తెలుపుతాయేగాని అవి బ్రహ్మస్వరూపాలు కావని వ్యాఖ్యానించారు గురువుంతకు దాం కోపం వచ్చింది

ఇలా ఉండగా, కాంచీపురరాజు కుమార్తెను బ్రహ్మరాక్షసి పట్టి పీడించసాగింది ఎందరో మంత్రవేత్తలు వచ్చి ప్రయత్నించారు కాని,ఫలం దక్కలేదు చివరకు రాజు యాదవ ప్రకాశులను కోరారు ఆయన శిష్యగణసమేతులై రాచనగరుకు వెళ్లి మంత్రప్రయోగం చేశారు కాని, ఆ బ్రహ్మరాక్షసి అతనిని ధిక్కరించి, అతని శిష్యుడైన రామానుజులను తీసుకురావని చెప్పింది అంతట రామానుజులు ఆ బ్రహ్మ రాక్షసిని సంబోధించగా, వినయంతో వెళ్లిపోయింది, దానికి సూచనగా రాజద్వారంలోవున్న పెద్దరావి చెట్టు విరిగిపడింది దీనివల్ల రామానుజుల ప్రతిష్ఠ పెరిగింది యాదవప్రకాశులు మనస్సులో మాత్సర్యమున్నా పైకిమాత్రం రామానుజులను ప్రశంసించారు

---

188 తైత్తిరీయోపనిషత్తు 2 1

ఏమైనా, రామానుజులను యాదవప్రకాశులు పంపివేయవలసిన పరిస్థితి ఏర్పడింది. ఒకనాడు యాదవప్రకాశులు 'సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత'[187] అనే మంత్రాన్ని, "నేహ నానాస్తి కించన"[188] అనే మంత్రాన్ని అద్వైతపరంగా వ్యాఖ్యానించారు. రామానుజులు కిన్నులై, మొదటి మంత్రానికి సృష్టి బ్రహ్మంనుంచి జనించి, దానిలోనే వుండి, దానిలోనే లయిస్తుంది గనుక సృష్టి బ్రహ్మం కాదని తత్పరివ్యాప్యమని అలాగే బ్రహ్మం కన్నా మరొక సృష్టి లేదని, అంతా దానిపైనే ఆధారపడి వుంటుందని వ్యాఖ్యానించారు. దానిమీద యాదవప్రకాశులకు చాలా ఆగ్రహం కలిగింది. తన సిద్ధాంతాన్ని ఖండించే శిష్యుడు తన నుంచి నేర్చుకొనవలసినదేమీ లేదని, ఇక రామానుజులు తమ వద్దకు రానవసరం లేదని ఆయనను పంపివేశారు. రామానుజులు సన్న్యసించిన ఎడప యాదవప్రకాశులు తమ తల్లి హితవుపై రామానుజులను ఆశ్రయించారని, ఆయనకు శిష్యులయ్యారని పరంపరగా వస్తున్న కథ. కాని ఈ కథ తర్వాత కల్పించినదై వుంటుందని డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ అంటున్నారు. రామానుజుల కాలంలో యాదవప్రకాశులనే సుప్రసిద్ధాద్వైతాచార్యుడు ఉండేవారనేది యథార్థమని, వేదాంతదేశికులు కూడా ఆయన వివిధ వాదాలను ఖండించారని, అలాంటప్పుడు యాదవప్రకాశులు పూర్వశిష్యుని మతాన్ని స్వీకరించి, ఆయనకు శిష్యుడు కావడం సంభవం కాదని తోస్తున్నదని డాక్టర్ అయ్యంగార్ వాదం.[189]

రామానుజులు యాదవ ప్రకాశుల వద్ద చదువుకుంటున్న కాలంలో ఆయన గురువును ధిక్కరించి విశిష్టాద్వైత పరంగా వ్యాఖ్యలు చేయడం పండిత లోకంలో వ్యాపించింది. కాంచీపురం నుంచి శ్రీరంగానికి యాత్రకు వెళ్ళిన కొందరు వైష్ణవుల వల్ల యామునాచార్యులకు ఈ విషయం తెలిసింది. ఆయన సంతోషించి

"అనంత ఏ చాత్ర హి సంభవంతి
హసంతికాయా మివ హవ్యవాహాః,
అత్రైవ సంతో యది సంభవంతి
తత్రైవ లాభః సరసీరుహాణామ్"

ఈ ప్రపంచంలో కుంపటిలో నిప్పుల లాగ దుష్టులు ఉంటనే ఉంటారు. సజ్జనులు పుట్టడం కుంపట్లో కమలాలు పూచినట్లే!- అన్నారు. తర్వాత కొన్నాళ్లకు రామానుజులను చూడాలని శిష్యులతో కాంచీ పురానికి వచ్చి, వరదరాజ స్వామిని సేవించి ప్రదక్షిణం చేస్తూ, తమ శిష్యులతో వస్తున్న యాదవప్రకాశులను చూచి, ఆ శిష్యులలో మెరుగు బంగారువన్నెదాయ, ప్రసన్న గంభీర ముఖం, ఆకర్ణాంత విశాల నేత్రాలు ఆజానుబాహువులు గల సమున్నత

---

187 ఛాందోగ్యమ్ 3 14 1. 188 బృహదారణ్యకమ్ 4 4 19. 189 డాక్టర్ ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్ ది గ్రేట్ ఆచార్యాస్ పుట 119

వ్యక్తే రామానుజులని తెలుసుకొని, ఆనంద బాష్పాలు కురిపిస్తూ, "ఆముదల్వ నివన్" ఈ మహా మహుడు మన సిద్ధాంతాన్ని ఉద్ధరింప గలవా డగుగాక! అని మనసులో ఆశీర్వదించి వెళ్ళిపోయారు

పిదప కొన్నాళ్లకు తమ అనంతరం విశిష్టాద్వైత దర్శనాన్ని నిర్వహించే వారు ఎవ్వరా అని ఆళవందారులకు విచారం కలిగి, రామానుజులను యాదవప్రకాశుల నుండి వేరు చేసి తనకు అప్తుని చేసుకొనడం ఎలాగా?—అని ఆలోచిస్తుండగా, రామానుజులు యాదవ ప్రకాశులతో అభిప్రాయ భేదాలతో విడిపోయినట్లుగా తెలిసింది ఆయన తన శిష్యుడైన పెరియనంబిని పిలిచి ఎట్లయినా రామానుజులను శ్రీరంగానికి పిలుచుకొని రమ్మని పంపారు

యామునాచార్యుని ఆనతిపై పెరియనంబి (మహాపూర్ణులు) కాంచీపురానికి వెళ్లారు ఒకనాడు వరదరాజ స్వామి కోవెలలో రామానుజులు స్వామికి తిరుమంజనం సమర్పించే సమయంలో యామునాచార్యుల స్తోత్రరత్నంలోని

"స్వాభావికానవధికాతిశయేశితృత్వం
నారాయణ త్వయి న మృష్యతి వైదికః,
బ్రహ్మా శివ శ్శతమఖః పరమ స్స్వరాడి
త్యేతేఽపి యస్య మహిమార్ణవ విప్రుష స్తే [140]

ఓ నారాయణా! నీవు అందరకు అధిపతివి ఈ అధీశత్వం స్వాభావికం, అవధిలేనిది, అతిశాయి దీనికి వేదజ్ఞుడెవడూ కాదనడు బ్రహ్మ, శివుడు పరమ స్వరాట్టయిన ఇంద్రుడు అనే వీరందరూ నీ మహిమా సముద్రంలోని తుంపరలు మాత్రమే—అనే శ్లోకం పఠించి ప్రార్థించారు ఆ శ్లోకం విని రామానుజులు ఆశ్చర్యపడి, దాని కర్తృత్వం గురించి ప్రశ్నించారు మహాపూర్ణులు అది యామునాచార్యులదని, శ్రీరంగానికి తన వెంట వస్తే, వారిని సేవింప వచ్చునని అన్నారు కాని, రామానుజుల కోరిక తీరలేదు వీరిద్దరూ అక్కడికి చేరే వేళకే ఆళవందార్ పరమపదించారు అంత్య సంస్కారం కోసం వారి భౌతిక దేహాన్ని శిష్యులు కావేరీ తీరం చేర్చారు రామానుజులు అక్కడే వారి భౌతిక దేహం సేవించారు అప్పుడు యామునాచార్యుల కుడిచేతి మూడు వేళ్లు ముడుచుకొని వున్నాయి ఇదేమిటని రామానుజులు ప్రశ్నించారు యామునాచార్యుల అంతరంగ శిష్యులు బాగా ఆలోచించి, "యామునులు తరచు పరాశరుల నామధేయాలు పెట్టాలని, వ్యాసబ్రహ్మసూత్రాలకు విశిష్టాద్వైత పరమైన భాష్యం రచించాలని, నమ్మాళ్వార్ల తిరువాయి మొళికి వ్యాఖ్యానం రచించాలని వారి పేరు కూడ శిష్యులకు పెట్టాలని అనుకునే వారు ఆ కోరికలే కాబోలు!" అన్నారు రామానుజులు ఆ కోరికలు తీర్చ గలనని ప్రతిజ్ఞ చేశారు

---

140 ఆళవందార్‌స్తోత్రం

"అహం విష్ణు మతే స్థిత్వా జనా నజ్ఞాన మోహితాన్,
పంచ సంస్కార సంపన్నాన్ ద్రావిడామ్నాయ పారగాన్
ప్రపత్తి ధర్మ నిరతాన్ కృత్వా రక్షామి సర్వదా,
సంగృహ్య నిఖిలానర్థాన్ తత్త్వ జ్ఞాన పదం శుభమ్
శ్రీ భాష్యం చ కరిష్యామి జన రక్షణ హేతునా,
జీవేశ్వరాదీన్ లోకేభ్యః కృపయా యః పరాశరః
సందర్శయన్ తత్స్వరూపాన్ తదుపాయ గతీం స్తథా
పురాణ రత్నం సంచక్రే మునివర్యః కృపానిధిః
తస్య నామ్నా మహా ప్రాజ్ఞ వైష్ణవస్యత కస్యచిత్
అభిధానం కరిష్యామి నిష్కృత్యర్థం మునే రహమ్ "[141]

నేను శ్రీవైష్ణవ మతంలో వుండి అజ్ఞాన మోహితులైన జనాన్ని పంచ సంస్కార వంతులు గాను, ద్రావిడామ్నాయ విశారదులనుగాను, ప్రపత్తి ధర్మ నిరతులను గాను చేస్తాను—అని అన్నారు రామానుజులు. యామునాచార్యుల ముడిచిన ఒక వేలు లేచింది. సకల తత్త్వ జ్ఞాన రాశి అయిన శ్రీ భాష్యం రచిస్తాను—అన్నారు. దానితో రెండవ వేలు లేచింది. జీవేశ్వర ప్రభృతుల స్వభావాలను, తదుపాయ గతులను తెలిపే పురాణ రత్నమైన విష్ణు పురాణం రచించిన కృపాళువైన పరాశరుని పేరును ఒక వైష్ణవునికి పెడతాను, ఆ మహర్షి ఋణ విమోచనం కోసం—అని అనగానే మూడవ వేలూ లేచింది

తర్వాత రామానుజులు కాంచీపురం చేరారు. ఆళవందార్ల శిష్యులైన మహాపూర్ణ (పెరియనంబి), కాంచీ పూర్ణులు (తిరుక్కచ్చినంబి) ద్విజులు కారు. కాని పరమ భాగవతులు వారి వద్ద, తక్కిన యామునాచార్యుల శిష్యుల వద్ద రామానుజులు వివిధ వైష్ణవ సంప్రదాయ విషయాలు, దివ్య ప్రబంధ రహస్యాలు గ్రహించారు. తమభార్య ఆచార్యుల ఎడల కుల భేదాన్ని పాటించడం వల్ల, తన మార్గానికి అనుకూలంగా లేనందున ఆమెను వదలి, 32వ ఏట సన్న్యాసాశ్రమం స్వీకరించి యామునాచార్యుల పీఠాన్ని నిర్వహించడం ప్రారంభించారు. శ్రీ భాష్యాది గ్రంథ రచనలో తన పినతల్లి కుమారుడైన గోవింద మిశ్రుని శైవం నుంచి మరల్చి వైష్ణవునిచేసి తన వద్దనే ఉండేట్టు చేశారు. వ్యాస వేదాంత సూత్రాలకు విశిష్టాద్వైత పరంగా శ్రీ భాష్యం రచించారు. దానికి శ్రీ భాష్యమని సంప్రదాయ నామధేయం. కొంతకాలం తర్వాత రామానుజులు శిష్యులతో భారత దేశమంతటా దిగ్విజయ యాత్ర చేసి విశిష్టాద్వైతాన్ని ప్రతిష్ఠించారు. ఆయన షష్టిపూర్తి వేళకు భారత దేశానికే మహా విద్వాంసుడుగా పేరుగాంచారు. యజ్ఞమూర్తి మున్నగు మహా విద్వాంసులను ఓడించి శిష్యులను చేసుకున్నారు

---

141 అనంతాచార్యులు ప్రపన్నామృతమ్, 8 65-76

ఒక సారి రామానుజులు అప్పటికి కాంచీ పురాధీశుని నుండి అపాయం కలిగించ బోగా చోళ రాజ్యం వదలి, హొయసళ రాజ్యం చేరారు. అప్పుడు ఆ రాజ్యం పాలిస్తున్న బిట్టిదేవుడు జైన మతావలంబి. అతడు రామానుజుల అపూర్వ ప్రభావానికి లోనయి వైష్ణవమతం స్వీకరించాడు, విష్ణువర్ధను డయ్యాడు. రామానుజులు మేల్కోట(తిరునారాయణ పురం)లో 12 సంవత్సరాలు వేంచేసి వుండి, శ్రీ వైష్ణవ సిద్ధాంత ప్రచారం చేశారు. క్రీ.శ. 1117 లో మరల శ్రీరంగానికి విచ్చేశారు. శ్రీరంగంలో తక్కిన అరవై యేళ్ళు వుండి మత ప్రచారం చేశారు. మత ప్రచారానికి 74 సింహాసనాధిపతులను నియమించారు.

చివరకు చేయవలసిన ఏర్పాట్లన్నీ చేసి, శిష్యులకు చెప్పవలసిన విషయాలు చెప్పి శ్రీరంగ నాథుని సేవించి పింగళ సంవత్సర మాఘ శుద్ధ దశమి శనివారం నాడు 120వ ఏట పరమ పదం చేశారు. మేల్కోటలోను, శ్రీపెరుంబూదూరులోను ఆయన కాలంలోనే ఆయన విగ్రహాలు ప్రతిష్ఠించారు.

శ్రీ రామానుజుల ముఖ్య శిష్యులు కూరత్తాళ్వాన్ ఈయన లేఖకుడుగా వ్రాయగా రామానుజులు బ్రహ్మ సూత్రాలకు శ్రీ భాష్యమ్, వేదాంత సారః, వేదాంత దీపః, వేదార్థ సంగ్రహః, శ్రీరంగ గద్యమ్, వైకుంఠ గద్యమ్, శరణాగతి గద్యమ్, మున్నగు గ్రంథాలు రచించారు.

రామానుజో జగామాశు తద్విష్ణోః పరమం పదమ్,
మాఘశుద్ధ దశమ్యాం తు మధ్యాహ్నే మందవాసరే

రామానుజుల అనంతరం ద్రావిడ, సంస్కృతాల ప్రాబల్యాన్నిబట్టి తెంగలై వడగలై, అని రెండు శాఖలు ఏర్పడ్డాయి. వడగలై శాఖకు వేదాంత దేశికుని విఖ్యాతిగన్న వేంకటనాథుడు, తెంగలై శాఖకు పిళ్ళై లోకాచార్యులు, మణవాళ మహామునులు నాయకత్వం వహించారు.

భగవద్రామానుజులు చేసిన గొప్పపని వేదోపనిషత్తులతోపాటు పాంచరాత్రాద్యాగమాలు, పురాణాలు ఆళ్వార్ల దివ్యప్రబంధాలు సమన్వయించడం [142]

విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకేచ పండితాః సమదర్శినః

అనే గీతోక్తిని అక్షరాలా పాటించి వర్ణవ్యవస్థను మించినది భాగవతవ్యవస్థ అని నమ్మినవారు రామానుజులు. తమకంటే వర్షాధికుడైన తిరుక్కచ్చి నంబిని (కాంచీపూర్ణుని), మహాపూర్ణుని

---

142 డాక్టర్ బి కోటేశ్వరరావు అముక్తమాల్యదా దర్శనము, పుట 286

(పెరియనంబి) గురువులుగా స్వీకరించి మంత్రోపదేశం పొంది, ద్రావిడామ్నాయం వారివద్ద అభ్యసించారు

రామానుజాంలో మరొక గొప్పగుణం తాము నరకం వెళ్ళినా ఇతరులు తరించాలనే మహౌదార్యం యమునాచార్యుల శిష్యులలో ఒకరు రామానుజుల ఆచార్యులలో ఒకరు అయిన తిరుక్కోట్టియూర్‌నంబి (గోష్ఠీపూర్ణులు) రామానుజులను మంత్రోపదేశానికి పద్దెనిమిదిసార్లు తిప్పారు ఆయినా పట్టువిడవక రామానుజులు ఆయనవద్దకు మంత్రోపదేశాభిలాషతో వెళ్ళు తూనే వున్నారు, ఆయన అనుగ్రహించకపోవడం తన లోపమే అని భావించారు చివరకు గోష్ఠీ పూర్ణుల అనుగ్రహంతో మంత్రోపదేశం పొందారు ఈ మంత్రం విన్న మాత్రంతోనే జనం ముక్తి పొందుతారు గనుక ఎవ్వరికీ ఉపదేశించవద్దు" అని గురువు శాసించారు రామానుజులు అలాగే అని తల ఊపారు, శ్రీరంగానికి బయలుదేరారు దారిలో ఆలోచించారు "నేనొక్కడ్ని నరకానికి పోతే ఏం? ఇతరులు ఎందరో తరిస్తారు గదా!" అని వెంటనే గోష్ఠీ పురంలోని విష్ణ్వాలయ ద్వార గోపురం ఎక్కి మంత్రాన్ని ఉద్ఘోషించారు

## విశిష్టాద్వైత స్వరూపం

భగవద్రామానుజులు ద్రావిడ ప్రబంధ వేదోపనిషదాదుల సమన్వయంతో ప్రవర్తింప జేసిన విశిష్టాద్వైత మత స్వరూపం సంగ్రహంగా ఇది

వర్షార్థ మష్టౌ ప్రయతేత మాసాన్
    నిశార్థ మర్థం దివసే యతేత,
వార్థక్య హేతో: వయసా నవేన
    పరత్ర హేతో రిహజన్మనాచ (వి పు )

సంవత్సరం 12 నెలల్లో నాలుగు నెలల వానకాలానికి అవసరమైన వస్తువులు మిగిలిన ఎనిమిది నెలల్లో సమకూర్చుకోవాలి రాత్రికి కావలసిన అగ్గిపెట్టె పసిపిల్లవాని పాలుపు, ముసలికి కావలసిన దగ్గుమందు పెండ్లానికి కావలసిన పక్కపొడి పగలే తెచ్చిపెట్టుకోవాలి పనిచేయలేని ముసలితనానికి అంతో ఇంతో యౌవనంలోనే కూడబెట్టుకోవాలి నట్టే పరానికి ఈ జన్మలోనే పాటుపడాలి [148]

శాశ్వత జ్ఞానానందాదుల వుండేది పరలోకం, శాశ్వతమైనవి ఏమిటి? చిదచిదీశ్వరులు శాశ్వతులు జీవుడు భగవంతునికి శరీరం జీవునికి ప్రకృతి శరీరం రెండింటికీ ఆత్మ

---

148 తుంబిమద్ది శేషశర్మ విశిష్టాద్వైత సిద్ధాంత దర్పణము, పుట 4

శ్రీమన్నారాయణుడు ఆత్మలేనిదే శరీరం లేదు ఈ రెండూ భగవంతుని నుంచి వేరుపరచ సాధ్యపడనందువల్లని చెంత, గుణ్ణ, రంగూ, రుచి, వాసనా విడివిడిగా గుర్తింప గలిగిన స్వస్థితి కంటైనా వేరుచేయ వీలులేనివి అట్లే చిదచిదీశ్వరులు ఈశ్వరుడు ప్రధానుడు విశేష్యం శక్తిమని రెండు విశేషణాలు చిదచిత్తులకు స్వతంత్ర ప్రతిపత్తి వున్నా భగవదిచ్ఛ ప్రకారం నియమింపబడుతాయి ఏమంటే ఈశ్వరుడు—భగవంతుడు నియామకుడు, నాయకుడు, శరీరి, శేషి, ఆధారుడు మిగిలింది శేషం, శరీరం, నియామ్యం, ఆధేయం ఈ చిదచిత్తులందేర - స్థూలావస్థలోను, సూక్ష్మావస్థలోను ఈశ్వరుడు విశిష్టుడు గనుక ఈ మతానికి విశిష్టాద్వైతం అనేపేరు వచ్చింది

సకల పదార్థాలు ప్రమాణమని, ప్రమేయమని రెండు విధాలు ప్రమేయం ద్రవ్యం అద్రవ్యమని రెండు విధాలు ద్రవ్యం జడాజడ భేదంతో రెండు విధాలు వీటిలో జడం కాలం, ప్రకృతి అని రెండు విధాలు అజడం నాల్గు విధాలు- ధర్మభూత జ్ఞానం, శుద్ధసత్త్వమ్, జీవుడు, ఈశ్వరుడు అద్రవ్యం పది విధాలు —త్రిగుణాలు పంచ తన్మాత్రలు, శక్తి, సంయోగం జడమంటే అమిశ్ర సత్త్వరహితం అజడమంటే స్వయంప్రకాశం ఈ జడాజడ భేదాయోగం ద్రవ్యం ఆరు విధాలు అద్రవ్యం పది విధాలు మొత్తం పదహారు విధాలు

చిత్తు జీవుడు ప్రత్యక్త్వం (స్వయంప్రకాశత్వం), చేతనత్వం (జ్ఞానాశ్రయత్వం) ఆత్మత్వం (శరీర ప్రతిసంబంధత్వం), కర్తృత్వం (సంకల్పజ్ఞానాశ్రయత్వం) మొదలయినవి జీవేశ్వర సాధారణ లక్షణాలు అయినా జీవుడు విభుడుకాడు జీవుడు దేహేంద్రియ మనః ప్రాణాదులకంటె విలక్షణుడు వెంట్రుక కొనను నిలువుగా చీల్చి, ఆ భాగంలో ఒకదానిని మళ్ళీ నూరుగా చీల్చినప్పటి భాగమంత అణుపరిమాణంలో వుంటాడు[144] నిత్యుడు ప్రతి శరీరంలోను భిన్నుడు పరమేశ్వరునిలాగ విశ్వసాక్షి అయినా అవిద్యాకర్మవశాన సంసార నిమగ్నుడై దుఃఖిస్తుంటాడు

ఈ జీవులు నాలుగు విధాలు—నిత్యులు, ముక్తులు, బద్ధులు, కేవలులు నిత్యులు అనంత గరుడవిష్వక్సేనాదులు వీరు పరమేశ్వరునిలాగ శక్తిమంతులు అతనికి ఉభయ విభూతుల లోను నిత్య సన్నిహితులై సేవచేస్తుంటారు ఈశ్వరుడిలాగే వీరూ అవతరిస్తారు ముక్తులు భగవద్భాగవతపరులై, నిత్యనైమిత్తిక క్రియలుచేస్తూ, భగవదాజ్ఞా కైంకర్యాలు కొనసాగిస్తూ, ప్రపత్తిలో పరమేశ్వరానుగ్రహం పొంది, ఆయన సాన్నిధ్యం చేరి సుఖపడుతారు బద్ధులు దేహాత్మ భ్రాంతులు, అనివృత్త సంసారులు బ్రహ్మమొదలు కీటకంవరకు చతుర్దశ భువనాం లోను జనన మరణాలు పొందుతూ వుంటారు వీరికి పరమేశ్వర భావన వుండదు కేవలులు

---

144 వాలాగ్ర శతభాగస్య శతధా కల్పితస్యచ, భాగో జీవస్య విజ్ఞేయః- శ్రీమద్భాగవతమ్

సంసారం హేయమని భావించి, ప్రకృతికంటె పరమైన ఆత్మస్వరూపాన్ని జ్ఞానయోగంతో ఆత్మస్వరూపం సాక్షాత్కరించుకొని, అదే భగవదనుభవమని విశ్వసించే జ్ఞానయోగులు వీరికి సంసారప్రాప్తి వుండదు ఆత్మ వుండేవరకు శరీరంలో తిరుగుతారు ఇదే కైవల్యం

బద్ధులు శాస్త్ర వశ్యులు శాస్త్రావశ్యులు అని మరి రెండు విధాలు శాస్త్ర వశ్యులు మనుష్యాదులు, కానివి పశ్వాదులు శాస్త్ర వశ్యులు బుభుక్షులని, ముముక్షువులని రెండు రకాలు బుభుక్షువులు ధర్మకాములు, అర్థకాములని రెండు విధాలు అర్థకాములు దేహాత్మభ్రాంతులు ధర్మకాములు యజ్ఞయాగ దాన తీర్థయాత్రాది పుణ్యకార్య నిష్ఠులు వీరికి స్వర్గాదులుంటాయి ఈ ధర్మకాములు దేవతాంతరపరులు, భగవత్పరులు అని రెండు విధాలు వీరిలో భగవత్పరులు ఆర్తులు జిజ్ఞాసువులు, అర్థార్థులు అని మూడు విధాలు ముముక్షువులు కైవల్యపరులు, మోక్ష పరులు అని రెండు విధాలు మోక్షపరులు భక్తులు, ప్రపన్నులు అని రెండు విధాలు

అచిత్తు సత్త్వరజస్తమో గుణాశ్రయ రూపం, సూక్ష్మావస్థలో అవ్యక్తం, నిత్యం జ్ఞానానికి విరోధి కనుక అవిద్య సృష్టి వైచిత్రి హేతువు కావున మాయ నిత్యక్రమంలో మార్పులు వున్నా నిత్యమైనది కనుక అక్షరం

ప్రళయస్థితిలో ఇది అవ్యక్త రూపంలో వుంటుంది ఈశ్వరుని ఇచ్ఛ వల్ల మూల ప్రకృతి నుండి త్రిగుణాత్మక మహత్తు, దీని నుండి అహంకారం పుట్టాయి ఈ అహంకారానికి సాత్త్విక రాజస తామస స్వభావా లున్నాయి రాజసాహంకారసహిత సాత్త్వికాహంకారం వల్ల ఏకాదశేంద్రియాలు, తామసాహంకారం వల్ల పంచతన్మాత్రలు, పంచభూతాలు పుట్టాయి పంచభూతాలు, అవ్యక్తం, అహంకారం శరీరోపాదాన కారణాలు

ఈ శరీరం నిత్యమని, అనిత్యమని రెండు భేదాలు భగవంతుని, నిత్య సూరుల శరీరాలు నిత్యాలు అనిత్య శరీరం కర్మకృతమని, అకర్మకృత మని రెండు విధాలు కర్మకృత శరీరం మనుష్యాదులది అకర్మకృతం పరమేశ్వరావతారాలు చతుర్దశ భువనాత్మక బ్రహ్మాండమంతా ప్రకృతే దేవతలూ దీనిలోని వారే ఇలాంటి ప్రకృతి జీవేశ్వరులకు భోగస్థానం

ఈశ్వరుడు చిదచిత్తులకు ఆత్మ, నియంత, శేషి, సర్వకార్యాలకు ప్రధాన హేతువు, ఫలప్రదాత, సకలకర్మారాధ్యుడు ఇతడు చిదచిత్తులను నియమిస్తాడు ఇతనికి అవి శేషం ప్రళయకాలంలో ఈ విశ్వం అతనిలో లీనమై ఉంటుంది దానిని అతడు మరల అనుగ్రహించి వ్యక్తం చేస్తాడు

అతడే జగత్తుకు ఉపాదాన నిమిత్త సహకార కారణ భూతుడు కాని, దాని తుచ్ఛ ప్రాకృత స్వరూపం కాదు బాల్య యౌవన వార్ధక్యాద్యవస్థలు శరీరానికే కాని ఆత్మకు లేనట్లు లోకంలోని వికారాలు ఆత్మ రూపుడైన ఈశ్వరునికి లేవు అతనికి ఈ జగత్సృష్టి కేవల మొక లీల జీవులను ముక్తులను చేయడానికే ఆయన ఈ సృష్టి చేస్తున్నాడు ఆయన కేవలకృపామూర్తి ఈ కృప వల్లనే ఆయన ఐదు విధాల అవతారాలు ధరించాడు పరావతారం, వ్యూహావతారం, విభవావతారం, అంతర్యామ్యవతారం, అర్చావతారం - అనేవి ఆ ఐదవతారాలు అతడు సర్వనియంత అతనికొక మూర్తి వుంది అది షడ్గుణైశ్వర్య సంపన్నం, నిఖిల కల్యాణ గుణాత్మకం చిదచిత్తులలో వ్యాపించి వాటికి చైతన్యం కలిగించే ప్రభువు అతడే

చిత్తు, అచిత్తు, పరమాత్మ తత్త్వత్రయం పరమాత్మ లక్ష్మీ సమేతుడైన నారాయణుడు తప్ప మరొకరు కాదు లక్ష్మీదేవి భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్యశీల కనుక నారాయణుడు శ్రీమన్నారాయణుడు

ఈ శ్రీమన్నారాయణుడు జగత్తును సృష్టించి, వాటిలోని జడా జడాలకు అంతరాత్మగా వుండి, సర్వమూ రక్షిస్తున్నాడు అతడే ప్రళయంలో సూక్ష్మ రూపం పొందిన ప్రకృతితో, కరణకళేబరాలు లేక ఏ పనికి చేతగాక ఉండి లేనట్లు అచిత్కల్పాలుగా పడి వున్న జీవాత్మలతో కలిసి వుంటాడు

ప్రళయంలో సూక్ష్మ చిదచిత్తులతో కలిసి వుండే పరమాత్మే, సృష్టిలో చిదచిత్తులతో కలిసి వుంటాడు ఆ పరమాత్మకు చిదచిత్తులు విశేషణాలు సూక్ష్మ దశలో గాని, స్థూలం దశలో గాని చిదచిత్తుల అతనిని వదలి వుండవు కనుక తద్విశిష్టుడు పరమాత్మ ప్రళయంలో తనలో వుంచుకొన్న వాటినే ఆవిష్కరించి, వాటికి అంతరాత్మగా, ఆధారంగా వుంటాడు అప్పటి అతనికి, ఇప్పటి అతనికి ఏ భేదమూ లేదు ఇదే విశిష్టాద్వైతం నిత్య సత్య తత్త్వాలు మూడైనందున, ఆ మూడింటికి వివాదం లేనందున, ఒక్కటే అనడం శ్రుతి విరుద్ధమైనందున రామానుజులు విశిష్టాద్వైతమన్నారు

ఈ విశిష్టాద్వైతం ఉత్తరాది దాక్షిణాత్య సంప్రదాయాల సమన్వయమని చెప్పడం చర్విత చర్వణం ద్రావిడ ప్రబంధాలలోని వైష్ణవ తత్త్వం, వేదోపనిషత్తులలోని తత్త్వత్రయాత్మక విశిష్టాద్వైత తత్త్వం సమన్వితాలైనందున రామానుజులు ఉభయ వేదాంత ప్రవర్తకులయ్యారు

మరి ఈ సంసారంలోపడి కొట్టుమిట్టాడుతున్న జీవునికి ప్రకృతి బంధాలు తొలగించుకొని తిరుగులేని పరమపదం చేరుకోడమే పరమ పురుషార్థమైనప్పుడు, నరజన్మ ఎత్తినందుకు సాధించ వలసిన ఫలమూ అదేనని గ్రహించినప్పుడు, దానిని పొందే మార్గాలేవి? సాధనాలేవి? ఉపాయాలేవి?

## ప్రపత్తి లక్షణం

ఆ ఉపాయాలు జ్ఞాన కర్మ భక్తి యోగాదులు. యోగమంటే ఉపాయం. ఈ జ్ఞాన కర్మ భక్తి యోగాలు ఈ కాలంలో సాధ్యంకావు గనుక, రామానుజ మతానుసారం ప్రపత్తే సులభతర ముక్తి సాధనం. ప్రపత్తిని న్యాసం, భరన్యాసం, శరణాగతి, ప్రపదనం అని అంటారు.

"అహం మద్రక్షణ భరో మద్రక్షణ ఫలం తథా।
న మమ శ్రీపతే రేవే త్యాత్మానం నిక్షిపేత్ బుధః।[146]

నేను, నా రక్షణ భారం, ఆ రక్షణఫలం ఇవన్నీ నావి కావు, శ్రీమన్నారాయణునివే-అని వివేకవంతుడు తనభారం భగవంతునిపై వుంచాలని వేదాంత దేశికులు అంటారు. ఈ ప్రపత్తికి ఆరు అంగా లున్నాయి.

"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్,
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా
ఆకించన్య భరన్యాసౌ షడ్విధా శరణాగతిః,
(ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః)

భగవదనుకూల కర్మ వచనాలు చేయడం, భగవత్ప్రతికూల కర్మ వచనాలు వదలి పెట్టడం, భగవంతుడు నన్ను రక్షిస్తాడనే నమ్మకం, రక్షణానికై భగవంతునే అనుసరించడం, దీనత్వం ప్రకటించడం, తన భారాన్ని అతనిపై వేయడం—ఇవి ఆరు శరణాగతి అంగాలు. పైన పేర్కొన్న వాటిలో భరన్యాసం ప్రధానమైన అంగి అని, తక్కిన ఐదు అంగాలని, కనుక పంచాంగయుతమైన న్యాసమని కొందరు ఐదు అంగాలే గ్రహిస్తారు.

ఈ ప్రపత్తి అనుష్ఠానంలో మూడు విధాలు—స్వనిష్ఠ, ఉక్తినిష్ఠ, ఆచార్యనిష్ఠ అని. పరిణతచిత్తుడైన ముముక్షువు స్వయంగా అనుష్ఠించేది స్వనిష్ఠ. తనకు అర్థం తెలియకపోయినా,

146 వేదాంత దేశికులు, న్యాసదశకం, శ్లో 1

ఆచార్యుడు చెప్పినట్లు చేయటం ఉక్తినిష్ఠ. ఆచార్యుడు తాను శరణాగతుడవుతున్నప్పుడు "వీడు నా పుత్రుడు, వీడు నా శిష్యుడు, వీడు నా సేవకుడు" అని తన్నాశ్రయించిన వారికొరకు, వారి ప్రమేయం లేకుండా రక్షించమని భగవంతుని ప్రార్థించటం ఆచార్యనిష్ఠ.

''మాం మదీయం చ నిఖిలం చేతనాచేతనాత్మకమ్
స్వకైంకర్యోపకరణం వరద స్వీకురు స్వయమ్ [146]"

ఓ వరదా నన్ను, చేతనాచేతనాత్మకమైన నా సర్వస్వాన్ని నీవే నీ కైంకర్యానికి ఉపయోగపడేట్టుచేసుకో అని ప్రార్థిస్తారు వేదాంతదేశికులు.

ఈ శరణాగతి మరిమూడు విధాలు - ఆర్తప్రపత్తి, దృప్తప్రపత్తి ప్రాయశ్చిత్తప్రపత్తి. అగ్ని పొగనిండిన ఇంట్లో వున్నవారు ఎప్పుడు గా దెప్పుడు బైటపడదామని చూస్తారు. నీటిలో ముంచిపెట్టబడినవారు ఊపిరాడక బైటపడేందుకు పెనుగులాడుతారు. అట్లే ఇలా మరణ తాపత్రయ సంకీర్ణమైన ఈ సంసారంలో ప్రకృతి బంధంలో శరీరకారాగారంలో తగుల్కొని ఇంక క్షణం వుండలేను, స్వగృహం పరంధామమేనని, భగవత్కైంకర్యమే తన కృత్యమని ఆరాటపడేవారు "భగవంతుడా! నన్ను వెంటనే నీ సన్నిధికి చేర్చుకో!" అని ప్రార్థిస్తే, భగవంతుడు వారి సర్వకర్మలూ హరమార్చి తన దగ్గరికి తీసుకుపోతాడు. ఇది ఆర్తప్రపత్తి.

దృప్తప్రపత్తి నింపుంతో కూడిన ప్రపత్తి. "వైకుంఠానికి పోతే, అక్కడా నీవే ఇక్కడ వుండినా చేసేది నీ సేవే. అట్లాంటప్పుడు ఎక్కడుంటే నేమి? మరణించేక ఇక ఒక్కసారే మరుజన్మ నాకు లేదు కనుక ఇదే నాకు కడపటి దావు. మరి ఇది ఎప్పుడైతే నేమి? వచ్చినప్పుడు రానీ!" అని దేహావసానం వరకు నిబ్బరంగా వుండేవారు దృప్తప్రపన్నుడు. వారు చేసే ప్రపత్తి దృప్తప్రపత్తి. వేదాంత దేశికులు ఈలాటి నిబ్బరంతో ఇలా అంటారు —

"నిరంతరం నిర్విశతః త్వదీయ
మస్పృష్ట చింతా పద మాభిరూప్యమ్,
సత్యం శపే వారణశైలనాథ
వైకుంఠవాసేఽపి న మేఽభిలాషః
"త్వంచేత్ ప్రసీదసి తవాస్మి సమీపతశ్చేత్
త్వయ్యస్తి భక్తి రనఘా కరిశైలనాథ,

146 వేదాంత దేశికుల న్యాసదశకమ్, శ్లో 8

అపచారాన్నైనా క్షమిస్తాడు గాని భాగవతాపచారం క్షమించడు భాగవతాగ్రహపాత్రుణ్ని భగవంతుడు క్షమించడు

రామానుజుల తర్వాత ఏర్పడిన తెంగలై, వడగలై శాఖల వారికి శరణాగతిలోను అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి ఈ శాఖల నాయకులను ఇది వరకే పేర్కొన్నాను

తెంగలై సంప్రదాయం వారికి భక్తి ప్రపత్తులు మోక్షసాధనాలు కావు భక్తియోగం కృత్రిమం భిన్నం ప్రపత్తి అకించనత్వ మాత్రమై మనుష్యుని అసామర్థ్యం వెల్లడిస్తుంది ఇవి రెండూ కాక భగవంతుని నిర్హేతుక కటాక్షంతో విశ్వాసంతో జీవించడమే మోక్ష సాధనం భగవంతుని అనుగ్రహానికి హేతువు లేదు ఉంటే అది దివ్యమే కాదు కనుక నిర్హేతుకం కటాక్షమే మోక్షహేతువు ఇది మార్జాల న్యాయమయినది సహేతుక కటాక్షం అంగడిలోని పాలు ముక్తిని మనుష్య సాధనాలతో పొందడం నైచ్యం ఇది స్వగతస్వీకారం భగవంతుడు తనంతట తానే జీవుణ్ని అనుగ్రహించడం పరగత స్వీకారం ఇది గొప్పది భగవత్సేవ కంటె భాగవత సేవ గొప్పది శ్రీకి శేషిత్వం లేదు ఆమెకున్నది అనన్యార్హ శేషత్వమే ఆమె కృపా మూర్తి ఆమె పురుషకార రూపిణి ద్రావిడ దివ్య ప్రబంధాలే ప్రమాణాలు

వడగలై సంప్రదాయం వారికి భక్తి ప్రపత్తులు మోక్షసాధనాలు, భగవత్కృప సహేతుకం నిర్హేతుక కృపాకటాక్షం అంగీకరిస్తే భక్త్యాదులు సాధనాలు కాకపోతాయి వాటిని వదిలితే మానవులు భ్రష్టులవుతారు సకల శాస్త్రాలూ భక్త్యాదులే సాధనాలని తెలుపుతున్నాయి భగవదనుగ్రహమే ముక్తికి హేతువు కాని, ఆ భగవదనుగ్రహానికి అర్హత జీవుడు సాధించుకోవాలి లక్ష్మీదేవి నారాయణుని లాగ విభువు శేష శ్రీవిశిష్టుడైన నారాయణుడే ముక్తి దాత తత్త్వత, పరతత్త్వం ఒక్కడే అయినా దంపతులై ద్వంద్వమైనది ఈశ్వరి ఈశ్వరులు పుష్ప పరిమళం వంటి వారు లక్ష్మీదేవి అకారము (ఈశ్వరుడు) కాని మకారము (జీవుడు) కాదు న్యాయపాలకుడైన నారాయణుడు కృపారూపిణి అయిన శ్రీదేవి కలిసిన శ్రీమన్నారాయణ తత్త్వమే ఉపాసించదగినది వేదోపనిషత్తులు, ద్రావిడ దివ్యప్రబంధాలు ప్రమాణాలు

ఈ రెండు వాదాలకు కారణం శ్రీమన్నారాయణుడే ఉపాయోపేయ భూతుడనే వాక్యం ఉపాయానికే ప్రాధాన్య మివ్వడం ముక్తికి హేతువని, భగవత్కృపా కటాక్షం సహేతుకమని వడగలై సంప్రదాయులవాదం ఈ ప్రపత్తిని మర్కటకిశోరన్యాయంతో పోల్చారు వీరు తెంగలై సంప్రదాయంవారు ఉపేయమే ప్రధానమని, అది నిర్హేతుక కృపాకటాక్షమని

అంటారు వీరు ప్రవృత్తిని మార్జాల కిశోరన్యాయంతో పోల్చారు తల్లిపిల్లి సురపేవి తన కూనను నోటకరచుకొని మరొక చోటికి తీసుకొని పోతుంది

## పంచ సంస్కారాలు

ఈ ప్రపత్తికి అధికారం సంపాదించుకోవడానికి చేసుకోవలసిన సంస్కారాలు ఐదు న్నాయి వాటికి పంచసంస్కారమని పేరు ఈ సంస్కారం లేనిదే ప్రపత్తికి అర్హత లేదు.

''తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః " తప్త చక్రాంకనం,నొసట పుండ్రం, పేరు, మంత్రజపం, దేవపూజనం-అనేవి పంచసంస్కారం ఈ సంస్కార పంచకంతో ఈ దేహం నేను, ఇది నాది-అనే భ్రాంతి తొలగిపోతుంది

ఏ వ్యక్తి అయినా తన వస్తువును గుర్తించడానికి దానిపై తనపేరు,లేక పొడి అక్షరాలు చెక్కుతాడు అలాగే "ఈ శరీరం నాది కాదు, పరమాత్మది, స్వామిసొమ్ము సంసారసాగరం దాటడానికి తప్పగా దీనిని నాకు అనుగ్రహించాడు దీనిని ఆతని సేవకే వినియోగించాలి దేహాత్మ భ్రాంతితో అనుచితమైన పనులు చేస్తే భగవంతుని సొమ్ము దుర్వ్యయం కావడమే కాక ఆత్మకూ అధఃపతనం తప్పదు అందువలన సంసారతరణసాధనంగా ఆయన కైంకర్యానికి వినియోగించాలి " అనే భావంతో గుర్తుగా భగవంతుని శంఖచక్రాలగుర్తులను భుజాలపై వేసుకోవాలి

నొసట పుండ్రం ధరించడం అనాదిగా భారతీయాచారం శూన్య లలాటంతో ఏ పనీ చేయరాదు అంతేకాక ఈ వ్యక్తి వైష్ణవుడు అని తెలియడానికి తిరుమణి తిరుచూర్ణాలతో ఆయా స్థానాలలో ఊర్ధ్వ పుండ్రాలు ధరించాలి ఇవి కేవలం అలంకారంకోసం కాదు శ్రీమన్నారాయణుడు ఆయా స్థానాలలో ఉన్నాడన్నదృష్టితో కేశవాది నామాలతో అనుసంధించాలి

మనదేశంలో ప్రతివారికీ ఒక్కొక్క పేరు వ్యవహారంలో వుంటుంది కులం పేరు, వంశం పేరు తమ పేర్లకు తగిలించుకోడం మనదేశంలో అలవాటులో వుంది కాని, వైష్ణవులైన వారు భగవద్భాగవతుల యెడల పూజ్యభావంతో వుండాలి గనుక, కుల విద్యా ధన మదాలు వదలుకొని, తాను అందరికన్నా తక్కువవాడినని చెప్పడానికి వర్ణ సంబంధమైన శర్మ వర్మగుప్తాద ఉపాధులు మాని, దాస అనే బిరుదం చేర్చుకోవాలి ఈ దాసత్వాన్ని త్రికరణ శుద్ధిగా ఆచరణలో పెట్టాలి

ఈ దాసభావానికి పెద్ద లోతైన కథ తెలుగువారు పెరియ తిరుమలనంబి (శ్రీశైలపూర్ణులు) ఆళవందార్ల శిష్యులు. ఆయన తిరుమలలో కైంకర్యం చేసేవారు. ఒకమారు ఆయన తమ మేనల్లుడు, తమవద్ద శుశ్రూషచేసి చదువు కొంటున్నవారు అయిన రామానుజాచార్యులకు పెరుమాళ్ళ తీర్థం యిద్దామని రాగా రామానుజులు వారిని సేవించి "పెద్దలు మీరు దీనికోసం రావలెనా? ఏ పిల్లవానితోనైనా పంపలేకపోయారా?" అని అన్నారట. "ఔను నేనూ చూచాను నాకంటే పిల్లవాడెవడూ కనిపించలేదు. నేనే వచ్చాను" అన్నారట తిరుమలనంబి. ఇది త్రికరణ పూర్వకమైనదాసభావం. ఇది గొప్ప సంస్కారంతోగాని కలుగదు.

మంత్రజపం నాల్గవ సంస్కారం. వైష్ణవులకు అష్టాక్షరి, ద్వయం, చరమశ్లోకం అనేవి ప్రధానమైన మూడు మంత్రాలు. ఓం నమో నారాయణాయ అనేది అష్టాక్షరి. ఎనిమిది అక్షరాలు వుండడంవల్లదీనికి అష్టాక్షరి అనే పేరు వచ్చింది. ఇది పరమాత్మ జీవాత్మల స్వరూప స్థితి ప్రవృత్తులు తెలియజేస్తుంది. ఓం పదం జీవాత్మ, లక్ష్మీ విశిష్ట పరమాత్మలను, నమఃపదం సేవను, నారాయణాయ అనేది జీవునికి నారాయణుడు తప్ప మరొకరు బంధువులు లేరనడాన్ని తెలుపుతాయి. ఈ మంత్రానికి మూలమంత్రమని, తారకమంత్రమని పేర్లు. శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః - అనేది ద్వయ మంత్రం. పూర్వార్ధంలో ఉపాయ ప్రతిపాదనమూ, ఉత్తరార్ధంలో ఉపేయ ప్రతిపాదనమూ ఉండడంవల్ల దీనికి పేరు వచ్చింది. దీనికి మంత్ర రత్నమని పేరు.

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః

అనేది చరమశ్లోకమంత్రం. అన్ని ధర్మాలూ వదలి నన్నే శరణుపొందు. నేను నిన్ను సకల పాపాలనుంచి విముక్తుణ్ని చేస్తాను. శోకించకు—అని భగవద్గీతలో కృష్ణభగవానుడు అర్జునునికి ఉపదేశించారు. నీవు ఇలా దీనిని అనుష్ఠించు, దీని కిది ఫలం—అని ఇది ఫలవిధానం బోధిస్తుంది. ముక్త్యుపాయాలలో కడపటి ఈ యోగం ఉపదిష్టమైనది. గనుక ఇది చరమమంత్రమైంది. ఈ మూడు మంత్రాలకూ మంత్రత్రయమని పేరు.

ఐదవ సంస్కారం యాగం. పూజ, దేవపూజ అని దీని అర్థం. ముముక్షువు భగవత్పూజ తప్పక ఆచరించాలి. చేసే ప్రతి పనినీ భగవంతునికి అర్పించాలి. ఏమి తినదలచినా, మొదట భగవానునికి నివేదించి, దానిని తీర్థ పూర్వకంగా పరిగ్రహించాలి. ఈ దేవపూజే యజ్ఞం.

ఈ పంచ సంస్కారం వల్లనే నిత్య నైమిత్తిక క్రియార్హత కలుగుతుంది పంచ సంస్కార సంస్కృతులైన పిదప శ్రీమన్నారాయణుని పొందే ఉపాయాలు అనుష్ఠించి, విరోధి పంచకాన్ని పరిహరించి అపునరావృత్తి రహితమైన మోక్షం పొందాలి[166]

## ఆళ్వారాచార్యుల చరిత్ర గ్రంథాలు- భార్గవపురాణం

ఈ ఆళ్వారాచార్యుల చరిత్రను భగవద్రామానుజుల సమకాలికులు, రంగాధిపారోగ్యశాలా వల్లభులు (శ్రీరంగనాథాలయ మహానసాధ్యక్షులు) అయిన గరుడవాహన పండితులు దివ్యసూరి చరితమ్ అనే పేరుతో సంస్కృత కావ్యంగా రచించారు ఇదే తొలి ఆళ్వారాచార్య చరితమని పండితుల విశ్వాసం ఇది పద్ధెనిమిది సర్గల మహా కావ్యం గరుడ వాహన పండితునికి కవి వైద్య పురందరుడనే బిరుదం వుంది పిదప మణిప్రవాళశైలిలో తమిళ భాషలో పిన్బళగియ పెరుమాళ్ జీయర్ అనే వైష్ణవాచార్యులు గురుపరంపరా ప్రభావమ్ అనే గ్రంథం రచించారు ఇది కూడ రామానుజులకు సమకాలికమే, కొండెం తర్వాతిదో అనంతాచార్యులనే పండితులు ప్రపన్నామృత మనే పేరుతో ఆళ్వారాచార్యుల చరిత్ర రచించారు ఈయన 18 వ శతాబ్ది వారు

తెలుగులో తొలి ఆళ్వారాచార్యుల చరిత్ర అముక్తమాల్యద కాని ఆళ్వాచార్యుల చరిత్ర సమగ్రంగా, రచించిన వారు రాళ్ళపాక తిరువేంగళ నాథుడు ఇతడు 16 వ శతాబ్దం వాడు అన్నమాచార్యుల మనుమడు దీని పేరు పరమ యోగివిలాసము రెండవది ఆచార్య సూక్తి ముక్తావళి దీని రచయిత మంగళగిరి వాస్తవ్యులైన వంగూరి కేశవాచార్యులు 18 వ శతాబ్దం చివరివారు ఈయన సమకాలికులు వంగల సీతారామాచార్యులనే కవి ఆచార్య రత్నమాల అనే పేరుతో ఈ చరిత్ర రచించారు

## హామనాయకుని తెనుగు సేత

ఆళ్వారాచార్యుల చరితం వర్ణించే ఈ భార్గవ పురాణం సంస్కృత భార్గవపురాణం ఉత్తర ఖండానికి అనువాదం రచయిత రామవ హామనాయకుడు ఈయన కృష్ణా తీరా నదీ మధ్యగతమైన అత్యంత పావనంతమైన సురపురరాజ్యం పాలకుడు రచయిత మూల పురాణంలోని అధ్యాయాలను కూడ ఎప్పటికప్పుడు పేర్కొన్నారు "అని నరుండు నారాయణు

---

166 మతవివరంలో నేను విశిష్టాద్వైత సిద్ధాంతదర్పణం, అముక్తమాల్యదా సౌందర్యాలలోని వాక్యాలు కూడా వాడుకున్నాను

మంత మహాయోగి మాహాత్మ్యంబును, సంవాద రూపంబును, శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి ప్రథమాధ్యాయం బాలకించి నమ్రింతె[159]

భార్గవపురాణం ఉత్తర ఖండం ప్రసక్తి గరుడవాహన పండితుడుగాని, ప్రపన్నామృత కర్తగాని, పరమ యోగివిలాస కర్తగాని ఎత్తలేదు అలాంటిది ఉంటే పరమ ప్రమాణంగా భావించే వారు కనుక ఇది తర్వాత- అంటే ప్రపన్నామృతం తర్వాత రచితమైందని శంకిస్తున్నాను పిదప భార్గవపురాణానికి ఉత్తర ఖండంగా చేరి వుంటుంది సూతుడు అర్వాచీనులైన ఆళ్వారుల చరిత్ర చెప్పడం సంభవం-కాదు కదా! శ్రీ వైష్ణవులు భార్గవపురాణాన్ని ఉప పురాణంగా సమ్మానిస్తారు

సంస్కృత భార్గవపురాణం ఉత్తర ఖండం వ్రాత ప్రతులు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో పది లభిస్తున్నాయి - 14547 నుంచి 14758 వరకు, తర్వాత డి 15987, ఆర్ 8081 (బి) ఆర్ 6154 ఇవన్నీ తాళపత్ర ప్రతులు 14548, 49, 51,52 తెలుగు లిపిలో ఉన్నాయి తక్కిన ఆరు గ్రంథ లిపిలో వున్నాయి 14548 కొండపల్లి కాయితం ప్రతి

పామ నాయకుడు సంస్కృత మూలాన్ని భక్తి ప్రపత్తులతో అనుసరించాడనడానికి రెండు మూడు పద్యాలు ఉదాహరిస్తాను

శుభమస్తు

మూలం

శౌనకాదయః —

సర్వధర్మార్థ తత్త్వజ్ఞ సర్వశాస్త్ర విశారద,
తత్త్వార్థ విదుషాం శ్రేష్ఠ సూత ద్వైపాయన ప్రియ

యాని యాని చ లోకేషు చరిత్రా ణ్యపవర్గిణాం,
తవ ప్రసాదా దస్మాభిః శ్రుతాని వదతాం వర
కృతకృత్యా వయం స్వామ పవిత్రీ కృత చేతసః,
యోగినాం తు చరిత్రాణి భగవద్దాస్య భాగినామ్

శ్రోత్రా న్యమృత కల్పాని త్వయా ధర్మోపదేశినా,
న తృప్తిం యాంతి చేతాంసి తస్మా త్తాని వదస్వ నః (1 వదస్వనః)

159 భార్గవపురాణం అధ్యాయం 1 52

సూత —

సాధు పృష్టోఽస్మి మునయః భవద్భిః మోక్షకాంక్షిభిః,
చిరకాలా దిదం వక్తుం భవతా మస్తి (?) మే మనః
భవద్భ ఏవ పృచ్ఛ్రత్తి మా మిదం ముని పుఙ్గవాః,
ఆసీ త్పురమహర్షోఽ య మధునా మమ చేతసి
వక్ష్యామి సర్వమేత ద్వః శృణుధ్వం తత్సమాహితాః,
భువి స్థితానాం సర్వేషాం క్షేత్రాణా ముత్తమం పరమ్
బదర్యాశ్రమం మహాపుణ్యం స్మరణాదేవ ముక్తిదమ్,
సర్వర్తు కుసుమోపేత వనరాజి విరాజితమ్
ప్రపుల్ల స్వర్ణకమల సరోవర విభాసితమ్,
తస్మిన్ దివ్యాశ్రమే రమ్యే దక్షిణాన్త శిలా తలే
సమాసీనౌ జగన్నాథౌ నరనారాయణౌ పురా,
భూ లోక జన రక్షార్థ మవతీర్ణౌ మహామునీ
నానా విధ కథా స్సర్వాః బ్రువన్తౌ వసతః స్సదా,
తస్మిన్ కాలే మహాత్మానం నారాయణ మునీశ్వరమ్
పార్శ్వేణ మహతా యుక్తో నరో వాక్యం త మబ్రవీత్

అనువాదం -

సుతం ధర్మార్థ తత్త్వజ్ఞ సకలశాస్త్ర
వేత్త తత్త్వార్థ విద్వత్ప్రభూత సూత
మౌని ద్వైపాయన ప్రియ మౌనిగేయ
యనుచు నభివాదనము చేసి యంఘుమతిని 1 27

అనయము భవదీయకరుణ
వెనసి జగములందు వింటిరెన్ని యద్భు
తుని యే ధర్మ చరిత్రము
అనుపమ మహిమాని వింటి మౌ మే మనమూ 1-28

హిగదొంద బహ్రితీకృత
మగు మనములు గల్గువారమై వివరింపన్
జగతిఁ గృతకృత్యుల మయితి
మగణిత మతి నేము నిస్తులానందులమై 1-29

అమృత స్వరూపంబులును, నిరంతరంబులును నగు భగవద్దాస్య భాక్యంబులయిన యోగీశ్వరుల చరిత్రంబులు తత్త్వోపదేశ నగు నీచేతఁ బల్కంబడినవి గావు గాన చిత్రంబులు తృప్తి నొందకుండు కతన మమ్ముఁ గూర్చి దానిఁ బల్కుమనుచు సూతుం డిట్లనియె 1-80

నిరతము మోక్షకాంక్ష గల నిర్మలచిత్తులు మీరు నన్ను సు
స్థిరతర సూక్తి ప్రశ్నమును జేసితి రెక్కుడు గాఁగ మీకు వి
స్ఫురణము దీనిఁ బల్కఁగ సముత్సుకి నాదు మనంబు కోర్కెయై
తిరము దనర్చు చుండు చిరకాలముగా మునులార వేడుకన్ 1-81

దీని మీరలు న న్నూన సంతుష్టిన
వడిగిన కతన నో యనఘులార
యిపుడు దృష్టమౌ నీ ప్రమోదంబు నా
చిత్తంబు నందెట క్షితిని నా న
మస్తంబు మీకుఁ బ్రేమమున వచించెద
వినుఁడు సమాధిన విమలమతిని
లోకస్థితమయి యనేకంబులగు క్షేత్ర
ములలోన నుత్తమంబుగఁ దనర్చు

స్మరణమువలన మోక్షం బొసంగుచుండు
నతిశయంబు మహాపుణ్య మయిలితంబు
నమరు నెప్పుడు బదర్యాశ్రమ మనెడు సుకృత
రంబునై సంతతంబును శుభంబు దనర 1-82

వివిధ తరు ప్రసూన సంయుతంబును నందన బృంద ప్రకాశితంబును విత్ఫుల్ల కాంచన కమల కాసార విరాజితంబును నగుట భవ్యంబగు బదర్యాశ్రమంబు నందలి చంద్రకాంత శిలా తలంబునందు సమాసీనులై భూభువన జన రక్షణయినకై యవతరించిన మహామునులును జగదధీశ్వరులును నగు నరనారాయణు లిరువురు నానాప్రకారంబులగు సకలకథా ప్రసంగంబు లొగ్గడింపుచు వసియింపుచున్న దర్శాలంబునందు నరుండు మహానుభావుండగు నట్టి నారాయణ మునీశ్వరుంగూర్చి పరమహర్షయుక్తుండగుచు వినయంబుగా నవయసూక్తి నిట్లనియె 1-83

2 మూలం —

తంసే మూలా మేదిన్యా మద్భుత్యర భూమహా(?),
నారా ట సృంగాలా పూర్ణా చక్రరేఖేవ శారదీ

దృష్ట్వా మరకతశ్యామాం దివ్యాంశుకాలంకృతామ్,
గృహీత్వా సమ్పరిష్వజ్య తేయ మస్యాః కథం భువి
ఇతి చిన్తాపర స్సోపి తదా ప్రాహాగతిర్జితః

తవేష్టాః కే వనం లోకే భూషణాః (?నా నా)తవ సుప్రియాః (?యా),
వదస్వ దేవదేవేశ గుహ్యాద్గుహ్యతమం శివమ్
తచ్ఛ్రుత్వా భగవా నాహ ప్రియా మాలిఙ్గ్య సమ్ప్రమాత్,
త(?మ)త్కృత్రవహరా దేవి మమేష్టా మత్పమాయతే(?)
ప్రసూనభూషా సంప్రీతి స్సర్వభూషాస్వనుత్తమా
మమ భూషాపరాణా ఞ్చ గుణకీర్తనకారిణామ్
సర్వాభీష్టా నాహం దత్వా ప్రదదే శాశ్వతం పదమ్
తచ్ఛ్రుత్వా భగవద్వాక్యం భూదేవీ హరివల్లభా
ప్రసూనమాలికాభూషాం కరిష్యే ప్రీతిప్రియామ్,
కీర్తనఞ్చ కరిష్యామి తస్యైవ గుణవర్ణతామ్
ఇతి సఙ్కల్ప్య మనసా త్వయి యోగేశ్వరేశ్వర,
విశ్వమ్భరా జగన్మాతా జాతా సీతా యథా పురా

అనువాదం –

అంతటఁ దులసీమూలధ
రాంతికసీమను ఖనిత్ర మలవరచి మహా
స్వాంతుండు విష్ణుచిత్తుఁ డ
నంతామరవిభుఁడు ద్రవ్య నానమయమునన్ ౪౦-౪౪

ఆషాఢ మాసంబు నందలి పూర్వఫ
ల్గుని తారగం శుభదినమునందు
శుభలగ్నమునను వసుంధరాంశను జేసి
తులసికామూల భూతలమునందు
శారదాగమ పూర్ణ చంద్రరేఖయుఁ బోలి
వికచాబ్జవదన బాలిక శుభాంగి
పరికింపనగుట నాధరణీసురోత్తముఁ
డానంద కందళితాంతరంగుఁ

ఇందిరాధీశ్వరునకు నభీష్టమై న
సించు సుమమాలికాహార సేయుదాన
నహరహంబును దన్మహామహా గుణైక
కీర్తనము సల్పఁగలను విస్ఫూర్తి మించి ప-95

అని మదిఁ జింతించి ముదం
బున యోగీశ్వరుఁడవైన భూసుర ప్రియం
దును గల్గ జగతిఁ బార్వం
బున సీత జగజ్జననియు బొరవిన యట్లన్ ప-96

8 మూలం –

గోదావరీ తటస్థాయాం ధర్మపుర్యాం దయానిధిః,
యోగానంద ఇతి ప్రోక్తో నృసింహో నతివత్సలః
కృష్ణవేణీనదీతీరే కాకులే త్వాష్ట్రినాయకః,
అహోబిలే సువర్ణాద్రౌ హిరణ్యకశిపోంతకః
పౌండరక్షేత్రవిఖ్యాతో విఠలః పరికీర్తితః,
శ్రీ వేంకటాద్రిశిఖరే వనరాజివిరాజితే
అష్టోత్తర సహస్రైశ్చ పుణ్యతీర్థై స్సమన్వితే,
స్వామిపుష్కరిణీతీరే శ్రీనివాసః శ్రియోజ్జ్వలః

అనువాదం -

శ్రీగోదావరి తటమున
శ్రీగాంచిన ధర్మపురిని స్థిరతరలీలన్
యోగానంద నృసింహుం
డాగమ వేద్యుండు దనరు నాశ్రితధనియై ప 178

దివ్యమగు కృష్ణవేణీనదీతటమున
వరలు శ్రీకాకుళంబునం దంధ్రనాయ
కుండు దనుఁ గొల్చువారలకును ముదమున
భుక్తిముక్తులఁ గూర్చు సంపూర్ణమతిని ప 179

గారుడాద్రి నంటి గద్దె నహోబలం
మున హిరణ్యకశిపుఁ గూలియఁ జేసి
నట్టి శ్రీనృసింహుఁ డత్యుగ్రకరవాహుఁ
దనరుఁ బరమపావనాహ్వయుండు ॥ 180

దివ్యసూరిచరితంలో గాని, పరమయోగివిలాసంలో గాని ధర్మపురి యోగానందుని, శ్రీకాకుళాంధ్ర నాయకుని ప్రసక్తి లేదు. పరమయోగి విలాసంలో అహోబిలం, వేంకటాద్రుల ప్రసక్తి ఉంది[180] దీనిలో ధర్మపురి,శ్రీకాకుళ క్షేత్రాల పేర్కొనడంవల్ల మూలం తెలుగుదేశం తెలిసిన వారి రచన అయివుంటుంది

4 మూలం –

ఉపాయం సాధు చింత్యైవం విస్మృత్యాభరణాదికమ్,
ధృత్వా శ్వేతోర్ధ్వ పుణ్డ్రాణి తులసీమణిమాలికా।
కాషాయవాసినీ విష్ణుదాస వత్కృత్రనే తదా,
మునే స్త్రీక మాగత్య పపాత పదపద్మయోః।
తాం దృష్ట్వా దుఃఖితాం దీనాం కులం గోత్రం చ జన్మ చ,
పృష్ట్వా నివేదితం సర్వం తయా కపటవేషయా
ఆశ్వాస్య కృపయా నారీం తులసీవనసేవనే,
కరణే రంగనాథాం నిదిదేశ మహామునిః
శుశ్రూషమాణా సానిత్యం శ్రామ్యవహరణాదిభిః,
భుక్త్వా భుక్తశేషాన్నం సేవయా మాస వత్సరమ్

తదా వర్షతి పర్జన్యే వర్షకాలాగతే వధూః,
అశ్వత్థమూలే సంతస్థౌ తత్ప్రమాగమకాంక్షిణీ
తతో విప్రోత్తమో దైవా దుష్టాయ ద్వార సంస్థితః,
దిశో వీక్ష్య ముదైస్సాన్ద్రైః తిమిరేణ సమావృతాః
తద్వృక్షాశ్వత్థ మూలస్థాం స్త్రియం వర్షేణ పీడితామ్,
వినాయ కృపయా వర్షకాలం తాం మునిసత్తమః

180 పరమయోగి విలాసము పుట 399–401

తతస్సా తస్య పాదాబ్జే లాలయిత్వా కరామ్బుజైః
రరామ తేన మునినా దైవాత్ప్రేరితచేతసా

అథ తం మునిమాదాయ గృహం గత్వా నిజేచ్ఛయా
భగిన్యై కథయామాస తత్సర్వం హర్షితా సతీ

అనువాదం - సతి

ఘనమున్ బిల్చియు దేవదేవి ముని నిచ్చన్ మోహితుంజేయగాఁ
మనమం దొక్క యుపాయమున్ దలఁచి సమ్యక్చాతురీ యుక్తయై 6 118

వరహేమ భూషణ వ్రాతంబు విదలించి
తులసీమణీ మాలికలు ధరించి
తిరుగా మృగనాభి తిలకంబు వెట్టక
నవ్య సితోర్ధ్వ పుండ్రంబు దిద్ది
చీనిచీనాంబర శ్రేణులు కడనుంచి
చారు కాషేయ వస్త్రంబు గట్టి
శృంగారగాన విశేషముల్ చాలించి
హరినామ కీర్తనాయత్త యగుచుఁ

తనరు భక్తిని వైష్ణవ దాస్యమునకు
నుచితమగు వేషము వహించి తుదియు భ్రమ
భావమున గల్గువడియున్నె యతిమృదూక్తిఁ
దేవియల్ దిక్కు వైరాగ్యమానయగుచు 6 119

మునివరుని సమీపంబున
కనుపొందఁగ నేగుదెంచి యతని యడుగులం
దును బ్రాలి యార్తి దీనా
ననయై వగపొందు సంగతన్ గని కతఁడున్ 6 120

కులము గోత్రంబు జనవంబు దెలియనడుగ
విప్రవర్యున కంతయు విన్నవించె
నతని మోహింపఁ జేయఁగా నలవరించి
కపటవేషంబుతోడ నా కంజనయన 6 121

అంత నమ్మునీంద్రుఁ డయ్యింతి లాలించి
కరము ప్రీతిఁ దులసికావనంబు
సేచనం బొనర్చి చెట్లకు పాదులు
సేయు మనుచు నాజ్ఞ సేయుటయును 5 123

ఆ బాలకన్య మునివచనానురక్తి
నాశ్రమ స్థలి సమ్మార్జనాదికములు
నంబుహరణాది ప్రసూనాలాచరించు
శ్రాంతయయ్యును విడువక సంతతంబు

ఆ ముని భుజింప విడువ ద
యామతి నిజభుక్తశేష మగు నన్న మిడన్
నేమంబున భుజియించుచుఁ
గామిని వత్సరము వఱకిటుల సేవించెన్ 5 124

క్షమ సుతఁ బ్రాంతాశ్వ
త్థమహీరుహ మూలసీమ దాఁపు గొనిన యా
కమలాయతాక్షి ముని నం
గమ మభిలాషింపుచుండెఁ గౌతుకమతియై 5 132

అంత దైవవశమున నుదాత్తుఁడగుచు
నిదుర మేల్కొని వాకిట నిలిచి సాంద్ర
కందరమ్ములఁ జీకటి క్రమ్ముకొనిన
యఖిల దిక్కులు పరికించి యవని సురుఁడు 5 133

అంతట దానశేఁ దడిని యాత్రి గడంగుచు పర్ణశాలికా
ప్రాంత ధరాతలంబునను రంభలు రావిమహీజమూలము
త్యంతము దాపుగొన్న కమలాయతలోచనఁ గాంచి దాపిత
స్వాంతముఁ జేసి లోపలకుఁ బయ్యనఁ దోడ్కొనివచ్చె వేడుకన్ 5 134

అట నుటజంబున కరుగుదెంచినయట్టి
మానినీ రత్నంబు మౌనిఁ జేరి
చలనెపంబున మునిచంద్రు పాదంబుల
పట్టనే యొక వింత పనుపుఁ జేసి

యంటినా రనుచుఁ దదంఘ్రులు తన తొడ
నిడుకొని యొత్తుచుఁ గడు నివురుచు
బ్రాహ్మణోత్తము నాదు పయ్యెద దడిసిన
దని తదీయకరము నందుఁజేర్చి

హావభావాభినయ మందహాస రుచుల
గులుక బిబ్బోక విలాస పలుకు తేనెఁ
జిలుకు సొగసులు దొలుకు నాతలికి విప్ర
పుంగవుని మానసము తరంగఁ జేయ 6 185

కనుఁగవ తళ్కులన్ గుచయుగంబునసౌరు ముఖేందు మండలం
బునఁగల నిగ్గు మిన్ను నరికోలిన కొను నాయారమున్ వచో
వినయ విలాస వైభవం విస్తృతి మించిన యంతిఁగాంచి యా
ముని హృదయంబు జల్లనఁ బువ్వుశరాసను డాకిలోర్వకన్ 6 186

ఇంతయందు దైవవశమునఁ
జలిత హృదయుఁడైన మౌనిచంద్రుడితోడన్
వలరాజు కేళియం దా
బలవాలి కళావిలాస సౌఖ్యము గాంచెన్ 6 187

మూల భార్గవపురాణం 40 అధ్యాయాల గ్రంథం మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలోని కొన్ని తాళపత్ర గ్రంథాలలో అధ్యాయాల చివర వ్యాసప్రోక్తమని లేదు కొన్నిటి చివర ఉంది "ఇతి శ్రీమద్భార్గవే ఉపపురాణే ఉత్తర ఖండే నరనారాయణ సంవాదే మహాయోగి మాహాత్మ్యే వ్యాసప్రోక్తే చత్వారింశోఽధ్యాయః" (ఆర్ 2670-14662) డి 282-14548 నంబర్ ప్రతి చివర లేఖకుడు తనను గురించి చెప్పుకొన్నాడు

శ్రీమద్రామానుజమునిర్ధాత్రీ పరమయోగినామ్,
చరిత్రం మహితం భద్రం లిలేఖ కృపయా హరేః

శ్రీరామానుజ ముని శిష్యుడు మహితమూ, క్షేమంకరము అయిన పరమయోగుల చరిత్రను హరికృపతో వ్రాశాడు

ప్రాచీన ప్రబంధకారులలాగే పాపనాయకుడు తన అనువాదాన్ని సాగించాడు పెంచి, తుంచి, కల్పించి

సురపురం రాజాలను గురించి ఇటీవల చాల విషయాలు తెలిశాయి మన పెద్దలు "వారి వంశం వారు ఇంకా ఉన్నారట" అని, ఎవరో చెప్పినట్లు వ్రాశారు ఆ వంశంవారు ఇంకా క్షేమంగా వున్నారు శ్రీ కపటరాళ కృష్ణరావనే పరిశోధకులు దాదాపు 80 ఏళ్ల పరిశోధన చేసి, వివిధ చారిత్రకాంశాలు సేకరించి 'సురపుర సంస్థాన ఇతిహాస' అనే ఉద్గ్రంథాన్ని, స్థానిక మహా విద్వాంసులు పండితరత్నం శ్రీమాన్ పెరుమాళ్ళ గుండాచార్యులు (ఎం.ఏ. బిఇడి) "సురపుర సాంస్కృతిక ఇతిహాస" అనే గ్రంథాన్ని కన్నడంలో రచించారు వీరిద్దరూ సురపుర వాస్తవ్యులయినవారు ఆ గ్రంథాలను అనుసరించి భార్గవపురాణ కర్త అయిన రాఘవ పామునాయకుని వంశచరిత్ర ఇది [162]

## సురపురం రాజుల వంశపరంపర -

సురపుర రాజ్య పాలకులను గోసం వంశం వారు అనే రూఢి వుంది గోవులను పాలించడం వల్ల ఈ పేరు వచ్చిందంటారు వీరి మూలపురుషుడు నరసింహ నాయకుడు ఇతని కుమారుడు వీర బొమ్మ నాయకుడు ఇతని కుమారుడు సింగప్ప నాయకుడు ఇతని పుత్రుడు ఎదెర నాయకుడు ఇతని పుత్రుడు కల్లప్ప నాయకుడు

ఈ కల్లప్ప నాయకుని నుండే ఈ వంశ చరిత్ర ప్రారంభమవుతుంది ఇతనికి 'బసవ శంకర', అనే బిరుదం ఉంది ఇతడు హంపి పట్టణంనుండి కంపిలి,గంగావతి, తావర గేరె మార్గంగా సకుటుంబంగా ముదుగల్లుకు వచ్చాడు ముదుగల్లు కిల్లేదారు ముస్తఫాఖాన్ కల్లప్ప నాయకుణ్ణి పిలిపించినట్లు ఐతిహ్యం వుంది కల్లప్ప నాయకునికి ఏడుగురు కుమారులు వీరందరికీ హనుమప్ప నాయకుడనే పేరు వీరు కృష్ణా భీమా మధ్య ప్రాంతంలో అక్కడక్కడ భూముల సంపాదించుకొన్నారు కడపటి వాడైన చిన్న హనుమ నాయకుడు శక్కేరిలో స్థిరపడ్డాడు ఇతని వంశం వారే సురపురం, గుడగుంట రాజ్యాలకు మూలపురుషులు ఈ చిన్న హనుమ నాయకుడు చుట్టుపట్ల ప్రాంతాలను తన పరాక్రమంతో ఆక్రమించుకొన్నాడు

ఇతని తర్వాత ఆరు తరాల వరకు చెప్పుకోదగిన వారెవరూ లేరు ఇతనికి ఆరో తరం వాడయిన పిడ్డ సోమనాయకుడు శక్కేరి వదలి బదు బావి, గద్దె మొదలయిన ప్రాంతాలకు వెళ్లారు శక్కేరి మొదటి పాలకులు ఇతనిని తరిమివేసినట్లు తోస్తుంది ఇతని కుమారుడు పెద్ద పామనాయకుడు ఇతరుల సాహాయ్యంతో మరల శక్కేరిని వశపరచుకొన్నాడు ఇతడు అప్పటి బిజాపూర్ సుల్తాను ఇబ్రాహీం ఆదిల్‌షా సరదారు అబ్దుల్ రహిం బహద్దూర్ ఖాన్ స్నేహం

---

162 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస, పెరుమాళ్ళ గుండాచార్యులు సురపుర సాంస్కృతిక ఇతిహాస

సంపాదించి కొన్ని అధికారాలు సంపాదించాడు ఇతనికి ఇద్దరు కుమారులు- పెద్దవాడు ఇక్కప్పదేశాయి, చిన్నవాడు హంప్ప (ఎద్ది) సోమనాయకుడు ఇక్కప్పదేశాయి కక్కేరి గడ్డి అనే రెండు స్థలాల్లో వుండే వాడు ఇతనికి గడ్డి పెద్ద నాయకుడు, గడ్డి లింగ నాయకుడు అని ఇద్దరు పుత్రులు ఎద్ది సోమనాయకునికి పిల్లలు లేరు ఇక్కప్పదేశాయి పెద్ద కుమారుడు గడ్డి పెద్ద నాయకుడు సురపుర రాజ్యానికి, గడ్డి లింగ నాయకుడు గుడగుంట రాజ్యానికి మూలపురుషులయ్యారు

చిన్న హనుమనాయకుని కాలంలో కక్కేరిలో సోమనాథ దేవాలయం నిర్మితమైంది అతని తండ్రి కల్లప్పనాయకునికి 'బసవ శంకర' బిరుదం ఉండటం బట్టి, చిన్న హనుమప్ప సోమనాథాలయం నిర్మించడాన్నిబట్టి వీరంతా శైవసంప్రదాయంవారనే తెలుస్తున్నది సురపురం వారు మాత్రం [illegible] వైష్ణవ సంప్రదాయం అనుసరించారు గుడగుంట వారు నేటికి శైవులే వీరి వంశక్రమమిది -

1 నరసింహ నాయకుడు
2 వీరబొమ్మ నాయకుడు
3 సింగప్ప నాయకుడు
4 బచీర నాయకుడు
5 కల్లప్ప నాయకుడు
6 చిన్నహనుమ నాయకుడు
7 హావి(పామ) నాయకుడు
8 పెద్దసోమ నాయకుడు
9 ఎర్రసింగమ నాయకుడు
10 మదకి నాయకుడు
11 వీరఘంట నాయకుడు
12 బలిసోమ నాయకుడు
13 హిరే (పెద్ద) పామ నాయకుడు
14 ఇక్కప్ప దేశాయి

15 గడ్డి పెద్ద నాయకుడు (సురపురం) 16 గడ్డి లింగనాయకుడు (గుడగుంట)

సురపుర రాజ్యం చివరి రాజయిన (1842-1858 వరకు) బ్రిటిష్ ప్రభుత్వాధికారాన్ని ఎదిరించిన స్వాధి వెంకటప్ప నాయకుని కాలంలో సురపురంలో వున్న కర్నల్ మెడోస్ టెయిలర్ సురపురం రాజులకు సమకాలీనులయిన మొగల్, బహమనీ, బీజాపూర్, విజయ నగర మహారాష్ట్ర, నిజాం రాజులతో గల సంబంధాలను తెలిపే ఎన్నో ఆజ్ఞాపత్రాలు మున్నగు వాటిని సేకరించి చరిత్ర వ్రాద్దా మనుకున్నారు కాని, తన ఆత్మకథలో మాత్రమే సురపురం సంగతి తెలిపారు ఆతని కథనం ప్రకారం "సురపురం సంస్థాన మూలపురుషులు కర్ణాటకలోని రత్నగిరి పాళెగార్లు విజయనగర సార్వభౌములు తమ సామ్రాజ్యం ఉత్తరాన మున్నూను రాజులను ఎదిరించడానికి ఈ బోరవంశాల వారిని కృష్ణా తుంగభద్రా మధ్య ప్రాంతంలో నెలకొల్పారు వీరు విజయనగర సమ్రాట్టులకు లోబడినవారు" ఆనెగొంది రాజులు సురపురానికి వస్తే సురపురం రాజులు పాదచారులై నగరద్వారం వద్దే స్వాగతం పలికి సాష్టాంగ నమస్కారం చేసి గౌరవించే సంప్రదాయం ఇప్పటికీ వుండడాన్ని బట్టి టెయిలర్ చెప్పింది వాస్తవమనే తోస్తుంది సురపురం రాజుల పూర్వులకు ఏడు తరాలుగా బీజాపూర్ సుల్తానులతో సంబంధమున్నట్లు ఇస్మాయిల్ ఆదిల్‌షా కాలపు కైఫియత్తుల వల్ల తెలియ వస్తుంది కృష్ణరాయలు ఈ ఆదిల్‌షాను జయించి రాయచూరు, ముదుగల్లు కోటలను స్వాధీన పరచుకోవడం చరిత్రాత్మకం

[illegible]క్కప్ప దేశాయికి ఇద్దరు కుమారులని, వారిలో లింగనాయకుడు గుడగుంట రాజ్యానికి, పిడ్డనాయకుడు సురపుర రాజ్యానికి మూలపురుషులని ఇదివరకే ప్రస్తావించడం జరిగింది పెద్ద నాయకుడు మహాశూరుడు మొగల్ చక్రవర్తులు బీజాపూర్ రాజ్యంపై దండెత్తినప్పుడు పిడ్డ నాయకుడు తన వీర పదాతి సైన్యంతో బీజాపూర్ నవాబుకు సహాయకుడుగా ఉన్నాడు ఇతడు మొగల్ చక్రవర్తి ఔరంగజేబు ప్రశంసలు కూడ పొందాడు ఇతని పరిపాలన కాలం 1686-1666

పిడ్డ నాయకునికి సంతానం లేదు అతని అన్న లింగనాయకునికి ఏడుగురు కుమారులు పిడ్డనాయకుడు అన్న ఐదవ కుమారుడైన పామనాయకుని దత్తత తీసుకొన్నారు ఇతడు సురపురాన్ని 1666-1687 వరకు పాలించాడు ఇతడు బీజాపురం, మొగల్ పాదుషాల నుండి బహుమానాలు, వస్త్రాలు పొందడం వల్ల హసరంగి (పచ్చంగి) పామనాయకుడని పేరు పొందాడు ఇతడు బీజాపురం పాదుషాకు చివరవరకు సహాయకుడుగా వున్నాడు కాని, ఔరంగజేబు చివరకు బీజాపుర రాజ్యాన్ని ఆక్రమించుకొన్నాడు కాని పామనాయకుని పదాతి సైన్యబలం చూచి అతనితో స్నేహం అవసరమని, అతనిని శత్రువుగా చూసుకో లేదు అతనిని ఢిల్లీకి పిలిచి సత్కరించాడు పామనాయకుడు ఢిల్లీలోనే మరణించాడు

పామనాయకుడు విశిష్టాద్వైత సంప్రదాయం స్వీకరించాడు దక్షిణదేశం నుండి వచ్చిన వైష్ణవులు ఇతని ఆశ్రయం పొందారు ఇతడు వాగినగిరిలో గోపాలస్వామి కోవెల కట్టించాడు, తన సైన్యాన్ని వ్యవస్థీకరించాడు

పంచ్చంగి పామనాయకుని కుమారుడు పీతాంబర బహిరి పిడ్డ నాయకుడు ఇతడు 81 సంవత్సరాలు జీవించాడు ఇతని పరిపాలన కాలం 1687-1726 ఇతడు బిజాపురం సుల్తానులకు, మహారాష్ట్రులకు సహాయంగా వున్నాడని ఇతన్ని అణచివేయడానికి ఔరంగజేబు పెద్ద సైన్యం పంపాడు ఇతడు దానిని ఓడించాడు దానితో వేడెక్కిన ఔరంగజేబు పెద్ద సైన్యంతో వాగినగిరి సమీపంలో ఆరు నెలలు మకాం చేసి, వాగినగిరిని నాశనం చేసి, వేణు గోపాల స్వామి కోవెలను నేలమట్టం చేసి, దాని స్థానంలో మసీదు కట్టించి, వాగినగిరికి రహమాన్ బక్ష్ అనే పేరు పెట్టాడు కాని, పీతాంబర పిడ్డ నాయకుడు ఆరు సంవత్సరాల తర్వాత మరల సైన్యం కూర్చుకొని ఔరంగజేబు సైన్యాన్ని ఓడించాడు కాని, రాజ్యమంతా నాశనమైంది అవధూత మల్లిభావి గోపన్న అనే యోగి ఆజ్ఞ ప్రకారం వాగినగిరినుండి ఇప్పుడున్న సురపురానికి తన రాజధాని మార్చి, సురపుర పట్టణం నిర్మించాడు [169] ఔరంగజేబు ఇంతలో మరణించాడు దక్షిణాన మొగల్ ప్రతినిధి అయిన నిజాముల్ ముల్క్ స్వతంత్రుడయ్యాడు పీతాంబర పిడ్డనాయకుడు మహాశూరుడు, కొంత ప్రయత్నించి వుంటే దక్షిణ భారతంలో చాల వరకు తన రాజ్యాన్ని విస్తరింపజేసుకొనే వాడే కాని, వృద్ధుడు కావడం వల్లనో, మరే కారణం వల్లనో సురపుర నిర్మాణంలోను, గోపాలస్వామి కోవెల, చెరువుల నిర్మించడంలోను నిమగ్నుడయాడు

పీతాంబర పిడ్డనాయకుని అనంతరం అతని మొదటి భార్య కృష్ణమ్మ కుమారుడు ఇమ్మడి పామనాయకుడు సురపుర రాజ్యాధీశుడయ్యాడు ఇతడు నిజాముకు అనుకూలంగా వుండే వాడు ఇతని కాలంలో బేటులు కొందరు తిరుగ బడ్డారు వారిని ఇతడు కఠినంగా శిక్షించాడు ఇతని కాలంలో సురపురం కోట ద్వారాలు, దేవాలయ సరోవరం నిర్మాణమయాయి ఇతని రాజ్యకాలం 1727–1741 ఇతనికి ఇద్దరు భార్యలు పెద్ద భార్య కుమారుడు పిడ్డ నాయకుడు , రెండవ భార్య కుమారుడు వెంకటప్ప నాయకుడు

ఇమ్మడి పామనాయకుని అనంతరం పెద్ద భార్య కుమారుడు ముమ్మడి పిడ్డ నాయకుడు గద్దె ఎక్కాడు ఇతడు (1742–1746) నాలుగు సంవత్సరాలు మాత్రమే రాజ్యం చేశాడు ఇతనికి సంతానం లేదు కనుక అతని అనంతరం సవతి తమ్ముడు వెంకటప్ప నాయకుడు పట్టానికి వచ్చాడు

---

169 పెరుమాళ్ళ గుండాచార్య, నగరవాడ దర్శన, పుట 181

ఈ వెంకటప్ప నాయకుని రాజ్య కాలం 1747–1762 ఇతనికి ఎడమ ముంజేయి తెగిపోయినందున ఇతనిని మొండగై (మొండి చేయి) వెంకటప్పనాయకుడు అనేవారు ఇతడు ఒక ఇనప ముంజేయి పెట్టుకొనేవాడు ఈ ఇనప చేతిని నేడు మహానవమి నాడు ఆ రాజ్యం వారసులు ఆయుధ పూజలో పెడుతారు దీనితోనే ఇతడు డాలు పట్టుకొని యుద్ధం చేసేవాడు

ఇతడు నాసర్‌జంగ్ పక్షం వహించి ఫ్రెంచి వారితో పోరాడి గెలిచాడు పుదుచ్చేరిని పట్టుకొన్నారు ఈ యుద్ధానికి ఫుడిచేరి (పుదుచ్చేరి) యుద్ధమని పేరు కాని నాజర్ జంగ్ ఎక్కువ కాలం నిజాంరాజ్యం ఏలలేదు నిజామలీ నిజామయ్యాడు వెంకటప్ప నాయకుడు సురపురానికి తిరిగి వచ్చి, తన రాజ్యాన్ని, సైన్యాన్ని సువ్యవస్థితం చేశాడు, తిరుపతిలో సత్రం కట్టించాడు

## ముమ్మడి రాఘవ పామనాయకుడు

మొండి చేయి కృష్ణప్ప నాయకునికి పుత్ర సంతానం లేదు కనుక, గుడగుంట వంశం నుంచి కుమారుని దత్తు తీసుకొందామనుకున్నారు కాని, అతని దర్బారు అధికారులు దానికి ప్రతిఘటించారు, అతని సవతి అన్నదమ్ముల వంశంవారు ఉండగా గుడగుంటవారు ఎందుకని వారు వాదించారు వేంకటప్ప నాయకుడు పుదుచ్చేరి యుద్ధానికి వెళ్ళినప్పుడు ఇతని పినతండ్రి రమణప్ప నాయకునికి సురపుర రాజ్య పరిపాలన అప్పగించాడు రమణప్ప నాయకుడు మహా భక్తుడు, శాంత స్వభావం గలవాడు

వెంకటప్పనాయకునికి పుత్ర సంతానం లేదు అతని సవతి తమ్ముడైన కృష్ణప్ప నాయకుడు, అతని సంతతివారు రాజ్యానికి వారసులు కాని, వెంకటప్ప నాయకునికి కృష్ణప్ప నాయకునికి మనస్తాపం కలిగినందున, అతడు సురపురం వదలి పోయాడు వెంకటప్ప నాయకుడు మరణించాడు కనుక అతని పినతండ్రి రమణప్ప నాయకుడు వారసుడయ్యాడు కాని అతడు చాలా వృద్ధుడయినందున అతని కుమారుడు ముమ్మడి రాఘవ పామనాయకుణ్ణి సరదారులు గద్దె ఎక్కించారు ఇతడు ఇంకా బాలుడైనందున రమణప్ప నాయకుడే రాజ్య వ్యవహారాలు చూసేవాడు ఇలా అతడు ఐదు నెలల కార్య భారం నిర్వహించాడు రమణప్ప నాయకుడు సురపురంలోని గోపాల స్వామి దేవాలయ నిర్మాణ కార్యక్రమం కొనసాగించాడు

రమణప్ప నాయకుడు మరణించిన తరువాత రాఘవ పామనాయకుడు రాజ్యభారం నిర్వహించాడు ఇతడు గొప్ప పండితుడు, కవి, వీరుడు, రణధీరుడు, ధర్మపరుడు, రాజనీతి చతురుడు ఇతడే భార్గవ పురాణ గ్రంథ రచయిత ఇతని ఆస్థాన విద్వాంసులు, గురువులు

అయిన ఉక్కపట్నం శ్రీనివాసాచార్యులు ఆతని జ్ఞాన రత్నాకరం అనే గ్రంథం అద్యంతాలలో ఈ విధంగా ప్రశంసించారు ప్రారంభశ్లోకమిది

అస్తి స్వస్తికరః కరాంచల చంద్రారాం ధారా మిత్
క్షేత్ర గ్రామ లనద్యదావదకుం ప్రస్తూయమాన స్తుతిః ,
శ్రీమత్సామ నృపాలకః ప్రతిమత ధ్వంసాధ్వరాధ్వర్యవం
ప్రాదా మృవ్య మదః ప్రదర్శనధియా వృత్తం ప్రవర్తామహే

గ్రంథ సమాప్తిలో

కౌండిన్య శ్రీనివాసాధ్వరి వరకృపయా ప్యగ్రగణ్యాగ్రహేణ
జ్ఞాతం యద్వ్యాప్యశత్త్వం శమిహా ఇథ ఇన ప్రీతయేవ్యక్త మూర్తమ్,
తేన ప్రీతః ప్రతీతః ప్రగుణ సురపురీ రాం గోపాలం రూపు
శ్రీమాన్ పామ్మ కీర్ప్రియ మయ మధికా మాదరా దారధాతు

ప్రీత స్స్య యత్నేన మత స్స్య మత్సర్
ధ్యాతః ఫలం పూర్వ మదా దిదానీమ్,
శ్రీపామ భూపాల్ప్రతి తేన తారః
సర్వం ఫలం దాస్యతి దృష్టమాత్రః [164]

అభినవ నిగమాంతదేశిక బిరుదాంకితులైన శ్రీ ఉక్కపట్నం శ్రీనివాసాచార్యుల ప్రశంసలను అందుకొన్న రాఘవ పామునాయకుడు అన్ని విధాల గొప్ప వాడవడంలో సందేహం లేదు ఈతని పరిపాలన కాలం 1762–1774

అప్పటి దేశ పరిస్థితి, అంతటా యుద్ధ కల్లోల యుగం సురపుర రాజ్యానికి ఒకవైపు నిజాము, మరొకవైపు పీష్వాలు ప్రబలులుగా ఉన్నారు అంతకు ముందు మహారాష్ట్రులకు ఓడి పోయిన నిజాము అలీఖాన్, మహారాష్ట్రులు పానిపట్ యుద్ధంలో అహమద్షా అబ్దాలీతో పరాజితులు కాగానే మరల తలయెత్తాడు కాని, మాధవరావ్ పీష్వ అతనిని అణచివేశాడు పూర్వపు బీజాపుర రాజ్యమంతా పీష్వ కిందికి రావడం వల్ల పీష్వ తన వ్యవహారాల నిర్వహణకు రాస్తే అనే కొత్త పదవిని సృష్టించి ఆనందరావ్ బీజాపు రాస్తే అనే అధికారిని నియమించాడు తమ్మ షరాలలో ఇతనికి, పామునాయకునికి

164 జ్ఞానరత్నప్రకాశికనుండి ఈ శ్లోకాలను శ్రీమాన్ పెరుమాళ్ళ గుండాచార్యులు పంపారు వారికి కృతజ్ఞతలు

స్పర్థలు ఏర్పడ్డాయి. పీష్వా రాజ్యంలోని కొందరు సర్దారులు ఎదురుతిరిగి పామనాయకుని ఆశ్రయం కోరారు. వారిని తనకు అప్పగిస్తే ఏమీ చేయనని మాట యిచ్చిన రాస్తే అప్పగించిన తర్వాత మాట తప్పి చెరలో పెట్టాడు. దానితో పామనాయకుడు రాస్తేకు తీవ్రంగా ఒక లేఖ వ్రాశాడు. రాస్తే గర్వంతో పామనాయకుణ్ణి పట్టుకొనడానికి మరాఠీ దండును పంపాడు. పామనాయకుడు దానిని ఓడించి పీష్వా రాజ్యంలో ప్రవేశించాడు. మాధవరావు పీష్వా మరొక సేనాపతిని పెద్దదండుతో పంపాడు. పామనాయకుడు వానిని ఓడించి తరిమాడు. మాధవరావు అప్పుడు పామనాయకునితో ఒడంబడిక చేసుకొన్నాడు.

కాని కొంత కాలం తర్వాత నిజాము, మాధవ రావు పీష్వా హైదరలీ పైన దండెత్తుటకు దక్షిణానికి పోతూ దారిలో సురపురం రాజ్యంపై పడ్డారు. అప్పుడు పామనాయకుడు వారిద్దరి అధికారానికి లొంగే ఒప్పందం చేసుకోవలసి వచ్చింది.

ఈ ఒప్పందం జరిగిన తర్వాత కూడ ఐదుగురు నిజాము సర్దార్లు సురపురం రాజ్యంలో ప్రవేశించి లూటీలు ప్రారంభించారు. పామనాయకుడు స్వయంగా సైన్యం నడిపి వారిని బందీలుగా పట్టుకొని సురపురానికి తిరిగి వచ్చాడు. ఈ పోరులో అతనికి 600 గుర్రాలు, ఒక ఏనుగు, మందుగుండు సామగ్రి లభించాయి. తర్వాత రాజీకాలానికి వారిని వదలి పెట్టాడు అతడు.

ఇలా వుండగా పామనాయకుని కులస్థులయిన వీర భటులు అతనికి విరుద్ధంగా పితూరీ చేశారు. వారిపై కఠిన చర్యలు తీసుకుంటే, రక్త పాత మవుతుందని గ్రహించి, నీతిపరుడైన అతడు, కొంతకాలం వేచివుండి వారిలో ముఖ్యులైన 186 మందిని బంధించి మరణ దండన విధించి, మళ్ళీ అలాటిది తల ఎత్తకుండా చేశాడు.

పామనాయకుడు గోపాల స్వామి కోవెల నిర్మాణం పూర్తి చేశాడు. కోవెలలో వైఖాన సాగమం ప్రకారం నిత్యసేవాదులకు, విశేష సేవాదులకు, ద్రావిడ ప్రబంధ, వేదాధ్యయనాలకు, దేవాలయ నిర్వహణకు, ఉత్సవాది కైంకర్యాల వారికి, భజంత్రీల వారికి, తక్కిన పరివారకులకు జీతాలు, మాన్యాలు ఏర్పాటు చేశాడు. ఈ పద్ధతి నేటికి నడుస్తూ వుంది.

నగరుకు కొత్త కట్టడాలను కట్టించి, పట్టణాన్ని సుందరంగా తీర్చిదిద్దాడు, తన సైన్యాన్ని కూడ కట్టుదిట్టం చేశాడు.

పామనాయకునికి నిష్టి కరంప్ప దివానుగా వుండేవాడు. అతని తర్వాత నిష్టి వీరప్ప దివానుగా వున్నాడు. ఈ వీరప్ప సమర్థుడు, ధార్మికుడు. ఇతడు రాజ్యంలోని భూమిని

కొలిపించి మాల్‌గుజారీ ఏర్పాటు చేశాడు. కొత్త జమాబంది పద్ధతి అమలు పరిచాడు. ఇతడు పామనాయకుని కుమారుడు ఇమ్మడి వెంకటప్ప నాయకుని కాలంలోను దివానుగా వున్నాడు. ఇతడు రాజ్యాన్ని పునర్వ్యవస్థీకరించడమే కాక, పెక్కు కట్టడాలు చెరువులు కుంటలు, బావులు, కోటలు, కొత్తరాలు నిర్మించాడు. ఇతడు జన ప్రియుడు కూడ కావడం వల్ల నేటికీ ఇతని కథలు చెబుతూ వుంటారు. నిష్టి వీరప్ప దువాయి (ఆన) అనే నానుడి కూడ ఏర్పడింది. ఇతడు కొత్తగా మాల్‌గుజారీ భూమిశిస్తు నిర్ణయించడమే కాక, కల్లు, సారాయి, పొగాకు, తమలం పాకులు, నూనె, నీరుప్ప మున్నగు వాటిపై సుంకాలు కూడ నిర్ణయించాడు. సురపురానికి అమ్మకానికి తెచ్చే వస్తువులపై అమ్మకం పన్ను విధించే వ్యవస్థ చేశాడు.

పామనాయకుడు వృత్తం జాగీర్ గ్రామాలు, గౌరవ జాగీరు గ్రామాలు పలువురు కవి పండితులకు, అధికార్లకు ఇచ్చాడు. ఈ జాగీర్లలో తిరుపతి వేంకటేశ్వరునికి, సురపురం వేణు గోపాలస్వామికి, వరకాల స్వామి మఠానికి, కంబపరం గురువులకు, ఎక్కపట్నం గురువులకు, పురుషకారికి, రాజపురోహితునికి, పురోహితుని ఆశ్రితులకు, అహోబలస్వామి మఠానికి, రాజవైద్యునికి, మూల్లముల గురువులకు, చిటుకాంద్ర వంశాలకు, గోపాలస్వామి కోవెల పూజారికి—ఇలా పెక్కుమందికి జాగీరు గ్రామాలు ఏర్పాటుచేశాడు.

## పామనాయకుని ఆస్థాన పండితులు

పామనాయకుని ఆస్థానాన్ని పలువురు పండితులు అలంకరించారు. వారిలో ఎక్క పట్నం అణ్ణయాచార్యులు, వారి అనుజులు శ్రీనివాసాచార్యులు ముఖ్యులు. వీరు సురపురాస్థాన విద్వాంసులు కావడానికి ఒక కథ ఉంది. అనంతపురం జిల్లా తాడిమర్రి సంస్థానం విజయ నగర సామ్రాజ్యానికి పదాతి సైన్యాన్ని ఒసగూర్చే బోయపాళెగార్ల సంస్థానం. పామనాయకుని కాలంలో తాడిమర్రి సంస్థానాన్ని కృష్ణనాయకుడు పాలించేవాడు. శత్రువులు అతనిని గద్దె దింపారు. పరాజితుడైన కృష్ణనాయకుడు పామనాయకుని సాహాయ్యం కోరాడు. రణధీరుడైన రాఘవ పామనాయకుడు తాడిమర్రికి పోయి, కృష్ణనాయకుని శత్రువులను హతమార్చి, కృష్ణ నాయకుని గద్దె ఎక్కించాడు. అప్పటినుంచి కృష్ణనాయకుడు, అతని తర్వాతివారు కూడ సుర పురం గోసల వంశంవారికి ప్రాణమిత్రులయ్యారు.

అప్పుడు పామనాయకుడు తాడిమర్రి దగ్గరే ఉన్న ఎక్కపట్నంలో నివసిస్తున్న అణ్ణయా చార్య సోదరుల విద్యావైభవం విన్నాడు. పిదప ఎక్కపట్టణానికి వెళ్ళి, అనేకవిధాలుగా వారిని ప్రార్థించి సురపురానికి పిలుచుకొనివచ్చి, తన గురువులుగా చేసుకొని, సురపురంలోని గోపాల

స్వామి కోవెలలో అగ్రతీర్థం, జాగీరు ఏర్పాటుచేశారు. ఇప్పటికీ ఈ అగ్ర తీర్థ మర్యాద నడుస్తోంది (జాగీరు పోయినా)[165]

అణ్ణయాచార్యులను అణ్ణాయ దీక్షితులని, పెద్దయ్యవార్లని శ్రీనివాసాచార్యులను అభినవ నిగమాంత మహాదేశికులని, చిన్నయ్యవార్లని జనం గౌరవంతో వ్యవహరించేవారు. అణ్ణయాచార్యులు 74 సంవత్సరాలు జీవించారు. ఈయన రచనల వివరాలు తెలియవు. ఆచార్యవింశతి, ప్రపత్తి వైభవస్తుతిః, యతిరాజవంశకమ్ మొదలయిన లఘుకృతులు లభిస్తున్నాయి. శ్రీమద్భాగవతానికి విశిష్టాద్వైతపరంగా భాగవత చంద్రచంద్రికా అనే వ్యాఖ్య రచించిన గండికోట వాస్తవ్యులైన వీరరాఘవాచార్యులు తమ వ్యాఖ్యానాన్ని శ్రీనివాసాచార్యులకు చూపి పరిష్కరించుకొన్నారని వీరరాఘవీయమని ప్రసిద్ధి చెందిన ఈ వ్యాఖ్యానాన్ని ప్రచురించిన శ్రీ కృష్ణబ్రహ్మతంత్ర పరకాల మహాదేశికులు ఉపోద్ఘాతంలో తెలిపారు.[166] శ్రీనివాసాచార్యులు రచించిన గ్రంథాలు అనేకం. వీరరాఘవీయంలో ఉదాహరించిన గ్రంథాలు మాత్రం ఇవి: 1 తత్త్వ మార్తాండః, 2 నయద్యుమణిః, 3 హరిగుణ దర్పణమ్, 4 భేద దర్పణమ్, 5 దేవతా ప్రసాదదర్పణమ్, 6 ప్రతితంత్ర దర్పణం, 7 ప్రమాణ దర్పణమ్, 8 తత్త్వ దర్పణమ్, 9 జిజ్ఞాసా దర్పణమ్, 10 షష్ఠీ దర్పణమ్, 11 సౌర దర్పణమ్, 12 గుణ మీమాంసా 13 సిద్ధాంతచింతామణిః, 14 పుష్పబ్రహ్మ నిరాకరణానందః, 15 తారతమ్య ఖండనమ్ 16 విజయ పరాజయః, 17 సంగతిరత్న ప్రకాశికా, 18 భావరత్నప్రకాశికా 19 విరోధ విరోధినీ ప్రమాథినీ, 20 తప్తముద్రా విద్రావణ ప్రద్రావణమ్

ఈయన తెలుగులోను పెక్కు పాటలు, పద్యాలు రచించారు. గండికోట శ్రీవైష్ణవస్త్రీలలో ఇవి నేటికీ ప్రచారంలో వున్నాయి.

రామన పామునాయకుని పెద్దభార్య దేవదుర్గాధిపతి పిచనాయకుని కుమార్తె తిమ్మమ్మ. ఈమెకు 1757లో కుమారుడు కలిగాడు. ఇతని పేరు ఇమ్మడి వెంకటప్పనాయకుడు. పామనాయకుని తర్వాత ఇతడు రాజ్యానికి వచ్చాడు. ఇతని రాజ్యకాలం 1773—1802.

రామన పామునాయకుని కాలంలో సురపురరాజ్యం పరనాయకత్వాలకు గురి అయినా, ధైర్యంతో మళ్ళీ చైతన్యవంతమైంది. రాజ్యం అభివృద్ధిపథంలో ముందంజ వేయడంవల్ల

165 శ్రీ పెరుమాళ్ళ గుండాచార్య, నగరవార దర్శన, పుట 184

166 శ్రీమతి తిరుమల సుచరిత, నగరవార దర్శన, పుట 280

సాంస్కృతిక పురోగతికూడ జరిగింది ప్రజలు ప్రశాంతంగా జీవించారు నిష్టి కదంప్ప, నిష్టి వీరప్పల మంత్రిత్వం సఫలమైంది రాజు వీరవైష్ణవుడు, మంత్రులు వీరశైవులు ఈ మతసామరస్యం గమనీయమైంది

పామనాయకుని దేవేరి తిమ్మమ్మ 1772లో మరణించింది పామనాయకుడు 1771లో జబ్బుతో మంచంపట్టాడు జబ్బు దినదినానికి హెచ్చిందేగాని, తగ్గలేదు అతడు 1776లో (విజయ సంవత్సరం, ఆశ్వయుజ బహుళ తదియనాడు) పరమపదం చేరాడు ఆ సమయంలో అతని తక్కిన భార్యలు జల్లిపాటి లచ్చమ్మ, గలుగు వెంకమ్మ, వాలిహాళ్ళ పెద్దమ్మ, రామక్క, మంగమ్మ దగ్గర ఉన్నారు పామనాయకుని రాజ్యకాలం 1762–1776 ఇతడు 1739 సిద్ధార్థి సంవత్సర పుష్యశుద్ధ సప్తమినాడు రమణప్ప నాయకునికి జ్యేష్ఠకుమారుడుగా జన్మించాడు 34 సంవత్సరాలే జీవించాడు సురపుర రాజుల చరిత్ర ప్రస్తుతం ముమ్మడి రాఘవ పామనాయకుని వరకే అవసరం గనుక సంగ్రహంగా తెలిపాను

సురపురం రాజ వంశావళి ఆఖరుప్రభువు వరకు ఇదివరకు తెలిసిందే సురపురం రాజ్యస్థాపకులు మొదలు తక్కినవారి వంశక్రమం ఇది [167]

1 గడ్డి పిడ్డనాయకుడు
(సురపురరాజ్య స్థాపకుడు)
రాజ్యపాలన కాలం 1636–1666

2 హనరంగి (పచ్చంగి) పామనాయకుడు
(ఔరంగజేబు నుండి సన్మానం, బిరుదులు పొందిన వీరుడు )
1666-1687

3 పీతాంబర బహరి పిడ్డనాయకుడు
1687–1726

4 ఇమ్మడి పామనాయకుడు
1727-1741

5 ముమ్మడి పిడ్డనాయకుడు
1742–1746

6 మొండగై (మొండిచేయి) వెంకటప్పనాయకుడు
1747–1762

---

167 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస

7 ముమ్మడి రాఘవ పామనాయకుడు
(భార్గవ పురాణకర్త)
1762–1778

8 ఇమ్మడి వెంకటప్ప నాయకుడు
(కిరీటి వెంకటాచార్యులు ఇతని ఆస్థాని)
1778–1802

9 ముమ్మడి పిడ్డనాయకుడు
1802–1818

10 ముమ్మడి వెంకటప్ప నాయకుడు
1818–1827

11 కృష్ణప్పనాయకుడు
1827-1842

12 నాల్గవ వెంకటప్పనాయకుడు
1842-1858

ఇతడు బ్రిటిష్ వారికి ఎదురుతిరగడంవల్ల బ్రిటిష్ ప్రభుత్వం ఇతనికి మరణశిక్ష విధించింది తర్వాత సురపురం నిజాం రాజ్యంలో చిన్న సంస్థానమయింది ఈ వీరవ్యాధవంశం వారు ఇప్పటికీ ఉన్నారు స్వాతంత్ర్యానంతరం అన్ని సంస్థానాలలాగ ఇదీ రద్దయింది ఈ రాజవంశంవారయిన రాజా వెంకటప్పనాయకుడు లోక్‌సభ సభ్యులుగా వున్నారు

## వీర శూర వ్యాధ జాతి

సురపురరాజ వంశీయులు వ్యాధజాతివారు ఈ జాతి పరాక్రమానికి, నీతినియమాలకు గీటురాయయిన జాతి, వ్యాధ శబ్దం వ్యాధ-బ్యాధ-బేద అయింది తమిళంలో వేద - బేద శ్రీలంకలో ప్రాచీన జాతి వెద్ద, ఈ పదమూ వ్యాధ శబ్ద భవమే తెలుగులో బోయ అయింది క్రమంగా వ్యాధ – బ్యాధ – బ్యాద అయినట్లే, వాహ–బాఅ-బా అ – బోయగా మారింది వ్యాధుల పరాక్రమాన్ని, సాహసాన్ని, శరీరసౌష్ఠవాన్ని, నిష్కాపట్యాన్ని గురించి గాథాసప్తశతిలో వర్ణనలు కొల్లలు రెండువేల సంవత్సరాలనుండి ఈ జాతివారు సేనానాయకులుగా దుర్గపాలకులుగా, తలారులుగా (నగరపాలకులుగా) కీర్తిపొందారు భారతదేశాన్ని పాలించిన ప్రతి రాజవంశమూ ఈ వ్యాధులను ఆదరించింది చాళుక్య, రాష్ట్రకూట, విజయనగర, మొగల్, కుతుబ్‌షాహి, బహమనీ రాజుల సైన్యాలలో ప్రముఖంగా వున్న దళాలు వ్యాధులవి విజయనగర చక్రవర్తులు, ముఖ్యంగా కృష్ణదేవరాయలు వీరిని సేనానాయకులుగా, రాజప్రతినిధు

లుగా, నగరతలారులుగా, తనకు అంగరక్షకులుగా నియమించారు రాయల అంగరక్షకులు దొస్తే నాయకుడు గొరగు పాలుడు బోయనే దుర్గరక్షకుడై పాళెగాళ్ళు వీరి మాతృభాష తెలుగు (ఈ విచిత్రమైన తెలుగు గురించి ప్రత్యేకంగా పరిశోధన జరగాలి)

ఈ వ్యాధుల మూలస్థానం దక్షిణాపథంలో నేటి కర్నాటకలోని గుల్బర్గ, బీజాపూర్, బెళగాంవ్, రాయచూర్, బళ్ళారి, చిత్రదుర్గం జిల్లాలు, ఆంధ్రప్రదేశ్‌లోని కర్నూలు, కడప, అనంతపురంజిల్లాలు, తమిళనాడులోని ఉత్తర ఆర్కాడు, చెంగల్పట్టుజిల్లాలు వీరి రణోత్సాహం అసాధారణం ఈ బోయ పాళెగాళ్లు ముఖ్యంగా సురపురంవారలు, తాడిమర్రి పాళెగాళ్లు తమకు ఎదురుతిరుగడంవల్ల హింసిస్తున్నారు ఈ వీరులను సైన్యంలో చేర్చుకోరాదని ఉత్తర్వు చేసింది[168] వ్యాధుల పరాక్రమం గురించి, పన్నంగి పామనాయకుని గురించి సుప్రసిద్ధ చరిత్రకారుడు ప్రొఫెసర్ జదునాథ సర్కార్ ముక్తకంఠంతో పొగిడారు – "అతని పదాతి సైనికులు గొప్ప గురిగాళ్ళుగా, మహాధైర్యవంతులుగా పేరుపొందారు వారు యుద్ధంలో గాయాలను, మృత్యువును లెక్కపెట్టేవారు కారు '[169]

బేడ శబ్దం ఉచ్చారణ తెలియని ముస్లిం నోట్లోపడి వివిధ వికారరూపాలు పొందింది బేరడ్, బిర్కి, బిర్డ్, బేండర్, బేడర్ అని అల్లే వాగినగిరి కూడ వాగిన్ ఖేరా అని, వాకిన్‌ఖేడ్ అని వికారరూపాలు పొందింది బేడర్‌కు ముస్లిములు బే+డర్ భయరహితులు అని వ్యుత్పత్తి చెప్పారు దీనికి డాక్టర్ రామరాజుగారి వంటివారు ఆయనను అనుసరించి తక్కినవారు "బేడర్లు=నిర్భయులు" అని వ్రాశారు గతానుగతికంగా[170] వాక్-ఇన-గిరి = వాగినగిరి బ్రహ్మగిరి అని అర్థం

## భార్గవపురాణంలో వంశావళి

భార్గవపురాణం ప్రథమాశ్వాసంలో రాఘవపామనాయకుడు వర్ణించిన వంశక్రమం ఇది ఈ అన్వయానికి ఆదిపురుషుడు గుహుడు అతని వంశం అనేకశాఖలుగా విస్తరించింది ఆ శాఖలలో కోసల వంశంలోనివారు

1 నరసింహ మహీపాలుడు

2 నడియర నాయకుడు

3 తల్ల మహీ వల్లభుడు

---

168 కపటరాళ్ళకృష్ణరావు—సురపురసంస్థాన ఇతిహాస, పుట 224–233 వివరాలు చూడండి

169 పై గ్రంథం పుట 28

170 డాక్టర్ బి రామరాజు మరుగుపడిన మాణిక్యాలు, ప్రొఫెసర్ సాళ్వ కృష్ణమూర్తి ప్రచలాత్మకాపరిణయ పీఠిక, పుట 3

4 చినహనుమ ధరణీకాంతుడు

5 హంపి నాయకుడు

6 పెదసోమ నాయకుడు

7 ఎఱసింగ ధరణీధవుడు

8 మల్లి ధరాధ్యక్షుడు

9 వీరహంపి నాయకుడు

10 బలిసోమ నాయకుడు

11 పెదపామ నాయకుడు

12 దేవాయి అక్క భూపతుడు

13 గద్దె పెద్ద నాయకుడు

14 పెదపామ నాయకుడు
(పచ్చంగి పామనాయకుడు)

15 పీతాంబరాసీన నాథుడు
(పీతాంబర బహరి పెద్ద నాయకుడు)

ఈ పీతాంబరాసీనాథునికి ఐదుగురు కుమారులు




సురపురరాజవంశంలో పామ(హంపి) నాయుధేయులు పలువురు పుండరంపల్లి గ్రంథ సంస్కర్తలు, పండితులు కీర్తిమత పర్తారు అంతేకాక వీరు వీరులయి యుద్ధాలలో మృతి యదం వల్ల ఎక్కువకాలం రాజ్యం చేయలేకపోయారు అందువల్ల ఒక తరంలో వారసులు ముగ్గురు నలుగురు కూడ రాజులయ్యారు పీతాంబర నాయకుని పెద్దభార్య కుమారుడైన పామనాయకునికి పెద్ద భార్య కుమారుడు పెద్ద నాయకుడు, రెండవ భార్య కుమారుడు వెంకటప్ప నాయకుడు (వెంకట క్ష్మాపతుడు) పెద్ద నాయకునికి

171 లేఖకుడు హనుమధరణీపతిని వదలి పెట్టాడు

సంతానంలేదు గనుక ఇతని సవతి తమ్ముడు వెంకటప్ప నాయకుడు రాజయ్యాడు ఇతడే మొండిచేయి వెంకటప్ప నాయకుడు ఇతనికి కూడ పుత్రసంతానం లేదు ఇతని ఒక పిన తండ్రి కృష్ణ భూపాలుడు (కృష్ణప్ప నాయకుడు) వెంకటప్ప నాయకునికి ఇతనికి (కృష్ణప్పకు) మనస్తాపంవల్ల ఇతడు సురపురం వదలి వెళ్లాడు అందువల్ల మరొక పిన తండ్రి రమణ ధరావరుడు (రమణప్ప) రాజసుడయ్యాడు అతడు వృద్ధుడు కావడంవల్ల రాజ్యం వదిలేసాడు అతని కుమారుడు రాఘవ పామనాయకుడు రాజయ్యాడు పేర్లవల్ల, రాజ్యకాలం స్వల్పం కావడంవల్ల పలువురు చాల భ్రమ పడ్డారు "పింగళిరావని పాలుని ఐదుగురు కొడుకు లలో పాము మహీధవు డొకడు, ఇతని కొడుకు వెంకట క్ష్మాపాలుడు అతడే వెంకటప్ప కానో పును అట్లాగాక భార్గవపురాణ కర్త్రయగు రాఘువ భూపాల పామనాయకునకు వెంకటప్ప యను పుత్రుడుండెనేమో తెలియరాదు పాము మహీధవుని కొడుకైన వేంకట క్ష్మాపాలకుడును రమణ ధరణీ రమణుని కొడుకైన రాఘవ భూపాల పామనాయకుడును అన్నదమ్ముల పిల్ల లగుటచే సమకాలీనులే అగుదురు''[172] అని ప్రొఫెసర్ సార్వకృష్ణమూర్తి సందేహం ప్రకటించారు ఈ సందేహాలు నివారించడం కొరకే పైన వివరంగా చరిత్ర ఇచ్చాను

రాఘవ పామ భూపాలు డిచ్చిన వంశావళిలో నరసింహ నాయకుని తర్వాత పరియర నాయకుడని తెలిపాడు తక్కిన దంతా సరిగావుంది ఇతర చారిత్రకాధారాలమబట్టి నరసింహ నాయకుని తర్వాత పిర తొమ్మనాయకుడు, సింగప్ప నాయకుడు ఉన్నారు భార్గవ పురాణా వతారికలోని వంశావళి తెలిపే వచనంలో ఒక పంక్తి లేఖక ప్రమాదంవల్ల ఎగిరిపోయిందని తోస్తుంది "తన్మహీశానికి పిరవరుండగు పిర తొమ్మనాయకుండును, అప్పిరునకు సింహ విక్రముడగు సింగప్ప నాయకుడును" అని చేర్చితే సరిపోతుంది

ఇంత స్పష్టంగా చరిత్ర ఉండగా, శ్రీ ఆరుద్ర "భార్గవ పురాణాన్ని వ్రాసిన సుర పురం అధిపతి పామనాయకుడు క్రీస్తుశకం 1696 దాకా జీవించాడు" అని వ్రాశారు"[173] ఆయన ఆధారాలు చూపితే బాగుండేది శ్రీ ఆరుద్ర పచ్చంగి పామనాయకుడు, రాఘవ పామ నాయకుడు ఒకరే అని భ్రాంతిపడి వుంటారు పచ్చంగి పామనాయకుడు కూడ 1696 వరకు జీవించలేదు అతని రాజ్యకాలం 1686-1687 అతడు ఔరంగజేబు నుండి మన్ సబ్‌లు స్వీకరించడానికి ఢిల్లీకి వెళ్లాడు దర్బారు మర్యాదల తర్వాత హఠాత్తుగా 27-12-1687న మరణించాడు[174] మరి 1696 వరకు జీవించిన పామనాయకు డెవరో !

---

172 ప్రొఫెసర్ సార్వకృష్ణమూర్తి అభిలాత్మకా పరిచయ పీఠిక, పుట 12

173 సమగ్రాంధ్ర సాహిత్యం సంపుట 12, పుట 47

174 ప్రొఫెసర్ జదునాథ సర్కార్ హిస్టరీ ఆఫ్ ఔరంగజేబ్, సంపుటం 4 పుట 897

## కిరీటి వేంకటాచార్యులు

ప్రకృతానుప్రసక్తంగా అణ్ణయాచార్యుల కుమారులైన కిరీటం వెంకటాచార్యులను గురించిన ఊహాపోహలను, అసంబద్ధపు ప్రచారలను సరిదిద్దవలసివుంది. కిరీటం వెంకటాచార్యులు ఇమ్మడి వెంకటప్ప నాయకుని లేక హిరియ (పెద్ద) వెంకటప్ప నాయకుని ఆస్థానంలో వున్నారు.

ఇమ్మడి వెంకటప్ప నాయకుడు భార్గవపురాణ కర్త రాఘవ పాండురాయకుని కుమారుడు. ఇతని రాజ్యకాలం 1778-1808. ఇతడూ మహావీరుడు మహాపరాక్రమవంతుడు. నిజాముతోను, రఘునాథరావు పీష్వాతోను, టిప్పు సుల్తానుతోను, ఆంగ్లేయులతోను యుద్ధాలు చేస్తూ, సంధులు చేసుకుంటూ, సహాయపడుతూ 28 సంవత్సరాలు పాలించాడు ఎంతో రాజనీతిజ్ఞతతో. అభినవ వేదాంత దేశిక బిరుదాంకితులైన, అణ్ణయాచార్యుల సోదరులైన శ్రీనివాసాచార్యులు తమ తత్త్వ సూర్తాంశంలో ఇతని ఆధ్యాత్మికోన్నతిని వర్ణించారు. ఇతడు దేశానికి చేసిన గొప్ప సేవ అప్పటి పిండారీల దండును అణచివేయడం. పిండారీల బాధ విపరీతం కాగా, ఇతడు తన రాజ్య పరిపాలన భారాన్ని దాదిమరి కృష్ణ నాయకునికి అప్పగించి, తన వీర నాయక బృందంతో పిండారీల వెంటబడి తన రాజ్యం సరిహద్దుల అవతల తరిమి నరికి తొప్పార అనే పట్టణంలోని పెద్ద చెరువులోకి విసిరి పడవేశాడు.

అణ్ణయాచార్యులకు ముగ్గురు కుమారులు, శ్రీ ఆయన సోదరులైన శ్రీనివాసాచార్యులకు సంతానం లేదు. కవి సప్తగిరి గారులూ ఈ విషయంలో పొరపడ్డారు.[175]

అణ్ణయాచార్యులు
- శ్రీనివాసాచార్యులు
- కిరీటం వెంకటాచార్యులు
- బుచ్చి వెంకటాచార్యులు

శ్రీనివాసాచార్యుల రచన లేమీ లభించడంలేదు. తక్కిన అన్నదమ్ములిద్దరి పేర్లు ఒకటే అయినందున చిన్నవారి పేరు బుచ్చి వెంకటాచార్య అన్నారు. విశిష్టాద్వైత కిరీటాన్ని ధరించినందున పెద్ద వెంకటాచార్యులకు కిరీటం వెంకటాచార్యులనే పేరువచ్చింది.[176] ఈయన 1 గణసూత్రార్థవాదః 2 శృంగార తరంగిణి 3 భావశతకమ్ 4 ఝంఝామారుతః (గదాధరీయఖండనమ్) 5 అలంకారకౌస్తుభమ్ 6 రసిక మానసోల్లాస భాణః 7 కూలిపతనమ్ 8 ఉషా పరిణయ నాటకమ్ 9 యతిరాజ దండకమ్ 10 హయగ్రీవదండకమ్ 11 అచలాత్మజా పరిణయము (తెలుగు) మొదలైన షణ్ణవతి (96) గ్రంథాలు రచించారు.

---

175 బయను వెంకటయ్య, కవిసప్తగిరి

176 పెరుమాళ్లగుండాచార్య నగరనార దర్పణ పుట 104

కిరీటం వెంకటాచార్యులు పంచభాషా విదులు, తెలుగు, కన్నడ, మహారాష్ట్రి, హిందీలలోను కవిత చెప్పగల దిట్ట ఈయనకు, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి కొంత మన స్పర్థ ఏర్పడింది ఈయన శిష్యులలో ఒకరిపై రాజా వెంకటప్ప నాయకునికి కోపం వచ్చింది అతడు గురువు వద్ద మొరపెట్టుకొన్నాడు "ఈ విషయమై పట్టుదలంతు పోవద్దు మనిద్దరికీ మంచిదికాదు" అని ఈయన తన శిష్యునికి సలహా యిచ్చారు కాని, శిష్యుడు విన లేదు విధిలేక వెంకటాచార్యులు రాజాతో ప్రస్తావించారు శిష్యుని సంగతి "మీరు గురువులు ఇలాంటి విషయాలలో జోక్యం చేసుకోరాదు" అని రాజా విన్నవించారు రాజా తన మాట విన నప్పుడు ఆ సురపురంలో వుండటం ఉచితం కాదని వెంకటాచార్యులు పూనా పట్టణానికి బయలు దేరారు వెళ్లుతూ ఒక శ్లోకం వ్రాసి రాజాకు పంపారు దాని భావమిది మదోన్మత్తమైన మతంగజం తన శుండాదండంతో భృంగాలను విసిరి కొట్టి వెల్లా చెదరుచేస్తే, వాటికి అడవులో పూవులు ఆశ్రయ మివ్వవా ?" అని అది వరకే వెంకటాచార్యులు పీష్వాల దర్బారులో పండితు లందరిని జయించి విశిష్టాద్వైత కిరీటం పొందటంవల్ల పూనాలో నానా ఫడ్నవీస్ వద్ద ఆయనకు పలుకుబడి చాల వుండేది పూనాలో స్థిరపడ్డారు వెంకటప్ప నాయకుడు కిరీటం వెంకటా చార్యులను మళ్లీ తన ఆస్థానానికి రప్పించడానికి ఎంతో ప్రయత్నం చేశాడు కాని, ఆయన రాలేదు పూనాలోనే 82 వ ఏట పరమపదించారు[177]

ఇచ్చి వెంకటాచార్యులు సీతా పరిణయ నాటకమ్, శృంగార సారస్వతమ్, వేదాంత కారికావళి మొదలైన గ్రంథాలు రచించారు వేదాంత కారికావళి సంస్కృతాంగ్ల వ్యాఖ్యానాలతో ప్రచురితమైంది

శ్రీ వద్దిపర్తి బచ్చారెడ్డి దాశరథిచరిత్ర పీఠికలో సురపురపాలకుడు మొండగ్రి (మొండిచేయి) వెంకటప్పనాయకుని ప్రస్తావించి గద్వాల చరిత్రలోని హనుమప్ప కథ మొండగ్రి వెంకటప్పకు అంటగట్టి వుంటారేమో నంటూ "కథయందలి తిగి తిగి చూచి, మాళవదేశములో జరిగిన సారంగధరుని కథను ఆంధ్రదేశమున అంటగట్టినట్లుగా హనుమప్ప కథలు కూడ రాదుమారై యుండునా!" అని సందేహం వెలిబుచ్చారు[178] కథలు యాదృచ్ఛికంగా సంభవడం అసహజంకాదు మాళవదేశంలో జరిగినట్లు భావించే సారంగధరకథవంటి కథ, నూటికి నూరుపాళ్లు పోలిక వున్నట్టిది, పంజాబులో పూరన్ భగత్ కథ వుంది దీనిని పిర్ అనే మాత్రా వృత్తంలో ఎవరో ప్రాచీన జానపద కవి వ్రాశాడు దీనిని పథకులు సారంగి సాహాయ్యంతో రాత్రిళ్లు మైదానాలలో పాడుతారు హిందూ ముస్లిం శిఖ్కులు అందరూ చెవులు

177 కపటరాళ కృష్ణరావు సురపుర సంస్థాన ఇతిహాస, పుట 282

178 దాశరథిచరిత్ర పీఠిక పుట 18

చేసుకొని దీనిని ఎంటారు. ఈ కథ సినిమాకూడ నేను 1999లో లాహోరులో చూడాము. హిర్ మత అక్కరవంటి వృత్తం. నేను ఈ కథ విని ఆశ్చర్యపడి, గురు వర్యులు వేటూరి ప్రభా కరులకు వ్రాశాను. దీని విషయమై యావద్భారత జానపద గాథగా పరిశీలించాలని వారు నాకు వ్రాశారు.

తను మొండెగై వెంకటప్ప నాయకుని మొండెంచేసు కథ కల్పనకాదు. అతడు తెగిపోయిన తన మొండెంతోనే వాలు పట్టుకొని యుద్ధంచేయడానికి వీలుగా ఒక ఇనుపముంజేతిని తయారు చేయించారు. దీనిని చేతికి తొడిగి భుజానికి కట్టుకొని వాలుపట్టుకొంటే, ఇనుపవేళ్లు ముడుచుకు పోయేవి. దానితో వాలుకు పట్టు వచ్చేది. దీనిని చేసినవారి చాతుర్యం మెచ్చుకోవాలి. ఈ ఇనుపముంజేతిని సురపుర రాజవంశీయులు నేటికీ మహానవమి ఆయుధపూజలో తక్కిన ఆయుధాలతోపాటు పెట్టి పూజిస్తారు[179]. కనుక ఇది కథకాదు, కల్పనకాదు, వాస్తవం.

సురపురం వారు మొదట శైవులే కాని, పచ్చంగి పామనాయకుడు వైష్ణవమతం పుచ్చుకున్నాడు. రాఘవ పామనాయకుని కాలంవరకు తాతాచార్య శ్రీవైష్ణవులే గురువులుగాను, పురోహితులుగాను ఉండేవారు. కాని రాఘవపామనాయకుడు ఒక్కపట్నానికి వెళ్లి అక్కడ ఉన్న మహావిద్వాంసులు, మహాతపస్వులు అయిన అళియాచార్య సోదరులను తన రాజ్యానికి పిలుచుకొని వచ్చిన పిదప తాతాచారుల ప్రాభవం తగ్గింది. కాని వారికి దర్బారులో మర్యాదేమీ తగ్గలేదు. సురపురము రాజులకు గురుత్వము వహించిన నంబెరుమాళ్లయ్య కుమారుడు లోకయ్య రాజులతో సంబంధమున్నట్లు కనిపించదు. సంస్కృతాంధ్ర కన్నడ ద్రావిడ భాషా సాహిత్యములలో విశిష్టస్థానము వహించిన లోకయ్యకు రాజాస్థానమున పీఠము లేకపోవుట విచారణీయము. పీతాంబరుని మన్మడు పామనాయకుడు తనకృతి భార్గవపురాణములో తన పూర్వులకు గురువులుగా నుండిన లోకయ్య నంబెరుమాళ్లయ్యలను స్మరించకపోవుట మరియు చిత్రముగా నున్నది. దీనికితోడు కేశవయ్యయు తన తండ్రి రాజాస్థానమున పొందిన గౌరవ ములగూర్చి ఏమియుచెప్పలేదు. ఈ కారణమువలన రాజులకు, వారి గురువులకు పరస్పర విశ్వాసములు సన్నగిలి యుండునేమో యను సందేహము కలుగును. కేశవయ్య వంశములోని తరాలను పరిశీలించ దాశరథి చరిత్రకర్తయు, భార్గవపురాణకర్తయు సమకాలికులై యుందురని తోచును " అని శ్రీ వల్లపురెడ్డి బుచ్చారెడ్డి వ్రాశారు[180]. ఒక్కపట్నం ఆచార్య సోదరుల రాకవల్ల కేశవయ్య మొదలయిన తాతాచారుల ప్రాభవం తగ్గడం నిజమేకాని, వారికి దర్బారులో

179 కపటరాళ కృష్ణారావు సురపుర సంస్థాన ఇతిహాస పుట 99

180 దాశరథి చరిత్ర పీఠిక, పుట 16

గౌరవమర్యాదలేమీ తగ్గలేదు అక్కపట్నం వారికి, కేశవయ్యగారికి సమానమైన గౌరవ స్థానాలు ఉండేవని ఇప్పటి స్థానిక ఆచారాలమంట్టి తెలుస్తున్నది [181] భార్గవ పురాణకర్త కేశవయ్య పూర్వులనేకాదు, తాను సగౌరవంగా పిలుచుకొనివచ్చిన అప్పయాచార్య సోదరులను కూడ తన కృతిలో స్మరించలేదు ఈ విషయంలో కృష్ణరాయలను అనుసరించాడు ఇక కేశవయ్య ౮౫ సంవత్సరాలు జీవించాడు కనుక ఇమ్మడిపాము నాయకునికి, ముమ్మడి పెద్ద నాయకునికి, మొండగ్రై వెంకటప్ప నాయకునికి ముమ్మడి రాఘవపాము నాయకునికి, ఇమ్మడి వెంకటప్ప నాయకునికి, ఆరుగురు రాజులకు సమకాలికుడు పైన పేర్కొన్న మొదటి ముగ్గురి కాలంలో బాలుడుకాని, తర్వాతి ముగ్గురికాలానికి యువకుడు, వృద్ధుడు

## భార్గవపురాణము

రాఘవపాము నాయకుడు స్వతః మహావిద్వాంసుడు, సంస్కృతాంధ్ర కన్నడ భాషలలో కవి, అప్పయాచార్యులవంటి విద్వద్వరేణ్యుల సత్సంగంలో వున్నవాడు కనుక భార్గవ పురాణాన్ని ప్రబంధ పద్ధతిలో ప్రౌఢంగా విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ఎనిమిది ఆశ్వాసాలుగ అంగీకరించాడు ఆశ్వాసం కథలను — ఏ కథలాకథను — చిన్న కావ్యాలుగా తీర్చాడు మూల సంస్కృత భార్గవ పురాణం అధ్యాయానుకూల మెక్కడికక్కడే పేర్కొన్నాడు "అని నయిందు నారాయణవలన మహాయోగిమాహాత్మ్యమును, సంవాద రూపంబును, శ్రీమంతం బనునగు భార్గవపురాణోత్తరఖండంబునందలి ప్రథమాధ్యాయం కాలించి —ఇత్యాదిగా [182]

ఉభయవేదాంత సంప్రదాయజ్ఞుడైన పాము నాయకుడు ప్రబంధప్రథమాశ్వాసప్రారంభంలో ఇష్టదేవతాస్తుతి సంప్రదాయాన్ని కృష్ణరాయలలాగ కొత్త పద్ధతిలో చేశారు భగవత్తత్త్వం పైనుంచి కిందికి దిగివచ్చి లీలావిభూతి అయింది ఆ పరతత్త్వ లీలావిభూతి అయిన నాగినగిరి సురపురవేణుగోపాలుని కవి మొదటి రెండు పద్యాలతో వర్ణించాడు ఆ పరతత్త్వం మరికొంత కిందికి దిగి అనంతుడయింది అనంతుడు — ఆదిశేషుడు ప్రథమశిష్యుడు పిదప తార్క్ష్యుని, అనంతరం విష్వక్సేనుని పంచాయుధాలను - శంఖ నందక కౌమోదకీ శార్ఙ్గ సుదర్శనములను ముక్తులైన పన్నిద్దరు సూరులను వర్ణించారు "అని ఇవ్విధంబుగా సార్థంబగు దివ్య దేవతా ప్రార్థనంబు" కావించాడు కవి [183] సార్థమంటే అనూహ్యర్థ శేషభూతులైన అనంత గరుడ విష్వక్సేనాదులను క్రమంగా వర్ణించడం ఇది సృష్టిక్రమం

181 తిరుమల సుచరిత, ఎం ఎ, ఎంఫిల్ నగరనాధదర్శన, పుట 287
182 భార్గవపురాణం ప్రథమాశ్వాసం 61వ పద్య తర్వాత వచనం
183 భార్గవపురాణం ఆ 1, పద్య 12

కవి ఇలా ఇష్టదేవతాప్రార్థనచేసి పడుకోగా, కలలో వేణుగోపాలుడు కనిపించాడు “తన్నిర్మల్యైవర్తి మద్వృత్తం చరితంబు నాంధ్రభాషాప్రబంధముగజేసి మా కిష్టముగ సమర్పణము” గావింపుమని కోరాడు ఈ కోర్కెకు ముందు

“అస్మత్ప్రియాభావహానఙ్గ శ్రీవిష్ణు
రాయంబు తెనుగున రసికులన్న
గృతి రచియింపించి తరతృప్తి మారంత
రంబు జేయించిన ధన్యమతివి”[184]

అని హేమరూపాలని ప్రశంసించాడు ఈ విష్ణుపురాణం ఎవరు రచించారో పరిశోధించాలి

ఆశ్వాసాంతంలో హేమనాయకుడు “ఇతి శ్రీమద్రాజగోపాలకృష్ణ కరుణాకటాక్ష వీక్షణా లబ్ధ సాంరాజ్యధురంధర నవరత్న పనిమంచలాలంకృత సామ్రాజ్యధురీణ నృసమర్థనాకృతపటహ ధణంధణారావ విపరీత పతన్నికరయా ఢిల్లీశ్వరుదుందుభిధ్వాన కోలాహల, హనుమద్ధ్వజాంకిత నవరదండికైత హారకంకణకృత నందిపత్రప్రతాపకీర్తిప్రాభవ గోసంవంశ పయఃపారావార రాకా సుధాకర పీతాంబరనాయక పౌత్ర రఘునాధరూపాం పుత్ర లక్ష్మమాంబా గర్భశుక్తి ముక్తాఫల రాఘవనాయకాభిధాన సౌందర్యమిత సుమహాయక ఇమ్మడి హేమనాయక ప్రణీతంబైన” అని చెప్పుకొన్నాడు బిరుదులు తరాత్రివాడు ధరించడం ఆచారంగనుక రాఘవ హేమనాయకుడు తన ముత్తాత అయిన పచ్చంగి హేమనాయకుని బిరుదులు ధరించాడనవచ్చు దీనిని గ్గోర్ వి రాఘవన్ మున్నగు పెద్దలు తెలిపారు

రాఘవహేమనాయకుని కుమారుడు ఇమ్మడి వెంకటప్పనాయకుడు పాతవాటితో పాటు కొన్ని బిరుదులు ధరించాడు “మహారాజాధిరాజ, రాజకంఠీరవ, రాజాధి శిరోమణి, ‘సం హోదరయ శరణార్థ్రమణిత శంకోప వేణు పంజ (?) గిరాతిత, శ్రీమంత వెంకప్పనాయక బహారి బలవంత బహద్దుర బిరుదాంకిత, ఢిల్లీశ్వర దుమదుమధ్వని డాహాల, గనుమద్వజ సువర్ణ పంచకలశ, ఏకదంత, రామరాజ, సువర్ణకుంభ, రణరంగ, మూత గరుడ్వాలా, బిరుద్మాలిక, సరసర్ రేగాయి మాహురే మకరతలార, మావశీహ ఇనాయత్ గుల్బర్గా), దారుల్మాలిక్ బిజాపుర, కిల్లెవాగినగేరి సంస్థాన సురపుర[185] కొన్ని పొందాడు

184 అందే ఆ 1, ప 16

185 కపటారి కృష్ణారావు సురపుర సంస్థాన ఇతిహాస, పుట 188

## అంకితం

పర్వంగిపామునాయకుని ఆహ్వానంపై వేణుగోపాలస్వామి కోవెలలో అధ్యయనాధ్యాపనా లకు, పురాణ ప్రవచనానికి దక్షిణాదినుండి సురపురం చేరిన శ్రీ వైష్ణవ బ్రాహ్మణ కుటుంబా లలో వాధూల గోత్రజులయిన నా మామగారు శ్రీమాన్ పెరుమాళ్ళ వెంకటాచార్యులవారి పూర్వుల కుటుంబం ఒకటి. శ్రీమాన్ వేంకటాచార్యులవారికి రామాయణ భాగవత మహితంతో విష్ణుపురాణాలు వాచోవిధేయాలు. విశిష్టాద్వైత వేదాంతంలోను వారు ఉద్దండులు. ఆరేడు దశాబ్దాల క్రితం వనపర్తి సంస్థానం దివాను శ్రీ వెంకోబనాయకుడు కృష్ణాతీరంలోని యాపర్లలో భారతదేశం నాలుగుచెరగులనుండివచ్చిన పండిత ప్రకాండులతో నిర్వహించిన భాగవత సప్తాహ మహోత్సవంలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు మధుర గంభీర కంఠంతో శ్రీమద్రామాయణం పారాయణం చేసి, శ్రీమద్భాగవతాన్ని ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సంప్రదాయానుసారంగా ప్రవచించి సన్మానితులయ్యారు. ఆ మహోత్సవంలోనే మంత్రాలయ కవి, జ్ఞానసరస్వతి, శ్రీమాన్ తిరుమల బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులవారు నిర్వహించిన వేదాంత విద్యా సంస్కృత పరీక్షలో శ్రీమాన్ వేంకటాచార్యులవారు ఉత్తమశ్రేణిలో ఉత్తీర్ణులై "వేదాంత కేసరి" అనే సన్మానపత్రం పొందారు. పిదప వారు 1886 లో అమరచింతాత్మకూరు సంస్థా నంలో శ్రీమాన్ తోకేమరి కృష్ణమాచార్యులు జరిపిన భాగవతసప్తాహమహోత్సవంలో సన్మానితు లయారు. ఆ మహోత్సవం నిర్వహించిన విద్వద్వరేణ్యులు శ్రీమాన్ పుసులూరి శేషాచార్యులవారు శ్రీమాన్ వేంకటాచార్యులవారికి బహూకరించిన శ్రీమద్భాగవత సంపుటిలో ఈ శ్లోకం వ్రాశారు

అపార సంసార విచ్ఛిన్న భావాన్
కృష్ణామృతాబ్ధౌ వవగాహ్య కృష్ణః,
అదా దిదం భాగవతం కదర్థ
విదే ముదే వేంకటసూరయే హరిః।

శ్రీ వేంకటాచార్యులవారికి భాగవతం వేంకటాచార్యులనే ప్రథ ఉండేది. వారి దివ్యస్మృతికి ఈ పీఠికను అంకితం చేసి ఋణ విముక్తుడిని అవుతున్నాను.

## మంగళాశాసనం

ఈ పీఠిక రచనలో సురపురం పుట్టినిల్లయిన నా అర్ధాంగి శ్రీమతి అనంతలక్ష్మి సుర పురాన్ని గురించిన ఎన్నో సందేహాలు తీర్చింది. ఆమె సురపురపు చక్కటి పురాణాల పట్ల ఆమెకు నా మంగళాశాసన పూర్వకమైన కృతజ్ఞత

## కృతజ్ఞతలు

మిత్రులు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత గ్రంథాలయ పరిశోధనాలయ సంచాలకులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు కవి పండిత పరిశోధకులు ఈ రామకవి పాండిత్యవైభవాన్ని, కవితాకమనీయతను, నిర్మాణమార్మికతను గురించి వివరించారు గనుక నేను చెప్పడం ఆమ్రేడితమవుతుందని మానుకున్నాను

ఈ ప్రబంధ పరిష్కరణంలో నావల్ల గలిగిన విలంబాన్ని సహించి నాతో ఈ ఉత్తమ సాహిత్యసేవ చేయించిన మిత్రులు డాక్టర్ దాసరి వేంకట లక్ష్మీనరసింహారావు సహృదయతకు కృతజ్ఞుడను

ఏ బి రెడ్డి ఆర్ట్ మ్యూజియం, భాషాసేవకుడు

హైదరాబాద్-౪౪ **తిరుమల రామచంద్ర**

# భార్గవ పురాణము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీ లక్ష్మీరమణున్ వివాహమునఁ దా గ్రేగంట వీక్షింప నే
త్రాలోలాంబురుహద్వయం బాగిని ముద్రాముద్రితంబౌట హ
ర్షాలక్ష్యంబగు నందు దై వరదిశాయం బెంత భాసిల్ల ని
గ్గోలాలస్మితిఁ బ్రోచుతన్ సురపురీగోపాలకృష్ణుం డిలన్ 1

మ. పరమాంగస్థితిఁ గల్గి వాగినగిరి[1] ప్రాశస్త్యిఁ గావించి సు
స్థిర భక్తవ్రజ పాలకత్వమున నిశ్శ్రేయాఽధిక ప్రాప్తియై
యరుదారన్ విభవాప్తి ని సురపురాధ్యక్షస్థితిం దొల్పు న
ద్గురుఁ [2]దా నందుఁడు బ్రోచు మమ్ము పదు శ్రీగోపాలకృష్ణుం డగున్ 2

చ. అనయము నే మహామహుఁ డనంత పరస్థితి పూర్ణతాప్తియై
తన నఖిలావనీభృతిని తల్పమహోన్నతి యౌచు శ్రీ భ
వన సమరాగరం బొరయు వాసవముఖ్యసురాళ్ళ నయ్యహం
తుని వినుతింతు సంతసముతో నతిదాంతు జగన్నిశాంతునిన్ 3

చ. నెరయ సహస్రఫేదకత దిష్టవైభవ శౌర్యరేఖయుం
బొరయఁ బవిత్రతాత్తిఁ గొని పూరితగోత్రత శక్తి వైభవం
బరపద సంపదం గలుగు భాసురశీలుని నాగవైరి శ్రీ
ధరతురగున్ బతంగపతు దార్ఢ్య మహోన్నతిఁ బ్రస్తుతించెదన్ 4

---

1 మూ — దర, వాగినగిరి సురపురాధీశ్వరుం డొంరాబదాని సురపురము నకు
బదాఱుమైళ్ళదూరమున నున్నది

2 మూ- దా నం

ఉ. పరమ వివేకశీలుఁడవు బ్రాహ్మణ పోషణ తత్పరుండవై
యరయుట నేను బ్రాహ్మణ ముఖాదవగాప్తి దనర్చు టెన్నికన్
వరమతిఁ గోర నిచ్చటికి వచ్చినవాఁడను నాకు సూక్తి ధ
న్యరచనఁ జేతు నీ కిపుడు దాంక పామధరాధిపాంతా. 14

సీ. అస్మత్ప్రితామహు డనఘ శ్రీవిష్ణు పు
రాణముఁ దెమఁగున రసికు లెన్నఁ
గృతి రచియింపించి కతభక్తి మాకంతి
కంబుఁ జేయించిన ధన్యమతివి
యరయఁ బిన్నిక్కరైనట్టి మద్భృత్తుం
చరితంబు నాంధ్ర భాషా ప్రబంధ
మునఁ జేసి మా కిష్టముగ సమర్పణము గా
వించినఁ గోఁ బృథివీస్థలమున
తే.గీ. సకల పుణ్యతరావాప్తి సంభవించు
నీ కనుచు సురపుర వాసుఁడై కరంగు
దేవుఁ డా కృష్ణమూర్తి యత్పూర్వుఁ డయ్యె
మెఱకొని మానసోత్సాహలలం దనర 15

వ. ఉదయంబైన సాకల్యంబుగు ఖ్యాతకరతయవిధి నొసర్చి దండనాథ సామంత ప్రభృతి వర్గంబుతోఁ గూడ నాస్థానంగంబుగాఁ గొల్చుండి చతుస్తంత్ర పార ధురీణ ప్రసంగులగు విద్వాంసుల రావించి వారలకై తత్స్వప్న ప్రభావం బెఱింగించిన సంతోష భరితులై యిట్లనిరి 16

ఉ. విరతవం ధర్మశీలుఁడవు నీరజనాభ కటాక్షవీక్షణా
కరుఁడవు వైష్ణవాగమ వికాసిత ధీనిధి వౌట వీకు శ్రీ
హరి కలలోన వచ్చి సదయన్ వచియించిన రీతివల్ల ని
ర్భర భూమివృద్ధి వితతస్థితిఁ గాఁగం దింత నెల్లడన్ 17

1 మూ—ప్రభృతి

క. దుస్తర పుణ్యోదార
ప్రస్తర బంధాయి[1]తాని భవ్యకరునకున్
శ్రీ స్తన కుంకుమ సంయుత
కౌస్తుభ వక్షునకు సర్గకర పితునకున్ 23

క. సుర దారార్పిత పదము
కరహ యుగళ కవిలోక కల్పకునకు సు
స్థిర వాగీనగిరి సురపురి
చిరవాస పరిఘనకును శ్రీకృష్ణునకున్ 24

వ. [2]నిరంతరాభ్యుదయ కల్యాణ పరంపరా వాప్తిగా నా యొనర్పంబోయిన విష్ణు
భక్తి ప్రధాన మార్గంబగు భార్గవ పురాణంబునకుఁ గథా ప్రారంభం బెట్టి
దనిన 25

## కథా ప్రారంభము

ఉ. ఘనతర ధర్మతత్పరులు కంజదళాక్ష కటాక్ష వీక్ష వ
త్రనులగు శౌనకాదులు తదద్భుతసంగతు సూతుఁ గాంచి వె
మ్మనమున సంతసించి యుపమారహితాత్మక భక్తి[3] నెంచి య
ర్జని మహత్త్వము సముదంచిత వాగమృత ప్రశస్తిగాన్ 26

తే.గీ. సూత! [4]ధర్మార్థ తత్త్వజ్ఞ సూత! శాస్త్ర
వేత్ర తత్త్వార్థ విద్యాత్ప్రవీణ సూత
మౌని ద్వైపాయన ప్రియ మౌనిగేయ
యనుచు సంవాదమును జేసి యంపు కృతిని 27

---

1 మూ—తాని

2 మూ॰ అని నిరం 3 మూ—వెంచి 4 మూ॰ ధర్మాత్మ తత్త్వజ్ఞ

తే గీ స్మరణమువలన మోక్షం బొసంగుచుండు
నతిశయంబు మహాపుణ్య మతులితంబు
నమరునెప్పుడు [1]ఔదార్యాఢ్య [2]మనఘ సుకృత
రత్నమై సంతతంబు శుభంబు దనర ౩౨

వ విచిత్ర ప్రసూన సంయుతంబును నందన బృంద ప్రకాశితంబును నుత్ఫుల్ల
కాంచన కమలకాసార విరాజితంబును నగుచు భవ్యంబగు నద్రిశ్రేష్ఠంబు
నందలి చంద్రకాంతశిలాతలంబునందు సమాసీనులై భువనపావన
రక్షణంబునకై యవతరించిన మహామునులును జగదధీశ్వరులును నగు నర
నారాయణులు విరివిగ నానాప్రకారంబులగు సకలశాస్త్రప్రసంగంబు లుగ్గడిం
చుచు వసియించుచున్న కాలంబునందు నరుండు మహానుభావుం డగునట్టి
నారాయణ మునీశ్వరుంగూర్చి పరమహర్షయుక్తుం డగుచు వినయంబుగా
ననయమూర్తి నిట్లనియె ౩౩

క మునినాయక నారాయణ
యనయము మా కీవ శరణమౌట నడిగెదన్
ఘనమోక్షసిద్ధికొఱకై
యనుపమ మతినై రహస్య మధికము గాఁగన్ ౩౪

క క్షమ నీ మాయాప్రాప
ర్తిమునందుఁ బ్రాణికోట్లు దగులుదురో [3]గో
ద్యముగాఁ బ్రతిక్రియ గలుగ
దమరఁగ వారింకు ముక్తి సులభమ్మెగాన్ ౩౫

---

1 మూ ధార్యాఢ్య 2 మూ మనఘ
2 మూ—క్రోద్యమగా

తే.గీ. అనఘ భవవార్ధిమగ్నులైనట్టి యా స
[1]మస్త జీవ ప్రతతులు కల్యాదరమున
సులభమగు మోక్షమార్గంబు గలుగునేని
దానిఁ దెలుపుము దయచేసి ధన్యమతిని 86

క. గురుమతియై పల్కిన యా
నరువచనముఁ బ్రియముఁజేసి నవ్యయశస్కుం
డురుమతి హరి విని పలికెన్
నరుఁగూర్చి కదియవచ్చి వందితుఁ డగుచున్ 7

మ. మును సర్వేశ్వరి లోకమాతయగు సంతోషాంబయాదేవి నె
మ్మున వైకుంఠపురంబునందు హరి సంతోషాత్ముఁ గూర్చి ది
విని ప్రశ్నంబుగఁ బల్కినట్టి కథ నే నీకూహగావించి సూ
క్తిని వెంపొందఁగఁ జేతువంచుఁ గరుణా దివ్యప్రభావాఢ్యుఁడై

ఆ. ఆ త్రిపాద్విభూతి యైన వైకుంఠంబు
విరజ కవలి దరిగ [2]వెలయ నెట్టి
పురి యయోధ్యగాఁగఁ బొల్చు నిత్యం బది
యంత నమృతమునని యావరించి 89

తే.గీ. కలఁద మణిసౌ[3]ధయ నిస్తంద్రములగు
రత్నమయ మందిరములు [4]హార్మ్యప్రసాద

1 యతిభంగము 2 వెలయ 3 మూ - శేయ
4 ప్రాసాదమునకు ప్రసాద ప్రయోగము

ములు విమానమ్ములను శుభములగు తోర
ణములు గోపురములు గల్గి యమరుచుండు

వ సకలకార్యకారణ కారణంబును నావరణసప్తకంబును దశగుణోత్తరంబును
చతుర్దశభువనాత్మకంబును నగు నండంబు గడచి పరమంబగు వ్యోమ
శబ్దంబునం జేసి యభిధేయం బగుట బ్రహ్మాదుల కగోచరం బై
శ్రీమంతంబగు దివ్యలోకం బగుట సనకసనందన శతానంద శివాదులకే[1]
నై నీ ధ్యానంబు సేయుట యవశ్యం బగుట నచిత్ర్యస్వరూపైశ్వర్య నిత్యా
నంత సిద్ధులను భగవత్పరిచర్యానుకరణ యోగ్యులను భగవదను
కూల్యైక భోగులును మహాత్ములు నగు దివ్యపురుషులచేత నత్యంతపూరి[2]
తంబగుట తత్స్వాధికుం డైన యార్యగస్వభావంబును నింతపరిమాణంబును
నింతయైశ్వర్యంబును నని పరిచ్ఛేదంబు సేయుటకశక్యంబుగాన దివ్యా
వరణ శతసహస్రావృతంబును దివ్యకల్పతరూపశోభితంబును దివ్యోద్యాన
శతసహస్రకోటి సమావృతంబును నతిప్రమాణంబును నగుచు దివ్య
తరం బగు నొక్క తలంబున విచిత్ర దివ్యరత్నమయంబగు దివ్యాస్థాన
మంటపంబు గలిగి దివ్యరత్న స్తంభ శత సహస్ర కోటి శోభితం బై
నానాదివ్య రత్న కృత స్థల విచిత్రంబయ్యు దివ్యాలంకారాలంకృతంబౌట
పతితంబులును పరమానంబులును నగు పాదపస్థ వివిధ గంధ వర్ణంబు
లంగల్గు దివ్యపుష్పశోభమానంబయిన దివ్య పుష్పోపవనశోభిత సంకీర్ణ
పారిజాతాది కల్పద్రుమోపశోభితంబులయ్యు దివ్యంబులగు గొన్ని
యంతస్థ పుష్ప రత్నాది నిర్మితంబులగు దివ్యలీలా మంటపశత సహస్ర
కోటులం జేసి శోభితంబులుగా నిరంతరానుభూయమానంబులై యపూర్వ
పదార్థంబు నావహించిన క్రీడాశైల శత సహస్రంబులచేత నలంకృ[3]
తంబులయ్యు నారాయణ దివ్య లీలాంతర్భూ నారాయణ దివ్యలీలా సాధార
ణంబులుగల్గి కొన్ని [4]పద్మవనాలయా దివ్యలీలా సాధారణంబులయ్యు
గొన్ని శుకశారికా మయూర కోకిలాదులచే నైన కోమలంబులగు కూజితం

1 గ్రంథపాతమున్నట్లు తోచుచున్నది

2 మా—పూరిత 3 మా—నస్వత్వ 4 మ—పద్మ

యంబేత నాలుగింటంగు దివ్యోద్యాన శత[1]సహస్రంబులచేత నావృతంబై మణిముక్తాప్రవాళకృత సోపానంబులను దివ్యామృతామృత రసోదకంబులను గల్గి దివ్యాండజ తరంబు(?)చేత నతిరమణీయ దర్శనంబులై న యతిమనోహర మధుర స్వనంబులచేత వ్యాప్తంబులైన యంతస్థ ముక్తామయ దివ్యక్రీడాస్థాన శత[2]సహస్రకోటి శోభిత దివ్య సౌగంధిక దివ్యారామహంసావళీ విరాజితంబులగు వాపికా సహస్రంబులచేత సమావృతంబయ్యు నిరస్తాతిశయానందైక రసత్వంబునందేసి యనంతంబులగు నదులు గల్గి ప్రకృష్టక్రీడోద్యోగ విభ్రాజమానంబై [3]యందందు నిర్మింపబడిన దివ్య పుష్పపర్యంకంబులచేత శోభితంబయ్యు వివిధ కుసుమ మరందాస్వాద మత్త మధుకర నిరంతరోద్గీయమాన దివ్యగాంధర్వ పూరితంబయ్యు చందనాగరు కర్పూర దివ్య పుష్ప రసావగాహిత మందానిలసేవ్యమానంబగు వైకుంఠపురంబునందు కోటిసూర్య సమప్రభంబగు కనక పుర వరంబు ప్రాకారంబు దన్మధ్యంబునందు మాణిక్య స్తంభ శోభితంబగు దివ్యమంటపంబు సమృద్ధి ప్రాపగుట నందు

తే.గీ. బాలసూర్య సుకాశమై పరగి కరము
వందు సింహాసనమున సహస్రదళ వి
శోభితంబయి భాస్వద్వి శోభ నమరి
కమల మొప్పారు నిత్యం కాంతి గల్గి 42

క. ఆ పద్మ కర్ణికయం దధివసియించు
సర్వేశ్వరుండు జనార్దనుండు

---

1 మూ-సహస్త్ర
2 మూ-సహస్త్ర 3 మూ-యెందెంద

ప్రభువు విశ్వమునకుఁ బతి దేవదేవుండు
నారాయణుఁడు శ్రీ నాయకుండు
శ్రీ భూమి నీళావిశిష్టుండు దేవాధి
పతి యనంతుండు తత్ప్రంతకాల
[1]సాహస్రదళ సమానకాలమలాద్య స
హస్ర దామర విరాజిత మూర్తి

ఆ వె భూర్యసంఖ్య నిత్య ముక్త శేషాది సం
సేవితుండు భూత భావనుండు
సంతతంబు నిట్లు సంస్థితుండై దివ్య
భోగ విభవ మహిమఁ బొల్చు చుండు 43

క విమలాద్యనేక చామర
సముదయ పరి[2]వీజితుండు సౌఖ్యపరుం డు
ద్యమముఁ దగుట [3]వనధి సుత యొక
సమయంబున విష్ణు గారి జగదధిపాలన్ 44

వ పిమ్మట సమ్మహాత్ముండు రటియ నేత్రారవిందమ్ములకుఁ బొనరు పుణ్యా-
నంద సంధాయకుండగుచుఁ బ్రత్యగ్రోన్మీలిత పుండరీక సదృశ నయ
నుండును విమల పీతాంబరుదంతాంగుండును నత్యుజ్జ్వల పీత వసనుండును
నచింత్యంబును దివ్యంబును నద్భుతంబును నిత్యంబును నగుయౌవన
స్వభావ లావణ్య స్వరూపామృత సాగరంబు గల్గు [4]మహాత్ముండును
నత్యంత [5]సుకుమారేవత్ర స్విన్న వదాంశ్యపాల [6]నిటాల ఎంత దివ్యా

---

1 మూ — సాహస్ర 2 మూ — వీచితుండు 3 మూ — వనిధి
4 మూ — మహాత్ముండు 5 మూ — సుకుమారతేవ
6 మూ — నిషాం

లతావళీ విభ్రాజితుండును నతివికచమాన దాయతర సారసాక్షుండను [1]సవిభ్రమ భ్రూలతా సంయుతుండును ప్రవాళాధరుండను పరిశుద్ధ స్మేరాననుండును మృదుల కపోలఫలకుండును సున్నాసికుండను సుదగ్ర [2]పీనాంస విలంబమాన [3]మకరకుండలాలతావళీ విస్ఫురిత దర కంధరుండును ప్రియావతంసేందీవర శ్రోత్రభూషణ [4]స్నిగ్ధాలకాబంధ విమర్ద ప్రశంసాలాను విలంబి చతుర్బాహు విరాజితుండును నతిమృదుల చపలరేఖాలంకృతాకార కరతల దివ్యాంగుళీయక భాసమానుండును నత్యంతకోమల దివ్య నఖ పంక్తికా విభ్రాజితాసురత్రాంగుళ్యలంకృతుండును దళ్వాల సమున్మీలిత కమల సన్నిభ పదయుగళుండును పదకలర కోటీర కోటి చూడావతంస గ్రైవేయ [5]క హార కేయూర కటక శ్రీవత్సకౌస్తుభ మౌక్తికదామోదరబంధన చామీకరాంబర [6]మేఖలా గుణ మంజుతర మంజీర రంజిత సువర్ణ దివ్యగంధ భూషా భూషితుండును శ్రీమద్వైజయంతీ వనమాలా విలసితుండును శంఖచక్ర గదా నందక శార్ఙ్గాది దివ్యాయుధ సేవ్యమానుండును నిజాజ్ఞామాత్రాన క్లప్త భువన భవన సంస్థితి సంహారక శ్రీమంతుండగు విష్వక్సేను[7]నందును సమస్తైశ్వర్యంబు తెల్పిన స్వభావంబు వలన నిరస్త సమస్త సాంసారిక స్వభావులు భగవత్పరిచర్యైకభోగులును నిత్యసిద్ధులును నగు సనంద వైనతేయాదులచేత యథాశక్తి యోగింపంజేసి యట్టి సంపాత వరాది కాలంబుల దివ్యములౌ కోమలాలోకనంబు చేసి విశ్వంబును నాప్యాయనంబు సేయుచున్న మహానుభావుండును కించిదున్మీలిత వదనాంబురుహ వినిర్గతంబును నిస్సంగాంభీర్యోదార్య సౌకుమార్య సౌందర్యాద్యనవధిక గుణ గణాలంకృతంబును నతిరమ్య దివ్యభావ గర్భంబును నగు[8]దివ్యలీలాలాపామృతంబున నఖిల జీవ హృదయంబులు పూర్ణంబులు గావించుచున్న

---

1 మూ - నలేదు
2 మూ — పేవాంస
3 మూ - నక్రకుండల
4 మూ — ప్రశా
5 మూ — కాహరి
6 మూ — మేఖలి
7 మూ — నందను
8 మూ దివ్యలీలా

ఉ పరివృత సీలనీరద విభాసిత కైశ్యము లల్ల నిల్ల వి
స్ఫురిత శిరోగృహాగ్ర పరిశోభిత కుంభ పయోజ లోచనో
త్కరముగ స్వర్ణకేతన విలాసము వట్టిన దామరాశియై
యరయ పురీ గృహేందిర లనంతపదస్థితి మించె నెంచఁగాన్ 67

వ కాంచన ప్రాకార సంయుతంబును సకలసంపదానిక్షేపంబును సమంత
తన్నమావృత ప్రకాశ్యమాన మేరుసంకాశ ప్రాసాద నికరంబును నగు
పురంబునందలి [1]హా స్తిగిరిశిఖరంబు మీఁదిభాగంబునందుఁ గనక కమల
సంకీర్ణ మత్తమధుకర నికర [2]ఝుంకరితాలంకరణంబును విమలజల
[3]చలత్ప్రవమాన తత్తీర సంచరిత సకల జంతు సంతాప దురంత నందీ
పిత తాపత్రయ నివారకంబును నగు పుష్కరిణీతీరంబునందు
బాలార్క ప్రభాభాసమానంబగు హేమనలినంబు వందుఁ బ్రవేశించి
యరవిందవదన పదారవింద మరంద నిషేవణంబునలన సద్యః ప్రవర్త
మాన నిఖిలావయవుండును భగవత్ప్రియుండును మహత్తర పాంచ
జన్యాంశుండును నగు మహాను భావుండు శుభంబగు ద్వాపరాంతంబు నందలి
ప్రవర్తమాన త్రియుగాఖ్యయబు మాసంబునందు సతిదేవి ముహూర్తంబుగా
సముద్భవింప దివ్యులు [4]దేవ దుందుభులు మొరయింపుచు మహనీయం
బగు పుష్పవర్షంబు గురియించి రమ్ము హూర్తంబున ప్రాదుర్భవించు నమ
యంబునందు యప్సరస్సంఘాతంబు నటియించె నంతదేవుండును సర్వేశ్వ
రుండును పరదుండును సలిలరూపకారియు పుండరీకవిశాలనయ
నుండును శంఖచక్రగదా ధరుండును దివ్యమాల్య సంశోభిత ముఖ
కమలుండును కోటిసూర్య సమప్రభాభాసమానుండును దివ్యపీతాంబ
రధరుండును వనమాలా విభూషితుండును హారకేయూర కోటీర కటక కుండల
శోభితుండును మహనీయకాంచీదామ నూపుర ప్రకాశితుండును గరు

---

1 మూ - హస్త 2 ము - ఝుంకార

3 మూ చలోత్ప్రవ 4 మూల - దేవ

దాధిరాజుండును శ్రీమద్రమావతీ సహితుండును జగద్విభుండును ధవళ
చామర పరిత ధవళాతపత్ర పరిశోభితుండునునగు నచ్యుతుండు దయార్ద్ర
హృదయుండయి పారంబగు నర స్థిరంబున తరుగుదెంచె 68

క. అరయఁగ నట్టియెడఁ గాని
కర మాహాత్మ్యము జేసి శ్రీహరి నిగమా
దర నీ నిర్మ్యాసంబులఁ
బరికింపఁగ వరది వేదపారగుఁ జేసెన్ 69

తే.గీ. అపు నరోయోగి యని యవ్యయంబు జేసి
ప్రభువు లోకాధినాథుండు బాహువులను
స్పర్శ గావించి తన ప్రియభామ కానఁగ
సంతసంబున నట్టుల సత్కృతిని 70

క. స్థిరమతి వాత్సల్యంబున
గర మా సిరి స్రావితంబుగాఁ దగు చనుఁబా
లరుదార నానఁగ యాతని
వరసి సుతుని పగిదిఁ బ్రోచె నతిమోదముగాన్ 71

వ. అతఁడు ప్రవర్ధమానుఁడయి యంచితభక్తి వినాత్మనెంచి సం
తతముగ వారి పాదసరసీరుహంబులను దండప్రణామ
ము తనుఁడునై యధోక్షజుని మాధవు లోకవిభున్ మహాత్ము సం
స్తుతి రచియించె వెల్పరిశోభిత సర్వ హృదా భక్తి వైభవిన్ 72

సీ. అతఁడు సంస్తుతిఁ జేయ నపుడు సంప్రీతుఁడై
దేవతేశ్వరుఁడు సుధీమతుండు
వరదుండు నిర్మలస్వాంతుండు యోగమ్ము
తత్ప్రదంబు సకలంబు సుప్రభావ
మతిగమ్య మతిశయంబుగ ధ్యానయోగంబు
మునివర్యుఁ గాసార భూతయోగిఁ
గూరిచి కరుణఁగై కొని యుపదేశింపఁ
దన్మహామహుఁడు తత్పాద నళిన

తే.గీ. ములకుఁ బ్రణమిల్లి సంతోషమున వినీత
వంతుఁడయ్యెఁ బ్రసన్న తద్వదన నీర
సంభవ న్యాసముం గాంచి సహృదయాప్తి
హర్షితుఁడు గాఁ దనర్చె యత్యంత మతిని 73

క. మునిపతి కృతకృత్యునిఁగాఁ
దనుఁ దెలియుచుఁ బరుని దేవుఁ దామరస దళా
క్షునిఁ గూర్చి కృతాంజలియై
యనియెన్ న్యాసార్థ కాంక్షతా[1]యాతుండై 74

తే.గీ. అనఘ నీవు వచించిన ధ్యానయోగ
మరయ గుహ్యంబుఁ దాత్పర్య మనుట యెట్టి
దానినంతయు నతివిస్తృతముగ మాకు
నాధిగాఁ బల్కు వలయుఁ గారుణ్యజలధి 75

వ. అనుడు భగవంతుం డిట్లనియె, 76

---

1 మ — తాయ

నవెరు [1]న్యాసనంబు తత్త్వవేదులగు మునులచె నాత్మన్యాసంబని పల్కం బడియె ప్రధానంబు గూర్చి బుద్ధి తత్త్వంబు గదారూపంబుగం జేసి నాకు ధరియింపనగుట భూతప్రవృత్తీంద్రియాదియు శంఖరూపంబుగా ధరియింపు చుండు నుత్తమంబును ద్వివిధంబును నగు నహంకారంబు శార్ఙ్గ రూపంబునం జేసి ధరియింపుదు మనస్తత్త్వం బేను చక్రరూపంబునం జేసి [2]దాలుతుఁ బరి యగు నింద్రియంబులు బాణ రూపంబులం జేసి ధరియింపనగుట విద్యా మయంబగు జ్ఞానం బెద్ది యది ఖడ్గరూపంబుచే నాకొఱకు ధరియింపంబడు నవిద్యామయంబగు జ్ఞానం బెద్ది యదివర్మరూపంబున ధరియింపంబడు వైజయంతీ స్వరూపంబు వలన పంచభూతంబులు ధృతంబులయ్యె నిట్లు ప్రధానంబును బుద్ధియు నఖిలాత్మకం బగు భూతాదియు నింద్రియాదియగు నహంకారంబును మనంబును సకలేంద్రియంబులును విద్యావిద్యలును భూమి మొదలగు భూతాదియు ననునవి మఱియవస్త్రకములయందలి విజ్ఞానధ్యానంబునం జేసి సన్న్యాసంబుగా నాత్మీయ న్యాసంబని న్యాసయోగ విశారదులు పల్కుదు రివ్విధంబున స్వాత్మను నా యురంబునందలి కౌస్తుభ రూపంబుచేత సన్న్యసించి నత్యానందసుధారసం బహర్నిశంబు గ్రోలుచు నాయుధ రూపకంబులగు తత్త్వంబులచేతఁ బరివృతుండయ్యు మత్కారారవింద మాధుర్య మకరందంబు పిక్కిలిసేవించు బహిర్విషయ వైముఖ్యంబగు నాత్మన్యాసంబుగాఁ దలంపఁ దగు నని యత్తనియె

తే గీ ఈ సమస్తంబు తెల్పుగా నెఱిఁగి నీవు
సర్వసర్వేశ్వరుండవై సంతతంబు
సూత్రము వర్ణింపు నాయందుఁ బాడ్కొఁ జేసి
యలరుచు సమాధిఁ గ్రీడింపు మనుపుచరిత 81

---

1 మూ వ్యాస 2 మూ దాలుత

సర్వదేహులకు మోక్షదముగా మల్లిపు
రంబున నందము నీరరుహ కుముద
ములను తెంగల్వలు ఎఱ్ఱ నుత్పలంబులు
నెనసి దివ్యంబుగా నెసఁగు నొక్క

తే.గీ. సరసి తటమున రాజహంస స్వనంబు
గలుగ సురరాజ నీలప్రభాళి మగుచు
శుభము గావించి నిస్తుల స్ఫూర్తి నలరు
దివ్య నీలోత్పలంబు సంభావ్య మగుట 85

వ. అందు 86

క. కౌమోదకీ మహాంకుఁడు
తామరసాక్షాంఘ్రి పంకజ (?) ధ్యాన సుధా
ధీ మహిత వివర్ధితుఁడు [1]మ
హా మహుఁడు వసించి నిస్తులానందుండై 87

క. క్షితి తత్త్వ జ్ఞానాధికుఁ
డరఁడు పవిత్రాశ్వయుజమ నగు మాసమునం
దతి శుభమగు దినమున నం
దిత మతి యిన్నింటె విమలచిత్తాంబుజుఁడై 88

వ. అయ్యవసరంబున

---

1 ము – మా

చ. అనుపమ కోటిసూర్య తులితాభుఁడు పంకజనాభుఁ డాశ్రితా
[1]వనుఁ డఖిలేశ్వరుండు బుధవంద్యుఁ డనేక సుమాస్త్రదారకా
ప్తి విగళరూపుఁ డచ్యుతుఁడు దేవుఁడు శౌరి చతుర్భుజుండు [2]భ
క్త్యనయుండు గోమఠావయవభాసితుఁ డవ్యయుఁ డప్రమేయుఁడున్ 30

సీ. సర్వేశుఁడు శంఖ చక్ర గదా పద్మ
విభ్రాజమానుండు విశ్వమయుఁడు
సుముఖుండు సుభ్రూయి సుజనస్తుతుఁడు పుండ
రీక దళాక్షుఁ డస్తోక గుణుఁడు
నారాయణుండు సునాసుండు శ్రీదుమా
ధరుఁడు సుదంతాఢ్యుఁ డరిజయుండు
సు[3]శ్రోత్రుఁ డనఘుండు సులలాటవంతుండు
సువిభూషణుండు విప్రతతయుతుండు

ఆ. సుగుణ మాలి సుగంధ చికుర కంధరుఁడు సు
నసుఁ డమరనుతుఁడు వాసుదేవుఁ
డమృత దాయకుఁడు సదానందరూపుఁడు
దివ్య గంధలిప్తదేహుఁ డనఁగ 31

వ. పుష్పమాలా విరాజితుండును దివ్యపీతాంబరధరుండును నగు వ్రాకధరుండు జగజ్జనని యగు లక్ష్మితోఁగూడి నిత్యముక్త పరివృతుం డగుచు సరస్సిరంబున కరుదెంచి యుత్తముండును సిలోత్పలాంతరస్థుండును నగు నయ్యర్భకుం గ్రక్కు[4]శోషణం బుఁజేయుటకై ప్రియముగు[5]కమలాహస్తకమంబున

1 మూ - నను 2 మూ - తా
3 మూ - క్రోతు 4 మూ - శోషణంబుగ
5 మూ - కమలం

దొసంగిన నాలేమి ఱవెంబుగా నట్టుతుంగొని హర్ష మానసయై
న్పుఁయుంపుచు నతని తమ్మరం బొసంగెను నమ్మహాత్ముండు తరక్షణంబ
ప్రవర్ధమానుండగుచు దర్శమయంబునం దాశౌరి యమ్మునీంద్రునకు
భూతాభిధానుండని ప్రవరమైన సరహస్యంబును సవిస్తరంబును బరమం
బను న్యాసాఖ్యంబును నగు మొగంబు యోగి ధ్యేయుండును భక్తుండును నగు
నమ్మహాత్మున కుపదేశంబు గావింప మునిశ్రేష్ఠుండగు వాతండు న్యాసయోగ
రహస్యం బెఱింగి యథాంధును నష్టయుండును నగు వానిం గూర్చి
సంబంధ జ్ఞాన భేదంబులుగువాని ప్రశ్నఁ జేసిన భగవంతుండు సంబంధంబు
లగు జ్ఞానభేదంబులయందు కర్తృ కార్యం బందలి [1]సంబంధంబు
శ్రేష్ఠం బని లోకంబునందుఁ జెప్పుదు కరంబున మునీంద్రా దాని పటి
యింతు వినుమని యిట్లనియె 12

తే.గీ. ధాత్రి రామావతారంబుఁ దాల్చు నాదు
చరిత మధికంబుగాఁగ నాశ్చర్య మగుట
నిదియె విజ్ఞాన సిద్ధికై యొసఁగుచుండు
నార్యజాలంబు నందు విస్ఫూర్తి మించి 13

క. మనసువలన నీ చరితం
బను దశకంధర వధార్థముగఁ దెలియఁగ నీ
తను జీవునిగాఁ బరమా
త్మ నయిన నను రాముగాఁగఁ దలపఁగ వలయున్ 14

సీ. ఉరుదీప్తియగు మదయోధ్య వైకుంఠంబు
[2]దగఁ బ్రపంచము దండకావనంబు
నందుఁ బ్రవిష్టుండనై పరమాత్మనౌ
నాకు లీలార్థమై నలువుగాంచ

1 మూ – సమ్మంధ 2 మూ – దనప్రపం

సీతా సదృశముగా జెన్నొందు రాక్షసు
రహిని మనస్సు రావణుండు
మృగ రూపమైన ప్రకృతిచేత మత్స్మి
ఎము వల్లభగౌని 'టిర మను లంకకు

తే.గీ. ఆ యుద్యాన సంస్థగా నెంగు వనవ
నంది వరిత్రి దా ఏకయాళ్ళ కోర్తి
మాంగమంద విజరాజ్యంబు నమ్మ వింగె
మహిత గుణాధుర్యు గురువర్య మౌనివర్య 95

తే.గీ. అప్పు దా సీత యౌవనమునందు నాదు
విగ్రహాకృతమం బెట్టి విస్తృతముగ
వలపుచు వసించుచుండు నీ ఎంపుమతివి
భక్తిరంజిల్లగా ధ్యానపరుడ వగుము 96

మ. సతతంబున్ మునివర్య యివ్విధముగా సంబంధ విజ్ఞాన మం
చిత భక్తిన్ హృదయంబునం దరసి విద్వన్నైష్ఠిక తత్త్వ సం
తతినై నాదు గుణానుభూతియు[1]ను మత్ప్రఖ్యాతియో లీలయున్
సతతత్వంబున మౌనివర్యులకు నిచ్చన్ బోధ గావింపుమీ 97

వ. ఉత్తమంబును రూపానుభవంబును మత్స్వరూపానుభవంబును వృద్ధుణాను
భవంబును జరమంబగు విభూత్యనుభవంబును మనుమలంగూర్చి నిరంత
రంబు స్థిరంబగు సమాధింజేసి యుద్బోధకంబు గావింపుము సంసారసార
మగ్నులగు శరీరులకు పుత్కారముంజేసి యపాయంబు తత్త్వం బధికంబుగా

---

1 మూ 'ను' లేదు

సీ. ఆహారధిగా నహా మర్థంబు విర్థేం
మను ధారు దాస్త్యైకమునఁ బ్రియంబు
నగుచు దివ్యతఁ జేసి యనుదినంబును బ్రతి
క్షేత్రంబు గూర్చి వసించు నెన్ని
దగు గుణంబులఁ గల్గి యరయ నటంతంబుఁ
దెల్లు నవ్యక్తమనియు పఠింప
నలరు చిదాత్మం బహంకారమును బంచ
భూత [1]ఖల విస్మయములా[1]ను నైదు

తే.గీ. నింద్రియంబులు పదునొకం డెసఁగు బుద్ధి
తత్త్వ మవ్యక్త తత్త్వ మీ తత్త్వములను
నెంచి నిర్వికార్యగా నెసఁగుచుండు
మహితగుణధుర్య జంఘచర్య మౌనివర్య 108

తే.గీ. అవియ త్రిగుణ విషయమై యలరి బదమ
నగు నదియ్రూప మని యరయంగ నగుటఁ
నిందు సర్వేశ్వరుండనై యే సనాత
నుండనగు నీశ్వరుఁడనుగా నొప్పుచుందు 109

వ. సర్వవ్యాప్తంబును సవతోధంబును నమలంబును వానందంబును నగు వాకారంబుతోఁ గూడికొన్న యనంతుండును నగుణుండును సాక్షియు శాస్త్రయు సర్వంబునకు ధారకుండును స్వాధీన సర్వవ్యాపారుండును శ్రీభూనీళాధినాయకుండును బ్రభుండును నిత్యలావణ్య సౌందర్య సంయుక్త మత్ర విగ్రహుండును నే నగుట నేతత్పదార్థ త్రితయంబునందు ద్విపదార్థాత్మకంబగు జగత్తు మచ్ఛరీరంబనియు నీశ్వరుండనగు నేను

---

1 మూ. సులేదు

రేలు గృహంబులు గల్గి తుల్యశీతోష్ణ సుఖ దుఃఖులై శరీరాదులందు నిర్మో
హంబు గల్గి భగవత్పాదాసక్తులై భోగాసక్తి యనంబు వలన భీతులై భవ
త్ప్రియ బాంధవులుగాన పరమానంద సంభృతులై యంత నొక్కొక్కతలం
బునం [1]దేకీకృతులై యానందాశ్రుతులయ్యు దూరంబువలన దండ ప్రణా
మంబులు చేసి తద్దర్శ[2]నాతిశయాహ్లాద [3]పులకీకృత విగ్రహులయు పర
స్పరాలింగనపరులును నానందాశ్రువిలోచనులును మాటిమాటికిం బెద్ద
దగ ననిమిషదృష్టిం [4]జూచు పైన పునఃపునః సంభాషణం బాసక్తి గల్గి
వినయా[5]న మస్తకులగుచు వారు ధన్యోస్మియని పల్కుచు సమీపంబు
నందుఁ గూర్చున్నవారై [6]యతిభక్తి వినయాన్వితులుగా నన్యోన్య ప్రశ్నం
జేయుచు రహస్యంబును శేషశేషిత్వ లక్షణంబును భగవత్పరతత్త్వంబును
నగు జ్ఞానయోగంబు పరస్పరంబు వలన వినుచున్నవారై యనంతరంబు
112

సీ. సంతతం బన్యోన్య సత్సంగ వశమున
నింపు బరమానంద వృత్తిఁ జెంది
మాటి మాటికి వేడ్క మహనీయ విస్ఫూర్తిఁ
దిరుగుచు నొక్కెడ దివ్యమైన
సిరిమించు వామన క్షేత్రంబునకు [7]యదృ
చ్ఛంజేసి వారలు చని రయమునఁ
దత్పుర ప్రాంతంబు దడయకఁ బ్రాపించు
యోగీశ్వరులయం దనూనవృత్తి

---

1 మూ - దేకీకృతులై
2 మూ - నాతిప్రియా   3 మూ - పులకే
4 మూ - గఱపి   5 మూ - కృత
6 మూ - మరి   7 ము - యదృచ

వ. సకల జీవదయాపరుండుగానఁ గాసారయోగి ధామం బొసంగి చన్న యా మహాయోగి యచ్చట పృష్ఠనిరంబైనం దలసి ¹నవాఁడగుచు హరిపదాంభోరు హధ్యాన సంలగ్న హృదయుండై సంతుది ²తంబగు నా స్థలంబునం దధివసించిన యమ్మునిశ్రేష్ఠుం గూర్చి యాగేహిని సేగుచెంది తదవ లోకనంబు సేసి నివర్తితుండగుచుం బోవుచున్న మహదాఖ్యంగాంచి వేది వారు గృతాంజలులై నమస్కారంబుగాఁ గరంబులంగై కొని గేహినిచేర్చి ప్రమోదంబైన నమ్మువ్వు రేతావాస మాత్రయగు నాగేహిని యందుఁ బర దుఃఖా సహిష్ణువులగుట వారు ³లం దర్శంతరంబుగా సంతుదితావ్యక్తులుగా ని⁴రభ్యాసులును నిర్భీతులును నిష్పందులును నిపుంతర విఖ్యాతి పరులును నమ్యుతధ్యాన సుధాపానులును సునిర్వృతులుంగా నూరకున్న యెడ విశ్వే శ్వరుండగు దేవుండు గేహినింజేరి తత్క్షమా చంలేచ్ఛుంజేసి తన్మధ్యంబు నం దతిప్రవృద్ధుండయ్యె నని యిట్లనియె 118

తే.గీ. ఆరయ సమ్మర్దమునఁ దైనట్టి పంక
వాక్కుచేత మునులు దారు యంత్రమునను
దగిలికొని యున్న చెఱకుల దంట్లరీతి
నుండి రచ్యుత సంస్మృతి నూని మదిని 119

ఉ. ఆయెడ వార లద్భుతము నొందుచు నచ్చటఁ గ్లేశకారణం
బై యలరారు ⁵నామముని యమ్మురవైరిని నాత్మదృష్టిచేఁ
బాయక చూచి చూడకయె భాసిలుచుండిరి నిర్వికల్పసం
ధాయక మానసంబు గొని నవ్యసతోన్నతులై పయంబునన్ 120

---

1 మూ — సలేదు 2 మూ — తలేదు
3 మూ - వారలయందర్శంబుగా 4 మూ - రు
5 మూ — నావునియ

సీ. అంబుజాక్షుని ప్రియ దగు నరోగాని భగ
వంతుఁడని యెఱింగి భక్తిఁ జేసి
యపుడు భువి [4]స్థాపియగునట్లు గావించు
సంతోషమున నర్చనము సేయఁ
జేసి భాస్కరుని భాసిల్లు దీపము గర్పూ
నీరాజనముఁజేసి నిరతాంబ
వయమునకు సమర్పణముఁజేసి యోగి వ
ర్యుఁడు నిష్ఠ నుండ యా యూర్వశేశుఁ

ఆ.వె. దగు ఉపార్ణవమందు నధికతుష్టుండైన
యంత భూరదానిగి యమల వృత్తిఁ
బ్రేమ మనెడి స్థాలి [1]విపరించి భక్తి నా
జ్యంబుఁ జేసి నిష్ఠ నంపరించి 121

వ. కృతాంజలి యగుచు నెండియు 122

క. తనదు హృదయకోశము ప
త్రిపఁజేసి సమాధిచేత దీప్తి [2]సజ్జ్
ప్తిని దీపముగాఁ గోర్కెం
గోనిప దదర్పణముఁజేసె సుస్థిరమతియై 123

తే.గీ. అట్టి దీపం బాసంగుట సఖిల భవము
నర్యమైపోఁగా నంత నలిన నాభుఁ
డచ్యుతుఁడు దేవదేవుఁ డనాథమూర్తి
యింధిరా భామి సహితుఁడై యిష్టమతిని 124

---

4 మ - స్త్రాపి 5 మూ — మనస్థితంము
1 మ విపరించు 2 మూ ని

వ. మహాత్ముండగు మహదాఖ్యు పురోభాగంబు నందు విభుండు ప్రాదుర్భ
వించిన నతనిం గాంచి యనంతరంబ యమ్మహాయోగి శంఖచక్రగదా
ధరుండును వాళాసురావంధుడును సుముఖుండును ఘటపాళ ధర్మప్రతుం
డును దివ్యపీతాంబరధరుండును దివ్య చందన లేపితుండును దివ్యపుష్ప
మాలికాపూర్ణుండును శ్రీవత్స విరాజితుండును పీన వృత్తాయత
భుజాండును పుండరీక విశాలనయనుండును గోటిసూర్యప్రభాసుండును
గోటి మన్మథ సుందరుండును కిరీటకేయూర కుండలాంగద ధారియు నర
మాత్ముండును నగు విష్ణుదేవు నవలోకించి వినయావనతుండయ్యు సంభ్ర
మ్యాక్షరమారుహంబు దగుచు నానందోద్రిక్త బాష్పాన్వితుండై సత్కృతాంజలి
యగుచు మాటి మాటికిఁ బ్రణమిల్లి హర్షగద్గద వాక్యంబున నిట్లనియె 125

క. అలిని భజింతు హరిన్నయి
నలర సిరిని లోకజనని యగు నీ గృహిణిన్
ఇలనాప్త కోటి విభవుని
విలసిత మూర్తిని నతాంత విస్తృత కీర్తిన్ 126

తే.గీ. సార రక్తపయోధరాకార రక్త
నూపుర విరాజితంబు ననూన జయము
శంఖచక్ర ధ్వజాంకుశ ఛత్ర వజ్ర
చిహ్నితమౌ ప్రాణి శరణ మక్షిత సుఖము 127

క. పరమ ప్రణుతించెద శ్రీహరి
చరణయుగము మునికర్మ గహన దహనం
బురుభక్తి ముక్తిహేతువు
సరస మహాయోగి హృదయ సంలగ్నంబున్ 128

తే.గీ. వరద వీరేశ విస్తృతి వెలయ నీదు
కన్నులను మెఱుపుం మాడ్కిఁ గదలు కుంద
యము వింటిల్లు గంధకంబులును ధ
రించువాఁడ నవమ్ము సేయించుకొనుట 184

తే.గీ. దివ్యము మహత్త్వశాలియు భవ్యమగుచుఁ
దొల్లు మాణిక్యమంటపంబును ధరింతు
భక్తి హృదయము వెనఁగాను బ్రజ్ఞఁజేసి
దేవదేవ గిరీశ వందితపదాబ్జ 185

సీ. కరుణాంత దీప్తి సంకలిత కోటీర వి
రాజిత వాద పూర్వమగు జన్మ
ము నొనర్చు నటిం పుణ్యయుతు వం
మిందిరానాయకు నెల్లలోక
ములకుఁ బ్రభుని హరిఁ బుండరీకాక్షుని
మణినవ నరింద్యు మధునిభేది
భవవార్ధి లంఘనోపాయు నవ్యయు గుణ
భరితుండు తత్పాద పద్మములను

ఆ.వె. గరిమమొంది యేను సర్వత్రిఁగ్రైకొని
[1]నిరత మమ్మహాత్మకరుణఁ జేసి
యీ సమస్తములను గృతకృత్యుండ నగుచు
ధన్యుఁడుగఁ దనరుఁ దత్త్వదృగను 186

---

1 మూ-నిరత

వ. ముకుంద దర్శనంబు వలన నాహ్లాద పరిపూర్ణ రసాత్మకంబును నానంద
గద్గదంబును నగువాక్యం బిట్లు నసమీరితంబగుట నత్యాసార భూత
యోగీం[1]ద్రులు జగదీశ్వరు నవలోకించి తద్దర్శనంబువలన నమితంబగు
నానందంబు భరియింప నగరుహంబులంజేసి(?)యంచితులై ప్రపంచంబు
స్మరియింపక పారవశ్యగతులైన యప్పుడు సంపూర్ణమతులును మువ్వురు
నగు నమ్మునులకుఁ దార్వ్యంబగు హరి యచింత్యంబును నవ్యయంబును
నగు నట్టి విశ్వరూపంబు దర్శింపంజేయ మువ్వురు న త్త్వమయంబును
నానందమయంబును శుభంబును నగు రూపంబుఁగూర్చి ప్రణమిల్లి
యాయోగిశేఖరు లానంద మగ్నులై యిట్లని స్తుతియించిరి 187

సీ. జయ రమేశ చతుర్దశ భువనైశ్వర్య సా
మ్రాజ్య ధురంధర మధువినాశ
జయ సర్వ సురగణ సార్వభౌమా[2] యఖి
లేశ్వర యద్రిజాధీశ వినుత
జయ భక్త జనస్తోత్ర సాఫల్యమయ విగ్ర
హా జయ నీలమేఘాంగ శౌరి
జయ కనకాంబర జయ కమలావర
ధ్యాన మనోజ్ఞ భుజాంతరతల

తే.గీ. నాథ జయ సర్వకల్మష నాశ నామ
కీర్తన యనంత యచ్యుత కృష్ణ యోగి
మానస పాంబుజ కర్ణికా మధ్య వాస
జయ విమల పద్మపత్త్ర[3] విస్తారనయన 188

---

1 మూ-ద్రుడు 2 మూ-మా తర్వాత ం అక్షరమున్నది

3 మూ విస్తార.

క. విదితంబుగ తత్పద్మము
మదిఁగల విజ్ఞాన మనెడు మార్తాండునిచేఁ
బొదలి వికసింపఁ జేయుచు
ముదమున వర్తిలిరి యోగపూరిత మతులై 146

తే.గీ. తత్త్వ ధర్మ ప్రథ ¹గుణంబు తత్ప్రయోగ
తద్విశేషాంతరంబునఁ గరము చండ
రోద్భవ ద్యుతి దామరాగోజ్జ్వలం శ్రీ
తిఁ గాను సిరిఁ గూడికొని యున్న దేవదేవు 147

సీ. తరుణార్క సమతేజుఁ దామరపొత్తు భూ
నీలా సమాయుక్తు నిర్మలాత్ము
దేవతేశుఁ గిరీట దివ్యహారమ్మయా
కృతిఁ బీతవాసనుఁ గృష్ణరూపు
భూరిచందనదామ భూషితుఁ గేయూర
కంకణాంగద సమా² కలితు శంఖ
చక్ర నందక ఖేట శార్ఙ్గేషుపాశాద్య
దావశార్థితాంగు శుభప్రదాయి

తే.గీ. దాం సూర్యకోటిసంకాశనిభప్రభా
హారవిద్యోతమాన విస్తారవక్షు
వజ్రసురనీలములు మాలి వికీర్ణ
మేఖలా స్ఫూర్తి కటిభాగు విహార వాసు 148

---

1 మూ ఁగుణంగు 2 మూ కవిక

సీ. సామజ రాట్కర సన్నిభోరు యుగళ
[1]వాదర్శదారుతరాకృతి న్వ
జానుయుగ్ము సరుణ సరసిజాంచిత పాద
యుగుఁ [2]గపోలద్వయయుతు ననంతు
సంతత ప్రియాద్విక సౌందర్య జిత సూన
బాణకార్ముకుఁ దచిత్రకృతశీలం
కుండల కర్ణయుగ్ము నదవలోకనా
ల్లోల సుశీల వసిం శుభ్ర

తే. గీ. తార విస్తారితాఖ్యాఖ్యు దైవవశుఁ
నార దంతస్ఫుర ద్విద్రుమోరు లోహి
తాధరు సుహాసితు మహాత్ము నచ్యుతునిఁ బ్రం
బాళ్ళ శరదిందు ముఖు పద్మఁ గరుణసద్మ 149

వ. ఇట్లు పరిశుద్ధంబగు స్మితంబు గల్గి నీరంధ్ర కృపావలోకనంబున జెన్నొందు హృషీకేశు ధ్యానించి ప్రత్యగాత్మ సద్దేవ విషయంబునందలి [3]యత్యంత ప్రకాశక కౌస్తుభ స్వరూపిగాఁజేసి, తదురఃస్థలానంద రసాబ్ధి సంప్లుతులుగా మనంబు సన్నుతించి యాది దంపతులగు లక్ష్మీ నారాయణుల చరణంబులను కమలంబులయందు మధురంబగు మరంద రస సుధా పూరం బనయంబుఁ గ్రోలుచుఁ బరవశంగరు లగుచు సత్త్వ స్వరూపంబులగు తత్త్వంబులచేత ([4]భాసితంబులగు) తత్కార పంక జంబులయందు సంస్థితంబగు మకరందానంద రసం బాస్వాదనంబుఁజేసి నిర్భరానందులై యిట్టిదంబున సమాధియుక్తులగుచు నుత్తమంబగు నేత ద్యోగంబుధరియించి బాహ్యప్రపంచంబు మఱచి చిరకాలంబు సమాస్థితులై యుండు నప్పు డేను భక్తి విశేషంబు నహింపనివాఁడ నగుచు మద్భక్తుల

1 మూ. దాదర్శ   2 మూ. యుగు కపోలద్వయయనంతు
3 మూ. యత్యంత కర్పాక'' క'' వర్ణమున్నది   4 మూ. లేదు

సీ. ఇం దనుత్తమముగా నెసఁగు యోగముదాల్చి
మద్భక్తులగు వీరు మహిత నిష్ఠ
వసియింపుదురు నాదు ప్రాణతుల్యులుగ
నిర్భటనే వసియింతు వారి
ధారణ యోగ విద్యానురాగులం దవ
ళ్యాతి మగు వీరి దర్శనము వచ్చి
వచ్చి నీ వరయవో నరయంగ నాచేత
నల్పుఁ డగినవాని సారసభవ 166

తే.గీ. యీ క్షణంబున వసియింతు నో క్షణార్థ
మవని వారల సంగమం బభిలపింప
హరము త్రైవర్గ సాధనం బనుఁడు బ్రహ్మ
నన్నుఁ గూర్చి వచించె విజ్ఞానియగుచు

ఆ.వె. యోగసిద్ధు లగుచు నొప్పు నీ భక్తులు
చూడ[1]రెట్టు లయినఁ జూడ్కిఁ జేసి
నన్ను వీరలాను ననంత శ్రీ పురుషోత్త
మా యటన్నఁ బెక్కు దలఁపుమతిని 167

వ. మనంబున యోగంబు ధరియించి బ్రహ్మానందం బనుభవింపుచుఁ బ్రపంచం
బతిక్రమించు చూడ్కి గంభీరం బవలోకనం బేమి పని యనినఁ
జతుర్ముఖుండు మహానుభావా నిశ్చలంబగు వీరి యోగంబు పరీక్షింప విధో
పాయంబులచేత భగ్నంబుఁ జేసెదఁ బ్రసన్నుండ వగుచు నాకు యోసంగుము
దీనం జేసి వీరి మాహాత్మ్యంబు ప్రకటంబుగాఁ జేయుఁడు గాక యనుచు
దర్శనంబునందుఁ బ్రహ్మ ప్రసన్నుండ వగుచు నే నానతిచ్చిన విష్ణు మదనుజ్ఞ

---

1 మూ. రెట్టినయిన

తుండగుచుఁ బరిహాస్యుండగు పరమేష్ఠి యప్సరోగణంబు రావించి
మదనుం గూర్చి యిట్లనియె 168

సీ. అప్సరసలఁగూడి యత్యస్త్ర వీవు ప్ర
యత్నంబుఁ గాని తీవ్ర మతిగి వీరి
యాగములకు విఘ్న మొనరింపు మని యట్లు
లతఁడు పంపించిన యా[1]సురేశ
వనితా సమేతుఁడై చని వివిధోపాయ
సంపూర్ణముగు సుశ్రావ్యనృత్య
గేయంబులను జరికింప దృఢవ్రతు
లైనట్టి మౌనుల నావరించి

తే.గీ. వారి కన్నులు దెరపింప జంపులేక
మగుడి ధాతకడకుఁ బోయి మధురవాణి
నంతయు నెఱుంగఁజేసిన నాతఁ డధిక
రోష మానసుఁడై యంత యాదిగాంచి 169

తే.గీ. వ్యాఘ్రసింహప్రముఖములు హస్తి శరభ
ములను సృజియించి భువి రాలు భూరికరక
సహిత వర్షంబుఁ గావించె సత్వరముగ
దింపుగాఁ దనకోశంబు వేర్పడంగ 160

క. ధర నవ్వర్షంబు భయం
కర మగుటయు దానిచేతఁ గడుఁ గ్రమమరయుచున్
ద్వరితమతులై మృగములు ని
ర్భరముగ మన్నియును గుహలఁ బ్రాపింప నాగెన్ 161

1 మూ. సురాళ

తే. A ఘనతఁ జెన్నొందు [1]శ్రీకూర్మమునఁ దనర్చు
కూర్మరూపిని సేవించి కోర్కి నిట్లు
తదనుసారిగ ధాత్రి సత్తమము గాంచి
యంపెనంగెడు నీలాద్రి కేఁగుడెంచి 176

క. దూరంబుగఁ దచ్ఛిఖరం
బారూఢిగఁ గాంచి వార లతిభక్తిని బ
ల్మారుఁ బ్రణమిల్లుచును గం
భీరతఁ దత్క్షేత్రమునుఁ బ్రవేశించి యటన్ 177

వ. ఇంద్రనీల శ్యామ లతనుండును [2]పీతకౌశేయ వాసనుండును గిరీట హార కే
యూర కుండలాంగద ధారియు గ్రైవేయ కాంచీ కటక కంకణాది విభూ
షితుండును పుండరీక విశాల నయనుండును దీర్ఘాయత భుజాయుగళుండును
బింబాధరుండును కౌస్తుభమణి భ్రాజమానుండును శ్రీవత్సవక్ష లక్షణుం
డును బలభద్ర సుభద్రా సమాయుక్తుండును సర్వేశ్వరుండును మహా
పురుషోత్తముండును ఈశ్వరుండును [3]సంస్మృతాశేష పతిత పావన వ్రతుం
డును రమానాథుండు నగు జగన్నాథు నవలోకించి విధ్యుక్తంబుగాఁ బ్రణ
మిల్లి [4]వేదాంతావహంబులగు స్తవంబులచేతఁ గొనియాడి తదీయ సేవా
సక్త మనస్కులగుచు నా యోగివర్యులు కొన్నిదినంబు లందు [5]వసియించి
పురుషం బనుత్తమంబును శ్రీమంతంబును నై నయష్టాక్షరం బుపదేశించి
యభీష్టితంబులగు సిద్ధుల నొసంగిరది మహాయోగి మాహాత్మ్యంబును
సంవాదరూపంబగు శ్రీమంతంబును నగు భార్గవపురాణంబునందలి

---

1 మూ. ద ర్శ
2 మ. పీత కౌశేయవాసుండును 3 మూ. సంస్మృ
4 మూ. వేదాంతా 5 మ. వసియించిన

యుత్తరఖండంబునందలి పంచమాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన వెండియు నతం డవ్వలి కథాక్రమం బెట్టిన నతని కతండు వివరించిన విధంబు సూతుండు శౌనకాదుల కిట్లనియె 178

మ లలితానూన దయాపయోధి పటుశౌర్యాలంకార యోగీంద్రహృ
[1]జ్జలజక్షేత్ర నివాస దానవగిరిశస్త్రోత్ర ప్రోత్రక్రియా
క్ష్వేళ దివ్యాంఘ్రి పయోజ యుగళ భాస్వత్ప్రభూతాంత క
ల్ప లసత్పాత్రభవ భావ భావభవ రూపారూప నామక్రియా 179

క శరచర కిరి హరి వటు భృగు
వర రఘువర రామ బుద్ధ వాజీశ్వర భా
స్వరరూప రూపవిజిత
స్మర స్మరణామృత పదాను సంధాయి హరి 180

మాలిని శరభభవ సుతాంగా సత్కృపాపాను[2]షంగా
వర విభవ నివేశా నాగినాద్రిస్థ వేశా
సురనగర విహారా సూరిలోకప్రచారా
విరచిత గుణ జాలా వేణుగోపాల బాలా 181

గద్య [3]ఇది శ్రీమద్రాజగోపాల కృష్ణ కరుణా కటాక్ష [4]వీక్షణాప్త పాండిత్య ధురీణవరతామణి మండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వ సమర్థతాకృత పటహ ధణంధణారావ వివరిత పరస్పృకియా ఢిల్లీశాధీశ దుందుభి ధ్వాన కోలాహల హనూమ[5]ద్ధ్వజాంక కనకదండికృత హార కటాక్షర సందీపిత ప్రతాప కీర్తి ప్రాభవ కోసం వంశ పయః పారావార రాకాసుధాకర పీఠాం

1 మూ జలజా 2 మూ షంగా 3 మూ ఇతి
4 మూ వీక్షణా 5 మూ మధ్వజా

అరనాయక క్షేత్ర రమణ భూపాలపుత్ర లక్ష్మీదాంబా గర్భశుక్తి ముక్తా ఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్యతిలక సుమసాయక అహరి పాము నాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబునందు అరవిశ్రమ మందు నారాయణుం గూర్చి నరుండు ప్రశ్నఁజేయుటయుఁ బరమపద వర్ణనంబును వాసుదేవ ప్రభావంబును లక్ష్మీప్రశ్నంబేసి నారాయణానుమతి వలన సేనేశాదు లంశరూపంబుఁ దొరవ నుద్యోగింపుటయుఁ గాసార భూత మహాదావ్యాయ సంబనంబును దత్రసన్నుతగుమ భగవంతుండు శతపదేశుండగుటయు వాసుదేవుండు మహాయోగులఁ గూర్చి విభిం ప్రాణంబు న్యాసయోగం బుపదేశంబు గావింపుమని యనుటయుఁ దత్ర సాదంబున వార లటు వలనే సేయుటయుఁ దదనుమతింజేసి వారు తీర్థాట నంబు సల్పుటయు వర్షాగమనంబున నొక్కెడో వారు ముప్పరుం గూడు టయు వారిభక్తి దెలియు కొఱకు భగవంతుఁ దప్పుడు ప్రత్యక్షంబగుటయు నమ్మహాయులు హరింగూరిచి మానసపూజ గావించుటయుఁ దదాజ్ఞం గొని వారు నారాయణాశ్రమంబున కేగించుటయుఁ దత్ర పో మాహాత్మ్యం బును బ్రహ్మవైభూతకంబును నరోభూత మహాదావ్యాయులు సకల పుణ్యక్షేత్రములు సేవించి నీలాచలంబునందలి జగన్నాథుని నభివర్ణించు టయు నను నెత్పభావంబు గల ప్రథమాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీవనితా భూ[1]షితా
భావాజ్ఞానుసక్త వాగినగిరి వా
సా వాసవ వందిత శ్రీ
రి వైభవ సుర పురీ గోపాలా 1

వ. అని సకలగుణ విశద ప్రజ్ఞాధురంధరుండగు నయ్యండు వివిధ విబుధో[2]ప
లాలన పరాయణుండగు నారాయణుం గూర్చి ప్రణమిల్లి మహాత్మా మహా
భాగులగు యోగులు నిఖిలపుణ్యక్షేత్రంబులు సంచరింపుచు నీలాచలంబు
నందలి సుభద్రా ప్రాణనాథుండగు జగన్నాథుం బూజించి యవల నెటు[3]కని
రని యడిగిన నతం డిట్లనియె 2

తే.గీ. క్షితిని నంతటఁ దన్మహాక్షేత్రమున్న
మయి యతిశయంబు గాంచు సింహాచలంబుఁ
జేరి యందున్న నరసింహసారసాక్షుఁ
బుణ్యమూర్తి జనార్దనుఁ బూజచేసి 3

క. ఘనమతు లవ్వలఁ దులసీ
వనమున[4]వ ర్తిలిన గతిని వనజాక్షుని దే
[5]వనుతుని భక్తపరాయణు
వినుతించిరి యాత్మభక్తి విస్తృతి గాఁగన్ 4

---

1 మా. భూషిత 2 మా. ధోరణి 3 మా. నెటువని నడిగిన
4 మా. వర్తిలి 5 మా. వసుతిని

తే.గీ. అంతఁ గృతశౌచమునమందు హరుని బయిని
వృషభవాహుఁ బూజగావించి పిదపఁ నధిక
పుణ్యమౌఁ బరమమగు స్తోత్రభూధరంబుఁ
జేసి రాధాధభక్తి సంస్ఫూర్తి లగుచు 6

కాసారభూత మహదాహ్వయుల సింహాచలాది క్షేత్రముల సేవించుట

చ. మునివరు లాస్థలంబున సమున్నతిఁ గల్గ నృసింహరూపి దే
వునిఁ బరమాత్ము నచ్యుతుఁ బ్రభున్ మధుసూదనుఁ దద్గుణాశ్రితం
బనగు సుధారసంబుఁ బరిపూరితభక్తిని గ్రోలుచుఁ మోదం
బునఁ బ్రణమిల్లి నిష్ఠఁగొని పుణ్యతరోక్తి నుతించి రక్తితోన్ 6

తే.గీ. హర్ష నిర్భర మానసు లగుచుఁ గొన్ని
దినము లందుండి యచట వర్తిలిన నరుం
కాశ్రితప్రియుఁడగు శ్రీకరుండు భక్తి
దృఢముగాఁ బాదు కొల్పిరి దివ్యమతిని 7

వ. అనంతరము యయ్యోగివర్యులు గోష్ఠి దినాంతరంబునందలి గుహాపార మాహాత్మ్యక్షేత్రంబునందుఁ బ్రత్యక్షంబుగా స్మరణంబువలన మిక్కిలి ముక్తి నొసంగు దేవుండును నారాయణుండును నగు హరింగూరిచి ప్రణమిల్లి స్తుతియింపుచుఁ దద్గుణంబు లభివర్ణింపుచు మహాయోగంబు ధరియింపుచుఁ జిరకాల సమాహితులై యందున్న పరం తనవరతం బపవర్గ మార్గంబు దర్శింపం జేయుచున్నంత శ్రీకూర్మాధీశుండును నాంధ్రనాయకుండును నగు నచ్యుతుం గూర్చి దండంబుఁ బెట్టికొనియాడి యనం ధర్మపురింజేరి యందలి యోగానంద నృసింహుం గూర్చి మ్రొక్కి స్తుతియించి యధివిష్ణు పదంబు నందలి విభుండును వరుండును లక్ష్మీనారాయణుండగుఁ గృష్ణుంగూర్చి నమస్కరించి యభివాదించి భక్తివలనఁ బూజగావించి పిదప నహోబలంబున కేగించి హిరణ్యాసుర మర్దనుండగు జనార్దను

సేవించి [1]యంతటఁ బాండురంగంబునందున్న విఠలస్వామి సపర్య
గావించి తదనంతరంబున శ్రీవేంకటాచలంబుఁ జేర నేతెంచి 8

## కాసార భూత మహదాహ్వయులు వేంకటాచలంబున కరుదెంచుట

సీ. సౌవర్ణమయ సముజ్జ్వలంబు విచిత్రరాజి
దారు[2]కూట స్ఫుర ద్వారపదము
నానామృగాకీర్ణ వనరాజి విరాజి
తంబు పొన్న సహస్ర ధన్యకీర్తి
పరివేష్టితంబయ్యుఁ బఠియింప నూరుయో
జనముల [3]నిడుపు యోజనము లైదు
వెడలుపు గల్గి భావింప మర్త్యుల కతి
లాఘవ హరంబు నాస్తికదరము

తే.గీ. భుక్తి ముక్తి ప్రదంబు సంపూర్ణ ఫలము
[4]సర్వ తీర్థాధిపతియగు స్వామి పుష్క
రిణి గలిగి శేషరూపమై గణుతికెక్క
దగు శ్రీవేంకటాచలం బనుదినంబు 9

క. ఈప్సిత ఫలోపశోభా
కలనము భక్తాఘహరము గాఁదగు శేషా
చలము నిలింప్ల సేవిత
మగు శుభంబైన దాని సరసిని భక్తిన్ 10

క. వనజాక్షునకు వికుంఠ పు
ర నివాసం బెట్లు ప్రీతి రంజిలు నట్లం

---

1 మూ. యట 2 మూ. కుట 3 మూ. నిడుదు
4 మూ. సర్వతీర్థాధిప యగు శ్రీస్వామి పుష్క

¹ధనాఢుఁ డాగిరిఁ బలుమరు
ఏమతింపుచు మ్రొక్కి భక్తి విధ్యుక్తముగాన్ 11

తే.గీ. అని శేషాచలావరోహణముఁ జేసి
²పావన వరుల గాంచింది దాని మూల
మునఁ గలుగు భక్తి తీర్థంబునను వసించి
రతిక నిష్టను చిరకాల మును మతిని 12

క. మునుల మహాత్ముల యోగం
బును గైకొని యోగ విత్తములయి సమాధిన్
వనజాక్షుని యనుభవ మేఁ
పునఁ జేయుచు నుండి దాస్య పూరిత భక్తిన్ 13

సీ. దేవతార్యత్వుండు దేవదేవుఁడు శ్రీని
వాసుండు దా మునివరుం బ్రేమం
నపుడు వర్తిలి కోమలావయవోల్లసితుం
డు గమిండు లోకేశుఁడు గుణ మూర్తి
సుప్రసన్నుఁడు కోటి సూర్యప్రతీకాశుఁ
³డాద్యంత రహితుఁ డనంతుఁడు హరి
చిరతాత్ముం డింద్ర నీలనిభశ్యాముఁ
డబ్జభవ శర్వార్చితాంఘ్రి తలుఁడు

---

1 మూ. ధనాఢుఁడు 2 మూ. పావన 3 మూ. దాత్యంత

తే.గీ. దైత్య సంహారి కోటికందర్ప సుంద
రుండు భాసుర పీతాంబరుండు మేఘ
లాగుణ విరాజితుఁడు భోగి భోగశాయుఁడు
శంఖచక్ర ధరుండు విశ్వప్రభుండు 14

తే.గీ. అతఁడు కటిహస్త సంయుతుం డగుచు నిదియ
పరమ [1]పదమని దర్శింపఁ బ్రజలు కేలఁ
దమ్మి గలవాఁడు తులసీ[2]దామ హార
కటక కింకిణీ భూషా ప్రకాశుండు 15

వ. కేయూరాంగద కోటీర కోటి మణిప్రభా భ్రాజమాన దిగంతరుండును
విస్ఫురత్ రత్నచిత్రప్రభా మండల కుండల యుగళ మండితుండును దివ్యచందన
లిప్తాంగుండును వైజయంతీ విరాజితుండును శరదిందు సన్నిభస్మేర
ముఖకమల శోభితుండును పీనాంధన తార్క్ష్యకోరుష భుజయుగ్మ
ప్రకాశితుండును గరుడావలోకనాలో పుండరీకాయతేక్షణుండును దిం
కుసుమ[4]సుషమా నిరసనాళ కేశపాశితుండును ఉత్కుండల విద్యోతమాన
కపోలభాగ భాసితుండును బింబప్రవాళ సంకాశ సుందరాధర యుగాంచి
తుండును మల్లికా కోరక హీర సన్నిభదంత పంక్తి సముద్దీపితుండును
గర్వాపరంజ ముకుర ప్రభాసంసక్త రుచిరాలికుండును ఉపార్ఘ్రాణ ప్ర
విలసన్నిటల సంపుటితుండును మణిగ్రైవేయకానుషంగ బంధుర కంబు
కంధరుండును లక్ష్మీనికేతన విపులవక్షస్స్థలం సూర్యాభ కౌస్తుభ రుచి
విస్తీర్ణాంగుండును ఆజానుబాహుండును నాభిసంస్థిత పంకజుండును

---

1 మూ. పదని 2 మూ. దామహా
3 మూ. లోచనాన 4 మూ. సుషమ
5 మూ. నామ

రంభాంచితోరుయుగళుండును సుజాను ద్విక[1]రాంచితుండును సర్వాధి కారియు సులలిత శరణ్యాంఘ్రియుగాంచితుండును విహంగరాజ పక్షవిక్షేప విచలిత కాంచనాంబరుండును శతపత్ర సంతాన చామర సమీర చల దాతపత్ర కమలహారుండును ననంత విష్వక్సేనాది నిత్యముక్త సమావృ తుండును బ్రహ్మరుద్రాదిదేవతతి పరిసేవితుండును సర్వేశ్వరుండును బూర్ల నుండును జగత్త్రితయ వను శ్రీపతి ప్రాదుర్భవించు మునిహృదయ కము దృశ్యమానుం డగుచు నదృశ్యుండైన నప్పుడా మహాయోగులు మిలితాక్షుల గుచు నాదేవేశు నవలోకించి మాటిమాటికిం బ్రణమిల్లుచు నిగమగోచరంబు లను బహుస్తోత్రంబులను నను ప్రబంధంబులచేతం గొనియాడిన శ్రీని వాసుండు సంప్రహృష్టుం డగుచు స్వహస్తంబున మిక్కిలివిస్ఫురియింపుచు దయచేసినగు పూర్ణావలోకనంబుల న[2]మ్మునులం గనుంగొని యిట్లనియె

కాసారభూత మహాదాహ్వయులకు వేంకటాచలాధీశ్వరుఁడు
ప్రసన్నుఁడగుట

ఆ.వె. భక్తులార యోగివరులార మత్ప్రియులు మీ
రలు మదీయ మూర్తి దెలిసి మీరు
వెంటనంటి నేను వేడ్క వచ్చెదఁ బాలి
గోవు గ్రేపుఁ గూర్చి పోవు కరణి 17

ఆ.వె. సకల జీవకో[3]టులకు ముక్తి కోఱకు మ
త్కాంక్షితంబు నమృత రాశి సుఖము
నాదు తత్త్వము నగు న్యాసయోగం బిదె
దేశమిచ్చి పరము దెలుపఁ దగిన 18

క. ఇది మొదలుకొని జగంబుల
పదపడి మిమ్మాశ్రయించు వారికి మోక్షం

---

1 మూ రాంచి 2 మూ నమ్మునిం 3 మూ రాసుల

యి దనరుఁ గోర్కె లొసంగెద
ముదమున సంశయములేక మునివరులారా 19

సీ ఆ దేవదేవుఁడు దివ్యుఁడు దిట్టు నా
శ్రావించి వేంకటాచలముఁ జేరి
నంత నా యోగివరాయకులు మువ్వురు భక్తి
తీర్థంబునందు వర్తిల్లి యచటి
వారికి నందు వఖ్యాగితులగు వార
లకు ముముక్షు రహస్య మకలంకంబు
నధికతరంబుగు న్యాసమె గం బంత
యు విశేషముగ నిర్చి యొప్ప దుర్కి

ఆ వె నప్పు డొక్క భూసురాగ్రేసరుండు త
త్త్వము నెఱుంగు కోర్కెఁ దనర వచ్చి
వారిపాదములకుఁ బ్రణమిల్లి భక్తిఁ ద
దాశ్రితుఁడయి ప్రవిమలాత్ముఁ డగుచు 20

క ఇంచుయంగ జీవ పరమా
త్మల సంబంధంపుఁ దెలివి దంచు నరని వి
త్కృలి గారవించి మౌనిం
ద్రులు నుడివిరి నయతరోక్తి తోషిత మనులై 21

తే గీ అతులమైనట్టి సంబంధమైన క్షిప్ర
యాడిగా దేహ దేహి స్వరూపలక్షణముల

---

1 మూ తనుగు

దెలియ దేహాత్మ దానికి దేహమయ్యె
దెహి హరి యచ్యుతుండయ్యె ద్విజవరేణ్య 22

వ ఈ శరీర శరీరంబుల భేదంబు మోక్షసాధనం బగుట నేతద్విజ్ఞానంబు దెలిసి విధ్యుక్తంబుగా [1]నిరంతరంబు భాగవతార్చనంబు గావింప ద[2]కో త్తమా శాశ్వతి యగు ముక్తిఁ బ్రాపింపఁ గలవని యిట్లు పల్కిన వరం దేను రిత్తుం ద[3]ను భాగవతార్చనంబుఁ జేయఁ దాం ద్రవ్య సంగ్రహంబునం దగ్రత్తుండ నని పలుకుచు భక్తిశ్రద్ధాన్వితుఁ డగుచు నెండియుఁ దత్పాద సేవనంబుఁ జేసిన నప్పుడు సర్వజ్ఞుఁడగు యోగు లతని యాశయం బెఱింగి నారాయణు కరుణచేతను నక్షయంబగు పాత్రం [4]బిచ్చి ధనపాత్ర సంరక్షణార్థంబు సుదర్శనంబను చక్రం బొసంగి యట దాని వం[5]పారం పర్యంబుగా ధర్మసిద్ధికొఱకు భగవతిది సంపత్సారస్వరాత్మకుండగు పుత్రు నతని కిచ్చిన యోగీశ్వరుఁ వలన నిష్టార్థంబు గాంచి భూసురుండు భూమియందలి శ్రీరంగాది సర్వక్షేత్రములయందు నిరంతరం బెందెందు హరి యర్చగం దందందు మహాభాగవతులకు విధి పూర్వకంబుగా నన్నం బొసంగి తత్ప్రకటేచ్ఛం జేసి తచ్ఛేషం బభి జీవులకు కిడి తద్విధిని నసాధారణ వైభవంబుగ నే నుపాసింతు నని హరిం గూర్చి మదువుచుఁ బరువుంబు ధర్మకీర్తనంబువలన జ్ఞానవంతుం డయ్యెదునని యమ్మహాం డు నిత్యంబు చతుర్విధంబగు నన్నంబు వైష్ణవులచేతఁ జేయించి వస్త్రం బులను గంధ పుష్పంబులను సువర్ణాభరణంబులను దను ననంత్యాం బగు నేతత్సంపాద్యంబు భార్గవునకు సమర్పణము గావించి తచ్ఛేషంబు మొదట హరి భక్తుల కొసంగి యథాక్రమంబుగా బ్రాహ్మణ క్షత్రియ విట్

---

1 మూ. నిరంతరంబు 2 మూ. జ 3 మూ. ని
4 మూ. బిచ్చిన 5 మూ. పార పర్యంతంబుగా

[1]శూద్రుల కొసంగి యట్లనె నిరతంబులగు సర్వ వర్ణంబులకు స్థాన భేదంబు
వలనఁ బ్రత్యేకంబుగా నొసంగి చతుర్విధాన్నంబును వస్త్రంబును గంధ
పుష్పంబును ధూపంబును నర్ఘ్యపాద్యాది రూపంబునం జేసి పూజావందన
పూర్వకంబుగా వినయం బొసంగి యనేక జనుల కభీష్టంబులగు వివిధ
పదార్థంబు లిచ్చి వెండియు

క. నిరతము సకలంబు లయిన
హరి యర్చావిగ్రహములయందు ద్విజుఁడు దాఁ
గలుపు సమస్తంబులగా
నెరసిన పక్షోత్సవముల నిత్యోత్సవముల్. 24

ఉ. ధరణి సమస్త దిక్కుల నుదారత విస్తృతిఁ గాంచు దేవమం
దిరము లనేకముల్ మఱి విశీర్ణములై యుండార నిట్లు భా
స్వర మతి భూసురుండు ప్రతివత్సర ముత్సవమున్ రచించె శ్రీ
హరి కరుణావలోకన సుధాంబు పవిత్ర మనః ప్రభావుఁడై 25

తే.గీ. ఇవ్విధంబునఁ జిరకాల మెంతు మీఱ
భక్తి భావన వల్లభ బ్రాహ్మణుండు
పరమ భాగవతార్చనఁ గలిపి సకల
ములఁ గవకముయముల సేసె లలితమతిని 26

వ. [2]ఇట్లు సంబంధంబున సంసిద్ధుండగుచు దుర్లభంబగు ముక్తిఁ బ్రాపించునట్టి
వైష్ణవాగ్రణ్యుండగు హరిదాసాభిధాను చరితం బెవ్వఁడు వినునతండు సన్న

---

1 మూ. విట్రా 2 మూ. ఏసి 3 ము. అ

దానపరుం డయ్యెడు నని మహాయోగి మాహాత్మ్యంబను శ్రీమంతంబను
నగు భార్గవపురాణంబునందలి యుత్తర ఖండంబునందు సంచారంబుఁ
జేసి భక్తపరాయణుండగు నారాయణుండు నరునకు షష్ఠాధ్యాయంబుఁ
జెప్పె నా విట్లనియె 27

అసారభూత మహదాహ్వయులు హస్తిగిరీశుని దర్శించుట.

సీ. అంతట మౌని నాయకులు మువ్వురు శ్రీని
కేతనంబగు గిరిఁ గేలుమోడ్చి
ప్రణమిల్లి భక్తి సంపత్తిఁ బ్రదక్షిణం
బొనరించి యాదరాచలముఁ జేరి
నారాయణునకుఁ బ్రణామంబు గావించి
యతని యథావిధి నర్చనంబుఁ
జేసి యచ్చోట్ల వాసస్థలంబు నధికంబు
నగు పుడకాద్రికి నరిగి యందు

ఆ.వె. ఘటికయందుఁ దాఁ గావింపు నప్తమో
నుతు ముంగలముఁ బలిసూన గరిమఁ
దోఁచినట్టి దేవుఁ దోయజ నేత్రు నృ
సింహుఁ బ్రాపుఁ జేరి సేవఁ జేసి 28

తే.గీ. అంతఁ గాంచీపురముఁ జేరి యందుఁ దనరు
నట్టి యరుణాచలముఁ గాంచి యధిక భక్తి
మ్రొక్కి ప్రియ హృష్టదేహులై రూఢి దాని
చెక్కురి త్సరిలమగ మౌను లిట్లు మతిని 29

2 మూ. భక్తి

3 మూ. నాగ 4 మూ. దేవాయతనేత్ర

సీ. పుణ్యకోట్యాఖ్యంబు భువనప్రభావంబు
దివ్యమాణిక్య సందీపితంబు
నగు నవ్విమానంబునందలి దివ్య సిం
హాసనం బందున నధివసించు
నట్టి మహాత్మకు నమర వందితు గురు
వరదు విరాజితు శరధిశయను
దేవరాజుఁ గపర్ది దివిజనాథార్చితుఁ
బద్మాలయామనః పద్మమిత్రుఁ

ఆ.వె. పుండరీకనయనుఁ బూర్ణదయారసు
జగదధీశు దైత్యజనవినాశు
మౌనివరులు గనిరి మన్మథ మన్మథుఁ
గోటిశేఖరాభ స్ఫురితతేజు 90

మ. కరిశైలేంద్ర విభున్ జగత్పతి రమాకాంతున్ శుభాధారు భా
స్కర సంస్థానుఁ జరాచరాంతరహృదబ్జక్రోడసంతాను శ్రీ
ధరు లోకేశు సమస్తలోకతను [1]వంద్యుఁ గోటిసూర్యప్రభా
కరు నానందమయాంఘ్రి పంకజా నహిగ్రైవేయక ప్రస్తుతున్ 91

సీ. సౌశీల్య సౌందర్య చారు వత్సల ముఖ్య
గుణ వారిధి లోకగురు మహాత్ము
దేవు బాలక్ష్య భూతియగు ప్రసన్నాస్యు
బింబఫలాధరుఁ గంబు కంఠు

---

1 వందధాతువు ఆత్మనేపదముగాన వంద్యానేక అని సవరించినగాని లేక సమస్తలోకతను వంద్యున్ గోటిసూర్యప్రభున్ గరుణా అని సవరించవచ్చు

సీ. చటుల పదాతి మస్తక ఘర్షణ పరంబుఁ
జెలఁగింది[1] విడివడు సింధురములు
పృథుతర పరిపంథి హృత్పుటంబు లగల్చు
ఖురగతి మట్టాడు ఘోటకములు
పరిదేహ ఘర్షణా ప్తి చక్రస్ఫూర్తి
రావంబుఁ బరగిందు రథ చయంబు
పటుతర శాత్రవ ప్రాణంబులు హరింపఁ
గా హంకరించెడు కాల్బలంబు

తే. గీ. గర్జి ద్రావితరాతి సంగ్రామరంగ
మండలం బొప్పె నప్పు డుద్దండ పటహ
దండఢక్కారావ కాహళ ధ్వాన మయ్యెఁ
గాంచ లోకంబునకు భయంకరత రోధ ౮౮

కావారభూత మహదాహ్వయుడు కాంచీరాజున కభయమిచ్చుట

వ. ఇట్లు ప్రవిధ మహీ[2]మండలాఖండలుం డఖండ విక్రమంబునం గొని సము
ద్దండ కోదండమౌర్వికా టంకార రవంబుగం జేసి విపాటితాశాంత దంతా
వళసాంత పుట పటలాంతరగుచు ఎప్పు కల్పాంత పావక శిఖల దీం
ద్రించు నిశిత నారాచ పరంపరం సందీపితాటోప ప్రతాప విమత వీర
[3]తుంబుఁ జీకాకు గావించి బంధుర మదాంధ సింధుర ప్రేంఖితీయ కం
ఖాల సమున్నత వాతాసీనా వితానంబు రిపుచమూ వర్గంబుపైఁ బురికొల్పి
చురంబు చేయు నెడ లోకంబున కకాలవిలయ సమయ భ్రాంతి సంపాద
కంబుగు పరిపంథి రాజలోకం బసంఖ్య సంఖ్యకంబుగా గుమిగూడి

---

1. మూ. విడు 2. మూ. ఖండలామండ 3. మూ. తుండంబు

విజృంభించి యనాంతరకటాహ నిర్భేదంబుగా ¹నార్చుచుం బేర్చి కార్చిచ్చు
వడవి రౌలుకొను తెఱంగునఁ గాశీపురాధీశ సేనం బరిమార్చి యా వరే
శ్వరుండు సంక్షీయమాన స్వబలంబయ్యు బలవంతుండగుటఁ దానొక్క
రుండు శత్రువులతో యుద్ధంబుఁ జేసి సంగరంబున మత్తంగంబులు
సర్వతురంగబలంబు బంకయుఁ బొలియింపం జేయునంత భీమప్రతాప
వంతులగు మహీకాంతులు పైఁబడి పోరికిం దిగిన బహుకాలంబు వారితోఁ
గూడ సాహసంబు గావించి యుదారంబులగు దర్పహారంబులచేత జర్జరీ
కృత తనుండగుచు విమల ²కీర్తి పొదలు ద్యూతిపాలి నిజపురంబుఁ బ్రవే
శించి యమ్మహాంధు కాసారభూత మహదాహ్వయులగు యోగివర్యుల
సన్నిధి కేఁగుదెంచి యహీత భయంబువల్లఁ దదీయ పదారవిందంబు
శరణంబు నొందిన వార లతనికొఱకు తపయం బొసంగి భయపడిన యతని
రక్షింపవలయునని చక్రిం బ్రార్థించినఁ దద్ప్రార్థనీయుండగుచు నచ్యు
తుండు తచ్ఛత్రువధకాంక్షం జేసి చక్రంబుఁ బ్రేరేపించిన 39

ఉ. శత తమహాప్త బింబరుచి చక్రము చక్రము వేగ మేఁగి యు
ద్ధత శరకోటి కోటి నినదంబు గడంగ నృపాలవర్యులన్
వితత పరాక్రమ స్ఫురణఁ బేర్చి హరించి జయంబు మీఱ నా
క్షితిపున కిచ్చి క్రమ్మఱను జేరె ననంత భుజాంతరంబునన్ 40

కాంచీరాజు శత్రుజయముగాంచి కాసారభూత మహదాహ్వయుం
స్తుతించుట

తే.గీ. అంత నారాజు వారి సత్యాంత భక్తిఁ
బూజఁ జేసి ³సనాతనంబను మహత్త్వ
మును సద్వ్రత మార్గము నెఱిఁగి మునుల యాజ్ఞ
వినుచు తా నిల రాజ్యంబు నేలుచుండె 41

1 మూ నేర్చుచుం 2 మూ దైన
3 మూ సనాతనంబును

తే.గీ. అంత నమ్మున నందఱం దధివసించు
కమలలోచను సేవించి మహితరంపు
స్తుతుల స్తుతియించి భగవంతుఁ జూడ కోర్కె
యందు సత్పుత్రు లగుచు నత్యంత మతిని 42

తే.గీ. పిమ్మట యథోక్తరీతిని విధియుతంబు
గా సమర్పించి యవలఁ బ్రత్యక్షతఁ గాంచి
భక్తి వల్లమ నీరాజనముల నిష్ఠ
హరికిఁ జూపి యొసర్చి రాహ్లాదు లగుచు 43

క. ప్రకటిత మతి నతిఁ బాంధవు
లతి దూరతమైన యనంత ల్మం భూధా
రతు [1] వరుణిఁ జేరి మ్రొక్కిరి
యతులంత స్థితిని భక్తి వంపర నమంన్ 44

తే.గీ. శౌరిని మహోన్నతు మహాత్ముఁ జక్రధారి
శ్రీహరిఁ ద్రివిక్రముని నుపాసించి పిదప
దేవతామాలికి నివాసు దివ్యకాయు
శ్రీ నృసింహునిఁ గరుణాబ్ధి బ్రతివేళ 45

ఆ.వె. సేవచేసి వారు స్థిర నొక్క తలమునం
దున్న యష్టభుజునిఁ దోయజాక్షు
హరిఁ బ్రణవ వస్తు నర్ఘనికేతనా
సహితుఁ గూర్చి మొక్కి సంతసమున 46

---

1 మూ. వసని

వ. విరాజితుండును మహాయశోవంతుండును నగు నద్వైప్పు నుపాసించుచు ననంత
రంబు యమునాతీర్థుల దీపాదం గొనియాడి యివ్విధంబున చిరకాలం
బు దధివసించి కాంచీపుర నివాసులకు తత్త్వంబు బోధించుచు
న్యాసయోగం బుపదేశించి యట నప్పురంబున దాసిపోవ మంగళ శ్రీగృధ్ర
సర స్సరంబునందు నెలకొన్న సకలలోకేశ్వరుండగు విజయరాఘవుం
గతియించి యంత ఏకారణ్యంబు చేరి హృత్తాపనాశ [1] కటుస్థుండగు
వీరరాఘవుం బాడించి దివ్యంబులగు స్తవంబులచేతం గొనియాడి
అదంత్రఘి పంకజద్వయంబుం గూర్చి ప్రణమిల్లి ఎదపం [2]దోతాద్రి
నెక్కి సంశ్రితామర ఘూరుహాంఘ్రగు తుంగశయను నారాధించి పిమ్మట
గజస్థలంబున కరిగి యందల గజాద్రిమ్నల నరసి యవ్వల బలి
పురంబుం బ్రవేశించి మహాబలి సమర్పించి యంతటం బురస్థితుండును
జగత్పతియు నగు భక్తిసారుం గూర్చి విన్నవించిన మస్తకుండగుచు
మిక్కిలి ప్రార్థించి తరువాత దేవేశుండును నప్రయుండును నగు నైంద్ర
పురాధీశు నుపాసించి గోపురియందలి గోపతి నధికముగా సమర్పించి
యుత్తమంబగు శ్రీముష్ణ క్షేత్రంబున ఽ ద్బి ష్టోచనిర్వృతులగుచు దర్శ
నంబువలన ముక్తిదాయకుండగు మహావరాహు సంసేవించి సంపూర్ణ
మానసులగుచు మహా పుణ్యంబగు మహిళాఖ్యక్షేత్రంబునందలి పద్మ
లోచనం గూర్చి నమస్కరించి యనుత్తమంబులగు స్తోత్రంబులచేత
స్తుతియించి యనంతరంబు 47

## కాసారభూత మహదాహ్వయులు శ్రీరంగంబు ప్రవేశించుట

క. ధరణిని ప్రత్యక్షమయిన
పరమపదము నిఖిలలోక పావన మధికో
త్కరమగు శ్రీరంగము ముని
వరులు ప్రవేశించి రతుల ధామాన్వితులై 48

---

1 మూ కటి 2 మూ ప్రో

సీ. అతి భాసురము ప్రభావాకారము మహోన్న
తంబు నామ్నాయ పరంబు కాంచ
నాద్రి పోల్కి సింపనగు రంగ సంజ్ఞకం
బగు సద్విమానంబు పథిక భక్తి
దూరంబుగాఁ గాంచి వారు భారతి నేత్ర
వక్త్రపాణముఁ జేసి వక్త్రసక్తిఁ
గల్గి వినయ సమాత్కలితులై యుత్తమం
బగు నా రథం బెక్కి యందుఁ దనరు

ఆ.వె. భుజగ శయను గౌరిఁ బరమ శ్రీ రంగ నా
థుని ననేకకోటి తోయజాప్త
సన్నిభ ప్రభునిఁ బ్రసన్న ముఖాంభోజుఁ
బుండరీకనయనుఁ గాంచ నదను 49

సీ. మకుట కుండలాదిప్త సుకర ముక్తామణి
హార విభూషిత పమర వినుత
విష్ణుం బీనోరస్కు విభ్రాజిత స్వర్ణ
వసను వక్షఃస్థిత వారిరాశి
తనయతోఁ గూడ మద్యద్విద్యుదంచిత
పీం మేఘముఁ బోలి నెఱయు వానిఁ
గంబుకంధరు దివ్యకాంతి గుణ ధరుని
నతులిత పారిజాతాగ్రము యష్టి

తే.గీ. సూత్రకోటిచేఁ బరమ పవిత్ర దీక్ష
తనువిఁ బ్రస్ఫుటాబ్జ కరపద్ముఁ దత్త్వ సద్ము
స్వామి నీం కువలం దళ శ్యామ గౌరి
హారిబి హస్తోపధాను మహానుభావు 50

సీ. దైత్యసంహార నీకు దండంబు హరిభవే
ర భవా యనంత సరసిజాక్ష
పద్మాసనస్తుత్య ప్రణతి నీ కొనరు ప
ద్మప్రద నతి నీకుఁ బద్మపాణి
వనమాలి నీకు వందనము వ్యాఘ్ర ని
వాసి పంకజనాభ భక్త వరద
సత్య స్వరూప ప్రసన్నుఁడ వగుము శ్రీ
రంగనాయక గణనాథ వినుత

తే. గీ. శంకరార్చిత శ్రీపాద పంకజాత
యమరపాల ప్రశాంత ప్రపన్నార్తిహారి
కాంతి కోటిల దేహ సంసారనాశ
[2]మా కనుగ్రహండవు కమ్మ లోకధారి 64

కాపాలభూర మహదాహ్వయులు కావేరి తటంబునం దధివసించుట

వ. అని యిబ్బిధంబున దేవదేవుంగొనియాడి తదీయ కరుణావర్ష సంప్లుతులై యందున్న వారలచేతఁ బూజింపఁబడిన వారలగుచుఁ గించిత్కాలం బధివసించి యనుత్తమంబును [3]సరహస్యంబును దాత్పర్యసహితంబును నగు ధ్యానయోగం బచటి వారల కందఱికి నధికారానురూపంబువలన నేర్పించి యార్తులకు వార్త ప్రవర్తియుఁ [4]దృష్టులకుఁ దృప్తాంతఃకరణంబును ధ్యానశీలురకు ధ్యానంబును

---

1 ము. మూల విద్ధచరిత్ర 2 మూ. మ కనుగ్రహండవు నమ్మ
3 సరహస్య 4 మూ. దృష్టులంగు 5 మూ. కాలము

యోగ శాంతులతు యోగంబునుంగా దాని [1]వాదేరెంపుడు రంగనాయకానుభవేచ్ఛా పరులై కవేర కన్యకా తీర సంఫుల్ల వందనాంతర నివాసులై యుండునపుడు క్షుధా పీడితుండును [2]చిర్యమాణ శిలావయవుండును సంచారక్షమ వర్జితుం డును [3]గుష్ఠరోగియు నగు నొక్క విప్రుండు దిరయలుగు జనప్రకష్టంబుచేత వారి ప్రభావం బాలకించి తద్యాత్రిచేతఁ బరిపూర్ణంబుగు మనంబు గలవాఁడగుచు స్వగ తంబుం గూర్చి యిట్లనియె 66

క ఆయతర గురు ఁ గీ
ప్రయ[4]తన పీనటబునందు రంజిలఁ దర్పా
దయుతాంశ జగరిఁ జేర్చ్యఁడు
ధయ నను జమలార పీ రుదంచిర మతులై 66

క ఆనుడు జను లతని వాక్యము
విని దాని వలావను గట్టి [5]వేఁడి తర్పా
దనలిన లక్షణముగు న
మ్మునివాన సమీపదేశమున్ జేర్చిరొగిన్ 67

వ అంత 68

ఉ అతఁడు మాటిమాటికిఁ ద దంఘ్రి పరాగముఁ గ్రమ్మికొన్నవాఁ
డై తదనూన వేష్టనమునంద యథేష్టతఁజేసి హేయ సం
[6]ప్రీతుఁడు రోగియై వతఁడు విస్తృత దివ్య శరీరధారియై
ఖ్యాతి గమించె ధారుణి సుమాంబక సన్నిభుఁడై మహోన్నతిన్ 69

1 మూ వావేశం 2 మూ విశీర్ణమాన 3 మూ కుష్ఠయోగి
4 మూ సుత నీ తటంబు 5 మూ దే 6 మూ స్పె

శ్రీరంగనాయకు సంసేవించి వివిధంబులగు రత్నంబులును విచిత్రంబులగు వంబ రంబులును మహత్తరగు స్వర్ణంబును రజతంబును నను నను త్తమంబును నసంఖ్యాం బగు ప్రియతోన్నతార్పితంబును నగు వస్తువు లమర్పించి తద్భృత్యులకుఁ గనకమణి వసనాదికంబగు ద్రవ్యం బొసంగి యపు యోగీంద్ర సేవ కౌతుకఁ దద్గ్రామం బున కరుగుదెంచి మహిమాన్వితులు విప్రులాదులను నన దారం నిరీక్షించి కుటుంబినీ కుమారికలతోఁ గూడఁ బత్నాఁ గావించి యప్పుడు 61

## యోగిదాసుఁడు చోళరాజకన్యకా శతమును బరిణయమగుట

సీ. ఆ రాజ పుత్రిక లరిరమణీయ కం
దర్ప సన్నిభు యోగిదాసుఁగాంచి
మన్మథ నిర్పన్నమానసులై వాని
యందు విలగ్న[1]మైనట్టి యాత్మ
ననుఁబొంది యచ్చట నధివసియింప వా
రంచిత్త మెఱిఁగి యరాఁ మదన
సుందరుండగువానిఁజూచి యమ్మౌనిఁ
గూర్చి దండము వెట్టి గురుమునిపఁ

తే.గీ. దనరఁ గృతాంజలి యగుచు వినుతిఁజేసి
తమ్ముమలవల్ల నాయోగిదాసకులము
గలయ విస్తృతి గోత్రంబు దెలిసి ప్రీతి
నరది గొనఁగొను[2]ధారఁ గన్యాశతంబు 62

క. పౌరి నరట యోగిదాసుఁడు
గరమునఁ బాణిగ్రహణము గావించెను ద

---

1 మూ. మానసలై వట్టి 2 దార

ధరతీరతుమారికలను
పరిపూర్ణానంద విమల భవ్యాత్ముండై ౬౩

మ. అనపత్యుండయి యమ్మహీపతి సముద్యల్లీలమై సర్వమా
తనరాజ్యం బట యోగిదాసునకు సత్యస్ఫూర్తిగా నిచ్చి వే
డ్కను దానిం జతురంగ సైన్యముల తోడన్ వేగ మార్కొయ ప
త్రసమూహం జేరఁగఁ బంపి తా నచట సుధ్యాన స్థితిన్ వర్ధిలెన్ ౬౪

తే.గీ. ఘోర వైరాగ్యుఁ డగుచు నా భూవరుండు
సంతతంబు హరిప్రియ నామముఁ గూర్చి
భక్తి సంకీర్తనఁ జేయుచుఁ బ్రమతి మోక్ష
మొందె దేహాంతమందు నానందుఁ డగుచు ౬౫

ఆ.వె. అంత యోగిదాసుఁ డంగనాసహితుఁడై
బల సమేతుఁ డగుచుఁ బట్టణంబుఁ
జొచ్చి రాజ్య భోగములు చిరకాలంబు
ననుభవించె [1]సుఖరతాప్తి యగుచు ౬౬

క. అరయ నొకప్పుడు హరి
కింకర సేవ యొనర్పు కొఱకు శౌరిప్రియుఁ డు
త్కర మతిని యోగిదాసుఁడు
స్థిరభక్తిం జేరె వేడ్క శ్రీరంగంబున్ ౬౭

---

1 మూ. సుఖ

తే.గీ. అందుఁ దగు యోగి రాజ పదారవింద
[1]శ్రితతాపనియంత విశేషభక్తిఁ
దివురు నా యోగిదాసుఁ జింతిత ఫలము
నడిగి మౌనులు సంప్రీతి నలవరింప 68

క. ఆర మనవద్యుఁ గ నాతని
నెఱిఁగి మునులు వాని కొసఁగి రింపుగ తత్సం
ఘ[2]రజస్సమర్చన యుత
స్ఫురణము హరిభక్తిరతము పుత్ర రతంబున్ 69

వ. అంత 70

క. మును లాతనిఁ బంపించిన
ననుపమమతి యోగిదాసు ద[3]తి మోదముతోన్
జనియెఁ దన పట్టణమునకు
ఘనతర చతురంగ బల నికాయము తోడన్ 71

వ. అనంతరంబు

శా. శ్రీమంతుండగు యోగిదాసునకు సందీప్త।ప్రతాపంబు ను
ద్దామ శ్రీ విభవంబు పుత్రరత సమ్యక్ప్రాభవంబునన్ గల్గఁగా
భూమీనాథుఁడు పెద్ద కాలము మహాభోగానుసంధాయియై
ప్రేమన్ యౌవన సంపదం దనరె గంభీర ప్రతిష్ఠారతిన్ 72

వ. నిగమ నిగమాంతవేత్తలును ధనుర్వేద విశారదులును నగు వారంఁ జీరం
బిలిచి కాలంబుచేత యౌవనంబు నొందిన సంతతంబు విష్ణుభక్తి పరులును
తదీయారాధనోత్సుకులుగాఁ దనరుట మహీ విభుండు పుత్రరత్నంబునకు

---

1 మూ. ధి. తాపని 2 మూ. రసజసేవార్చనయుతి 3 మూ. పతి ప్రమో

రాజ్యశతం బొసంగిన మహాబలులగు రాజపుత్రులు తమతమ రాజ్యంబు
లెంది ధర్మంబున సకలం జగతిం బాలింపుచు హరిప్రియులై యనయంబు
భగవద్భాగవత పూజనంబు గావింపుచుఁ బ్రీతిచేత [1]నర్లై యలరింపు
చుండి రంత ధీమంతుండును నిరపేక్షుండగు యోగిరాజుండు మోక్షార్థి
యగుచు రంగ క్షమాతలంబు నందున్న యయోధ్యం సన్నిధి కేఁగు
దెంచి నిరంతరంబు శుశ్రూష గావింపుచుఁ దత్కృపాకటాక్ష వీక్షితుం
డగుచుఁ దత్పాదసేవకుండయి వారంవలన న్యాసమార్గం బవగా
హించి తదనుగ్రహం బువలన దుర్గమంబగు పరమ స్థానంబు బ్రాపించె
నేతద్యోగిదాస చరితం బెవ్వరు చెప్పుదురు వినఁగలరు వారిహలోకంబు
నందలి సుఖం బనుభవించి దేహాంతంబునందు పరమం బొందుదురని మహా
యోగి మాహాత్మ్యంబు [2]మిమంతంబునగు భార్గవ పురాణంబు నందలి సప్త
మాధ్యాయంబు సంవాద రూపంబుగా భక్తపరాయణుండగు నారాయణుండు
నయనకుం జెప్పెయు వెండియు నిట్లనియె 74

## కాసార భూతమహదాహ్వయులు సకలలోక తీర్థాటనంబు సేయుట

తే గీ ఇవ్విధంబునఁ జిరకాల మెలమి మౌని
పుంగవులు భక్తిఁ జేసి శ్రీరంగమున వ
సించి యవ్వలి వెడలి వివేక మతిని
భూరితర మార్గమునుఁ గూర్చి పోవ నెదుట 75

క విమలాని శ్రీరామ క్షే
త్రము నడుమ వసించు హరిని ధరణీ నాథున్
గమలాక్షు గానక్షియు
నమూదందిర భక్తిఁ బాఁ నర్పిన వివదన్ 76

---

1 ము నట్లనె వం 2 ము

తే.గీ. శ్రీనివాస స్థలమున వసించు దేవుఁ
డార్తజన భక్త కల్పవృక్షోత్తముఁ డాత
భక్తిఁ గావించి యవల సువర్ణ భవన
వాసిని హరి సువర్ణన్ సపర్యఁ జేసి 77

క. పొగడొందఁగ నటఁ బుణ్యం
బగు వ్యాఘ్రపురంబునందు నలరు మహా బా
హు గిరిశ వందితు శ్రీహరి
నగధరు నర్చించి రతులితాహ్లాదమతిన్ 78

తే.గీ. అంత నాకాశనగరంబునందుఁ గల్గు
హరిని భక్తపరాయణు నంబుజాక్షు
శ్రీహరిని భక్తవర్గ నారాధనంబు
సల్పి యవ్వలఁ దోషిత స్వాంతు లగుచు 79

క. వనజాక్ష భక్తి తత్పరు
లనఘులు మౌనివరు లుత్పలావర్తకమం
దొనరిన శౌరిని యచ్యుతు
ఘనుఁ బూజయొనర్చి విగతకలుషాత్ములరై 80

తే.గీ. అంతటను బుణ్యచరియుగా నలరి ఖ్యాతిఁ
గాంచు మణికోటియందులఁ గల్గుదేవుఁ
బుండరీకాక్షుని మహాప్రభుని నుతించి
యవలఁ గృధ్రపురినిగూర్చి యరిగి యందు 81

క. తనరు మహాకృష్ణుని పద
వనజంబులఁ గూర్చి ప్రమోత్కట భక్తిని యతనిం
గొనియాడి మౌని పుంగవు
లనుపమ హృదయానురాగులై యటఁ జనుచున్ 82

క. అమలంబగు విష్ణుస్థా
నము చేరి యచటి మహాత్ము మదనగోపాలున్
గమలాధినాథు నచ్యుతు 83
సముదంచిత భక్తిఁ బూని సల్పిరి పేర్మిన్

వ. అంతటఁ బుణ్యంబగు శ్వేతహ్రదతీరమునందలి శాంతమూర్తిని సమర్చించి
పిదప నగ్నిపురమునఁ బ్రవేశించి యచటి సురప్రియు సమారాధించి
యనంతరంబు భార్గవస్థానంబునందలి భార్గవుం బ్రార్థించి వైకుంఠాఖ్యం
బగు క్షేత్రంబునందలి మాధవుని పదారవిందంబులు సేవించి యటఁ బురు
షోత్తమం జేరి భక్తసులభు సర్వసందు గావించి యవల చక్రతీర్థంబునందలి
సుదర్శనుంగూర్చి తరలంబులఁ బొంది మహాపుణ్యంబైన కుంభఘోణంబునందలి
శార్ఙ్గపాణి చరణకమలంబులం గూర్చి ప్రణమిల్లి కొనియాడుచు నచ్చోటు
వాసి భూతస్థానం బాశ్రయించి శార్ఙ్గధరునకుఁ జేసి, యంత నమ్మునులు
కపిస్థలంబున కేఁగుదెంచి గజార్తిఘ్నుం గూర్చి నమస్కృతిఁ గావించి
యంతటను మనోహరంబగు చిత్రకూటంబునందు వెలుఁగొందు నుత్త
మోత్తమంబగు గోవిందుఁ గాంచి ధ్యానంబుచేసి తరువాత శ్వేతపర్వ
తంబునందలి పద్మలోచనుంగూర్చి నమ్రులై యథాన్యాయంబుగాఁ
బూజించి పిమ్మటఁ బార్థస్థలంబునకుం జని యందు పరబ్రహ్మ నుపాసించి
యనంతరంబు కృష్ణకోటియందలి మధుద్విషు సేవించి మహామునులగు
వారలు పరిపూర్ణ మనోరథు లగుచు నందపురి యందలి మహానంద
నిధినందనముగావించి మథురాపురి కరిగి యచట వృషాశ్రయు నాశ్రయించిన
వారగుచు నంత 84

తే. గీ. అతులమగు సంగమగ్రామమందుఁ జేరి
సంగమాహ్వయు సేవించి సదయు లయ్యు
సింధుడు శరణ్యపురికేఁగి నిష్ఠభక్తి
శరణముగఁ గొంటిరి శరణ్యు హరినిఁ గూర్చి 85

క. విమలంబగు సింహక్షే
త్రమునకుఁ జని యందుఁ గల్గు ధరణీధరహరిన్
గమలాక్షు మహాసింహునిఁ
గమనీయ సుపాశ్రయంబు గావించి యటన్ 86

క. ధరణీమంటప సంస్థిత
హరి మల్లారిని నుతించి రసఘనులు మహీ
శ్వరులు సమాహ్లాద హృదయు
లురుతర సుఖి[1]తాత్ములగుచు నూర్జితరీతిన్ 87

క. ఘనమగు నిబిర క్షేత్రం
బున జేరి మహాత్ము లఖిల పూజ్యుని దేవే
శుని నిబిరాకారుని హరి
వనజాక్షుని సంశ్రయించి పరమోత్సవులై 88

క. లలి దట ధానుష్కంబునఁ
గల జగదీశ్వరునిఁ బూజగావించి మహో

---

1 మూ. లాత్త

శ్రీల యగు మోహనపురి యం
దలి యచ్యుతుఁ గాంచెఁ బాదరించి రొగిన్ 89

వ అంత 90

తే ఇల సరోభూత మహదాహ్వయులు సుభక్తి
నలరఁ బద్యంబు సమకూర్చినట్టి మధురఁ
వేరి సుందర పదసరసీరుహంబు
సంశ్రయించి మునీంద్రులు సంతసమున 91

క భాసుర మతి వృషభాద్రిని
వాసము గావించినట్టి పరమస్వామిన్
దాసవనుతుఁ బూజించిరి
ధీ సంపద గర్గ నిఖిల దివిజస్తుతులై 92

వ అంత శ్రీ మధ్వరగుణ క్షేత్రంబు నందలి నాథు మహానింది ప్రేమార్ద్రిం
ఎను గమలంబును నగు మనంబు గలవార లగుచుఁ బిదపఁ గురుకాభ్యంబగు
మహోత్సవంబు నందలి రమాసఖు నారాధించి ప్రియాన్వితు లగుచు గోష్ఠీ
పురంబునందలి గోష్ఠీపతి నభివాదనంబు గావించి దర్పసంస్తరణార్థ మేగు
దెంచి శయానుంగూర్చి వందనం బొనర్చి ధన్విమంగళక్షేత్రంబునందలి
శౌరిం బూజ గావించి క్రమరక్షంబునం దధివసించు బలాఢ్యు నిక్కలి
సపర్యసల్పి కురంగంబు నందలి పూర్ణుఁ బ్రార్థించి యనంతతీర్థంబు
నందలి విష్ణుం గూర్చి మాటిమాటికిం బ్రణమిల్లుచు దివ్యంబులగు నంస్త
వంబులం గొనియాడి భద్రవతి యందు సమావిష్టుండగు నచ్యుతు నర్చగా
వించి పుణ్యంబగు ననంతశయనం బందుండు జగత్పతియగు పద్మనాభుం
గూర్చి నమస్కరించి స్తుతిఁ జేసి పరమానంద నిర్భరులగుచు మహీతలం
బున నిప్పిధంబున నగణితంబులును మోక్షదంబులును విష్ణువాసభూతంబు

లను దివ్యంబులును నేతదాద్యంబులును నగు క్షేత్రంబులం గూర్చి సంద
ర్శింపుచు యోగివరులు సంసారధ్వాంత[1]వర్తులగు తత్తన్నివాసులకుఁ
గృపాస్పదులగుచు సంతతంబు ధ్యానయోగ ప్రదీపంబున బ్రహ్మాది దుర్ల
భం బగు మోక్షంబు దర్శింపఁ జేయుచు యదృచ్ఛచేతఁ గొందఱు కాలం
బధివసింపుచు ననంతరంబు యొక్కసమయంబునఁ గ్రమ్మఱ వేంకటాద్రి
కరుదెంచి వెండియు తత్తీర్థంబునం దధివసించి యథాసుఖంబుగా సమా
సీనులగుచు మనమిప్పు డనుత్తమంబగు నశేషక్షేత్రయాత్రలు గావించితిమి
శ్వేత ద్వీపాదియాత్రఁ గావింపలేదని మిక్కిలి చింతించి యప్పుడు 93

క. వారు మహా యోగము వి
స్తారమతిం గొని యధోక్షజస్మరణము వా
ర్పారఁగ శ్వేతద్వీపముఁ
జేరిరి నిస్తుల మహత్త్వ శీలాస్పదులై 94

క. పేరిఁ దారకసంజ్ఞికమై
పరగంగా నందు నుండు పరమగుబ్రహ్మం
బరసి శిరస్స్పృష్టాంగముఁ
గరపి రథికసుతులఁ జేసి గౌరవఫణితిన్ 95

సీ. అంతట క్షీరాబ్ధి కరుదెంచి శ్రీభూమి
ప్రభాశితుని హరిని విశ్వరూపుఁ
బన్నగశాయిని భవహారుని దివ్య
మగు నలంకారంబు నలరువాని

1 మూ॰ వర్త

ఉ అందుఁ దనర్చు విష్ణుఁ బరమాత్ముని విశ్వవిభున్ బ్రభున్ సదా
నందు రమాసమేతుని యనంత విధాతృముఖౌఘసేవితున్
గంధనిభాంగు నచ్యుతునిఁ గౌస్తుభ భూషణదివ్యసుందరున్
మందరధారిఁ గేశవు సుమామత పాదపయోరుహంబులన్ వాసిన్ 100

క నక[1]లాలంకృతి సంయుతు
మకరధ్వజు జనకుఁ గాంచిమోక్షేశ్వరు లా
తృప్తక భావుఁడగుచు మ్రొక్కిరి
[2]వికసీకృత భక్తి హృదయ విమలాంబుజుఁడై 101

తే గీ దివ్య సన్నుతుల నుతించి దివ్యదీప్తు
లవల సామోదలోకంబు నందుఁ జేరి
యందు వర్తిల్లు ననిరుద్ధు నమలమూర్తి
నరసుని నుషాపతిని గూర్చి సంస్తుతించి 102

వ అతని నమస్కరించి సంప్రహృష్ట తనూరుహుం డగుచు నటఁ బ్రమోదకం బగు లోకంబు నందలి ప్రద్యుమ్నుం గొనియాడి దివ్యస్తుతులంచేసి సంస్తుతించి యోగీంద్రులుఁ బ్రహృష్టు లగుచుఁ దదన్యామోద లోకస్థుండును విభుండును నగు సంకర్షణుం గూర్చి మ్రొక్కి పరిపూర్ణమనోరథు లగుచు స్తోత్రింబు గావించి యవల నానంద నిలయంబును మహత్తువగు వైకుంఠ నిలయంబుగాంచి యందు దివ్యంబగు సింహాసనంబునందుఁ బ్రకాశించు సనాతనుండును గోటిసూర్య ప్రతీకాశుండును గోటిమన్మథ సదృశుండును దివ్యపీతాంబర ధరుండును దివ్యకుసుమగంధ సమన్వితుండును శ్రీ భూసి

---

1 మా సకలాంకృతి 2 మూ వికస్వ

శాసనాయుక్తుండును ఛత్రచామర శోభితుండును ననంతగరుడాది నిత్య
ముక్త సంసేవితుండును నగు వాసుదేవుం గూర్చి పునః పునః ప్రణామం
బాచరించి మహాహర్ష పరిపూరితు లగుచు నిగమాంత సంస్థితంబులగు
స్తోత్రంబులచేత స్తుతియించి పూజాదికంబు గావించి శరణ్యంబగు తచ్చ
రణ కమలంబుఁ గూర్చి పరంబగు శరణంబు నొంది యిట్లు భగవంతుని
దివ్యలోకంబు దర్శించి తత్కృపా సంభృతు లగుచు వెండియు ముదంబునఁ
జనవెండి యివ్విధంబున నిరంతరంబు భగవద్ధ్యానంబులు విలోకింపుచుఁ
విరుగుచు నిం యం దధివసించిన వీరం దివ్య చరితం బెవ్వ రాలకింతురు
వార లాయురారోగ్యంబులు పరమైశ్వర్యంబు ప్రాపింపంగలరని మహాయోగి
మాహాత్మ్యంబున సంవాద రూపంబును శ్రీమంతంబును నగు భార్గవ
పురాణోత్తర ఖండంబు నందలి యష్టమాధ్యాయంబు భక్తపరాయణుండగు
నారాయణుండు నరునకుం జెప్పె క్రమ్మఱ నిట్లనియె 108

సీ. అంతటఁ గాంచిమహా పురంబునకుఁ బ్రా
గ్భాగ మం[1]దత్యంత భవ్య మగుచుఁ
బార్వ పారావారమునకుఁ బశ్చిమ భాగ
మందు నానా మహీ [2]పాల కోటి
కంబొంట నప్పుడు దైవ షురోప మం
బగ మహాసామ్రాజ్య పురవరంబుఁ
బొలు పొందు మనుష్యయంపప్ప భగవంతుఁడు
విశ్వ స్రష్టఁడు బ్రహ్మ విబుధనుతుఁడు

తే. గీ. జగతిఁ దక్ష క్షేత్ర మొకటి దశ నకలంబుగు
క్షేత్రమూలోక దశ నుంది స్థిర మనివ

---

1 మూ ఎది 2 మూ బాల

దాని సారంబు దెలియుటకై నయమునః
[1]దాశెఁ బాతుర్య మెసఁగ సంతోషి యగుచు 104

భక్తిసారుని జననము

క. మన తరమగు [2]దా షేత్రం
బున గం మహా పార యగుట భూరి మహిని దా
ని నెఱింగి పద్మ భవుఁడి
ట్లని తద్యా మంబు దాని కంపర పఱచెన్ 105

తే గీ [3]ఆదియు మొదలగ ధారుణి యందు నప్పు
రము మహిసార సంజ్ఞతే నమర రదలి
ధాన విఖ్యాతి పూజ్యామృత ప్రదాయి
నిగఁ బ్రకాశించు నిత్యంబు జగి గదంగి 106

సీ. అట పావనంబగు నప్పురమునందు
దేవేశు రధిపతి దివ్యమూర్తి
కైవల్య మార్గానుకాంక్ష విరించి ప్ర
భృతి సురభార్గవర్తితతి భక్తి
నిత్య సంసేవ్యుండు నత్యసంధాయుండు
దనరుట ముక్తిప్రదంబు సర్వ
భూరుహ సేవితంబు మునీంద్ర జీవనం
బును దివ్యమును ఖ్యాముగఁ దనర్పుఁ

---

1 మూ దాళ్ఫ 2 మూ మగుషే
3 మూ అది మొదలు ధారుణి

తే.గీ. తత్పవిత్రాశ్రమమునందు ధన్యుఁడౌచుఁ
భార్గవ[1]మునిఁ దతులప్రభావ ధుర్యుఁ
డాత్మ విద్యా విశారదుఁ డయమనిష్ఠ
[3]నూని తపమాచరింప [2]నుద్యుక్తుఁడయ్యె 107

తే.గీ. అట మహాగ్రీష్మమునను బంచాగ్ని మధ్య
సంస్థితుండయి హిమవేళ జలమునందుఁ
జేరి వర్షర్తువున బహిస్స్థ నుండి
తపము గావించె నాతఁ డుగ్గాఢ మతిని 108

క. తరిమష్టాక్షర మంత్రము
స్థిర మతిఁ జరియింపు చతఁడు శ్రీహరి యర్చన్
గరపుచ దుస్సహమును న
త్యురువుగ ఘోరముగఁ దపము సేయుచుఁ దనరన్ 109

క. అల దుస్సహమైన తపో-
నలమునఁ దప్తుఁడయి దివిజనాథుఁడు క్రోధా-
జ్వలుఁడై దానికి విఘ్నము
నలవడ క్షుద్రితుఁడగుచు సత్వరలించన్ 110

తే.గీ. అప్సరసలందు శ్రేష్ఠయౌ నట్టిపతిని
కోటదాస్యముఁ గనకాంగి సుప్రభఁ బిలిచి

1 మూ మునీశ్వరు 2 మూవి 3 మూ తనకాంక్షి

యాచిన భార్గవుఁ డవమ హరింప దా స
రోషమునఁ గూర్చి నవ్వి విడెం దనియె 111

చ పరమతి బ్రహ్మపుత్త్రుఁడు భార్గవమౌని యొనర్చు వెక్కసౌ
పరఁగుఁ దపంబు విఘ్న మగునట్లుగఁ జేయ మటంచు వేడ్కమై
స్ఫురదతులైన యట్టి సురపుంగవుఁ డంపిన నా సుతాంగి నం
స్మర యయి భార్గవాశ్రమరసాస్థలి కెయ్యెడవచ్చె నున్నతిన్ 112

తే గీ వచ్చి యా భార్గవునిఁ గాంచి వామనయన
శ్రేష్ఠరూపంబు గావించి ఋషికులేంద్రు
ప్రేమ పీడాకృతిత శబ్దముం గఱపుచు
లలిత గాంధర్వ గానంబు సలిపె యప్పుడు 113

క కలయఁగ లహరిచేష్టితమై
కలరవము దనర్చు నధికగాంధర్వము వి
క్కలి విని ముని దనతపమున
కలవడు విఘ్నంబు[1] దక్కి వరిసంచలనై 114

వ అమ్మునివరుండు సూనబాణబాణనిర్భిన్నుండై యత్యంతియం దాప్తంబగు మనంబు కలఁగఁగుచు దానితోఁగూడ రమియించి పిదపఁ దపోవ హరణంబు వలన దీనాత్ముండును బశ్చాత్తాపంబు నంజేసి దుఃఖితుండును నయ్యెఁ బరిశుద్ధ భావంబు గతంబయ్యెనని పల్కి నిష్కృతి యందుఁ గృత నిశ్చయుండగుచు భగవచ్చరణ కమల శరణాగతహృదయుండై

1 మూ. దక్షినపుడు

యాత్మ విద్యా వినీతాత్ముండును సర్వభూతదయామయుండును నగుచుఁ దీర్ఘయాత్రాపరుండయ్యె నప్పు డక్కనకాంగి భార్గవుని సంకల్పంబు వలని సద్యోగర్భంబునం జెసి పరమ శోభనంబగు కలిద్వాపర సంధి కాలంబు నందలి పౌర్ణమాసియందలి మహూర్తంబునందుఁ బుత్రుండును యోగి పుంగవుండును శ్రీపతి ధ్యాన సుధాపాన సంసక్తచిత్తుండును సుజ్ఞానుం డును నగు తనయుం బ్రసవంబుగాంచి యట నొక్క లతాగృహంబు నం దక్కుమారుఁ జేర్చి కార్యసిద్ధి వడసి దివిజలోకంబు గూర్చి [1]చనిన పిమ్మట సర్వత్ర శ్రేష్ఠం బగు నా లతానికేతనంబునందు సామస్వరంబున రోదనంబు గావింప నంత నఖిలేశ్వరుండును మహీసార పురీశ్వరుండును నగు వాసు దేవుండు శ్రీ భూమి సహితుం డగుచు ప్రత్యక్షంబుగాఁ దన్నికుంజంబున కేఁగుదెంచి ప్రియతోఁ గూడ సంతుష్టుం డగుచుఁ గటాక్ష వీక్షణామృత ధారల ననఘుఁడగు నా శిశువును సంతృప్తుం గావించి తిరోహితుం డగుటయు నబ్బాలుండు సంప్రాప్త [2]స్వాంతుఁ డయిన యనంతరంబు 115

మ. హరిదాసాఖ్యుఁడు వేఁబలాధికుఁడు సర్వ ప్రాభవోపేతుఁ డు
త్కరతేజుం డనపత్యుఁ డుత్తముఁడుఁ బ్రఖ్యాతాను మోదుండు శ్రీ
హరిభక్తుండు మహానుభావుఁ డగు వాఁడారూఢుఁడై యవ్వన
స్థిర కేతంబునఁ ద్వరాన్వితుం డగుచు విచ్ఛిన్నాఘ సంస్కారుఁడై 116

ఆ.వె. శోకసంభ్రమములఁ బరగింపు దా వేత్ర
మందిరాంతరమున మఱియు బాలు
నగవు వాలకించి వచ్చి మోదమున న
ర్భకునిఁ గాంచి పూర్ణభావుఁ డగుచు 117

---

1 మూ. చనిపిమ్మట 2 మూ. ఎంతు

తే గీ దీప్తి విద్యోతమానుని దివ్యలక్ష
ణాంకితునిఁగాఁగఁ బహురతి నరసి యద్భు
తంబు నొంది వరుండు పదస్థుఁ డగుచు
నింపు మీఱంగఁ దనమది నిట్టు లనియె 118

సీ ఈ క్షేత్రవన మేద పీ విద్య మంగళ
విగ్రహం బేద స్థాపించి చూడఁ
దలిదండ్రు లెవ్వ రీ స్థలమున నెట్టులం
యధివసియించునీ యర్చకుండు
క్షితిని యెవ్వనిచేత జీవింపఁబడు వీఁడ
టని యవ్వనంబునం దమ్ము హొందు
చింత గావింపు చా శిశువునకు ఒనర
మృక్కంబు లేకున్కి మోద మందు

తే గీ చెంతు మనపతుఁడ నగు నా కతిశయంబు
నగు దపత్యంబు దైవ మొసఁగెఁ బ్రియమున
వని మనంబున నిశ్చయుఁడై గ్రహించె
నుత్తముని బాలకుని నిగమోక్తరీత్ను 119

వ అంత 120

క ఉరమున నర్చకు డిడికొని
శిర మాఘ్రాణించి సంతసిలు చిత్తముఁ బెం
పరయ లతాగృహము వెడలి
పరమానందాశ్రు భరిత భవ్యదృశుండై 121

ఆ వె గృహముఁ జేరి తనదు గృహిణి కొసఁగె బాల
గౌరి పాదలోల సత్యశీల
వేయిలాభ్యుదయుండు విభవసంపన్నుండు
స్ఫూర్తి యుతుఁడు నిత్య కీర్తితుఁడు 122

సీ అటు యశోద సరస నత్ప్రీతి సంహృష్ట
యై పూర్ణిమ మాడ్కి నవతరించు
సుతునిఁ గ్రైకొని పరిశుద్ధ సుగంధ జ
లాభిషేక మొనర్చి యతులమతిని
స్తన మధ్యమునఁ జేర్చి చన్నివ్వ నమ్మహాఁ
బెదుటఁ గల్గిన దేవు నింటిరేశ
జగదధిపాంశు సందర్శన మొనర్చి
తత్పదాంభోరుహ ధ్యాన మనరు

తే గీ సుధ గ్రహించుటవలనను సుస్థిరముగ
పుత్రు తృప్తియుఁ దాని యౌత్సుక్య మొంది
తల్లి చనుబా లొసంగినఁ ద్రావ కహర
హంబు వర్ధిష్యమానుఁడై యలరె[1] భువిని 123

తే గీ ఇట్లు బహుదివసంబులు సన నెల్లజనులు
హృష్టపుష్టాంగు వరయుంబు వృద్ధినొందు
వానిఁగని విస్మయమునొంది పరమదేవుఁ
గాఁ దలంచిరి సంతోషకారులగుచు 124

---

1 మూ విభు

వ. అంత 125

క. ధర నందుండిన యొక ధా
సురుఁడు మునలిచాఁడు తనదు సుందరితోడన్
దొరిఁ బుత్రార్థముగాఁ దాఁ
జిరకాలము గడపెఁ దత్పరిత్వం బగుచున్ 126

## భక్తిసార శతకమాహాత్మ్యము, అనిరుద్ధ జననము

వ. తత్ప్రభావంబు విని ద్విజశ్రేష్ఠుం డతని దైవంబుగాఁ దలంపుచు నొక నాఁడు గోసంబంధంబగు పయంబును నాజ్యంబునుఁ గ్రైకొని యొక్కనాఁడు వేణులావిక గృహాంతంబు ప్రవేశించి పటుశ్రీయమఁగు జనార్దను వసిడి రమ్యంబగు తన్మందిరంబు నందలి శాలయందు బాలార్కసంకాశంబగు నయ్యర్చకు నవలోకించి యోగనిద్రాపరాయణుండగు నయ్యోగీంద్రు స్తుతియింపుచుఁ దదీయ చరణంబుల కెఱఁగి పురోభాగంబున దుగ్ధాజ్యంబు లిడి మహాత్మా! భక్తవాంఛ ఫలప్రదుండ వగుటఁ గుచేలుం డొసంగిన పృథుకప్రసృతి శ్రీధరుండు సంగ్రహించిన విధంబునఁ బ్రీతిచిత్తంబు భక్తి పూర్వకంబుగా దీని గ్రహింపుమని యట్లు నుడివినఁ గరుణాసాంద్రుండగు యోగీంద్రుండు సమీపవ పద్మాసనుం డగుచుఁ బ్రియంబుగ క్షీరాజ్యంబుల గ్రోలి నిర్వృతంబునఁ బ్రీతిచిత్తంబు భక్తి పూర్వకంబుగా వారిచేత సమర్పితంబగుదానిఁ ద్రావుచు నొకనాఁడు నమ్మహానుభావుండు భక్తశేషంబు వారిం గొసంగిన సద్భక్తింజేసి మహాత్ముని భక్తశేషంబుగైకొని దంపతులు పానంబుఁజేసి తత్క్షణంబ నవయౌవనంబు నొందిరట నమర ప్రభావంబునఁ గొన్నిదినంబులకందు ప్రియంబున వారికిఁ గుమారుండయ్యె ననిరుద్ధుండని యనయంబు యమ్మహాండు శమాదిగుణ సంయుతుండును నారాయణ చరణ కమలాసేకుండును దదీయ పూజా నిరతుండును విద్యావిశారదుండునుంగాఁ బ్రీతా

శించె నంత భార్గవయోగీంద్రుఁడు వర్ణన ప్రకారం బా గృహంబునం దధివ
సించి,[1] దాని పీఠ యోగ సంకేల నన్ముని యగుచు వ్యారయోగంబు కొం
కు త్తముఁడగు మహదాహ్వయ మాశ్రియించి యనంతరంబ 187

ఆ వె అంతనివ్వల దాని నరసి సంతుష్టుఁడై
యతఁడు వైశ గహ్వరాంతరంబు
పొదుకొని వయమునఁ బద్మాసనాసీనుఁ
డగుచు యోగ మూని వశుం మతిని 188

యో గ వి ద్యా మ హి మ ము

క కదఁగి యమాద్యష్టాంగయు
తుఁడునై యత్యంత నిష్ఠతోఁ బరమాత్మున్
ఆదరాంతరగత్వరంబును
మృదవంద్యుని సంస్మృతినిగుడింపుచు నంతన్

సీ పరికింపఁగఁ గపాలభాతి ధౌత్యాదిక
షట్కర్మములఁ జేసి సమత గల్గి
యలరు నా జాలంధరాది ముద్రలు పది
విధ్యుక్తముగ సల్పి విమల మతిని
దగ నిరాద్యంతస్థ ధమనులు పదునాల్గఁ
జూచుచుఁ దీవర స్ఫూర్తి మరి
యనువొందు శీతలయును భ్రమరయును భ
స్త్రికయును కేవల మూర్ఛికయు వసం

1. మూ దాని 2 మూ లేదు

పరిస్థితంబును నుత్తమంబును దివ్యంబు నగు తూళాంబుజం బూర్ధ్వంబు
గావించి తత్క్రమంబ మధ్యస్థంబును ననుపమంబును నిష్ప్రతంబును నగు
సుధారసం బధోముఖంబుగా స్రవియింపంజేసి ముదంబున నిజహృదయ
కమలంబునందుఁ బూరించి యోగసామ్రాజ్య సౌభాగ్య భూషణం బగుచు
నమ్మునీంద్రుండు మనఃపద్మస్థాచ్యుతధ్యానమగ్నుండును బరవశ
గుండును దదీయచరణకమల సంలగ్న చిత్తుండును నగుచు నమృత
రసంబు గ్రోలుచు బాహ్య ప్రపంచంబు మఱచి బ్రహ్మానంద
పరాయణుండై యిట్లు నుత్త కులాచల గుహాలయందు వేఱువేఱుగా
నూఱు మాతేండ్లు యోగంబు నైకొనియుండి గోవింద నిలయంబులగు
క్షేత్రంబు లనయంబు సంచరింపుచు సకల సిద్ధాంతంబు లరసి వివిధంబు
లగు శాస్త్రంబు లాలోడంబు గావించు మర్మతంబులు భేదించి సిద్ధాంత
కరణ విశిష్టం బగుచు విష్ణుసిద్ధాంత సామ్రాజ్య పరిపాలన వంతుం
డయ్యె నంత 102

తే.గీ. అట్లు మునివరుఁ డున్నచో నీశ్వరుండు
శౌరి భక్తానురక్తుండై జగతి నతని
కెలమి విశ్వ స్వరూపంబు వీక్షణంబు
సల్పఁ గావించె నప్పు డుత్సాహ మతిని 103

క. అగణిత మగు నైశ్వర్యం
బగు నా రూపంబు గాంచి యానందాశ్రు
ధారఁ గాని నిగమాంత గోచర
బగు నుతులం నుతించె యోగి యతులిత భక్తిన్ 104

తే.గీ. ఇట్లు భక్తి రసావేశ మెనయ నట్టి
భావ భావనవల్లను భక్తిసారుఁ
డనెడు నామంబు గల్గి విఖ్యాతిఁ జెందె
నప్పు డుర్వరయందు మహర్షి వరుఁడు 185

### భక్తిసారుఁడు భర్గుగర్వ మపహరించుట

ఉ. అంతట నొక్కనాఁ డొక వనాంతర సీమ మహర్షి యిందిరా
కాంతుని పాదపద్మమునఁ గల్గు సుధం గలయంగఁ గ్రోలు సు
స్వాంతము గల్గి వర్తిలుట సజ్జన పూజ్యుఁడు భూమిభృత్సుతా
కాంతుఁడు శంకరుండు త్రిజగన్నుతుఁ డం దరుదెంచె నయ్యెడన్ 186

తే.గీ. అపుడు వృషభాధిరూఢుఁడై న హరుఁడు
భవుఁడు చండీశ్వరుండు దా పార్వతీ స
మేతుఁడై కాంచె మునిరాజు విహితతేజు
మనగుణసమాజు సజ్జనకల్పభూజు 187

ఉ. అంతఁ బ్రభాత్మ మానుఁడగు నమ్ముని వాయతుఁ గాంచి పార్వతీ
కాంత మహామహాన్ సతత కంజదళాక్ష పదారవింద సు
స్వాంత మహాత్మ్య రాజిత రసాధర వాసుని భూతనాథు ధీ
మంతుని జాలిఁ గూర్చి నిజమంజులరోక్తి వచించె నేరుతన్ 188

తే.గీ. ఇవ్వనాని యందు యోగీశ్వరుండు
గన్నుగవ మోడ్చికొని యొంటిగా నయంబు
పీఠి యున్నాఁడు బాహ్యంబు పీడి తరుణ
సూర్య సంకాశుఁ డనుచు నస్తోత్రమతిని 189

క. ఇతని ప్రభావము చరితము
పతి ముదమున నిప్పు డెఱిఁగి యవలం బ్రియాణ
స్థితి గలవఁగ మత్ప్రియమై
కురుకంబగు దీనిఁజేయు గుణరత్న విధీ 140

క. అని పార్వతి నుడివిన న
య్యనలాక్షుఁడు సంతసంబు నందుచు యోగిం
ద్రుని సామర్థ్యం బరయఁగ
వనమున్ బ్రవేశించి పల్కె భవ్యతరోక్తిన్ 141

ఆ.వె. ఏమి కోరెద వో మహాత్ముడా! నీవ
నధికమైన వరము నడుగ నిత్తు
నాదు దర్శనము వృథా దనందు గాన
భువన మందు సుజన నివహములకు 142

సీ. అనవుండు తద్వాక్య మాలించి మునిరాజు
నయన సమున్మీలనంబుఁ జేసి
ముంగల వర్తిల్లు పురనాయకుఁ గాంచి
యర్ఘవత్తైవ వాక్యంబు నుడివె
నేను నిస్సంగుండ నిరపేక్షుఁడను నాకు
ఏ చేయవలసిన చింత లేని
లేదు మహేశ్వర నీదర్శనంబున
కేగు మటన్న మహేశ్వరుండు

వ. నీవు సమర్థుండవై తివేని నన్ను రక్షింపు కొమ్మని పల్కుచు నతులాతురుండు కోట్యగ్ని సదృశంబగు దృతీయాక్షంబు దెఱచిన యగంబు తదీయలోచన మహానలంబు జ్వాలలచేఁ బరిపూర్ణం బౌట భక్తిసార యోగీంద్రుండు నిర్వ లుండును, నిర్భయుండును నగుచు భయంకరంబుగాఁ బ్రకాశించుచున్న కీలల కడ్డంబుగాఁ దన పాదంబు పొందిన[1] మహాత్ముని చరణ కమలంబు నందలి మహానేత్రంబు వలన ననేకకోటి చండాంశు సన్నిభప్రభావిభ్రాజ మానంబును నద్భుతంబును నగు ననలంబు వొడమి తత్సముద్భూత కీలా జాలంబు లపారంబులుగా నఖండంబు లందంతట వ్యాపరించిన సకల దివిజులు కంపితులుగాఁగ హరనేత్ర సముద్భూతానలంబు శాంతి నొందింప శక్యంబు[2] విస్మితుండై సర్వాత్మంగూర్చి యిట్లనియె 148

తే. గీ. దేవ చూడుము నీవు సందీప్తమతిని
విదితాత్మకులగు వైష్ణవుల మహత్వ
మీ ప్రభావం బసదృశమా నెంచి యీ ప్ర
భావమున కన్న మెచ్చుడు భవ్యమతిని 149

వ. మహాత్ములగు హరిభక్తులు గతాహంకారమత్సరులగుట విశుద్ధ సాత్త్విక గుణు లగుచుఁ బ్రయత్నంబువలనఁ బాపక్షయులు గానఁ బ్రశాంతులును విమలాత్ములును నిఖిలభువనపావనులును నగు వారలకు భూతలంబునఁ గృద్ధులై రేని నద్భుతంబు గాదు సురలచేతనేమియని వార్యులగు వారలకు నిలలోకో త్తమోత్తములని యిట్లు ప్రియము చెప్పి యానందుఁడు భక్తిసారుంగూర్చి ప్రణమిల్లి వైష్ణవకథ లగ్గడింప దలఁచె నంతకుం బవియె నది మొదలుకొని యా లోకంబునందు మహాముని యగు భక్తిసారుం దక్షసంబుని[3]రాగ్ని వలన

1 మూ. య్యు 2 మూ. విస్మయుం 3 మూ. సర్వాది

నక్షపాదుండని పిమ్మటఁ డియె నని మాహాత్మ్యంబును శ్రీమంతంబు నగు
భార్గవ పురాణంబు న నందలి యుత్తరఖండంబు నందలి నవమాధ్యాయంబు
సంవాదంబు జేసి భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పె
నెంతయు నిట్టనియె 160

ఆ వె. అంత నొక్క సమయమందు యోగీంద్రుఁ డ
క్షపాద సంతతానుషక్త
మగు మనంబు గల్గి యమ్మంత్ర పారంబు
నందు మిగుల వాంఛ నుపచరించి 161

సిద్ధుఁడు భక్తిసార సమగ్రహము పొందుట

తే గీ. శీలమగు తంత దృఢముగాఁ జేయు చాతఁ
డవ్వనాంతర సీమయం దధివసింప
నప్పు డొక యోగివర్యుఁడు వ్యాఘ్రవాహుఁ
డగుచు దివి నే నుదగ్రత నరుగుచుండి 162

క. తన భక్తిసార తేజం
బునఁ దదుపరితలమునందుఁ బోఁగాలక ని
ల్చు నమోఘ గమనమగు పులి
యనుపమ మా తత్ప్రకాశ మద్భుత మగుటన్ 163

శా. ఉల్లంఘింప వశక్త మౌచు మఱి యత్యుత్సాహమున్ పేది మి
న్నల్లం జూచుచుఁ జప్పుడంబునకుఁ బో నయ్యోగి యవ్వేళ తో
షోల్లాస స్థితి యొందుఁ దుర్లభగతిగా నొప్పారు నప్పాదుపిన్
మల్లాడింపుచు [1] బాకుడుం బెదిపె మంత్రద్విత్రి మారంబుఁ దై 164

---

1 మూ. బాకుం

సీ. తరుణారిమై తిర్య గూర్ధ్వ మణీందునై
యమనిష్ఠు యా గిరీంగవునిఁ గాంచి
దిగి వచ్చి తన్ముని దివ్యపదాబ్జంబు
లకు నమస్కృతిఁ జేసి లలిత మతిని
చతురప్రకార సంస్తుతులను సంస్తు
తించి భక్తిని ప్రమోదించి యతఁడు
మృదుతరోక్తి పలికె మునివర్య నీవు మ
[1] హానుభావుఁడవు [3] నా మహత్త్వ మతులం

ఆ.వె. మదిత ఎరుగఁ గ్రొత్త యజ్ఞానమువలన
నియ్యపరిసఁ [4] దోవ నెరపినట్టి
దోషమును క్షమింపు దుర్దోషపరిహార
భవ్య గుణ విచార భక్తిసార 165

క. ఇల సిద్ధపురుషగు యోగికిఁ
దలఁపంగా ఛిద్రతంత దాల్పఁగ యోగ్యం
బెంతటి మహాత్ము నాదగు
పలుకు వినుము కరుణఁ జేసి భావుక మతిపై 166

సీ. ధరణి సమూల్య రత్నభరిత రాంచ
నాంతరి యగుచు సర్వాంతమైన
యాకృతంత నాదేత నెలమి సంపాదింపఁ
బడియె నాదే సమర్పణము సేయఁ

---

1 బహుమాత్రహెచ్చు 2 మూ ది
3 ము మను 4 మూ త్రో

అతివ ఘుటిక రసప్రాదుర్భవ యగుట
వివి రెండుఁ గైకొను పిష్టమతిని
రని చెప్పి వాని వానిని బ్రోలం నిడి సమా
హితుఁడౌటఁ గన్గొను బుపివరేణ్య

తే A రసఁగఁ గంధయు ఘుటికయు నవెడి పేని
వలన ఫలమేమి యనుఁడు సర్వంబు నుడువ
కౌటకు నుద్యుక్తుఁడయ్యె సర్వకాలములని
యోగి వర్యుండు నమ్మహాయోగి గూర్చి 167

వ మహౌషధాద్రియందెవ్వండు మనుజుం డిక్కంథ[1]ధరియింపఁగం దతండు మృత్యుజరల నొందక యమరత్వంబు ప్రాపింపనయ్యెడుఁ గానఁ దాద రస ఘుటికా సంగ్రహంబు పూర్వంబునాఁడు మహాయాసంబగుట దాని వినుము మొదటఁ బాదరసంబుగొని యుక్తంబగు నౌషధిరసంబులచేతఁ బ్రత్యేకముగా శోధించి యట దానికి రసపంచకంబును షడ్విధ రస వర్గంబును నుత్తమంబగు ధృతి బీజంబునుం గావించి యుక్తంబులగు రత్నంబులు గ్రాసంబుగా నొసంగి యంత నష్టాదశ సంస్కారంబులచేత నొంగంబగుట దృఢవ్రతులగు [2]తపస్వులచేత దుర్లభమగు నిపారస ఘుటిక నే నొందనగుట దీని స్పర్శంబువలన తత్క్షణంబ యనుత్త మంబగు గొదిలోహంబును నగు సువర్ణంబు గావింపఁగం దని పల్కి యతం డూరకున్నఁ దద్వచనంబు విని స్మయమానుండగుచు నితాంగము వందుఁ దరుణార్క సన్నిభంబగు కంచుకము దర్శింపం జేసి సిద్ధుం గూర్చి యిట్లనియె 168

---

1 మూ. ధ 2 మూ. తపస్సు

ఆ.వె. తత్పరీక్షఁ జేయఁదగు కోర్కి గలబుద్ధి
చేతఁ జిత్రకూట శిఖిఁ జేరి
ఋషి పదాంబుజాత [1]మృత్తికచే దాని
సంస్పృశించె సిద్ధుఁడైన విభుండు 163

ఆ.వె. అట్లు చిత్రకూట మస్పృతంబుగ దివ్య
కనకరూప మగుటఁ గాంచనాద్రి
కరణి నొప్పు దానిఁ గాంచి విస్మయ మొంది
యమరు లరుగు [2]దెంచి రతుల మతిని 164

వ. అట్లు సమీచీనంబుగాఁ బరీక్షించి సిద్ధుం డాశ్చర్య మానసుండగుచు
నగంబు నందలి సరుల వికారం బెఱింగి (2) యోగమాహాత్మ్యంబుచేత
నమ్మహీధర బిలంబునందు దృఢంబుగా స్థాపనంబు గావించి యట
వెండియు భక్తిసారుం జేరి తదీయ పద పంకజంబులకుఁ గూర్చి దండంబు
పెట్ట లేచి క్రమ్మఱ శిరంబు వంచలిఁ జేసి భక్తిప్రవణ హృదయుండగుచు
యోగీంద్రుం గొనియాడి [3]భువనంబునం దనమంబగు తత్పరత పరాగ
మాహాత్మ్యంబుఁ బ్రశంసించుచు తత్స్పర్శంబువలన గిరిశృంగంబులు
సువర్ణంబులగుట కచ్చెరువుపడి విష్ణుండు నిక్కంబుగా లోకేశ్వరుండు
తద్భక్తులు [4]పావనులు వారి పాదపరాగంబు పురుషులకు సకల కల్మష
హారంబును భోగమోక్షైక సాధనంబును నగు పుణ్యంబగుట రామపాద
స్పర్శంబువలన నహల్య శాపవిముక్తయైన తెఱంగున భక్తచ్చరణ
రజస్సంస్పర్శంబువలన మహీధరంబు కాంచనాచలంబుగాఁ జేయఁ
బడియె నట్లగుట విశ్వంబున భగవద్భక్తుం డధికుండుగా వరయోచలయునని
మున్మూఁడు ప్రదక్షిణంబు గావించి స్తుతియించి నమస్కరించి యంతఁ
దదాజ్ఞఁ బడసి నిజనికేతనంబుగూర్చి చనిన పిమ్మట యోగీంద్రాగ

1 మూ మృత్తువ    2 మూ దెంతు
3 మూ భూవనం బనందసమమంబగు    4 ము పై

గహ్వరంబున మహోద్యుతియు నగు భక్తిపాదుండు యెగంబు ధరియించి చిరకాలంబు[1] గుహాంతరంబునం దధివసించి యున్న యట్టి యోగి పుంగవులగు కాసారభూత మహదాహ్వయులు తద్గుహా ప్రాంత సరసిం గూర్చి పోవుచు గుహానిర్గతంబును దరుణార్క ప్రభవంబును నగు తేజం బవలోకించి యందా[2] క మహాయోగి యోగంబుగ్గై కొని యున్న వాఁడని తెలిసినవా రగుట వారంతలోన భూతాహ్వ మహదాహ్వయులు గుహం జొచ్చి ప్రదక్షిణంబు గావించి యుతెచ్చవలనఁ రోయరి సరోయోగి యొక్కరుండు గుహావాసియగు యోగీంద్రుం గాంచుకొంచు కిచ్చ గలవాఁ డగుచు నంతఁ జొచ్చి మూరంబుగా నిలయందు నమస్కరించిన యోగ భారకుండగు భార్గవుం దమ్మహాత్ముం గనుంగొని

తే.గీ. ధరణిపై మాటిమాటికి దండవత్తు
గాఁ బ్రణామంబు సేసి[3] యుత్కృష్ణుగ లేచు
భో సరోయోగి యట్లు నా సుగుణమతికి
దండము నొనర్చె పలుమా రుదాత్తమతిని 166

సీ. అరయ పహోబ్దిన్ సమాధిస్థు లౌట రో
మాంచిత గాత్రులై యలము మతిని
వారూర్ధ్వ ప్రణమతి యందు నిశ్చలు లౌచు
నలుహొంది విహ్వలానంద బాష్ప
నేత్రులై విస్తృం నిష్ఠులై ప్రేమసం
సిక్తాత్ములై సుఖాసీనులైన
మునులు యథాక్రమంబుగఁ బూర్వవర్తన
మగు కుశలంబు సత్కాదరమున

---

1 మూ బున 2 మూ దాక
3 మూ యోక్క

తే గీ నడిగి సౌహార్ద [1] భావ సమన్వితులకు
సారసౌఖ్య పదార్థ పూజా [2]స్మరణ ప
రాయణులను సన్మోక్షానపాయులను ద
ధియ కీర్తన రతులనై దివ్యమతిని 167

తే గీ తద్గుణానుభవస్వాద తత్పరులగ
భద్రమైన మయూరాఖ్య పట్టణమునఁ
గొంతకాలంబు వసియించి సంతసమునఁ
బూర్వసాగర తీరంబు పొంది యపుడు 168

క ఒగి యోగవిద్వరులు పెం
పుగ వారు సరస్వతటంబు మూలంబై లు
బ్బగతిని వర్తిలు కినర
[3] నగకంధరఁ బాయకొని యనర్ఘశమతులై (?) 169

క తన యోగానందాంబుధి
మునిఁగిన భార్గవపుత్త్ర క్షితీశపుత్త్రి దిం
త్రపముఁ గించిత్కాలం
బనుపొంద వసించి రధికమైన తపమునన్ 170

సీ అంత దీర్ఘాచరణాత్యుండగుచు సరో
మునిరాజు భార్గవముని గుణించి
యంజలి గావించి ప్రార్థించుచు వచించె
నవను నారాయణాఖ్యావతార
ములు దనర్చి నక్షత్రములు గూర్చి యేనుఁటో
యెడ నిట్టు మున్ను రచేసఁడైన
భగవంతు నానతిఁ బడసిన వారల స
ర్వక్షేత్రముల నున్కిఁ బడయు నట్టి

1 మూ ర్ద్రి భావ సమా 2 మూ స్మర 3 మూ నగకందము

తే.గీ. [1] వలపుగొన్న గతాధిక ఫలము పెద్ద
కైన వారలఁ బాయుట వంద్రు బుధులు
గాన మధుసూదనుని యాజ్ఞ గడవ వలయు
సెలవు గైకొమ్ము కరుణ భాసిల్ల మదిని 171

వ. సకల లోకంబులచేత సేయుపాయంబుచేతనేని యనుమానింపఁబడని మహాత్మ్యుఁ డగుట మహానుభావు యాజ్ఞ యొసంగుట శివ యద్భుతంబని యవిరతంబును సకలదశలఁ బ్రార్థింపుచున్న సద్యోగివర్యుండు భద్రశ్లేష [2] కారణంబగుచుఁ బ్రేమ విహ్వలాంగుండయ్యు మహాత్ముం డంపించి యతి దూరంబుగా వెంటఁజని యందనోన్యంబుగాఁ బ్రణామంబు లొనర వెండియు నంత పర్యంతంబు లక్షింపఁబడునంత పర్యంతం బవలోకించి వచ్చి భార్గవుం డంత యోగనిష్ఠం గైకొని భగవద్ధ్యాన మానసుండగుచుఁ జిర కాలం బధివసింప నంత నొక్కదినంబున నా భక్తిసారయోగికి మూర్తిద యగం శ్రీరమ్యమూర్తికి లేకపోవుట సూర్యచంద్రంబులేని వాఁడు [3] ఉపాధి కంబు చేయరాదీ సమస్తంబు కృష్ణభూమి యగుట నొక్కఁడనే యిది లేదని చింతింపుచు యోగీంద్రుడు యోగనిద్రాగతుండగుచు నిద్రింప నింద్రనీల శ్యాముండును మహాద్యుతియుఁ గోటికందర్ప సుందరుండునుఁ దరహాసవింద చరణయుగళ విరాజితుండునుఁ బ్రకాశిత [4] ప్రభాధో విద్యోతమాన నూపుర కటక శోభితుండును స్ఫురత్తరుణ [5] తరణి సన్నిభ [6] రత్న పీతకౌశేయ వేష్టితుండును నానారత్న విచిత్ర ప్రభాం బరాంచిత గుణావృతుండును ముక్తాగుచ్ఛాగ్ర లలితాలంకార విలసత్కి రవంటకుండును నిజపాదపద్మ గరిమ సందర్శిత కరాంబుజాండును సద్భావయుగ్మ ప్రకాశిత శంఖచక్ర విరాజితుండును విశిష్టోన్నత పీనవక్షఃస్థల శ్రీవత్స లక్షితుండును స్ఫురత్కౌస్తుభ ముక్తాహారశోభి తుండును, మణిగ్రైవేయ లలితకంబుకంధర విరాజమానుండునుఁ బూర్ణ సుధాకర ప్రతిభా వదన కమల విరాజితుండును సునాసికాగండ

1 మూ. పాలముల 2 మూ. కాతు 3 మూ. వానిచేత
4 మూ. ప్రతిభ 5 మూ. కరుణ 6 మూ. శ్లేష

ప్రాలంబాట విరాజమానుండును [1]విస్ఫురత్కోటీరమకర కుండల ద్యోతి
రాననుండును గృపాకటాక్ష ప్రకాశిత పుండరీకాయతేక్షణుండును [illegible]
సింహాసనాసీనుండును శ్రీనికేతనుండునై ప్రకాశింపు శ్రీ వేంకటాచలా
ధీశ్వరుండె స్వహస్తంబున నమ్ముని వాయదు స్పృశియించి కృపచేత
నుపలాలింపుచు మధుర వాక్యముల నిట్లనియె 172

తే గీ అరయ నా యాజ్ఞఁజేసి యాదరసిఁగ్గు
నమ్మతి పాండుర మృత్తిక నమ్మిత భుజం
కేని దుర్లభగా నుండు ధరిని దాని
సంగ్రహింపుము మునికుల సార్వభౌమ 173

క అనయ మటు మాత్ర ధారణ
మున మామక పదయుగళ్ళా భువిజనముల కం
దని భగవంతుఁడు పల్కిన
ముని నాథుఁడు మేలటంచు నమున్నతమతియై 174

వ దివ్యరూపంబులగు స్తుతులచేత శ్రీధరుం గొనియాడి యట దిగ్గియం దిగ్గి
యత్యంత మృదులయు శ్వేతయు శుభయు [2]భావనయు నగు మృత్తిక
సంగ్రహంబుగాఁ గైకొని బ్రహ్మగిరి తీరంబున కరుదెంచి తరువు మూలంబున
వాదుకొని పద్మాసనాసీనుం డగుచు యోగివర్యుండు శాస్త్రోక్తంబుగా
ద్వాదశాంగంబుల యందుఁ గేశవాది ద్వాదశ నామంబులచేత సమీచీనం
బుగా నూర్ధ్వ పుండ్రంబు ధరియించి [3]యష్టాక్షర మంత్రంబు జపియిం
పుచుఁ గొన్ని మాసంబులం దధివసియించి పిమ్మటఁ గాంచీపురంబున
కేఁగుదెంచి యందరి ఫణిరాజ పర్యంకశాయియగు పురుషోత్తముం గాంచి
నమస్కరించి తద్భక్తిచేత స్తుతింజేసి యోగానందపరుండయ్యె నంత

1 మూ విస్ఫుర 2 మూ శభ 3 యష్టాం మంత్రంబులు

క. అనఘం దద్వాక్యము విని
యనఘుండగు భక్తిసారుఁ డలరితా నెం తె
ట్లను ఎఱిఁగితంబగు న
ట్లను గాఁగల దని వచించె లలిత ఫణితిన్ 19

ఆ.వె. భక్త సత్పులందు పల్కుల చొప్పున
అరరదారి సంబనమున సార్ధ్య
యోపసం బ తెం? యనుచును దివ్య తేం
దర్శ భాగ్య యగుచు ధన్య మతిని 20

క. పలు మాఱు లవ్వుఁబోణి పద
ములకుఁ ప్రమొక్కి పంఙ్క్తిభాక్షి కృతాం
జలి పుటయై వినుతించెన్
గిరయఁగ సంహృష్ట యగుచు గౌరవఘటితిన్ 21

వ. అంత నెండియు 22

క. వినుతించు దానిచే న
మ్మని ప్రీతుండగుచు మోదమున నొసఁగె ధరా
వన పత్నిత్వంబై తెం
పునగు పరమభాగ్య మధికముగ నా సరికిన్ 23

తే.గీ. తత్ప్రియోజాక్షి రుదరతౌదార్యగుణ వి
శేషయై మందిరమున వసించియున్న
సమయమునఁ గాంచితా పురీశ్వరుఁడు వవని
వార సక్తమనస్కుఁడై యతిరయమున 24

కం. సరసిజనిభాననఁ జంద్రవదనఁ
గరిగామినిఁ గనకగాత్రిఁ గంబుధరాస్యన్
గురుకోకస్తనిఁ గన్యన్
వరరాయబాల యవ్వనస్థిరి యంచున్ 25

సీ. పరిపూర్ణుఁడగు సుధాకరుఁ గాంతి నిరసించు
సరసంపు మందహాసంబు గల్గి
నీలోత్పలంబుల డాలు డీలు గఱింప
మీఱిన చనుదోయి తీరు గల్గి
కాంచనస్తంభ ప్రకాశంబు పైకొన్న
చక్కని పెందొడ్ల సొరు గల్గి
కాంచువారల చిత్తకమలంబు లగలింపఁ
గా మించు రాయంచ గతులు గల్గి

తే.గీ. చెంగి చాలించుచున్న మెఱుంగుఁదీవ
తగి చెదరక్కను నమ్మిని సిరిఁ గడంగి
మదనమంత్రాధిదేవత మాడ్కిఁ దనరు
నీరజాక్షిని నా ధారుణీవిభుండు 26

తే.గీ. దేవ దోహదమనుటఁ దెలియఁ జాలి
స్మర వినిర్భిన్న హృదయుఁడై సంతసమునఁ
బిన్నసాయక తే సంపూర్ణమతిని
దానిఁ గళలారు రతిసల్పె ధన్యుఁ డగుచు 27

కం. అంత నవ్వేళయందు మహీ
కాంతుఁడు నదిఁ జేర్పకొని సుఖస్థితి నిజస
ద్ధాంతమున మునిదకొని యా
కాంతము తీరవాల వేల కంతుని కేళిన్ 28

తే.గీ. త్వద్గుణ మహాత్మ్య దర్శింపఁ దవరు గోర్కి
సమయమున్నాఁడ నేను మహానుభావ
యమ్మునీంద్రుని కమలావరాంఘ్రి పీఠమం
మధుకరుని నిందుఁ దోకొమ్ము మహిత మతిని ౪౨

సీ. ఘనుని మహాకవిప్రవరుగా నిన్నుఁ గ
వులుఁ బొక్కుచుందు రుర్వీశ మనీషఁ
బరఁగు గంభీరార్థ పదయుతయగు నొక్క
కృతి మాకుఁ జెప్ప వాస్ప్రతిఁ గడంగి
యాభరణంబు లనర్ఘ వస్త్రములు వ
స్త్రంబులు నీకు నొసంగెద నని
పల్కెడు వారాలఁ బఠించి సంపూర్ణ
భావుఁడై యధిక తపస్వియైన

ఆ.వె. కృష్ణయోగి రోవత్కర ర క్తనయముఁడై
విశత పఠిరిదేఁ ద్రృతికరించి
పల్కె మద్గురుండు భగవత్పదాంబుజ
ధ్యానమగ్నచిత్తుఁ గమల గుణుఁడు ౪౪

వ. కృతికృతారవిందభవశచేంద్రప్రముఖ నిర్జరుండును మహాయోగీశ్వ
రేశ్వరుండును నగునట్టి భక్తి సారముఖ్యుండు పరపాలాంతికం బుద్దేశించి
యెట్టు రాచేర్పు దుర్మతి విభూతి ద్వయనాథు లహంకారంబులు కీర్తింప
చున్న మద్వార్త్యంబు దురాత్ముండవగు నిన్నుంగూర్చి యెట్లు పల్కెనగు
భగవంతుండుంటోర నీ విచ్చెఁదగిన వస్తువులు నిక్కంబుగా నిఖిలలో
కమయంబు లనుఁ గుటిలాననుం దగుచు మత్కృతియందు నీదు బహు

వర్ణింపు లుండఁదగ దని పలికి తత్క్షణంబ యంతఃపురంబుఁ బ్రవేశించె
నని మహాయోగి మాహాత్మ్యంబను శ్రీమంతంబును నగు భార్గవ పురాణంబు
నందలి యుత్తరఖండంబునందు సంవాదంబుఁజేసి సత్త్వపరాయణుండగు
నారాయణుండు వరుసను నేకాదశాధ్యాయంబుఁ జెప్పి వెండియు నిట్లనియె 84

చ. మనుఁడు మహాతపోనిధి ప్రశాంత చిత్తుఁడు గృష్ణయోగి ర
త్నసవతి వల్కె పల్కుమిది సౌమ్యము పీఠగ రోషభాసితా
ననుఁడయి యాత్మదేశికు మనఃప్రతిభాసురుఁజేరి భక్తి నా
తని పదపంకజమ్ములం గుదారత మ్రొక్కి వచించె నిట్టులన్ 85

క. నిగమాంత విశారద యా
గతికిం దధముఁ దగుట సకలాచ్యుత భ
క్తిగా విపించుఁ నిప్పా
రగు నిం జేంపేని నిర్వహంపదు నియతిన్ 86

తే. గీ. దాని మూల దర్శనము మహాపాపహారి
కంబగుట నేను దేశాంతరంబు గూర్చి
యప్పు డరిగెద నానతియమ్ము మునిక
లోత్తమ మహానుభావ యనూన చరిత 87

క. మునివరుఁడు భక్తిసారుఁడు
మనమతి యవ్వచనము విని కరుణానిధి వి
మ్న నెరసి సహింప నిమునము
ననుపుగ నే నీవువెంట వరుదెంతు నిలన్ 88

## శ్రీకృష్ణుఁడు గురు దేవతా సమేతంబుగా దేశాంతరంబు వెడలుట

వ. ఇందు వసియింపరాదు గాన భుజంగశయనుతోఁగూడ నెచ్చటి కరుగుదెంతుమని
పల్కి శేషపర్యంకశాయి సన్నిధి కేఁగుదెంచి యద్వైతుం గూర్చి విధివంతం
బుగఁ [1] బ్రణామంబు లాచరించి కృతాంజలి యగుచు నిట్లనియె 39

సీ. శ్రీపతి శౌరి యాశ్రితవత్సల మురారి
సర్వలోకేశ్వర జగదధీశ
కేశవ భుక్తి ముక్తి ప్రదాకోదాత్తలీల
భుజగ భోగశయాన పుణ్యచరిత
ముచికుందనుత జగన్మోహనాకార య
బ్రహ్మ శంకరవందితాంఘ్రి పద్మ
బుధసేవిత పురాణ పురుషోత్తమ ముకుంద
యామ్నాయవేద్య ప్రాణ్యంతరస్థ

తే. గీ. కృష్ణయోగి మహాత్ముండు క్షితిపరుఁడు
నేఁడు నృప [3] పరుషోక్తి గణించి యింత
దేశమున నేఁగుచున్న వా ధీరు నెన్క
నేను పోయెద మనమున నిశ్చయించి 40

వ. నిమిషంబేని నిమిషార్ధంబేని క్షణంబు నిన్నెడఁబాయ సహింప భవద్వి
యోగం బసహ్యంబుగావ సర్వేశ్వరా నీవు శ్రీస్వామి సహితుండవగుచు
ఫణీంద్రశయనంబుతోఁ గూడి నన్నుద్దేశించి సత్వరంబుగా రమ్మని
పల్కిన వచనంబు విని యటఁ గురూహంబునం భక్త నిత్యానపాయి
గావున భక్తవత్సలుండగు భగవంతుఁడు లక్ష్మీస్వామి యుక్తుం డగుచు
శేషతల్పంబుతోఁగూడ గమనోన్ముఖులను యోగీశ్వరులను నగు నా గురు
శిష్యుల వెంబడిన నరిగె నంతనాఁగం యుభయదేవతలను దర్శనాసక్త

1 మూ కృతప్రణామ 2 మూ మహాత్తం 3 మూ పురు

ఆ వె కృష్ణయోగి వాఁడు ప్రియుఁడు తన్ను గాని సం
తోషపెట్టి నీవు తోడి తెమ్ము
వాఁడు బాల కోవిదనయు వింటి పెంచి
యున్న నగరి వాకిఁ మూలించి 45

చోళ మహీపాల ప్రార్థనంబున నది కృష్ణ భక్తి సారులు
స్వధామంబు ప్రవేశించుట

తే గీ తీవ్రముగఁ బోయి మునికులతిలకుఁ గృష్ణ
యోగి పదములఁబడి కరయుగము చేర
దృఢముగాఁ దత్పదాబ్జ యుదీర్ణ భక్తిఁ
బట్టుకొని యశ్రువులు రాల భవ్యమతిని 46

వ దీనుం డగుచు గద్గద వాక్యుండైన నిట్లనియె 47

తే గీ మునిని శరణాగతిని యోట గనిరెంద్ర
వైరిగ శరణాగత వత్సలురు భ
వత్పదాబ్జము లెగమున భక్తులకుఁ గృ
పారసముఁ జేసి ప్రోతురు సొంపుమీఱి 48

వ అపరాధ సహస్రంబు లెన్ని క్షమియింప వలయుఁగాన వెన్నుఁడెందిన వాఁడ నీవ శరణంబు వగుటఁ గ్రమ్మఱఁ గాంచీపురి కేతెమ్ము నన్ను పాలింపు మని మడిచిన క్షమానిధియుఁ గృష్ణయోగి[1] నంయమీంద్రుం డగుచు వెరలి గురుండైన భక్తిచే ద్రావింపిన ధర్మవిత్తగు భక్తిసారుం డానంద కందళిత హృదయాంతరంగుఁ డగుచు శిష్యదాసానుదాస మహీపతులతోఁ గూడ వెండియుఁ బురోత్తమంబు ప్రవేశించె శేషపర్యంకశాయి యిందిరతోఁగూడ

---

1 వరా అపారసహస్ర,

స్వకీయాంగ ధామంబుఁ జేరె నవుడు భూమియు దేవతలును దమతమ తావులంబోవఁ గొనియె నంత మహాముని యగు భక్తిసారుండు నారాయణాంకితమున నుదయించి ఏకాంతాకారంబుగా స్తుతియించి యుత్తమోక్తి నిట్లనియె

## భక్తిసారుఁడు భగవత్కీర్తనము గావించుట - దశావతార వర్ణనము

సీ. పావకభానుసంఖ్యఁ దనరు వంశపులింగ
మలాసనాంబునికాయములను
బెరుగఁ జేసెడి నీవు జెప నాశక్యమా
వించెదు దిరిగెదు స్థిరమతిన
స్వాంతవాదాముగోచరుఁడవౌ నిన్నెట్లు
స్తుతియింపఁగలను దైవతనుతాంఘ్రి
కేశవల్పుయాన శ్రీధర యాశ్రిత
వత్సల వరదసుప్రదాయి

తే.గీ. యా భువనమందు నాశిష్య నెంచి నన్ను
నధిక గౌరవము రచించి తమల చరిత
రూఢిగా భక్త వాత్సల్యరూపమునను
నిత్యముఁ దవర్పుచుండువు నిపుణమతివి 60

తే.గీ. జగదధీశ్వర నీ సద్యశంబు నితర
మైనవేలుపు లోకంబునందుఁ గల్గ
దహిప పర్యంకమునఁ బాంటియట్లు లచ్చి
తోడ వసియించి ప్రోవు భక్తులను నీవు 61

క. అని దేవుఁ బొగడగనే
తను విశ్వాపించి ధరణిధవు యోపరిపా
లనమున నునిచి మునివరుఁడు
వనజాక్షుని సన్నిధిని నివాస మొనర్చెన్ 62

చ. అనఘుని యక్షరాంతర తమ్ముని వందుగిని గ్రోలిచిత్త స
జ్జన నుతుఁ బుణ్యమూర్తి నరసన్నుతుఁ దోరగానివచ్చు యమ్మునం
ఘనలం ర్థ పీఠపునిగా రచియించి తదంఘ్రి పద్మయుల్
గనకపుఁ బాత్రయందు నిడి గారవ మొప్ప క్షాళించు దత్తితోన్ 74

క. విమల సుగంధ జలంబుల
క్రమఁ దత్ప్రక్షాళనంబు గావించి నగు
ద్యముఁ దగుచు గంధపుష్పా
ద్యములం యథా[1] విధిని నర్చ ంచరించి యటన్ 75

తే గీ. హర్ష పర్యాకులేక్షణుఁ డగుచు పొంగి
చంద్రు నా భక్తిసార సుత్యాహశీలి
తన్మతరమైన సద్భక్తిఁ బ్రణతి సేసి
పలికె విప్రుండు విమల వాక్ప్రౌఢి గదురగ 76

క. భగవత్ప్రియ సుచరితముని
యగణిత మతి యోగ చర మహాభాగ విహం
గగమన పదనీరజ భృం
గ గరళ గళ గర్వహారి కలుష విదారీ 77

ఆ వె. గరిమ మీఱఁ [2] బుణ్యక్షేత్ర గతుఁడవైన
నీవిచట కేఁగుఁదెంచుట నిర్మలాత్మ
యప్ప[3]డును సల్పు నా జన్మ మెలమి సఫల
మయ్యె నా జన్మ పావనంబయ్యె ననఁగ 78

---

1 మూ విధి సల్పనెంచి 2 మూ అంతయు దేవి పుణ్యకాలెను
3 మూ దేనునల్పు జన్మ

కాథ దానవుండును వాకర్ణ విస్తీర్ణ సముత్ఫుల్ల విశద కమల నయనుండును సుకర దరహాస చంద్రికా పూరితా[1]ధర సమన్వితుండును శరదిందు సన్నిభ ముఖమండల ప్రకాశితుండును సుభ్రూలంబితాసితాలకాసక్త ఫాల ఫలకుండును చారుకోటీర హార కేయూర మంజుమంజీర కంకణాది విభూషితుండును మహేంద్రేంద్ర సేనేంద్ర ప్రముఖ నిత్యసూరి కమలాసన వాక సురేంద్రాది నూరాప్సరోగణ వసిష్ఠ వ్యాస వాల్మీకి ముఖ్య భాగవతోత్తమ సనకాది యోగి సంసేవితుండును జగదీశ్వరుండును [2]కోటరజో రమణ సంకాశచ్ఛత్రచామర శోభితుండును నగు హరి సభామధ్యమందున గాంచువారల కందఱికిఁ దొడగట్టినప్పుడు ద్విజోత్తములందఱుఁ బ్రకంపితా ధీరధీతులును విస్మయాకులిత చిత్తులును నగుచు మాటిమాటికి దండంబు వెట్టిన భక్తిసారుండు తద్భృత్య దేవతాగణంబుల సంస్తుతించి లక్ష్మీవ కరుణ నొందఁ బ్రాంజలు లగుచు ద్విజులు మదపరాధము క్షమియింపు మని పల్కిన వాక్యం బాలకించిన నాడు నవిప్రపుంగవులు బ్రహ్మ నిష్ఠా గరిష్ఠుండగు నాభార్గవ నందనుం గూర్చి ప్రణిపత్తి చేసి చరణంబులం గూర్చి పలుమాఱు శరణంబు నొంది యిట్లనిరి 81

సీ. [3]ఏము హీనమతుల మిల నొంద దురభిమా
నంబు గర్వితుల మనూన చరిత
యజ్ఞానులము సమోహాత్ములము సమర్ప
రు[4]ము కామక్రోధ కలితమతిని
కాళయులము దుర్మదాంధుల[5]మపరాధ
మఖ్యాభాక్కులము నవమూఢ వృత్తి
లముగాన నీ మహిమ మెఱుంగలేకయె
గీశ్వరేశ్వర యుండినవారపై

1 మూ ధార 2 ము కోటీర మణి
3 మూ ఏమహీన 4 మూ లముసదా 5 మూ మహాప

తే గీ, కమల మరసిన సిరిసరోజ మేము
కలిపినారము వ్రమువత్సలుఁడ వగుట
క్షమ యొనర్పుము కారుణ్యజలధివగుచుఁ
బరమ పిశలాయుకార భక్తిసార 82

ఉ దారుణ దుఃఖవహ్ని దరితప్త భవాంబుధి మున్గు నట్టి వి
స్తార జలార్కవృత్తుల మాశక్తులమై తగు మాకుఁ [1]మేరనౌ
శీరము నీదుపాదములు తిప్పపుతావముఁ బెంచి [2]నిస్తుల
స్ఫారతఁ బ్రోవఁగాఁ గుంము భవ్యమతిన్ మునిరాజశేఖరా 83

క అని యిట్లు భూసురులచే
తను బ్రార్థితుఁడగుచు నతఁ డుదారదయాళో
కనమున వారలఁ గన్గొని
మనమున సంతోషవార్ధి గదలుకొనంగన్ 84

భక్తిసారుఁడు బ్రాహ్మణుల ననుగ్రహించుట

వ పరికింపుచున్న నిఖిలదేవతలకుఁ బరిదారకంబు గావించు కొలుకు యోగి
వర్యులందు హృదయకమలాంతరవర్తియైన దేవుం దెల్పి ప్రవృత్తంబయ్యె
నంత బ్రహ్మాదిదేవతల తత్ప్రభావంబు నగ్గడింపుచుఁ దమతమ నివాసంబు
గూర్చి చనిరి విప్రపుంగవులు హరిపాదంబు గూర్చి నమస్కరించి[3]కొని
యాది మత్కృ[4]తాపరాధంబు క్షమియింపుమని పల్కి భూసురులం బ్రార్థించి
ప్రవృత్తంబగుచు యజ్ఞంబు యథాక్రమంబుగాఁ బరిపూర్ణంబు గావించి రట
చిన్ని లవభృథాంతంబునందు హరిపాదు హరిప్రియుఁ గావింప బ్రాహ్మ
ణుం దవభృథస్నానంబు సేసి మహీసురులతోఁగూడ భక్తిసారాంతికంబైన

1 మూ ఘోరనౌశీరని 2 మూ నిస్తుల
3 మూ దు 4 మూ కృపా

క  అతిఁ బ్రమ్ముల భగవద్భ
క్తుల వైభవ మనువదింపు గురునాయక యం
చనుకొనెదు నానరుతోఁ
బలికె విభుం డవ్యయుండు భగవంతుఁ డొగిన్ 88

సీ  [1]పరమహా నీ యొగివరచరిత్రము గూర్చి
నీదేశ తెన్నగా నేను బ్రశ్న
చేయంగఁబడితి నిర్ణ్యయస్సునకు భగ
వద్భక్తి చరిత ప్రవణమునుండె
నిరత పారనము రే విని నత్యమో విన్నుఁ
గూర్చి వచించెద గురుమహీన
క్షేత్ర భక్త దారిద్రంబు విను శాస్త్ర
పద్ధియనెడు నది ప్రాంతమందు

తే.గీ. హర్షమగు పాండ్యదేశంబు నందుఁ గల్గు
నతుల సంపత్సమృద్ధిగా నలరుఁ బండ
రీక నగరంబు సంతత శ్రీకరంబు
భక్తసందాయకము ముక్తిదాయకంబు 89

వ. అందు 90

కారి నాథనాయకా దంపతులు తపం బొనర్చుట

తే.గీ. ధరణిపైఁ గురురాజుచే ద్వాపరంబు
నందుఁ బాలింపఁబడి కురుకని తనర్చు
నందు వసియించు పురుషుండు వాద్యఁ డమ్మర
బంధువాకాసఖుండు రాక్షసహరుండు 91

1 పా. పరమంబైనయోగి 6 కంబు

చ సురనిధి[1]లావు మాఁ మతిలోలిత పాదపయోరుహంబు సు
స్థిరతర మూర్తి నచ్చట వసించిన మానవులెల్ల విష్ణు త
త్పరులగు టమ్మహా మహిమ భాసిల వారలలో మహామహుం
డురుతర మూర్తి నిర్మల గుణోన్నత భాగవతాత్ముఁ డిలన్ 92

తే గీ అద్భుతానాథ సద్భక్తు డమల గుణుఁడు
వనరి యనుపేర నమరినవాఁడు పరమ
తత్త్వభాగ వే[2]దుండు సద్ధర్మఁ దనరి
పంచ నుద్భవమయ్యె నుజ్జ్వల యశుండు 93

తే గీ అతనివలన మహామహుండైన ధర్మ
ధరుఁడు జనియించె నా యశోత్కరుని వలనఁ
జక్రపాణి యనెడువాఁడు జననమొందె
నమ్మహాని కయ్యె రక్తదామాహ్వయుండు 94

క అతనికిఁ గర్గ మహోన్నత
మతిమంతుఁడు సద్గుణుండు మధువైరిపదా
బ్జాతుఁడగు పాటల లోచనుఁ
డతుల యశోధనుఁడు వైభవామరపతియై 95

తే గీ అమ్మహాత్మున కయ్యె నుదార గుణుఁడు
నిర్మలాకారి [3]సత్కారి ధర్మకారి
యగు మహామహుఁ డాతని యందు తనయుఁ
డనఘమతి భగవత్కార్యుఁడైన ఘనుఁడు 96

---

1 మూ నిళింధ 2 మూ విధుండనద్ధర్మ 3 మూ సత్కారి

తే.గీ. అఖిల గుణముల కాకరుఁడగుచు వసుఁడు
సంతతము వృద్ధిఁ బొందుట జనకుఁ డతఁడు
సత్యకారుణ్య సంయుతు ధర్మచరితుఁ
బుత్త్రిఁ బరికించి విభవసంపూర్ణ మతిని ౪౭

ఉ. అతనికి రూపయౌవన రమంచిత లక్షణ లక్షితాంగియౌ
సతిని వివాహమున్ సలుప స్వాంతమునందునఁ జింతచేసి నం
దితయశమూర్తి ధార్మికుఁడు శ్రేష్ఠుఁ డతండు సమీప వర్తిగా
స్థితుఁ [1]సుభక్త వత్సు సముదీర్ణగుణున్ విభవాఢ్యు ధీమతిన్ ౪౮

క. [2]కంఠాప్త వత్సునిఁ గని
మంఠాత్రినిఁ బ్రేమ సేసి మధురాధర శ్రీ
కంఠాక్ష[3]భర్తఁ బెండ్లి నా
గిం జేసెను నాథునాయకని [4]గారికిఁ దాన్ ౪౯

వ. గుణశాలియగు పుత్రునకు వివాహము గావింప భగవద్భక్తుండగు సత్కారి
విష్ణుభక్త యగు భార్యతోఁగూడఁ జిరకాలంబు ప్రహృష్టుండై క్రీడించి
ధర్మవత్సలుండగుట నప్పు డమ్మహం బనపత్యుండై సుతార్థంబు చింతిం
పుచుఁ దపంబుచేత రమానాథు నారాధించెదనని నిశ్చయించుకొని
భార్యతోఁగూడ గృహంబు నిర్గమించి పుణ్యయు జగత్ప్ర[5]సిద్ధయు
నఘనాశినియు దర్శన శ్రవణంబులవలన ముక్తి నొసంగునదియు రామపక్షి
తరంగితం దేరి యందు యథాన్యాయంబుగా స్నానంబు చేసి విధ్యుక్తంబుగా
హరిం బూజించి హృదయకమలంబునందలి శ్రీపతిం భజియింపుచు

---

1 అతనిపేరు కమలాప్తపుత్రుఁడు 2 మూ. కంఠాక్ష
3 మూ. భర్త 4 మూ. గౌరికి 5 మూ. సిద్ధి

నిత్యంబు సమాధించేసి [1]యుత్తమంబగు మంత్రరాజంబు జపియింపుచుఁ
బరమంబగు తపంబున[2] నిట్లు సంతప్తుండగుచుఁ గురునాథీశుఁడును భక్త
వత్సలుండును నగు పద్మాక్షుండు రమాసహితుండగుచు నెదుట నిల్చిన
నమ్మహామహుం గనుంగొని తత్క్షణంబున లేచి మాటిమాటికిం బ్రణమిల్లి
ప్రాంజలియగుచుఁ గారి పరమేశ్వరుంగూర్చి స్తుతిపూర్వకంబుగా నిట్లనియె

సీ. ఇందిరాధీశ గోవింద నీకుఁ బ్రణతి
వాత్సల్యసుఖ గుణాబ్ధి నీకు
పతి సహస్ర శీర్ష శరధృతి వందిత
నీకు నమస్కృతి నిర్మలాత్మ
విశ్వపతి మహేశ వినుత యాత్మేశ్వర
నీకు సాష్టాంగంబు లోకనాథ
హరి జగద్గేహినే ఎట్టి నీకు శోహరు
విశ్వరంభుఁడవైన విభుఁ గాని

తే.గీ. నీకు నతి యక్షరాయ సుశ్లోక నిగమ
రూపిణే శాశ్వతాయ నరూపతాయ
సుందరాయ పరేశాయ యుణవ నన్ను
తాయ యని నీకు మ్రొక్కెద దైవరాయ[3] 101

క. నారాయణ నీకు నమ
స్కారమ్ము ననంత శక్తి గల్గియు బ్రహ్మం
బై రంజిలు నీకై శ్రీ
ద్వారఁ బ్రణామం బొనర్తుఁ గంబుజనాభా 102

1 మ యనంతమం 2 మ 3 మూ వైపవమానస 4 మూ

సీ అమల విభూతిద్వయాధినాయక విశ్వ
శేషివయిన నీకుఁ జేతువినతి
వనవాఖ్య యోంకార వాచ్యుఁడవగు నీకు
మ్రొక్కెడియెద దైవమ్ము గనుక
హరి స్వతంత్రుండవౌ వచ్యుత నీకు న
మో నమో యని భక్తిఁ బొగడువాఁడ
కరుణాపయోధి భక్తఫల ప్రదాయి ప్ర
సన్న కల్పక నీకుఁ బ్రణతిఁగాంతు

తే.గీ భూమినీళాధి నాయక పుణ్యచరిత
నిత్య ముక్తైక భోగ్యాయ నిరుపమాయ
తే యని నమస్కృతి రచింతు దివ్యరూప
వైభవాకార సద్భావ వాసుదేవ 103

తే.గీ నామమా భగవచ్ఛబ్ద వాచ్యుఁడవగు
నీకు మ్రొక్కెద సర్వనిగమరూప
యాత్మనాథుఁడ వగు నీకు ననుదినము న
మో నమోయని కొనియాడి మ్రొక్కువాఁడ 104

క అని యిట్టులఁ బొగడెడు నా
తనిఁ గని భగవంతుఁ డఖిల తత్త్వుఁడు నిగమాం
త సుతుండు భూతభావనుఁ
డనఘుఁడు సంతోషకారి యగుచు నయమతిన్ 105

క. చిరుకాలలోకనంబులఁ
బరిపాలింపుచు వదింబై పరమ్మవరత సౌ
పరితుష్టుఁడ నైతివి సు
స్థిరమతి నీయాతపంబు చేతఁ గుమారా 108

## శఠకోపముని జననము

వ. ఆ కోర్కి యెట్టులంగుడు నట్టనే వరుండగు కుమారు నొసంగెద నని
యర్కి దేవుం డంతర్హితుండగుట సంహృష్టమానసుండగు కారి సభా
ర్యుండగుచుఁ గుమరంబేరి శ్రీకర మందిరంబుకు కేతెంచి రమా సహితం
గూర్చి ప్రణమిల్లి యట్టగ్రమ్ముల నిజగృహంబు ప్రవేశించె నంత భగవత్ప్రీ
యుండును మహాద్యుతియునగు సేనేశ్వరుండు భగవంతుతోఁ జెప్పి
నాథనాయకి గర్భంబునం దావహింప నంతట సంవత్సరంబు పూర్ణంబగుడు
సాధ్వియగు నాథనాయకి కలాంభియందుఁ దొంబది రెండు దినంబులు
సనుట [1]సుభగంబునగు వైశాఖ మాసంబునందలి భృగువాసరంబునందు
శ్రేష్ఠంబగు విశాఖాసహిత కర్కటలగ్నంబునందు నుత్తమంబగు పుత్రుం
గాంచె నపుడు భూవరాహుండును మాధవుండును భక్తపరాయణుండును
నగు నారాయణుండు సూతికానికేతనంబున కేతెంచి మహాత్ముండగు
నర్భాలునకు విజ్ఞానం బుపదేశించి స్వధామంబున కరిగె[2] నంత భుజంగా
ధీశుండు సింధుకన్యాధవాజ్ఞంజేసి [3]కారి గృహాంతరంబునందు దివ్య
మహీరుహాకృతి యగుచు వసియించె నర్భాలుండు శౌరికారుణ్య లబ్ధ జ్ఞానా
మృతంబు గ్రోలుచు జనని స్తన్యంబు గ్రోలక యవలోకనంబు సేయక

---

1 మూ. సభాగంబునగు 2 మూ. నట్ట
3 మూ. హరి

తే.గీ. అనుపమ నలౌకికుని నీ వుదార మతిని
యిచ్చు నిట్టాలు నీవ గ్రహించి కొనుము
ఇతఁడు యతుఁడేల యనుచను సాత్త్విక వయసు
తెలిసి యాదంపతులఁ గాంచి యాదరించి 112

సీ. హరి యిట్లు పల్కి మీ యాత్మజుం డల మహా
యోగి మత్స్యేంద్రుఁ డుద్భవించె
లోక రక్షార్థ మలౌకిక స్థితితోడఁ
గన మర్త్యమాత్రుండు గాఁడు సుమ్ము
యటుగాన మీరు హర్షాత్ములై యాత్మజా
రక్షించుఁ డన రమారమణుఁ డంతర్హి
దపయు నపోత్కృతతనుని యా హర మంది
రమునసే పోషింప రమణితోడ

తే.గీ. సతఁడు బాలార్క నిభుఁడు పర్యంకతలము
యానఁడు హరిపదాంబుజ ధ్యానలగ్న
మానసుండయ్యెఁ దద్దేవ మందిరంబు
గలయఁ గలియుంపుచును నొక్క కాలమునను 116

వ. అందుఁ బింబా కృతి మూలాధారకోటరంబు ప్రవేశించి బద్ధ పద్మాసనాసీనుండును నిమీలిత నయనుండునై హృత్పద్మంబున బద్మ పత్రాక్షు పాద పద్మాలోకనంబు సేయుచు బాహ్యంబు నవలోకింపక యోగసమాధి నధివసించె నిప్పిధంబున షోడశ వత్సర కాలం బమ్మహాత్ముండగు హరి సుతుండు హరిసమాలోకనాహ్లాద నిర్భరుండై యుండె నని మహాయోగి

క వచ్చిన [1]హరిఁ గని కన్నులు
విచ్చి మహానందమునను వెసలేచి యతం
డచ్చోట మాటి మాటికి
మెచ్చిన భక్తిని దండము లిచ్చి నుతించెన్ 117

వ అంత నతండు మౌనంబు విడిచి నిటలతట ఘటితాంజలియై యిట్లనియె శ్రీసర్వేశ్వర కమలాకర కమలా లాలితంబులును నూపురోజ్జ్వలంబులును రక్తారవింద సుందరంబులును పద్మరాగమణి ప్రభాపంబులును వజ్రధ్వజాంకుశ పంకజ కల్పవృక్షాది వాంఛితంబులును చంద్రమండలఖండాభ నఖరాజి విరాజితంబులును సువృత్తాకార రుచిరాంగుళీ శోభితంబులును సుపార్ష్ణి పార్శ్వలలితంబులును ప్రవాళాంకుర కోమలంబులును సంరక్తసీమ పద్మపరివృతంబులును బ్రహ్మరుద్రేంద్ర మకుటమణి నీరాజితంబులును సర్వామరార్చిత కల్ప పుష్పవాసితంబులును తులసీకోమల ప్రభాపటల భాసితంబులును లక్ష్మీవక్షోజ కాశ్మీరచందనాలంకృతంబులును ననవరత భక్తి వినత శంకరాలోక శంకరంబులును ఇందిరా కపోల నయన పద్మ ఓష్ఠాధర వక్షోభిమర్శితంబులును ప్రపన్నార్తిహరంబులును సమాధి మహిత మహా యోగిజన హృత్పద్మ స్థాపితంబులును క్రమాక్రాంత లోకత్రయంబులును గంగాజనకంబులును సత్ప్రపన్న జనాభీష్ట ప్రదంబులును భక్తజన కామధేను కల్పతరు చింతామణి సమానంబులును శరణ్యంబులును వరేణ్యంబులును ధన్యంబులును యనన్యంబులును నిరాశ్రయంబులును వదాన్యంబులును నగు భవచ్చరణంబుల శరణంబుఁ జొచ్చెదనని వినుతించినఁ గరుణార్ద్రుఁడగు నయ్యనంతుం డనంత వేద శాస్త్రోదితం బమ్మౌనికి దివ్యాగ్రగణ్యంబైన ద్రావిడాకృతిం బ్రవర్తిమ నట్లుగాఁ గృపా కటాక్షంబున వీక్షించి యమ్మహానుభావుండు పరమపదంబు గూర్చి చనిన యనంతరంబున 118

1 మూ. హరిగన్నుల

## శఠకోపముని దివ్యప్రబంధంబులం జేసి హరియర్చావతార విగ్రహముల నాకర్షించుట

చ. ఆ ఘురదైత్యసంహరు కటాక్ష వశంబునఁ జేసి సర్వవి
ద్యామయుఁడైన భారతి శుభాత్మక యాతని జిహ్వయందు ను
ద్దామత నిల్చెఁ దత్త్వమయి తన్ సుగుణుల్ గొనియాడ నర్థిఁ బ్ర
బ్ధా మహిత ప్రచారగతి నంతత నిర్మల వృత్తి నంటటన్ 119

సీ. ఆగమాది వేదమయంబులు దివ్యముల్
శ్రీ హరి భక్తి విజృంభితములు
సచ్చిదానంద కల్యాణ గుణావళి
మణి పయోరాశులు మౌనివర్య
ములు పరతత్త్వార్థములు నిరవద్యముల్
బహువిధ చేతన పావనములు
హరిపాదభవయగు నా గంగయును బోలెఁ
గడు పవిత్రములు మోక్ష ప్రదములు

తే.గీ. ధన్యతరములు నగు ప్రబంధములు చేయ
వింసి నచ్చారిసుతకృత కృతులఁ గాంచ
నమరి యర్చావతార రూపమున సర్వ
సంస్థితాచ్యుత మూర్తు లచ్చటికి వచ్చె 120

## శఠకోపముని యర్చావతార విగ్రహముల నిజధామమ్ముం గనుపుట

మ. అటఁ బింబాలయ కోటరాంతరమునం దాదానమ్ముంగాంచు నా
మునికుం జేరి తదీయ సంస్తుత పృథక్ ప్రఖ్యాతిఁ జెంపొంది యు
త్కటరీతిం దగు దివ్య సత్కృతులం జేరన్ భక్త సందర్శన
స్ఫుట సంప్రాప్తము తోచఁ గంటె గిరి నమ్మూర్తుల్ స్వధామంబునన్

తే గీ వాని మధ్యంబునను శ్రీనివాసు శేష
శైలవాసు జగద్గురు శౌరి ననంత
రిప్రబంధమ్ముల నుతించి రహిం దనర్చు
హర్ష వికసిత మానసుండగుచు నపుడు 122

శఠకోపుండు చింతామహీరుహ కోటరావాసుండగుట

తే గీ చారుతర తత్ప్రబంధ నిష్యంద మధుర
సామృతంబుం గ్రోలుచను సమాహ్లాదమునను
దద్గుణాస్వాద మత్తుండై తత్ స్థలంబు
నందు మన్నారి నందనుం డధివసించె 123

సీ ఆ సమయమున కలావహంబగు తామ్ర
పర్ణీ నదీ తీర భాగమునను
నమర కోంగ్రామ మందు వర్తిల్లు మ
హీసుర శ్రేష్ఠుండు భాసురుండు
హరిపదాంభోరుహ [1]ధ్యానసూర్ధ్వశిఖ యుక్త
ముండు తద్విశ్రుత శ్రేష్ఠ భూసురుండు
దేశికుండును విజితేంద్రియుండు[2] ను బర
తత్త్వార్థ విదుండతి సాత్త్వికుండు

తే గీ వాడి కేసరినాముం డనార్యగుణుండు
సామవేద పరాయణుండా మహాత్ముం
డీ ప్రభావంబు గలవాని గృహిణియైన
నతి యనెడు పేర వెలసిల్లు సాధ్వియందు 124

1 మూ ధ్యానో ద్వికో త్త 2 యూ ప్రాజ్ఞుడు పర

## మధురకవి జననము

క. సేనేశ గణాధ్యక్షుం
డైన కుముదనాముండు హరి హితుఁడు శుభా
నూన మగు చైత్రమునఁ జి
త్రా నక్షత్రంబునం దుదారత వారమున్ 125

సీ. జన్మించె నతఁడు దా జన్మప్రభృతి లబ్ధ
పర భగవద్దాస్య వైభవుండు
విమల యోగమహత్త్వ విస్తార పరమర
హస్యార్థ నిర్దేశ యష్టాక్షరాఖ్య
మంత్రరాజ జప సమాసక్త హృదయుండు
హరిపదాంభోజ నిష్యంద మధుర
సాస్వాదనపరుఁడు దగుచు రమాధిప
మాధుర్య కవితా సమగ్ర రచన

తే.గీ. మధురకవ్యాఖ్యఁ దనరి యమ్మహాగణేంద్రుఁ
డతి కృపానిధి యమల వేదార్థవేది
యఖిలవేద ప్రశస్తి యఖిల భోగ
ము విరక్తుఁడు గురుభక్తి కలితుఁడగుచు 126

ఉ. అందు వసించు శేషశయనాంచిత శౌరిని హృత్సరోజమం
దందముగా భజించి మఱి యచ్చటనచ్చటఁ గల్గు విష్ణు స
న్మందిరముల్ సుతీర్థములు మాటికి సేవ యొనర్చుచున్ జగం
బుం దనివారి చేరి తాన పవిత్రీకరించుచున్ 127

మధురకవి శరకోప సందర్శనార్థం బరుగుదెంచుట

సీ. అనుచుఁ జింతించి తదాలోకనముఁ జేసి
యతని పాదాబ్జంబు లాశ్రయింతు
[1]నని మనమున నిశ్చయ మొనర్చి తత్క్షణ
మునఁ [illegible] నిధి వేగమునఁ గవీంద్రుఁ
డా దిక్కునకు స్వస్థ మనస్కుఁడై పోవ
మార్గ సంస్థిత నదీమహీధరములు
నఖిల వనంబు లేకాగ్ర చిత్తుం డగు
తన్మహామహునకు దారి యొసఁగెఁ

తే.గీ. గాన భాగవతుల కెవ్వరేని చేయ
కుండరె సహాయ మట్లోట గురు మనీషి
యైన యమ్మధురకవీంద్రుఁ డరుగుచుం గ్రి
తిదిఁ గురుకాఖ్య నగరంబుఁ జేరవచ్చె 188

వ. అందలి బృందారకకోటరంబునం దధివసించు మహాప్రభుండును బద్మా సనాసీనుండును పద్మపత్రనేత్రుండును ప్రసన్నవదనకమలుం డును దీర్ఘబాహాయుగళసమంచితుండును విశాలఫాలఫలకుండును విస్తీర్ణ భ్రూయుగళ శోభితుండును గంభీర నాసాభాసురుండును బింబోష్ఠ ద్వయ విరాజితుండును సముజ్జ్వలాదర్శ సంకాశకపోల విలసితుండును తిరస్కృత కుందకోరకదశనలసితుండును మహాహనుండును గూఢ జత్రుండును కంబుకంధరుండును మందస్మితచంద్రికా విస్తంద్ర వదనచంద్ర మండలుండును సమున్నతాంసలస్కంధుండును విపుల తర వక్షఃస్థలుండును పీనోన్నత కుక్షిస్థ నాభిగహ్వర భ్రాజమానుండును

1 మూ మానసము

సమస్థిరోరు యుగ్మంబును బ్రహ్మగ్రంథికటితటంబును సంశోభిత
ాసనబంధాద్వయంబును కోటిపాలితలాంఛితుండును స్ఫురదరుణా
రవిందచరణ సుందరుండును జ్ఞాన ముద్రాముద్రితుండును జటామండల
మండితుండును గరళాలవాలహృదయుండును బాలబాలప్రభాభాస
మానుండును సమాధిసమాయుక్తుండును నగు నమ్మహానుభావుం గనుం
గొని యానంద సమాకులేక్షణుండగుచుఁ బ్రణమిల్లి యతని పదారవింద
యుగళంబు నిజనేత్రాంబుకణంబుల నిక్కటంబుగా సంస్పృశింపుచు
బహువిధస్తోత్రంబుల స్తుతియింపుచుఁ గృతాంజలి పుటుండై యున్న
యవసరంబున 184

తే.గీ. ఆతనిచే నిట్లు సంస్తుతుఁ డగుచు యోగి
ఘనకృపాదృష్టి వీక్షింపఁగా నతండు
తన్మహాజ్ఞానవంతుఁడై తత్ప్రభావ
మహిమ నెఱింగి వాక్య మిట్లనుచుఁ బల్కె 185

చ. గురుతర యోగివర్య! పరకోప దయాబ్ధి మదీయ దేశికా
యురుతర వేదసారము లనుత్తమముల్ పఠదంబులున్ భవ
ద్విరచిత సత్ప్రబంధములు విస్తృతి గాంచఁగ నాకుఁ జెప్పి పెం
పరయఁగఁ దెల్పుమీ పదపదార్థములందుఁ గల్గు భావముల్ 186

మ. అని ప్రార్థించిన వా పరాంతుపలు ధవళ్ళపీఠిచే నాతనిం
గని శిష్యోత్తమ నీవు కోరినది పక్కంగా మహాగోప్యమై
యొనయుం దానటులైన జెప్పెదను నీ వేకాగ్రచిత్తుండవై
విను మారీతి యథార్థమంబయిన వాఖ్యావిర్భూతిగాఁ దెల్పెదన్ 187

## శఠకోపముని మధురకవి నియమ్ముగ్రహించుట

సీ. అని యిట్లు పరతత్త్వ మనుపమరహస్యమహిమల్
విను సనాతనములు విభవములును
నంతర్యామి యతి పథార్చలును వి
రములు పర్యాయ విగ్రహము లగుట
నిల శ్రుతి స్మృతి పురాణేతిహాసాగమ
ములు నన్నిటను [1]నివి తెలుపుచుండు
నతిశయస్ఫూర్తిగా సత్కృత్యకృత ప్రబం
ధము లట్టి ప్రతిపాదనము నొనర్చు

ఆ.వె. నమచు నీ రహస్య మంతయు శఠకోప
మునివరుండు ప్రేమమున సవిస్త
రముగ శిష్యుగూర్చి విమలతరోక్తిని
యాదరత ననుగ్రహంబు చేసె 138

తే.గీ. అట మధురకవి యను పేర నమరు మౌని
యతని పదపంకజములకు నతి యొనర్చి
తద్దయు సమస్తములగు సద్గుణము లొంది
యా గురుని నాశ్రయించె నేకాంతుఁ డగుచు 139

చ. సతతము భక్తి కీర్తనము సల్పుచు నా గురువర్యునందు నా
యతమతిఁ జేర్చి తన్మతమునందు వసించుచుఁ గాలమున్ సము
ద్ధృత గతిగా నిమేషము నరిం గనుగొంచు స్వకర్మ భక్తుల
[2]న్నత మగు జ్ఞానమున్ మొద లనందగు ప్రీతిఁ దొలంగి విన్నతోన్ 140

---

1 మూ. ఇవి 2 మూ. వ్రతియగు

## భగవంతుండు ప్రసన్నుం డగుచు శరకోప మునికి
## వకుళమాలిక నొసంగుట

వ. ఏకాంతమానసుం డగుచు నాచార్యుండే పరమంబగు దైవంబును నతండే పరమగతియు నతండే పరమంబగు జ్ఞానంబును నతండే యుత్తమంబగు ధనంబును నతండే పరమ యగు విద్యయు నతండే పరాయణంబును నతండే సర్వార్థంబును నని విశ్వాసంబువలన సంధింపుచు నతని యందాత్మభరంబు నునిచి యహర్నిశం బంద యధివసింప మహాయోగియగు నమ్మధురాంతకుం డతనిచేత శుశ్రూష సేయంబడిన వాఁ డగుచు సంతోషంబుగా భగవంతుం డొసంగిన వకుళమాలికచేత భూషితుం డగుట యను మొదలుగాని లోకంబులయందు వకుళాభరణాహ్వాయుం డగుచు దృఢయోగ సమాధిం జేసి శ్రీకాంఘ్రికమలధ్యాన సుధారసం బనవరతం బనుభవింపుచు నతిం బనులఁ గృతకృత్యులఁ గావింపుచుఁ జించామహీరుహచ్ఛాయ యందుండె నిలయందుఁ దత్కృత దివ్యప్రబంధంబు లేనరులు పఠియింతురు వారు సుదుర్లభంబును సత్యంబును నమంబును నగు పదంబుఁ బ్రాపింతు రఘౌఘనాశనంబగు నీ శరకోప చరితం బెవ్వఁడు భక్తిం జేసి వినుచుం జదివింపుచు వ్రాయుచు శ్లాఘనంబు గావించెనేని వాఁడు పుత్రపౌత్ర సంపదలను నిరామయంబగు నాయుష్యం బొంది యంతంబున దివ్యంబును బరంబును వైష్ణవంబును నగు నద్ది పదంబు నొందునని మహాయోగి మహాత్మ్యంబును జరిత్రమంతంబును నను భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి పంచదశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన నతండు 141

మ. సురలోకార్చిత పాద పద్మయుగ రక్షోనాయక ధ్వాంత భా
స్కర మౌని ప్రకరాత్మ నీరజదళాగ్రజ్యోతి వ్యాధ్యాప సం
సరణాంభోనిధి తారణ ప్లవ రమా సర్వంసహాధీశ ని
ర్జర గంగాజని కర్తృకాంఘ్రి ఘనవక్షఃస్థిత ప్రాభవా 142

క. సరళాగమాంత సంగా
వకుళాభరణాంతరంగ వాసభృంగా
యతుల్యం కరుణాపాంగా
ప్రకటాసుర మదవిభంగ పతగ తురంగా 143

మాలి. పరమపుర విహారా నవ్యకస్తూరిహారా
సరసగుణ విశాలా చారుసౌవర్ణచేలా
సురపుర వరశీలా సుందరీ చిత్తలోలా
విదిత శుభలీలా వేణుగోపాలబాలా 144

గద్య. [1]ఇది శ్రీరామ గోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాంచిత పాండిత్య ధురీ
ణవరతాపసీమండలాఖండల సోమయాజ్య ధౌరేయ సకలసమర్థకాశ్యపకాశ్యప
పటహ దంభధ్వానావ విపరీత పతత్రియా ధిల్లికాధీశ దుంధుభిధ్వాన
కోలాహల హనూమద్ధ్వజాంక కనకదండీకృత హీరకంకీకృత సందీపిత
ప్రతాపకీర్తిప్రభావ కౌశలసంచయపారావార రాకాసుధాకర
సౌందర్య జిత సుమసాయక అహోబిలనాయక ప్రణీతంబైన శ్రీ
మహాభార్గవ పురాణంబునందు భక్తిసారుంగూర్చి మునిశ్రేష్ఠుండు భక్తిం
జేసి శుశ్రూషగావింపుటయు మునిశ్రేష్ఠ నిజ దోశరా జవమితి గావింపుటయు
మునిశ్రేష్ఠుండు గురుసమేతుండగుచు సకలదైవతోద్దిష్టంబుగా దేశాంతరంబు
నకుటయు నదీశ్వర మహీపాల ప్రార్థనంబునంజేసి మునిశ్రేష్ఠ భక్తిసారుల
నకలదేవతా సంఘంబుతో వెండియు స్వధామంబు ప్రవేశించుటయు భక్తి
సారుండు భగవత్ప్రార్థనంబు గావించుటయు విప్రుం డధ్వరంబున భక్తి
సారు నగ్రపూజ గావించుటయు విప్రుం గోపంబున భగవద్దర్శనంబును

---

1 మూ ఇతి

భక్తిసారానుగ్రహంబును గారి నాథనాయకి తపంబును భగవదాజ్ఞం జేసి వారియందు విష్వక్సేనాంశజుండైన శఠకోపముని సముద్భవించుటయు భగవత్ప్రసాద ప్రభావంబునం జేసి పరాంకుశమునీంద్రుండు దివ్య ప్రబంధంబులం జేసి హరి యర్చావతార విగ్రహంబుల వర్ణింపుటయుఁ గ్రమ్మఱ వాని నిజధామమ్ముం గనుపుటయు శఠకోపుండు చించామహీరుహ కోటరావాసుం డగుటయు మధురకవి జననంబును దపోవిఘ్నం బగు మధురకవి పరాంకుశు సందర్శనార్థం బరుగుదెంచుటయుఁ బరాంకుశులు మధురకవి కనుగ్రహం బొసంగుటయు భగవంతుండు ప్రసన్నుం డగుటయుఁ బరాంకుశులకు వకుళమాలిక నొసంగుటయు శఠకోపమునీంద్రులు మధురకవి సహితులగుచు నిజనివాసంబున నుండుటయు ననెడు నేతత్కథలం గల తృతీయాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## చతుర్థాశ్వాసము

క. శ్రీధర రథాంగధర  గం
గాధర నుత సాధువేణు లీలాధర ధా
త్రీధర శ్రీ వాగిన  ధా
త్రీధర శుభధాం సురపురి గోపాలా 1

వ. అవధరింపుము సకలగుణనికర ప్రశ్లాఘురంధరయం దగు  నరుండు నారా
యణున కిట్లనియె 2

తే.గీ. అనఘ నారాయణ మునీంద్ర యఖిలలోక
పూజిత మహోగ్ర శరకోప మునివరేణ్య
చరితమంతయు వాలేర సాదరముగ
వినఁగ నయ్యెను వవ్వం వి స్తరింపు

చ. అతులము విష్ణుభక్తచరితామృతమున్ మధురంబు దివ్యమా
ద్యుతి భవదాస్యదుగ్ధ జలధిం జనియించిన దానిఁ గౌతుక
స్థితి శ్రవణాంజలిం గొనియుఁ దృప్తి నొసంగక యున్నవాఁడ నం
చిత దయతోడ నాకు మతిఁ చెప్పఁగదే హరిభక్త సత్కథల్ 4

క. అని వరుణుడు పల్కె దారా
[1]యణ మౌనిఁ బ్రార్థనచేసి యతనికి మతి యా
జ్ఞను నీ వాక్యము సత్యం
బనఘా తుష్టుండ నయితి నవ్వాక్యమునన్ 6

సీ. శ్రోతంబును శ్రోత దేశ ప్రియంబులు
ధీర సంసార ఖేదములు
మోక్షకాంక్షప్రాప్యములు పావనమ్ములు
కరము బ్రహ్మానంద కరము లైన
హరిశ్చంద్ర చరితంబు లాలించి యెవ్వఁడు
తుష్టి నొందఁడు పలాదుండు దక్క
యోగనిష్ఠాపరు లర్థిఁ గాసారాది
మునివరుల్ హరిశ్చంద్ర ముఖ్య జనుల

తే.గీ. సేవచేతను మను కుంతేశ్వరుండు
మనుజపతియయ్యె నట పరమంబు నైన
పదముఁ బ్రాపించె నమ్మహాభవ్య చరిత
మేను వచియింతు వినుమని యిట్టు లనియె 6

## కుంతేశ్వర ప్రాదుర్భావము

క. కేరళ దేశంబులోఁ
బారిత సంపద లింపురమను విదితం
బౌ రాజధాని వెలయున్
ధారుణిఁ ద్రైలోక్య విశ్రుతస్థితి యగుచున్ 7

---

1 వణప్రాసము 2 మూ ము

తే.గీ. ఆ పురవరంబుఁ బాలించు నధిక యశుఁడు
సత్కృతీనుఁడు దర్వక్ష
(గ్రంథపాతము) 8

ఉ. హమల్ మొగిడ్చి నృపకేసరి పల్కె దయానిధుల్ క్షమా
సారులు మీరు మిమ్ముఁ గనఁజాలని మంత్రి కృతాపరాధమున్
చేరి క్షమింపరే శరణుఁ జెందితి దాసుఁడ నంచు వేడినన్ 9

క. వారలు దరహసిత ముఖులై
కారుణ్యమూర్తు లతనిఁగని నిమ్ముత్రోచున్
శ్రీ రమణుం డని దీవెన
వారూఢి నొసంగి రా ధరాధిపుఁ డంతన్ 10

ఆ. ద్వార పాలురఁ గాంచి రోషారుణాక్షుఁ
డగుచు మున్నెమఁ జెప్పని యట్టి భాగ
వత విరోధంబుఁ జేసిన పాపాత్ము
లక్షమతులగు మీరు దండార్హు లనుచు 11

సీ. ఆ దురాత్ములఁ దీక్ష్ణమైన దండన సేయ
నాజ్ఞ యొసర్చిన నవింధూత
కారుణ్యపరులు భాగవతులు ప్రార్థింప
నా ప్రార్థనము శిరసావహించి

ద్వారపాలకుల భూవర్యుఁడు నిలిపించి
యంతఃపురంబున కరిగి యందు
నా వైష్ణవులను సింహాసనాసీనుఁ
గావించి తత్పాదకమలములను

ఆ.వె. గనక పాత్రముల సుగంధితఁ జేర్చి య
క్షోదకముల హస్తయుగము చేతఁ
గడిగి పావనంబు గల్మషాపహమును
బరమమైన తీర్థవారి గ్రోలి 12

వ. కళత్ర పుత్ర మిత్ర బంధు భృత్యులను గ్రహించి [1]దచ్ఛేషంబున శిరంబున మూర్ధనం బొనర్చి గంధ పుష్పాదుల బూజించి వస్త్రాభరణ ధనాదుల సంతుష్టిఁగావించి కులశేఖరుండు వారితోఁ గూడ నంతఃపురంబు వెడలి దేవసభానమానంబగు నాస్థానంబుఁ బ్రవేశించి యలంకృతంబులగు భద్రపీఠంబుల నారధిష్టింప నండి తదీయముఖాగవింద నిష్యంద గోవింద కథామృత పానంబున నానంద భరితుండై యుండె నని మహా యోగి మాహాత్మ్యంబును బ్రేమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి షోడశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు వసుధకుఁ జెప్పి వెండియు నిట్లనియె 13

క. ఈ విధి భూవిభుఁ డుండిన
చో వాని యమాత్య లక్ష్మ సూచకులు కళా
కోవిదులు వచ్చి సమయము
భావింపుచునున్న వారి భావ మరయుచున్ 14

---

1 మూ. తత్పే

తే.గీ. చెప్ప వలసిన పని యున్నఁ జెప్పఁ దగిన
మంత్రు లిట్టని రా రాజమౌళితోడ
నీవు సర్వజ్ఞుడవు మహనీయమతివి
నీవ రెండవ హరివి ధరావరేణ్య 15

సీ. అనిరంబు ని సేయునట్టి మహాప్రశ్న
వార్వన మదిగా మహాత్ముఁడగుచుఁ
దగు మముంబుంతుఁ గర్తవ్యంబు మంత్రి కు
పాయంబు ధర్మ మౌనైన రాజు
ప్రజలఁ బ్రోచుట శిష్టరక్షణంబును దుష్ట
శిక్షణంబు నెఱింగి చేయవలయుఁ
[1]చతురుపాయంబులు [2]శక్తిత్రయము [3]షడ్గు
ణంబులు [4]పంచాంగ నయము లెఱిఁగి

తే.గీ. యరసి [5]సప్తాంగ రక్ష సమర్థుఁ డగుచు
యశము దిక్కుల నెఱపి [6]భోగాష్టకంబు
ననుభవింపుచుఁ బోషించి యాశ్రితులను
వర్ణ ధర్మాళిఁ బాలింప వలయు జగతి 16

---

1 సామ దాన భేద దండములు
2 ఉత్సాహ ప్రభుత్వ మంత్రములు
3 సంధి విగ్రహ యాన ఆసన ద్వైధీభావ ఆశ్రయములు
4 ఉపాయ సహాయ దేశకాల విభాగ ప్రతిక్రియా కార్యసిద్ధులు
5 స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గ బలములు
6 గృహ శయ్యా వస్త్రాభరణ స్త్రీ పుష్పగంధ తాంబూలములు

చ ఏవవిధమైన భక్తియు మనస్థితిగాఁ గమలాక్షుఁడైన శ్రీ
ధవుని యెడం [1]గురింపుచు నుదారత వృద్ధుల సర్వ వేద శా
స్త్ర విదుల ధారుణీసురుల సాత్త్వికులన్ భయభక్తి తొప్పగా
భువిని సపర్యఁ జేయు నృపపుంగవుఁడార్య చరితతోషితా 17

తే గీ సత్త్వమయమున శుభములౌ సత్కథలను
వినుచు మంత్రులు మంత్రకోవిదుల సూక్ష్మ
మతుల మన్నింపుచును దీక్ష మహిత దండ
మెఱిఁగి చేయంగవలయు మహీశునకును 18

క మనుజుల పాలనము చే
ద్యను సల్పుచు న్యాయ రీతిగాఁ బలురథనం
బును సార్థకంబుఁ జేయుచు
జన పాలం దండు సధిక సౌఖ్యపరుండై 19

వ తగు సమయంబున సదికతరంబగు ధర్మార్థకామంబు లనుభవింపుచు బలం
బులగు వరంబులగు [2]సురుషార్థంబుల యందభియోతత్పరుండై యుందు
సప్రాప్తకంబు నెఱింగుచు మూఁడు మూడగు పరస్పరానుషిక్తాత్మ భావం
బులం జేసి తీర్థ స్వభావంబు లరయుచు నాత్మశక్తి చతుర్గుణంబులగు రాజ
దోషంబుల వర్జింపుచు దశ యంత దశసప్తప్రకృతిసర్గ తత్పరుండును
సవ్విధంబున వింశతివర్గతత్పరుండును నగుచుఁ గృత్యంబులుఁ బ్రకృతి
మండలంబును దైవంబును మానుషంబునుం ద్రివిధంబులగు విద్యలం
బ్రబోధించి వర్తింపుచు ధర్మంబైన యూపాసనంబు సేయుచు జిత
శత్రుండును జితేంద్రియుండునునై యివ్విధంబున నే రాజు సంయుంతు
వతఁడు చతుస్సముద్రపరీతంబగు ధరాతలంబు నాకంబు సాధింద
లంచుమం బోలి యనుభవించు నిట్లు హితకాంతుల మగు నస్మద్విజ్ఞాపనంబు
విని రాజధర్మంబులఁ బ్రవర్తింప మెల్లవ్వరుం దత్త్వపరుండవై

---

1 కురియించుచు చింతపలెదు   2 పురాణములు

యందరు మిథ్యావగతులు హితయును బ్రత్యక్ష సౌఖ్యప్రదంబు
నుత్తమంబును నగు రాజధర్మంబు బోధింప నెఱుంగరని చెప్పిన 20

కం. అన విని మంత్రివాక్యములు హాసముఖుండయి ధారుణీశుఁ డి
ట్లను నిం వైష్ణవోత్తముండై యెవరేని హితోపదేశ మిం
పున నొనరింప వారు హితబోధనమున్ శుభదుల్ విముక్తిదుల్
ఘను లనిపల్కి మంత్రులకుఁ గార్యము లేర్పరఁజెప్పి యంతటన్ 21

మ. ధరణీనాయకహారి వైష్ణవసుంతోఁ దత్వార్థసంలగ్న హృ
త్పరసీజం బగుచున్ వసింప సచివుల్ తద్వైష్ణవ శ్రేణికిన్
నరనాథాగ్రణి యావిశేద మనువందం జేయఁ దాపాత్ములై
యరయంజొచ్చిరి పెద్దపాయములు ధర్మాశ్వేషణాసక్తులై 22

సీ. అంతట నొక్కనాఁ డవనీశ్వరుఁడు మహా
తేజుఁడు సుముఖుండు రాజ రాజ
పవిత్ర ప్రశాంతమూర్తియుఁడు మహాభాగ
వరమౌళి రత్నాంఘ్రి పాళి కయుఁడు
దక్షుఁడు విస్తీర్ణ ఫాలభాగుండు వి
శాలవక్షుఁడు సుజనసుమంచి
తా యుగళుఁడు దీర్ఘాయత బాహుస్త్రియుఁ
డబ్జగరుండు మహాభుజుండు

తే.గీ. సుభ్రూవు సునాసికుఁడు బృహదోష్ఠ కటిత
టుఁడు బింబాధరుండును గంబు కంధ
రుండు గంభీరనాభిపుటుండు బంధ
హాస హరిరంగ రుచిరుంతఁ బాంచితుఁడు 23

తే.గీ. దివ్యమాల్యాంబరధరుండు దివ్యచంద
నానులేపియుఁ గేయూరహారమకుట
కంకణాంగద కుండలకరభూష
ణాంఘ్రిమంజీర భూషితుండై విభుండు 24

కం. అతఁడు మణిస్తంభ సమం
చింతామణిమంటపము నందు సింహాసన సం
గతుఁడును నృపమండల సే
వితుఁడును నయవేది మంత్రివితతివృతుండై 25

కం. హితులు పురోహితులు కవి
ప్రతతియుఁ బౌరాణికులును బరివేష్టింపన్
క్షితికంబాధుఁడు తారా
న్వితుఁడగు చంద్రుఁడుఁ బోలి వెలసెన్ సభన్ 26

వ. అయ్యవసరంబున భాగవతశ్రేష్ఠులుం గృపానిధులును సనన్దనాదిభక్త విశిష్టులును జగత్పవిత్రులును సర్వేశ్వరార్పితకర్మనిరతాశయులును శ్రీమదష్టాక్షరీ మంత్రానుష్ఠాన నిష్ఠాగరిష్ఠులును ద్రావిడామ్నాయ బోధకులును శమాదిగుణసంపన్నులును జీవాత్మ పరమాత్మలయందు శేషశేషిత్వతత్వజ్ఞులును దత్వత్రయ పరిజ్ఞాతలును స్థిరచిత్తులును దృఢవ్రతులును నగు కొందఱు వైష్ణవు లేతేర నిరీక్షించి కులశేఖరుండు విస్మయంబునఁ బ్రత్యుత్థానప్రణామస్తుతి పూజనంబుల యథావ్యాయంబున నొనర్చి వారలవలని గోష్ఠివలనఁ దత్వరహస్యంబు లెఱుంగుచు హరిగుణశ్రవణంబునం బొడమ్పద్యయంబు పరమాహ్లాదనిర్భరుండై యుండి స్నానంబొనర్పు కొఱకు నిజరుక్షణంబుల సింహాసనంబునందు నిడి వెండియు హరికథానక్తచిత్తుండై యమ్మహాత్ములవలన నుత్తమంబగు గోవిందచరితామృతాస్వాదంబుఁ జేయుచు నత్పల్లాపతుతుహలుండై యుండి యంతవ వైష్ణవులంబుఁ బ్రతిమిల్లి మనగొని యనుజ్ఞాతుండై యమ్మహారాజశుద్ధాంతంబుఁ బ్రవేశించెనని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును

నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి సప్తదశాధ్యాయంబు భక్త
పరాయణుండగు నారాయణుండు నరునకుం జెప్పి యెండియు నిట్లనియె 27

## రాజమంత్రులు వైష్ణవులయెడ చౌర్యంబు కల్పించుట

ఉ. అంతట మంత్రులందఱు సభాంతరసీమకు వచ్చి యందు భూ
కాంతుని భూషణంబు లటు గన్గొని యా నృపభూషణాళి గే
హాంతరమందు దాఁచి యపు డా మహిభర్తకు వైష్ణవాళి పై
వింతయు ద్వేషముం గలుగ విన్నపఁ జేయఁగ నంత దుర్మతిన్ 28

సీ. అన్యోన్యముగ వార లాలోచనము సేసి
నరనాయకుని భూషణములు దాఁచి
యమగృహంబుఁ జేఁగ భరతాగ్రజుం డంత
స్నాతుఁడై మంత్రరాజము జపించి
జానకీ లక్ష్మణ సహితుని బ్రహ్మాది
సేవితు రాము నర్చించి యర్ఘ్య
పాద్యాది విధులచే బ్రణమిల్లి సర్వవే
దార్థంబు లను స్తుతు లాచరించి

ఆ. మఱి హరి నివేదితాన్నంబు ప్రదసౌ
చేతమున నలంది ప్రీతితోడ
సభకుఁ బోవఁదలఁచి జనపతి పరివార
జనులతోడఁ గలిసె సంభ్రమమున 29

తే. గీ. పరమ సింహాసనమున భూషణము లేమి
చెప్పి గృతిఁ దెమ్మని పెద్దఁడు పలుక
నేగి యారక్షకులు సభ కేగి యచట
గానక యున్న చింతించి మరలి వచ్చి 30

1 మూ. [illegible]

క. జగతీశుఁ గూర్చి దివ్యము
లగుభూషణములు తదవనియందుం దే వం
దాఁగిఁ దెలిపిన వారల పలు
జగతిని మరి ఏది నరేంద్రుఁ డతికుపితుండై 81

క. పుర రక్షకులను మంత్రుల
సరవిని రావించి యది నొసంగుచు నభయం
బిరవైన నాదు సొమ్ములు
పొరిఁ దస్కరు లెవరు గొంపఁబోయిరి పగటన్ 82

తే గీ. ఒప్పుఁగా మీరు కావలియున్నచోట
దొంగతన మెం తగులు నిందుల మరియు
భూషణంబుల వేగ నిప్పుడె యొసంగ
కున్నఁ బ్రాణాంతదండ మే నొగి నొనర్తు 83

## కుంభోదరుఁడు శపథము చేయుట

క. అని యిట్లు నృపతి పలికిన
విని యందఱు గంపమొంది భీతిని దీనా
ననులై యభిభాషింపుట
కును శక్తులు గానిచో నతం డిటులనెన్ 84

సీ. అంత మంత్రులు నిల్చి యధిపతిమ్రోలఁ
బ్రాంజలులై మ్రొక్కి యందఱనిరి
నృప భవదాజ్ఞచే నింత కాలము చోర
బాధ యొకప్పుడైనను సమస్త

ధాత్రీ తలంబున దనరదు గాన పి
తందఱు భయగతులగుచు వార్త
నందుచున్నారు చోరాన్వేషణం బగు
తర్క మిం దెట్లుం గలుపవచ్చు

తే.గీ. నిలువు రాజు లనేకులు గలరు రాజ
గృహములు గల విపుడు నివారింపఁబడిన
ద్వారములు నయ్యె నిట్లు పీవంటి వారు
గలుగనేరరు పరికింపఁగా నిజముగ 85

తే.గీ. శ్వేత మృత్కాబ్ర ధారణ స్థితిని జేసి
తావకీన నికేతనద్వారమునను
బరఁపు లిటువంటివారైన నరుగుదెంతు
రెంచి వారింపఁబడర ధాత్రీతలంబ 86

క. కన పీ చిత్రం బెట్లుం
డిన [1]నుందని భూమిపాల ఎక్కుమగ గలం
పను మా మది జైన్యవుం
దునె సందేహంబు వారను మానస్థితిగన్ 87

క. వారలు గాకను పొమ్మలు
చేరారరు గ్రహింప రధిప విను మిట్టింగిన్
వారిఁబడి కోధించియు
పీరి గ్రహియింప వలయు పీభూపాలున్ 88

---

1 మా నుండిని

మ. అని దుర్వాక్యము దుష్టచిత్తు లతిపాపాయత్తులౌ మంత్రు లా
డిన వారించి నృపాలశేఖరుఁ డకుంఠీభూత చేతస్కుఁడౌ
చును గర్ణంబులఁ గేల మూసికొని విష్ణున్ సంస్మృతిం జేయుచున్
గన నెట్లో ఖలాత్మలైన మీ ముఖము ప్రత్యక్షంబుగా నేనిటన్ 39

క. నిలువవలదు నా సన్నిధి
ఖలులారా పొండు మీరు కమలాక్షుని భ
క్తులయెడ నింద గలుపు వా
రలతో భాషింపరాదు రహి నెవ్వేళన్ 40

గీ. వారిఁ జూచినఁ బాపంబు వచ్చు ననుచు
నవనిపతుఁడు పరాఙ్ముఖుఁ డయ్యె నంతఁ
గుపితుఁడై యున్న యతనిఁ గన్గొనియు మంత్రు
లప్పు డిట్లని రవని సాష్టాంగ [1]మెరఁగి 41

మ. తగుదండార్హులఁ దాతతాయిరతులన్ దండింపు మన్మన్ యథో
క్త గతిన్ భూవర యంచు మంత్రు లన నాతం డి[2]ట్లనున్ వెఱ్ఱి వం
తగ శ్రీవైష్ణవులందుఁ గల్గనగు నిందం దాపి యా మీఁద మం
త్రిగణంబుం గదు శిక్ష దండమున దండింతున్ బ్రసిద్ధంబుగాన్ 42

తే.గీ. అటులఁ గాకున్న వైష్ణవు లందు భక్తి
గలిగి నృపుఁ డపరాధము గలుగునట్టి
మంత్రులను దండనమొనర్చె మహి నెంచుఁ
బాలనిందింపరే నన్ను సజ్జనులు 43

---

1 మూ మెరిగి 2 మూ దిట్టుచున్

సీ. అని మనంబున నిశ్చయము( జేసి నృపతి యి
ట్లని పల్కె నా మంత్రి జనములార
వసుధ నే యఘమందు నపచారకము హరి
స్మరణచే నణ(గును శౌరినింద
చేసిన పాపంబు శ్రీ వైష్ణవస్తుతి
నణ(పగ నణంగు వైష్ణవుల నింద
నెప్పాపము ఘటించు నప్పాప మేమిట
నైన( బోవదని మహర్షు లనిరి

తే. గీ. యట్లు కావున మీచేత నాచరింప
నైన మహనీయ విష్ణుభక్తాపరాధ
మున(గలుగ నెందు మిమ్ము పావనుల( జేయ
[1]కలిగి(జాలునే యే మహాదండమైన, 44

తే. గీ. ఆయన వైష్ణవులందు( దౌర్జన్యము లేమి(
ప్రకట మొనరించి దండింతు( బైన మిమ్ము
దుమిం ప్రసిద్ధముగాగ నిపుడు యథార్థ
లైన మిమ్ము దండింపక నలయబో(ద 45

వ. హరిభక్తియుక్తులును మహాత్ములును ధర్మసంపదాధారులును పరస్త్రీ పర
ధన పరాఙ్ముఖులును త్రిలోక పవిత్రచరిత్రులును గామార్థానపేక్షితులును
సర్వలోకమిత్రులును క్రోధ లోభాది శత్రులును జ్ఞాన వైరాగ్య
ప్రభావులును నగు నీ వైష్ణవులయందు దుష్టబుద్ధులగు మీ చేత నాలో

---

1 పా॥ కలిగి

హితంబగు చోరత్వం బేను బరిహరించువాఁడనై నిశ్చితంబగు నంతరంగం
బుతోఁ బ్రమాణం బొనర్చెద స్వామికార్యంబు భృత్యునకుఁ గర్తవ్యం
బగుఁగదా యని పలికి సవిషంబును ఘోరంబునగు సర్పంబును స్వర్ణ
ఘటికం జేర్చి ఘటాంతరంబునందు నిడి యప్పు డమ్మహీవల్లభుండు
సంపూర్ణహృదయుండగుచు [1]సుహృత్తునకు రాజబంధువర్గంబును బురో
హితులను సమస్త పౌరజనంబులను రావించి యిట్లనియె 46

తే.గీ. అఖిల జనులార నాదు వాక్యంబు వినుఁడు
సత్య మేను వచించెద శౌరి భక్తు
లెల్ల లోకంబులందు నొక్కప్పుడేని
చౌర్య కర్మంబుఁ జేయ రుత్సాహు లగుట 47

క. క్షమ సత్యము సత్యము స
త్యము సత్యంబిదియె సంశయము లేదని య
వ్విమలాత్ముఁడు కులశేఖరుఁ
డమలం బలికి జూచు వారి కందఱ కనుచున్ 48

వ. మహాఫణి ఫణా వ్యాప్తయుఁ గుంభాంతర్గత సంస్థితయునగు స్వర్ణ ఘటి
కరంబునం గొని తత్సర్పం బెత్తిన వాఁడయ్యె నిట్లమ్మహారాజు గావించు
కర్మంబు నుద్దేశించి సకల విబుధులాకాశంబునం జనుదెంచి ఋషి సమ్మహాత్ము
నవలోకించి తన్మహాద్భుత కృత్యంబుఁ బ్రశంసింపుచుఁ బహుముదంబుల
విస్మయంబు నొంది దుందుభులు మ్రోయింపుచుఁ బుష్ప వర్షంబులు
గురియింప నప్సరోగణంబు నృత్యంబు సేసెనని మహాయోగి మాహా

---

1 పూ. స

తృతీయంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి
యష్టాదశాధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నరునకుం
జెప్పె మఱియు విట్లనియె 49

ఉ. అంత సమస్తదేవ నికరార్చితుఁడున్ సకలేశ్వరుండు శ్రీ
కాంతుఁ డనాది పూరుషుఁడు గంధవహస్తుతుఁ డాశ్రిత ప్రియ
స్వాంతుఁడు రంగభర్త కరుణాంబుధి శ్రీ రఘురామమూర్తితో
నెంతయు దృష్టిగోచరత నింపెసలారె నృపాలు వెంగటన్ 50

సీ. భానుకోటిప్రభా భాసమానుని హరి
స్మృతిమేచకాంగు ననంతవీర్యుఁ
గరుణాపయోధి రాకాచంద్ర మండల
నలిన విరాజితానను మహాత్ము
హస్తి హస్తాయత హస్తుఁ దటిత్ప్రత
వసను నపార వైభవుఁ బ్రఫుల్ల
సితపద్మ పత్ర విస్తీర్ణాంత లోచను
నర్క చంద్ర విశాల [1]ఫాల భాగు

తే.గీ. నుదుట బాలేందురేఖా సమోర్ధ్వపుండ్ర
రమ్యమాణిక్య మకుటాంతరక్త నీల
కర్ణకుండల మండిత ఘనకపోలు
([2]విలస నీ రేణుసంస్పర్శి విపులనయను ) 61

---

1 మూ ఫాలు
2 మూ లేదు

సీ. విలసితస్మరచాప విభ్రమభ్రూయుగుఁ
జంపక నాసు[1] నిశ్శ్వసన నలిన
గంధసమ్మోద సంగత చంచరీక మ
హా హాసుఁ బీనోన్నతాంసు దీర్ఘ
బాహుని శ్రీవత్స కౌస్తుభ హారవ
ద్ధురు మహోన్నతవక్షు గూఢ జత్రు
నరుణ ప్రవాళబింబాధర మందస్మిత
దరహాస వృత కుందదంతపంక్తి

తే.గీ. కలితు ప్రశస్తత్రిరేఖాంక కంబుకంఠు
నమిత హేమాండ భువనోదరా త్రివళ్ళి
యె స్వోదయభూత వాణీపయోజాసనధిక
బహుమణి విభాసితోదర బంధనాభు 62

తే.గీ. అసమసంధ్యాభ్ర సమహేమ వసనలసిత
కాంచికాంచిత కటి భాగ ఘన సుసూక్ష్మ
కలిత మధ్యుని రోమరేఖావిభాసు
సురనదీరమ్య సైకత శ్రోణియుగళు 63

కుంభోదరునకు నారాయణుఁడు ప్రసన్నుఁ డగుట

క. స్మరలితావన మధ్య
స్థిర రంభా సన్నిభోరు దీపితుని రమా
కరకమల రక్తరుచి భా
స్వరమణి కృత సురసేవాను జంఘా యుగళున్ 64

---

1 మా. నిశ్వసన  2 ము 'స' లేదు

చ సకల జగచ్ఛరణ్యుని విశాల శరద్వికచాబ్జ పాదయు
గ్మకుని మణిస్ఫురన్మకుట కాంతి విరాజిత సర్వదిక్తటున్
బ్రకట శరాసనాగ్రయుత వామకరున్ గలితాన్య హస్త సా
యకు నిజపృష్ఠభాగగత హాటక రత్న నిషంగయుగ్మునిన్ 55

సీ వైజయంతి దివ్యవనమాలికోజ్జ్వల
మణికంకణాది భూషణ శుభాంగుఁ
గాశ్మీరకస్తూరికాగంధ చర్చితుఁ
గందర్ప శతకోటి సుందరాంగు
శంపాంతరాంగి జగదాకృతియు జగ
న్మాత దయాలోకనముఁ జేసి
సకల భూతశ్రేణి సంరక్షణముఁ జేయ
జనకజతో నుండు సదయ హృదయు

ఆ వె వ్యగ్రజన్ము దాస్య మనుపొందుచు సమాహి
తుఁ డగునట్టి లక్ష్మణుఁడు సపర్య
నమరినంత సలుపఁ దనరువిభుని లోక
పాలకుని మహానుభావు నమలు 56

చ అమృత పయోధి ఫేన రుచిరాభ్ర మణిదండము చేత మించు బో
ద్యమ మగు చామరంబున సమంచిత పూర్ణ సుధాంశు మండలో
పమ ధవళాతపత్రమున భాసిలు ధన్యు శరాబ్జజేంద్ర వం
ద్యు మహిత చర్యు భక్తజనతోషకు నిస్తుల ముక్తిదాయకున్ 57

తే.గీ. అక్షయు ననంతు నవ్యక్తు నప్రమేయు
నఖిల జగదాకృతి పరేశు నాద్యు విశ్వ
సంభవ స్థితి లయ కారు సకలభర్తఁ
బరమిఁ బురుషోత్తమునిఁ బరాత్పరుని విభుని 58

క. ఈ విధమున వెలుఁగొందెడు
నా పరముని నవ్యయాత్ముఁడగు రామన్న నా
భూవరుఁడు గాంచి కాన
ద్భావంబై తనుదేరఁ బ్రణామతిఁ జేసెన్ 59

తే.గీ. అతని సందర్శనమువల్ల నధిక సుఖత
లాప్తియై పులకాంచితుఁడై ప్రహర్ష
బాష్ప చకితాక్షుఁడైన యప్పరమ భాగ
[1]వత వతంసుని రామభూవరుఁడు గాంచి 60

వ. తనకు దండ ప్రణామం బొనర్చిన మహీమండలాఖండలు నెత్తికొని కౌఁగిలించి కృపాకలన సహిత మధుర భాషిత నిట్లనియె 61

కులశేఖరుఁడు నారాయణుని స్తుతించుట

సీ. వైష్ణవోత్తంస భూవరశేఖరత్వ క
ల్యాణగుణాఢ్య మహానుభావ
నాథ కృపరూప నాకంటె నధికులు
గాఁగ నెంచితి నదిగాన నేను

---

1 మూ. వతాంసుని

క చరణ కమల సందార
స్ఫురితాళిం గహన నిందయ భూరి భరాద్యా
సుర పుష్కరణ్య నము
ద్ధర దావానలం నినున్ వతుల్ సేతు మతిన్ 67

క కుహనా కురంగ రూపుని
మహిత భుజా శౌర్యధుర్య మారీచుని దై
త్యు హరించిన నీ కోరిక
నహరహము, నుతింతువాఁడ నతిశయ భక్తిన్ 68

క కని తిర్యగ్యోని జనిం
చిన పక్షి జటాయువునకుఁ జేకొని మోక్షం
బనువొంద నిచ్చిన దయా
వన రాశి నీకు మ్రొక్కువాఁడ మహాత్మా 69

తే గీ శబరి యనెడి తపస్విని సారభక్తి
స్వాదు ఫలములు గాఁజూచి సంగ్రహించి
యొసఁగిన భుజించి కరుణ దయ్యనిదఁ బ్రోచి
నట్టి నీకు నమస్కార మాచరింతు 70

క లీలా విలోకనంబున
[1]నోలిన్ వాలమ్ము వ్రేసి యొక బ్రేటున నా
వాలిన్ నిర్మూలించిన
శ్రీలోలున నే నమస్కరించెద నీకున్ 71

---

1 మూ లోలిఁ

క. అగ్రజు నిగ్రహ మొనరిచి
సుగ్రీవుఁ బరిగ్రహించి శుభకర రాజ్యా
నుగ్రహముఁ జేసిన కృపా
విగ్రహునకు మీకు నేను వినతి యొనర్తున్ 72

సీ. ముద్రాంకిత కపీంద్ర ముద్రికాభరణాంక
భద్రదాయక భక్త హృద్రతాత్మ
శరణార్థి శౌంస్త్య భరణాభయ ప్రద
కరుణాభరణ దీన శరణ చరణ
యాతనాంబుధి బంధ్రాక మధ్యనిబద్ధ
సేతు విఖ్యాతి సంజాత మహిమ
లంకాపురీ కృతాలంకార హరణ ని
శ్శంకార చిత సాహసాంక సమర

తే.గీ. సకల దనుజ దవానల శమన జలద
కుంభకర్ణాఖ్య మదకుంభి కుంభివైరి
ఖండనోద్దండ రిపుఘాతఖండన ప్ర
భండన నమస్కరింతు నీ కంజలి గొని 73

క. కుంఠిత దశకంఠ మహా
కంఠీరవ ఘోర కంఠ గళ ఖండన పో
త్కంఠ శరధా[1]కృతిప యగు
కంఠేకాల నుత నిను గావింతు నతుల్ 74

---

1 వు ప్రతి వగు

క. వరవిధి శక్రముఖామర
చిర వినుత విభీషణాభిషేక క్రీడం
భరితానంద నిగుంభన
మతిమతి నీ కొలుతు నే నమస్కృతిఁ జేతున్ 76

క. నామాంకాయత భాసిలు
భూమీసుతతోడ నెక్కి పుష్పకమున న
త్యామోదస్థితి వెలసిన
శ్రీమంతున కే నమస్కరింతును నీకున్ 78

సీ. సాకేతపురవాస జనమానసానంద
    తరుణార్క సౌఖ్యప్రదానవిభుఁడ
యనమాన దివ్య సింహాసనారూఢత
    నిరవొందు సర్వలోకేశ్వరేశ
భరతాది నిజ సహోదర ధరిత ఛత్ర
    చామరాదిక పరిచ్ఛద విశేష
తపన నందన వాయుతనయ[1] జాంబవదాది
    రమణీయ సేవా విరాజమాన

తే.గీ. యఖిలం రాజన్య నికరంబు లాశ్రయింపఁ
పరమ సామ్రాజ్య వైభవస్ఫురణ వెలసి
దేవతలు సన్నుతింపఁగఁ దేజరిల్లు
నీకు ప్రమోక్కెదమయ్య లోకైకనాథ 77

1 మూ. సుగ్రీవాది

ఉత్సాహ వందనంబు నీకు రాజవర్య జానకీవరా
వందనంబు నీకు భక్తవర సంతతాదరా
వందనంబు నీకు లోకవందితా కృపాకరా
వందనంబు నీకు రామభద్ర దేవ శ్రీకరా 78

చ. ప్రకృతుఁడను దేవతల్ వెదకి చూడ నగమ్యుఁడవైన నీవు ప్ర
స్తుతము మనుష్యమాత్రుఁడను క్షుద్రుఁడనై తగువారు గోచర
స్థితిఁగనవైతి విప్పు డటులేని కృతార్థుఁడనైతి సత్కృపా
యతమతిఁ బ్రోవు నన్ను ధరరాగ్రణి శ్రీ రఘువంశశేఖరా 79

క. అని పల్కి నృపతి యారా
ము ననుగ్రహమునను దివ్యమును వేదాంతా
ర్థ నిరూఢ సంగ్రహంబును
దనరఁ బ్రబంధంబు నపుడు దాఁ జేసె యోగిన్ 80

తే.గీ. దాని రాముని కర్పించి తద్విభుండు
భక్తిని గృతాంజలి యగుచుఁ బరమ మూర్తి
యైన యద్దేవుఁ గూర్చి యుదార ఫణితిఁ
బలికె సంతోష భరితుఁడై భవ్యమతిని 81

క. కరుణాకర దేవా నను
వర మడుగు మటంచు నీవు వచియించుట నే
వర మేను గోరుదు సురే
శ్వర యంతయు మున్నె నా కొసంగుట కతనన్ 82

క. నీ యందలి సద్భక్తియుఁ
బాయక మీ భక్తులందుఁ బ్రబలిన భక్తిన్
ధీయుక్తి నా కొసంగుము
శ్రీయుత కరుణాలవాల శ్రీతజనపాలా 83

తే.గీ. అవ్వరము దక్కఁగ నితరం బేమి కోర
నో సర్వేశ్వర యటంచు నిట్లు నృపతి
యెఱుకతో హరి సంతోష భావుఁడగుచు
వల్లె వరమిచ్చి నవ్వుచు ననియె మఱియు 84

తే.గీ. ఖ్యాతి శీలాంక దాతయో ! తనూజ
నా కొసంగుము ధారుణీనాథ నీకు
నేను జామాత నయ్యెద నీవు నాకు
మామ వగుమని యా రంగధాముఁ డనిన 85

క. జనపతి యా హరి వాక్యము
విని నే ధన్యుండనైతి వెస నా జన్మం
బును గులము పవిత్రంబై
తనరారె మహాత్మ యని ముదంబు దలిర్పన్ 86

**శీలాంకదాతయగు కులశేఖర తనయను నారాయణుఁడు వివాహమాడుట**

వ. అని ధరణీశ్వరుండు పురమంతయు సాంద్రసుగంధ చర్చనం
బున మకరతోరణంబులను ముత్తెపు ముగ్గుల రత్నదీప భా
జనములచే నలంకృతము లెసంగఁగ మంగళతూర్యములు ని
స్స్వనములు ఘోరుకొల్పఁగ వివాహ విధుల్ సమకూర్చి యంతటన్ 87

సీ. సతికి మంగళజల స్నానంబు గావించి
 చారు దుకూల వస్త్రములు గట్టి
లలితమౌ కస్తూరి తిలకంబు గావించి
 పవనవామోద గంధము లలంది
కరతతికి మణిహేమ తాటంక కంకణ
 కంఠహారాద్యలంకారము లిడి
కలికికిఁ గన్నులఁ గాటుక ఘటియించి
 చెలువంపుఁ బసుపున నలుఁగు పెట్టి

ఆ.వె. సకల సౌందర్యరసము సాక్షాత్కరించి
యా కుమారిక యయ్యె నా నింపుమీఱ
పరమ శోభనవతికి నా పద్మముఖికి
నఖిల శృంగార వైభవ మువరించి 88

క. ఆదరమున నా నరపతి
వేదోక్త కృతాగ్ని హవన విధు లొనరంగా
నా దేవికి వైవాహిక
వేడుకపై మనిచి దివ్య విభవము లమరన్ 89

క. ఆ రాజు కన్య నిచ్చెను
వారికి విధిపూర్వకముగ వైభవ భృతికిన్
శ్రీరంగపతికి భవ సర
సిరుహ భవ ముఖ సుపర్వ సేవాదృతికిన్ 90

ఉ. అంతట రంగరత్న విభవాంచితలీల మనోహరాంగి య
త్యంత విలాససంపదల యందము లందగు సత్య ధారుణీ
కాంతుని పుత్రియై తగిన కన్యక ధన్యకలాపశాలి వ
[1]ల్లింతి వివాహమై తమము రింపుగ నా రమణీ సమేతుఁడై 91

తే.గీ. ఆ నృపాలుండు మంగళాచరణ సకల
భూరితర వస్తువు లొసంగి పూజసేయ
హరి ప్రమోదించి ప్రీతుఁడై సురలతోడఁ
బరమ మైనట్టి నిజ దివ్య భవనమునకు 92

సీ. అంత నా నృపమంత్రు లతి విస్మయావిష్ట
చేతస్కులై యా మహీతలేంద్రు
నతుల ప్రభావంబు నారసి భూవరా
వతరిల్లఁ గైకొని వచ్చి యరిగి
ముందట నిడి భయంబున ప్రణామము చేసి
తమ యపరాధ మంతయును దెల్పి
యట కృతార్థులై యతిభయంబు వేడిన
నారాజు వారల కందఱకును

తే.గీ. దయ నభయ మిచ్చి రక్షించి తనతనూజు
ననఘు గుణవంతు బలవంతు వినయవంతు

---

1 మా. ల్లింత

రాజ్యమున నుండి తాను నిరంతరంబు
వెలయ వైష్ణవసేవఁ గావింపుచుండె 66

కులశేఖరుఁడు రామాయణకథా శ్రవణంబునం జేసి
దశకంఠునిపైఁ గోపంబు పెట్టి లంకకుఁ జనుట

వ అనంతరం బమ్మహీకాంతుండు శ్రీమద్రామాయణ పారాయణుం డగుచు ననవరతంబు రామాయణ కథం గూర్చి మహాత్ముండగు రాఘవు సుఖ చర్యలయందు సుహృష్టుండును, దుఃఖ చర్యలయందు దుఃఖితుండును నగుచు రామునియందలి ప్రేమాతిరేకంబునఁ బరవశాంతఃకరణుం డగుచు నివ్విధంబున వసియించుచున్న రాజు నవలోకించి యటఁ బౌరాణికుం డిమ్మహానుభావుం డీ సీతాపహరణంబు సహింపఁడని చింతింపుచు మాయాసీతం గొనిపోయెనని యుగ్గడింపుచు నా వైష్ణవుం డుండె నంత నొక్క నాఁ డవ్విప్రవర్యుండు గ్రామాంతరగతుం డగుట నతని పుత్రుం డనుత్తముండగు రామాయణంబుఁ జెప్పి నృపతి మనంబు గూర్చి తమతండ్రి చేత నుడువఁ బడని సీతాపహరణంబు నతనికి యథార్థంబుగ నెఱింగించిన [1]నారాజు భక్తి సంపూర్ణ హృదయుం డగుచు దాని విని ప్రత్యక్షంబు మాడ్కిఁ దెలిసి శోకరోష సమాకలితుం డగుచు మదీయజనని యగు జానకిన్ దుష్టాత్ముండెట్లు హరియించె నిప్పుడ యారక్కసు శిరంబులు కరవాల ధారం ద్రుంచి వైదేహిని పలికి క్షిప్రంబ గైకొని రవితురంగ సన్నిభంబగు తురంగరాజం బెక్కి లంకాభిముఖుఁడై పోవుచున్న యవసరంబున 64

1 వారాజ కుమారుండు

వ. మహీపాలా నీ వియ్యుద్యమంబువలన నరుగవలదని చెప్పి యాశ్రిత వత్సలుండగు సర్వేశుం డతనిఁ బుష్పకారూఢుం గావించి యవ్విమానంబులోఁ గూడ నప్రాకృత జనాకీర్ణం[1]బగు వైకుంఠంబునఁ జేరె మహానుభావుండును హరిప్రియుండును నగు రుక్మాంగదు చరిత్రం బెవ్వ రనయంబు వినుచుం బఠియింపుచు లిఖియింపుచు నుండురాఁ వైహాముష్మిక సుఖంబులను [2]బొందునని శ్రీమంతంబును నగు భార్గవపురాణోత్తర ఖండంబు నందలి యేకోన వింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నరునకుఁ జెప్పె నింతియ నిక్కమనియె 98

చ. నరు విను మేను జెప్పెద జనస్తుతమై తగి సర్వదేవతన్
త్కర పరిరక్షణార్థముగ ధారుణిలో నవతీర్ణయయ్యె సా
దరమతి లక్ష్మి భక్తజన దైన్యములన్ హరియింప నా రమా
చరితము సత్తమంబు సకలప్రద పాపహరంబు వేడుకన్ 88

సీ. కల్యాణగుణశాలి కంజాత సంజాత
కటువాకటాక్ష వీక్షణ సమేత
సరసీరుహాక్ష వక్షస్స్థలాలంకార
కీర్తి ప్రచార విస్ఫూర్తి సార
త్రిజగతీమాత వర్ధిత వైభవవ్రాత
నతకల్పవల్లి కాంతామతల్లి
సకలలోకేశ్వరి శాశ్వత శుభకరి
భక్త మన పద్మ [3]భవ్యసద్మ

---

1 మూ యనుపగు
2 మూ లేదు
3 మూ సద్మ

తే.గీ. మహిని సంసార బంధ నిర్మగ్ను లగుచు
గ్రుక్కుఁ బడుచుండెడి జనములఁ జూచి వారి
నందఱను నుద్ధరించుట కార్య మెంచి
యవతరించిన సిరికళ యాత్మకింపు 100

## పద్మినీకన్యకోత్పత్తి

సీ. ఝంకార షట్పదాలంకార సౌరభ
కేళీవిహార పరివార సంకులంబు
మల్లికా జాతిమతల్లికా మాధవీ
వల్లికా సముదాయ వేల్లితంబు
మందార తరు సుమస్యంద దారత మరంద
సందోహ నిస్తులానందదంబు
కేతకీ పాటలీ కీలికా పాళికా
నేత నిస్తుల మాలికాకరంబు

తే.గీ. మంజుతరతరంబు సంచార ఘుంఘురంబు
చైత్ర సంక్రాంతి సౌరభాకాంతరంబు
సమత దివ్యతరంబు ద్రుమాపగా త
టాంత లక్ష్మీకరంబు పద్మాకరంబు 101

వ. అందియు నా సరోరుహాకరంబు సరోరుహాకర కారకం బగుట నప్పుడా
కరంబు కరంబు విరచించుచు నిశాంబుపూర ప్రతిబింబితంబులగు
నంబురుహ మిత్రామిత్రబింబ ప్రముఖ గ్రహతారకా కదంబంబు నున్ని

లోకంబున నాలోకింబు లోనంగి మృదంగ భువనంబునకు వెలుంగు లొసంగం గమకించు తెఱంగు సంగీతరింప నిందీవరారవింద నిష్యంద మకరంద బిందు తుందిలంబులగు మిళింద బృందంబులు కుసుమవాసనా ఘటితంబు లగు తటనికట విటపి పటలంబుల కటు నిటుల్ జనకదీయ మేచక రుచి బాలచక్రంబు లంబుదర్పితయగు నాందేవత విదుర్చు కచరుచి నిచయంబుల్ బచరింప శైవలంబులు దాను నీరంపు చిత్తాత తరంగల తెరల తెఱగుల నలిల కమల పాళి వేళికి ఘటియించు మెఱుంగు [1]లెఱింగింప స్వకీయ [2]పత్ర పాత్రీకరం బైకొను కోకనదనికరంబులును అతిపరీత మధుకర ప్రకరంబులై యజ్ఞలాకరలక్ష్మికిం గజ్జలాగ్రదీపిత దీపికల నొసంగు మంగళార్తికం బొంపు సంపాదింప నింపొందును [3]నతి ఎఱుంగగనంబు మాణిక్యచ్ఛ దరతారకానికాయంబై వాసుదేవాననంబు పగిది పతగరాజవాహన ప్రవృత్తి ధుర్యంబై యంతో జనంఘవ సభా భవనంబు భాతి భాషా ప్రశంస హంసావతంస సంసరణంబై కందర్పహార మందిరంబు పోల్కిక్రౌంచ భేదనందారాంచితంబై శుకపికాళి సేవిత వితానంబులం సనితకుమార [4]ప్రేరితంబై కుముదవన సరంభాది సంరంభయుక్త్యా సంఫుల్లహస్త కల్హార రాజీవ రాజీవిరాజితంబును అవ్యపరాగ పరంపరా పటవాస వాసనా వాసితా శాంతరంబును కోయష్టిక టిట్టిభ జలకుక్కుట కారండవ ముఖ సలిలాంతర మండల ప్రకాండ మండితంబును వగు నమ్మడుంగు నందు 102

---

1 మూ లెఱింగింప

2 మూ వృ

3 మూ యతి

4 మూ ప్రేరిత

తే.గీ. అమరి ఫాల్గుణ మాసంబునందు శోభ
నంబయిన యుత్తరర్క్షంబునను సమస్త
లోకసేవిత స్మరమాత శ్రీకరాంగి
పొడమె నొక దివ్య కాంచనాంభోజమునను 103

సీ. సుందరగాత్రి పూర్ణేందు నిభ వదన
జలరుహపత్ర విశాలనయన
ఘన చతుర్భుజ పీతకౌశేయ శోభిత
ఊరయుగ కటిక కోకనదయుగళ
విద్యుత్ప్రభాన భాసిత దీప్త సంతాన
రమ్య లావణ్య హారణ్య వక్ష
హారిణి పృథుశ్రోణి హరిమధ్య బింబోష్ఠి
పద్మ పాదకమ్రప్రభాసమాన

తే.గీ. శ్రీయుత భ్రూలతాక్ష్య చాంపేయనాస
నీలకుంచిత కుంతల నిమ్ననాభి
కరలు కంధర హార కంకణ కిరీట
కుండల లలాట భూషిత గుణ సమేత 104

తే.గీ. దివ్యచందన పరిలిప్త దివ్యపుష్ప
గంధ శోభిత సుకుమారి కమలహారి

కార్యాలంకృతయను నాదు గంట పేరి
యందు వెలయొందుచున్న యయ్యవసరమున 105

క. నరసింహాసన ముఖులగు
సురలు తపోధనులు నగు ఋషులు గంధర్వా
ప్సరసలు గుంపులు గాని యు
త్కరమతులై వచ్చిరట కుదారస్ఫురణన్ 106

తే. గీ. అపుడు సుమవర్షములు గురియంగఁజేయు
చును జయారావములు మొరయింపుచును ధరిత్రి
యందు సాష్టాంగ దండంబు సలపరించి
వివిధనుతుల నుతింపుచు నుండునంత 107

### బ్రహ్మేంద్రాదులు లక్ష్మిం గీర్తించుట

క. సరసిజభవుఁడు జగద్ధా
త్రి రమను నా లోకజనని దివ్యగుణ మణిన్
వారిఁ గరపుటాంజలిం గాని
సరసం బగు భక్తిచేత సన్నుతిఁ జేసెన్ 108

తే. గీ. సర్వలోకేశ్వరేశ్వరి సర్వలోక
జనని శ్రీదేవి దేవీ జయము నిందయ
మోదమున విశ్వజా నీ పదము కొలుతు
బ్రోచెదను నేను బహువారములను భక్తి 109

ఉ. నీవు సహస్రలోచనుఁడు నీవు సహస్ర శిరోధి యొప్పుదున్
నీవు సహస్ర పాదవును నీవు సహస్ర కరాంచి తాతవున్
నీవు హిరణ్య వర్ణవును నీవె హిరణ్మయ వాది లక్ష్మి విన్
నీవె సమస్తమాత హరిణీ నినుఁగూర్చి నమస్కరించెదన్ 110

క. క్షమలోఁ జంద్రాహ్వయవై
రమణీయస్థిరి సువర్ణ రజితస్రజవై
యమరి సకల సంపత్ప్రద
సుమహిమ గం నీ కొనర్తు శుభమతి వినతుల్ 111

క. ఇల నీ కటాక్ష వీక్షణ
ములచేఁ దగ నీ యనేక భువనంబులోగిన్
గలుగుచు వర్తింపుచు ను
జ్జ్వలతర సౌఖ్యంబు నొందు సమ్మదలీలన్ 112

మ. హరివక్షః స్థలవాస నీ దగు విలాసార్థంబు నీచేత నా
హరి సంప్రేరితుఁడౌచు నీ సకలలోకాళిన్ సృజించున్నిజం
బరు రక్షాప్తినిఁ జేయు నిదయిన నేత్రోదంచితస్వాంచిత
స్థిరలీలన్ గద లోకపాలపదవుల్ దిర్జాబ్జరాదిస్థితుల్ 113

సీ. అనఘ గంధద్వారయును దురాధర్షయు
నిత్యపుష్టకరీషిణియు నటంచు
సర్వభూతేశ్వరి శౌరి నిత్యాన పా
యినియని నిన్ను పాసనముఁ జేసి
యశమంబు సర్వలోక విభాసులును ధనం
బును సత్ప్రమంగ గోవులును మహోక్ష
ఉష్ట్ర మాతంగ సంఘములఁ గౌశేయ వ
స్త్రమును వివిధ రత్న వ్రజము

తే.గీ. భూమిని వనేభ విభవంబు పుత్రపౌత్ర
సంతతిని నిగమంబుల శాస్త్రములను
బుణ్యలోకాదులను [1]జ్ఞానమును సద్బుద్ధి
నొందుదురుగాదె నీ దయఁ జెందిజనని 114

తే.గీ. అఖిలలోక శరణ్య కల్యాణ సుగుణ
జలధి శరణంబు గాంతు రేజనులు నిన్ను
వారు గాంతురు పుణ్యము వైష్ణవంబు
నక్షయంబును శాశ్వతంబైన పదము. 116

---

1 షూ. జ్ఞానములను

దళదరవింద సుందర విలోకనములు
ప్రీతజన దైన్య విచ్ఛిత్తిఁ జేయ
సముదీర్ణ బాహా కాంచన కల్పలతికలు
ధన్య సంచయ వాంఛితం బొసంగ

తే.గీ. సరస సౌవర్ణ పంకజాంతరమునందు
బాలభావంబున వినోదకేళి సల్పు
చును బ్రకాశించు శ్రీదేవి శోభనాంగి
గాంచి యారాజు విస్మయాక్రాంతుఁడగుచు 124

తే.గీ. రూపలావణ్య కాంతుల రూఢిమించు
నమ్మహాదేవి చక్కఁగా గనియెంత
నధిక సంతుష్టుఁడంచు గొనియాడి మ్రొక్కి
భక్తి తాత్పర్య హృదయ స్వభావుఁ డగుచు 125

ఉరు విశ్వాసమునందు భూమిభుజుఁడు విధ్యుక్తంబుగా పద్మమం
దిర లక్ష్మి న్నిఖిలోపచారముల నర్చింపగాఁ గాంచి సుం
దరతం బొల్పగు నామెఁ గాంచన విమాన ప్రస్థితంజేసి మం
దిర సీమం గొనివచ్చె హర్షయుతుఁడై దివ్యప్రభావాఢ్యుఁడై 126

క. పద్మమునఁ గలుగుటను వా
పద్మనిభేక్షణకు భూమిపాలుఁడు తగన్
పద్మని యనుపేరిడె వా
త్పద్మంబున నిండుకొనిన పరమ ప్రీతిన్ 127

పాండ్యరాజు పద్మినీకన్యను భార్యఁ గొపంగి పుత్రికాభావమునఁ బెంచుట

క. తన భార్యతోఁడఁ దా నా
మనుజేశ్వరుఁ డక్కుమారి మన్నన దోపన్
దిన దినమును పోషింపఁగఁ
గనుఁగొన నల్లారు ముద్దుగా నెసఁగు దఱిన్ 128

మ. అమరన్ యౌవనపూర్ణిమోదయముగా నద్భాషితిన్ బాల్యమం
దమమున్ దూఱె ముఖేందు మండలము నుద్యల్లీల దీపించె దృ
క్కుముదంబుల్ వికసించెఁ గాఁపుఱె వక్షోజాద్రులాం దారకో
ద్గమ రోమాంచిత మేర్పడన్ హసితరేఖాచంద్రికల్ రంజిలెన్ 129

ఉ. సారసగంధి కొప్పు గురువస్థితిఁ జీఁకటులన్ హసించు వే
షాలు మహేంద్రరత్నరుచి మండలిఁ గై కొను దేమి చిత్రమో
యారయ నెచ్చెవారికిఁ [1]బరార్థము లెక్కుడు [2]వాటఁజూడఁ జే
కూరిన విత్త వస్తువులు గొంగనెత్తురె విప్రులార్థులై 130

తే.గీ. విదితముగ బాల పొలంతు విదియనాటి
యమృతకరరేఖ నుమ్మటు లనక యున్నఁ
దరళ మౌక్తిక తారకోదార రైక
గాత్రమంతం సాంగత్య మంది యున్నె 131

---

1 మూ. పదా

2 మూ. నాటు లూడ

తే. గీ. నయనములు మీనములు రదనములు మౌక్తి
కములు తైర్యంబు లై తాం సమిరి నాఁగఁ
బాలిక సౌందర్య రస సుధా స్ఫూర్తి నెసఁగి
సరసిజేక్షణ నవ [1]వయస్సంపద నెంసె 144

క. నాళీక నాభియగు నా
నాళీక దళాక్షి యౌవనంబున నిటు లా
నాళీకా నవ సృష్టియు
నాళీకాస్త్రుని సంపా నా నెసఁగు రతిన్ 145

## పద్మినీకన్య రంగనాథుని భర్తగా వరించుట

క. ఆ మానిని లో మానని
ప్రేమాధిక ప్రసక్తి పెంపొంద మదిన్
నేమించి తనకుఁ బతియని
కామించెన్ రంగనాథుఁ గమలానాథున్ 146

సీ. శ్రీరంగనిలయు నెంచి గణించినంతనే
మదిఁ బ్రీతి నర్తింప మసలఁ జెనుచు
ఎవియాయి యనుచు నేర్పడఁ జెప్పినంతనే
రోమ రేఖాంచితాకృతి నెసఁగుఁ
పద్మనాభుఁ డటంచు భాషించినంతనే
వీక్షణాంబు [2]చేత నేర్కఁ జేయుఁ
పద్మాప్రియుఁ డటంచుఁ బల్కినయంతనే
యచ్యుతప్రియ నే నటంచుఁ దలఁచు

---

1 వ్రా యవ 2 వ్రా చే

తే.గీ. హరియటంచు వచించు నంతలోన
తాను బద్ధుని ననుచు సత్కర్షఁ బూను
రంగపతి మోహలగ్నాంతరంగ యగుచు
బాలికామణి యటుల విభ్రాంతి నెసఁగు 147

వ. మఱియును నయ్యంగనామణి రంగనాథ సమాశ్లిష్టాంతరంగయై తదీయ దర్శనస్పర్శనాలింగనానంగ నానావిధ లీలావధాన సువిధాన విభ్రమ సంభావనా గుంభన వివశస్వాంతయు స్వాంతభవ [1]న్వ సముద్దండ దోర్దండ కుండలీకృత కోదండ నిర్గళ త్కాండ ప్రకాండ పరంపరా విపాట్యమానధైర్య కంకట వికంకట హృత్పుటయును బటపాక నికార వియోగ వేదనాతిశయాతి పాక సమాపాదిత పాండిమాది వివిధ వైవ[2]ర్ణ్య లక్షితావయవ లక్షణయును క్షణమాత్ర చలీకృత శయనాసనాద్యవస్థానయు నగుచు వర్తింపుచు నతని యనంతకల్యాణ గుణంబులు గీర్తింపుచుఁ జెలికత్తెలకుఁ దత్కథలు వచియింపుచుఁ దత్పరిచర్యలు రచియింపుచుఁ దల్లీలా చరిత్రంబులు పఠియింపుచుఁ దదస్త్రప్రముఖంబులు స్మరింపుచుఁ దద్రూపంబులం బూజింపుచు నతని భజియింపుచు నివ్విధంబున నిరంతర తత్పరాయణయుఁ దదధీనానన్యధ్యాన విస్మారిత సర్వస్వయునై యుండి యయ్యవసరంబున 148

సీ. చిత్రరంజిత మదాత్తమౌ లసదు ది
త్రము రంగనాథాకృతంబు గాఁగ
పద్యంబుఁ బల్కిన నంరెదు తనజిహ్వ
శౌరి చరిత్రోక్తి కాస్పదముగాఁగఁ

---

1 మూ. స్వ 2 మూ. ర్ణ

జలసంయుతేక్షణ భాసిలు తన చూడ్కి శ్రీ
హరిరూప దీప్తియం దిరవు గాఁగ
నిరత శబ్ద స్ఫూర్తి నెనయు మెఁదన వెఱ్క
నలినాక్ష నామ పఠనంబు గాఁగ

తే.గీ. క్షిప్తి యుక్షిప్తియును లేని క్షిప్తిఁ జేసి
యద్భుత ధ్యాన పరవశయగుచు నింతి
విశ్వమెల్లతఁ ద్వైతమ్మునెయును దక్కి
శివ యాత్రానవశేషయై శక్తిఁ దనర్చె 149

## పద్మినీకన్య విరహము — సఖులచింత

క. ఈరీతి నుండు నాతాం
తారత్నముఁ జూచి తోడి తరుణులు చింతా
భారంబునఁ దమలోఁ దా
మారూఢి వచించ రతులితాశ్చర్యమునన్ 150

చ. కనుఁగొనఁగా ధరిత్రి నృప కన్యక లెందఱు లేరు యవ్వనం
బును మెయిఁ గల్గినేనిఁ దమ [1]పొల్పువచింతురు గాన నిందు న
వ్వనజదళాక్షి చిత్తమున వర్తిలు కోర్కి నొకప్పుడేని సూ
క్తిని గతియించి పల్కదు సఖీమణులార యిదేమి చిత్రమో 151

చ. పరవశమైనదో తరుణి భావము నొక్కని యందు లేక యు
త్కరముగ సిగ్గు లోఁ బాదముఁగా వదియించుపటలేదా యింత నీ

---

1 మా. పొల్తి

నరసి యెటువ్వదో తెలియఁజాలము భామినులార పీఁద తె
త్తుఁ గగనో యటంచు బలుకినత వారలు పల్కుస త్రపన్ 152

మ. దివస గ్రీష్మము కాంతిఁ జెందఁగను రాత్రి ప్రావృడుద్భూతిగా
రవి వారాయణుఁ దోట నత్తఱిని నిద్రాసక్తి సంధ్యాంబర
చ్ఛవి లొప్పన్[1] శయనించ నేఁగె నన నిచ్చున్ వార్థిలోఁ జొచ్చెఁ బై
నవ మేఘంబు[2] లెసంగెనాఁ దగె భువిన్ గాఢాంధకారద్యుతుల్ 153

క. సాయం పురుషుఁడు రజనీ
ప్రేయసిఁ గంయునెడ పీడు చేసిన మెఱుఁగో
నా యొప్పె నిరులు తద్గ
తాయత మల్లీ సుమంబులన నెరసె[3] నుడుల్ 154

సీ. విరహాంధుర ధైర్య ధరణీధరంబుల
ఛేదింపవచ్చిన భిదుర మనఁగ
పర విభాగుల గెల్వ విజయంబు గైకొన్న
కంబరాంతకుఁ డెత్తు కంబమనఁగఁ
బధిక సంఘముల హృత్పంకజాలు దార
మాలంబు లెత్తు మహాయమనఁగఁ
కాంత జనంబులపై వేఁట వచ్చిన
యంబరారణ్య సింహంబనంగ

---

1 మూ ప్రవ్ 2 మూ లొసంగె 3 మూ నడుల్

సీ. సారసాస్య యటంచు సారె వేధింపకు
  గువలయగంధి యీ కోమలాంగి
చక్రస్తని యటంచు సాహసింపఁగఁ బోకు
  బాల చకోరాక్షి యీ లతాంగి
యలరాహు రోమాళి యనుచు రోషింపకు
  [1]దారకానన యీ యిభారి మధ్య
తిమిరకుంతల యనుచుఁ దివిరి తాపింపకు
  చంద్రికాహాస యీ చారు వదన

తే.గీ. యీ సుధా మధురాధర కీ మృగాక్షి
కీ కళారాశికిని మాఱు మెలఁక గలిగి
యున్న నీ విట్లు గినియుట యుచితమౌనె
యమలగుణపాత్ర శుభగాత్ర కుముద మిత్ర 161

మ. నిను సత్యంపు గుణంబువాఁడ వని సందీప్తంబుగా లోక మేఁ
పునఁ బల్కంగ మనోగ్రదీప్తిఁ గని యా పూఁబోఁడిం బ్ర పఁగాఁ
దని యేమో మను దార్వటించు మఱి సంతప్తాంగ నేత్రానలం
బున రూపాఱను వాని బెట్టి గనియుం బోఁ గాంచి నీ వీ యెడన్ 162

క. శితకరుండ వీ వని చింతురు లోకులు నేఁడు గాంచి
ప్రాతము చిత్రముం గంట వచ్చుట పిదుగులుంబు గాదు వి

---

1 మూ. తారకానని
2 మూ. ప్రోగాచగా

## శ్రీరంగభర్త పాండ్యనగరమున కేతెంచి పద్మినిని బరిణయమాడుట

సీ. జలజాసంభవుఁడు నా సకలదేవతలతో
      సనకాదులగు దివ్య మునులతోడ
పరమ వసంత విష్వక్సేన ముఖ్యులై
      తనరిన పరివార జనముతోడ
సమితానుభావులై యలర కాసారాది
      పరమ మహాయోగి వరులతోడ
గరుడని నెక్కి రంగస్వామి సంతోష
      భరితుఁడై నిమ్నగానగరముఁ గూర్చి

తే.గీ. ఎమ్మఁ బరిణయ మగుట కుల్లాసి యగుచుఁ
చేరి యంతటఁ బాండ్య ధాత్రీరమణుఁడు
భక్తి దళుకొత్తఁగా జగత్కర్తఁ గూర్చి
యెదురుగా వచ్చి పదముల కెఱఁగి యంత 176

వ. అయ్యుర్వీశ్వరుండు దేవుని షోడశోపచారంబులన్ బూజించి బ్రహ్మపురోగ
ములగు సురలనుం గాసారాది యోగీశ్వరులనుం దక్కిన సమస్తపరివా
రము దాయంబుపు మరంబున చెలువొందిన యథోపచారంబుల గావించి
యందు సుందరంబును సువర్ణమణి బంధురంబును నగు నొక్క దివ్యమంది
రంబునన్ జగన్నాథుండగు రంగనాథు నునిచి నిత్యం కస్తూరికా ఘనసార
చందన ప్రముఖ నిఖిల పరిమళ మిళిత సలిల చర్చిత ప్రతోళికా ప్రతి
నికేత నాంగణ ప్రయుక్త ముక్తాఫలిత రంగవల్లికా సంగతంబును
వియత్పరత్కర ప్రకర గరుత్పరంపరా సంవత్సంపాదక వారిస్మిత
తోరణ నిబద్ధ ద్వార బంధంబును నుభయపార్శ్వ సంబంధ రంభా
స్తంభ సంభార సంభావిత వేదికాప్రదేశంబును రాజమార్గ విరగ్గళ సంచర
ద్విలాసినీనికర కర రాజీవ విరాజిత రత్న నీరాజన భాజనరాజంబును
సముత్తంభిత శాతకుంభ కుంభ సంభావిత రమ్య హర్మ్య నిర్మిత
పతాకావితానంబును సుధాధౌత సౌధ వీథికా విపత్సురాసీన వివర

ఏమందు నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ
పురాణోత్తర ఖండంబు నందలి వింశతితమాధ్యాయంబు భక్తపరాయ
ణుండగు నారాయణుండు నరునకుం జెప్పిన 183

మ. అవతారాంత కథాయథానుభవ లీలాధూత సీతాహృతి
ప్రవణప్రోర్ధ దశాస్య వేదతర రోషప్రాప్త సాధుత్వ మా
ర్గ విగాహాద్భుతకృత్య కోలమగు శ్యామాంగ సాకాంక్షృతి
ప్రవణ ప్రాపిత మోక్షదైవత సదాచారాదర ప్రాభవా 184

క. సురుచిర పాండ్యకుమారీ
సరస మనోహారి దైత్య సంఘ విదారీ
కరుణా సుధాబ్ధి లహరీ
నిరుపమ భక్తానుసారి నిగమ విహారీ 185

భుజంగప్రయాతము
పరాశ్రితశ్రీ వ్రాత సంభావ్యశీలా
కరారాధ కాంతార కాలాగ్ని కీలా
హరాత్మస్త తాపత్రయ ప్రేష్య జాలా
మురారీ హరీ శౌరి గోపాలబాలా 186

గద్య: [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణాకటాక్ష వీక్షాలబ్ధ పాండిత్య ధుర్యా
యవనతావనీ మండలాఖండ సామ్రాజ్య ధౌరేయ స్వకీయమద్గళాన్వయ పటహ
ఘుమంఘుమారావ విస్ఫురిత పరసృతియా ధిల్లికాధీశ దుందుభిధ్వాన కోలా

---

1 మ ఇతి

వాల హనుమద్ధ్వజాంక కనక దండికాకృత హారకంఠాకృత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కౌశలవంశ పయఃపారావార రాకాసుధాకర సౌందర్యజిత కుసుమసాయక విహారిపాము నాయక ప్రణీతంబైన శ్రీ మహా భార్గవ పురాణంబునందు కుంభేశ్వర ప్రాదుర్భావంబను రాజు మంత్రులు వైష్ణవుల యెడఁ జౌర్యంబు గల్పించుటయుఁ గుంభేశ్వరు కపటంబునఁ దన్మహీపతికి నారాయణుండు ప్రసన్నుండగుటయు భగవద్గుణాను కీర్తనంబును శ్రీ వివాహంబునుఁ గుంభేశుండు రామాయణ శ్రవణం బునం జేసి దశకంఠునందుఁ గోపంబు వెట్టి హుంకరించిపో మార్గమధ్యంబున వాసుదేవుండరసికిఁ బ్రసన్నుండై పుష్కరంబునఁ గుంభేశ్వరు నిలిగొని పుంమపదంబు గూర్చి చనుటయుఁ బద్మిని కన్యకోత్పత్తియు బ్రహ్మేం ద్రాది సురాప్సరోగణంబులు లక్ష్మిం గీర్తించుటయుఁ బాండ్యరాజు శ్రీరంగంబున కరుగునెడ నరటి మధ్యంబున వెందలి కమలాకరంబున రమాంకలాలయగు కన్నియం గాంచి పుత్రీభావంబునఁ దన రాజ్యంబు కొసం గుటయుఁ బద్మినీ కన్యకా వర్ధనంబును శ్రీరంగ భర్త పితామహేంద్ర రాహారయోగి ప్రభృతిగణ సహితుం డగుచుఁ బాండ్యనగరంబున కేతెంచి పద్మినీ కన్యకం బాణిగ్రహణంబు సేయుటయు ననెడు నేతత్కథలం గల చతుర్థాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## పంచమాశ్వాసము

క. శ్రీకాంతానయనోత్పల
రాకా హిమధామ కోటిరవినుతధామా
ప్రాకట వాగిన గిరి శౌ
రీకరుణాకర సురపురి గోపాలా 1

వ. ఆ సకలగుణనికరప్రశస్తాధురంధరుం డగు నయుండు వివిధ విబుధోపలాలన
పరాయణుండగు నారాయణుం గూర్చి యిట్లనియె 2

క. నారాయణ నిఖిల జగ
త్కారణ కారణ దయామృత పయోనిధి సం
సారాంబుధి తారణ గో
త్రై రహ సాష్టాంగ వినతిఁ గావింతు నిటన్ 3

క. నీ వలన నేను వింటిని
శ్రీ వైష్ణవ భక్తి రతుఁడు చిరపుణ్య యశ
శ్శ్రీపతి యగు కులశేఖర
భూపాలకు చరిత సకలమును విదితముగాన్ 4

తే. గీ. అఖిల పాతక సముదాయ హరము నగుచు
మహిత కల్యాణ విభవ సంపాది యగుచు
దివ్యమైనట్టి పద్మినీదేవి కథయు
వింటి మదిలోన సంప్రీతి విస్తరిల్ల 5

ఉ. ఏ యెడ నె విధంబునను నే సమయంబుల నంతరాద్భుత
శ్రీ యులంచర్యులై యవతరించిరి యోగివరేణ్యు లాదినా
రాయణ పాదపంకజ పరాయణులై భగవత్ప్రదాప్తి సం
ధాయకులై మహాత్మ లిటు దన్మహిమాత్మ్యముఁ దెల్పవె తగన్ 6

## మునివాహన జననము

వ. అను వరుం గూర్చి సమాదరంబుగా నారాయణ మౌని యిట్లనియె 7

క. తమసా నదికిని దక్షిణ
మమునను రమణీయమై భవాబ్ధ మగు శ్రీ
రమునందు సర్వసంప
త్సమృద్ధిఁ దనరారి యఖిల జనమాన్యంబై 8

క. మగరాం కేలిమిద్దెఁ
బగరఁపు దారువులఁ గనక పంకజ రాగా
ధ్మ గృహ నివహములు నిచులా
నగరము పెన్పొందు నగ్రనగర నిభంబై 9

---

1 పా. మహాత్ము

మ అల నాథోపరి చంద్రకాంత ఘట కుంభారోళ్ సదా చంద్రకాం
తుల నీరున్ గమరింప నాసిరి సుధాంధోవర్త్మ పై కుంయి రాఁ
గిరి యౌఁగన్ మెయిఁ జిమ్ము పర్వంతి వాకీర్ణంబుగా సంతతో
ద్ధుం కల్ప క్షితిజాత జాతయుతమై యత్తిర్థ నా ప్రోలిలన్ 10

సీ అమరావతి పురి కాధార భూతమౌ
గురుతరోన్నతి మేఱు కొండ దనర
క్షితి భాగవతి గభీరత వెల్వ నతలంబు
పాదుగా నెలకొన్న పరిఘమెంచఁ
గనకాద్రి కంధరోఘములందుఁ జెన్నొంది
విలసిల్లుగతి నాథ విసర మమర
వర్ధి రత్నశ్రేణి నందు దాఁచిన పెం
పమనీయ మణిఖచితమమలు మెఱయ

తే గీ వసుల వస్తువు లింపొందు నాపణాలు
ధనదు గృహరాశి లివి యనఁ దనరుచున్కిఁ
వెలుగు నాగములలోఁ గల్గు సిరుల కెల్ల
దాపురం బన నా నిచుళాపురంబు 11

క ఆ పురికి సమీపంబునఁ
బ్రాపిత యఘలిం దగుమహానది ఘటన
వ్యాపార సత్రణన రే
లాపూర్ణ నిదాన వారి కావేరి తగన్ 12

---

1 మూ ధరన్

ఆ వె పరమ పావనంబు భవ్యనివసనము
దివ్య భాసనంబు సేవ్యమగుచు
నవ్య సౌరభంబు నవ్యయ ఫలదమై
క్షాలిఁ దనరు నన్నదీతటమున 13

సీ అందు కార్తిక మాసమందలి రోహిణీ
నక్షత్రయుక్తమై పెయముగాంచు
శుభదినంబందుల సురుచిర లీలతో
హృదయంబు నందు రమేశుఁ దలర
మొనసి శ్రీ వత్సాంకమౌని వైష్ణవాంభోధి
చంద్రమ స్ఫూర్తిచే సంభవించి
అన్న ప్రభృతి రంగశౌరి పాదాంబుజ
ధ్యాన యోగామృత[1]పాయి యగుచు

తే గీ ఘనుఁడినయును వర్ధమానాంశుఁ డగుచు
వరుసతో రోదసీ వర్ధనంబుఁ
చేసి సహజ మహితుఁడై వెలుఁగె నతఁడు
[2]నఖిల జగములు విస్మయం బందుచుండ 14

1 మూ పాని

2 మూ జనములు

తే. గీ. వెరస దేహాత్మలకును విభిన్నతయును
శేషశాయికి నగుతన శేషతయును
నెఱిఁగి యథార్థ్యత్మ విశిష్టాద్వైత మెంచి వాఁ
డుండ వైకుంఠ కృతి లక్షణంబు నగుచు 15

మునివాఁడు కావేరీతటంబున గానంబు సేయుట

సీ. మొనసి రంగక్షేత్రమును భగవన్మూర్తి
గా మదిఁ దెలిసి యుద్దామ లీలఁ
జేసి యాత్రంబు దర్శక్షేత్రంబుఁ జేరక దీ
ప్యన్మంద వాటపీ వాటిఁగలుగు
నట్టి కావేరి యందు దాపతిగా నవ
గాహనం బొనరించి కౌతుకమునఁ
దన్నది దక్షిణ తటమున రమ్యప్రవ
దేశంబు నందు వర్తిల్లి తాను

తే. గీ. కొలుచు శ్రీరంగమున కట్టుముఁడు నగుచు
మఱియు హృదయ పయోజాల మధ్యసీమ
భగవదంఘ్రి సరోజముల్ పాదుకొలిపి
యనుదినంబును దర్శరుఁ దగుచు నంత 16

తే. గీ. క్షితివి ధ్యానంబుఁజేయుచుఁ గీర్తనంబు
సేయుచును భక్తిచే నమస్కృతులు చేయు
చును ననేకంబుగా మహాస్తుతులు చేయు
చును ప్రమోదయుతుండయి దనరి యతఁడు 17

చ అనుదిన మీ మహేశ్వరుఁ డుదార గతిన్ రచియింపు గీత మెఁ
పున వినువట్టి వారలకు భూరితరాద్భుత సౌఖ్య సంపదం
దనరుట సత్య మిట్టిగతిఁ దామరసాక్ష కటాక్ష వీక్షణం
బునఁ బరియించునట్టి ఫలపుంజము వ్యర్థము గాఁ దవర్చునే 21

తే గీ ధన్యతరమైన విద్యగాంధర్వగాన
మునను నా గాయకుఁడు మోదమునను నందు
బ్రహ్మమయ మధివసియించె తత్త్వమతిని
యంబుజాక్ష పదాంబుజధ్యానుఁ డగుచు 22

తే గీ నిజతటంబున వసియించి నిష్ఠ నతఁడు
నవ్య మధురస్వరమున గానముఁ జేయఁ
దాని నాలించి కావేరి తన్మయతను
స్తంభి[1]తోదక యగుచు నిశ్చలత నిలిచె 23

సీ అతి కఠోరంబుగా నుండెడు శిలలెల్ల
ద్రవియించి నీటి వెల్లువలఁ బారె
బహు మనోహరము గాఁ బాదపశ్రేణుల
స్రవియించె మధువు సుస్వాదువుగను
పశువులు చెవు లొగ్గి పరవశస్థితిచేతఁ
గనవు మేతఁ దమ్ము గంటి లయ్యె
మూగి పక్షులాహారము లిడి తలెత్తి
యనితర బుద్ధితో వినఁ గడంగె

---

1 మూ తో—క

తే. గీ. మఱియును సమస్త జంతువుల్[1] మానిసులును
దన్మయములుగఁ జేష్టలు దక్కియుండె
నమ్మహాగాయకుండు చేయునట్టి దివ్య
పరమ భగవద్విషయగాన వైభవాన 24

చ. కృతయుగమందు ధ్యానమునఁ ద్రేతను యజ్ఞవిధానలీల సం
తతము సమర్చనావిధిని ద్వాపరమందు నరుండు గాంచు నా
యతమతితోడ నేఫలము నాఫలముం గనుచుండు నార్త సం
గతమగు భక్తితోఁ గలియుగంబున శ్రీహరి కీర్తనంబునన్ 25

మ. అని యీ యర్థము సంస్మరించి మదిలో నా గాయకాగ్రేసరుం
డనుమోదంబున వల్లకిం గొనుచు దివ్యంబైన గానంబుచే
వనజాక్షునిఁ దారుచుం బొగడుచున్ వర్ణించి యీ రీతి న
త్యనురక్తిన్ హరినామకీర్తన పరుండై యుండె నశ్రాంతమున్ 26

## రంగభక్త మునివాహనుని గానమును లక్ష్మీదేవికిఁ దెలిపి యాతని గానమును బ్రశంసించుట

శా. ఆరీతిన్ మధుర స్వరాంచితంపు దివ్యంబున్ మహాశ్చర్యదం
బారాధ ప్రవణానురంజకము నౌ సద్గాన మాలించి యా
శ్రీరంగక్షితి భర్త హర్షపులకశ్రేణీ పరీతాంగుఁడున్
సారామోద భరాశ్రు మిశ్ర నయనాబ్జాతుండునై యెంతయున్ 27

తే. గీ. తన సమీపంబునందు సవినయమునను
జేరి సరసవిలాస విశేషములను
దెలఁగు శ్రీదేవి మొగము వీక్షించి యిట్టు
లనియె నాశ్రితవత్సలుఁ డగుచు శౌరి 28

1 మూ. మానసులు

తే.గీ. లోకసారంగ విఖ్యాతు లోకవిదితు
నవము దీక్షాహరణ కారణుని మహాత్ముఁ
గాంచి యారంగనాథుఁడు ప్రీతితోడ
నాంటికి మృదుమూర్తుం నానతిచ్చె 96

సీ. అనఘు కావేరీ మహాతీర్థ సంస్థితుఁ
బరమ పవిత్రు మత్ప్రీతి భూతు
యోగివర్యుని నిత్య యోగి సంసేవితు
గాయకోత్తము విఖ్యాత చరితుఁ
గరుణాపయోనిధి ఘనుని సన్మద్భక్తు
నిగమాంతవిజ్ఞాను నిర్మలాత్ము
[1]వినయవిభూషు సదావిర్భవ ప్రాభవు
లబ్ధవైరాగ్య బోధ ప్రచారు

తే.గీ. నామహామహు నీవు స్కంధాధిరూఢు
గాఁగఁ గావించుకొని నీవు గారవంబు
చేసి తోడ్తెమ్ము యోర్మాని వగుచుఁ
గరము నా కతిసంతోషకరము గాఁగ 97

సారంగముని మునివాహనుఁ దన స్కంధమున నిడుకొని
తెచ్చుటచే మునివాహనుఁడను పేరు గలుగుట

వ. అని యిట్లానతిచ్చిన జగదీశ్వరుండగు భగవంతుం డాజ్ఞాపింప నమ్మ
హాత్ముండు సంభ్రమాశ్చర్య తనూరుహుండగుచు నేతాదృశంబగు నింతటి గాను
గ్రహంబు బ్రహ్మాదులకేనిఁ గలుగుట దుర్లభంబు గాన నమ్మహాయోగి

---

1 మూ. వినయవ...

భాగ్యంబు సత్కార్యంబు గదా యని పెను పుణ్యంబుగా నెన్నుకొని పల్కుమ న ఋషి సమీపంబున కతిరయంబునఁ జని విధ్యుక్తంబుగా నతనిం బూజించి వాంఛితంబు విన్నవించి నిజభుజాకోటరంబునందు ధీరుం డగుచు నెందని పలుకు నగ్గాయకు బలాత్కారంబునం జేసి గ్రహించి స్కంధంబునం దిడుకొని సారంగమునిపుంగవుండు రంగభర్త సన్నిధిం గొనివచ్చిన 38

తే.గీ. అని మొదలుకొని మునివాహనుఁ డనెడుపేరఁ
దనరి గాయకుఁ డంత నుదాత్తభక్తి
రంగవిభుఁ గాంచి ప్రణమిల్లి రమ్యమతిని
హర్ష రోమాంచ కంచుకితాంగుఁ డగుచు 39

## మునివాహనుఁడు హరిసకలావయవ మనన తత్పరుఁ డగుట

క. కర బద్ధాంజలి పుటుఁడై
పరమానంద ప్రవాహ భరితాత్మకుఁడై
యురుభక్తి నతఁడు దామో
దరు సకలావయవ మనన తత్పరుఁ డగుచున్ 40

క. వరుస మనో భృంగము దేఁ
జరమూర్ధ విశేషసాంద్ర పరిమళయుతమై
నిరతము మనోహరంబగు
హరి చరణాంబుజ మరంద మాస్వాదించెన్ 41

శా. ఆ రాష్ట్రంబున నందు మందన సమాఖ్యం బొల్చు గ్రామంబు భా
శ్రీ రత్నోజ్జ్వల భూషణంబు మణి సందీప్తచ్ఛటా స్వర్ణ సౌ
ధారామ ప్రచయాభిరామము రతీశాత్మద్విదాపాకి భా
వోరుక్షేత్రయు సర్వభాగ్య మహిమం బుత్కృష్ట తేజస్థితిన్ 59

సీ. ఆ పురంబున నుండు నవనీసురోత్తము
లందఱు హరిపరాయణులు నిగమ
పారంగతులు దివ్యభావులు నకలశా
స్త్రవిశారదులు సదా సత్యశీలు
రానందవార్ధి మగ్నాంతరంగులు సత్కో
ర్కరగుణాల్ సమలోష్ట కాంచనాత్మ
మతులు సంతత శాంతియుతులు కృతీక్షర
బ్రహ్మలోకాదిక భాగ్యరతులు

తే.గీ. సతత హరిచిహ్న చిహ్నితుల్ వితత యశులు
తపన తేజులు నిజవర్ణధర్మ నిరతు
లతిథి భాగవతార్చనాయత్త చిత్తు
లఖిల సమదర్శనులు వినయాభిరతులు 60

క. కలియుగ నందును వర్తిలు
కలి కల్మష నాశ నిపుణ గమలాధీశున్
లలితమతి భక్తి గాని ని
ర్ఘలురై భజియింతు రెపుడు సత్యస్ఫూర్తిన్ 61

తే.గీ. హరి సమర్పణ యజ్ఞంబు లాచరించు
చును జితేంద్రియుండగుచు నుత్సుకత మించి
ధర్మమున మెట్టు నిష్ఠగాఁ దనరు వారి
లో గాంచెను మహాత్ముఁ డనూన గుణుఁడు 62

క. నిగమాంతజ్ఞాన పరుం
డగణిత గుణసంపన్నుఁ డమలాత్ముఁడౌ
నగధీసురవర్యుని కిం
పుగ పత్రిల ధర్మవతి పుణ్యమతిచ్చెన్ 63

## విప్ర నారాయణ జననము

తే.గీ. సాధ్వి యంతట మార్గశీర్షమున జ్యేష్ఠ
యందు వృశ్చికలగ్నమున శుభమగు దివమునఁ
గాంచె వనమాలికాంశ సమంచితాత్ము
భవ్య గుణయుతుఁ దనయు సంభావ్య చరితు 64

తే.గీ. సూతకాంతమునందు విఖ్యాతిఁ గాఁగ
నవని నారాయణుం డను నాహ్వయంబు
సుతున కొసరించె జనకుండు సుస్థిరముగ
నిర్మలానంద చిత్తుఁడై నియతి మించి 65

వ. అంత 66

క. పంచమ సంవత్సరమున
సంచిత మతియైన సుతున కత్యుత్సవమున్
మించగ నుపనయనము గా
వించెన్ జనకుండు విప్ర వినరము లెస్సన్ 67

## విప్రనారాయణుఁడు విరాగియగుట

క. నారాయణాభిధానుం
డై రంజిలు నమ్మహాత్ముఁ డఖిలార్థకుఁడౌ
శౌరి యశోరాశి కరుణన్
గౌరవమున నధికభక్తి గంగ్రాఁ దగుచున్ 68

సీ. ఘనమాయల్ప హేతుకంబు దుస్తర మగు
సంసారమందు నసారమైన
దృష్టి గావించి శౌరి పదారవిందంబు
విమల నిజమనోరవింద సీమ
[1]మోయు దారేషణ పుత్రేషణ ధనేష
ణాదులౌ విషయంబు లన్నియు విడి
చిదచిదీశ్వర తత్త్వ నిష్ఠత్వ మనుపొంది
శౌరిఁ బారతంత్ర్యమున భక్తి గాంచి

తే.గీ. యంతరింద్రియ బాహ్యేంద్రియములు నెల్ల
గెలిచి వైరాగ్య బోధ సంకీర్తిఁ దగుచు
నిత్య నిరుపాధిక సుస్థిర నియతి నుండె
నచ్యుత పరాయణుండగు నారాయణుండు 69

## విప్రనారాయణుఁడు శ్రీరంగమునకు వచ్చి రంగేశుని సేవించుచుండుట

తే.గీ. అంత నా భూమిసుర వర్యుఁ డతుల భక్తి
జ్ఞానవంతుఁ డగుచు దయాసార సంధి
యైన శ్రీరంగనాయకు నధికతేజ
క్షేత్రమున కేఁగుదెంచి యక్షీణమతిని 70

1 మూ మొనపి

మ. కనియెన్ విప్రవరుండు కాంచనమణి ప్రాకార సప్తావృత
స్వన దుద్యాన శుకీ పికీ శిఖర భాస్వన్నందనోపేత స
హ్యనగోద్భూత నదీ పరీత విలసత్ప్రాసాద వైకుంఠ దీ
ప్ర విమానాంత ప్రతిభానుషంగ విభవాతంగంబు శ్రీరంగమున్ 71

తే.గీ. రంగభర్తను గాంచు చుత్తుంగ భక్తి
నహరహం బమ్మహాత్ము సమర్చ సేయు
చుండె భూసురుం డందు దయారసంబుఁ
గలిగి యాక్షేత్రమునను వర్తిలి యతండు 72

క. నిరతంబు భక్తి రంగే
శ్వర భక్తారాధనంబు సలుపుచు సత్కృ
ప్పరుఁడును దత్కైంకర్యముఁ
గలుపుచు నచ్యుతపదానుగత చిత్తుండై 73

విప్రనారాయణుఁడు భక్తాంఘ్రిరేణువను పేరందుట

క. భగవద్భక్త [1]గృహంబులఁ
దగు మధుకర వృత్తిఁ గొనుచు ధరణిస్థలి నా
యగణిసురవర్యుఁడు సొం
పగుమతి భక్తాంఘ్రిరేణు వను పేరొందెన్ 74

సీ. అంత గోవింద భక్తాంఘ్రిరేణు సమాఖ్య
భాసిలునట్టి యా భూసురుండు
రమణీయముగను శ్రీరంగేశ్వరునకు స
మస్త కైంకర్యంబులందు నెట్టి

---

1 మూ. గృహంబున

యుక్తమై శ్రేష్ఠమై యింపొంది పెంపొందఁ
నంచుఁ జింతయు విచారించి హరికి
నిరవొందు మాలికా కరణమె యుక్తంబు
శ్రేష్ఠంబునని తనహృదయమందుఁ

తే.గీ. దాని నిశ్చయ మొనరించి సంతసించి
యయ్యుపాయముఁ జింతించి హరి గుడిని
వివిధంబుల నలంకరించి చక్క
దిద్ది [1]యచ్చోటు వెడల నెంచె యంత 76

క. అప్పటికిఁ బశ్చిమస్థలి
నొప్పుచు భ్రమరుదనాను మను ద్వీపంబున్
మొప్పుట యంబనని యచటికిఁ
జెప్పర నేతెంచి ప్రీతచిత్తం బగుచున్ 76

భక్తాంఘ్రిరేణువు తులసీమాలచే రంగేశు నలంకరించుట

క. నానా వృక్షసమన్విత
మై నిరుపమ మగుచు రమ్యమైన వనంబున్
మానిత్వరఁ దా గ్రమమునఁ
దా నారోపంబుఁ జేసె భక్తైకమతిన్ 77

చ. నిరతము నా వనంబునను నీరము నాదిగ గల్గు కర్మముల్
గఱపుచు దానిఁ బెంచి సవిలాసత నందొక పర్ణశాల వి
స్ఫురణ రచించి సారిపదపూర్ణ మనంబున నుండి యచ్చటన్
స్థిరతర భక్తి గైకొని ముకుంద సమాధి సంపదాప్తిచే 78

---

1 మూ. యచ్చోట

తే.గీ. ప్రౌఢతర మేలుకొని విప్రపుంగవుండు
మొనసి విధ్యుక్తముగ స్నానమును రచించి
మంత్రరాజస్మరణము నెమముఁ జేసి
యవలఁ దులసీవనంబున కరుగుదెంచె 79

క. హరి వల్లభయగుఁ దులసిని
పరిపూర్ణ నిజాత్మ భక్తి భావింపుచు ని
ర్భరముగ సంస్తుతించె
నరయం గొనియాడి వినయమానందుండై 80

సీ. ఆయాఘ్రాణేంద్రియమునకు సోఁకినఁ
దాపత్రయాదికాదోష మణఁచు
నుత్తమాంగమున నమున్నతిఁ దాల్చినఁ
బంచమహాపాపపటలిఁ బాపు
శ్రవణ భాగమున భూషణముగా ధరియింప
ననుదినం బధిక భాగ్యంబు గలుగు
నిందిరేశ పదారవింద తీర్థయుతంబు
గా గ్రహియింప మోక్షము నొసంగు

తే.గీ. తులసిఁ దన్నెవరేని భక్తిని దలంచి
రేని వారికి నతుల మహానుభూతి
జేయఁగాలేదె యీ తులసీమతల్లి
యనుచుఁ గొనియాడి విప్రవరాయుండు 81

తే.గీ. చారుకోటీర కౌస్తుభహార కంఠ
తాంగదాది విభూషాప్త కంకణాలి
శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గ హస్త
పద్మములవాని శ్రీరంగభర్తఁ గాంచె 85

తే.గీ. భక్తిని ప్రదక్షిణంబుఁ జేసి ప్రణతి సల్పి
యంత సత్తమములగు వేదాంత సంస్త
వంబులను సంస్తుతించి మోదంబుఁ గాంచె
సంచితస్ఫూర్తి నా యోగివ్రతవర్తి 86

శా. నానా వర్ణవిచిత్రమై పరిమళానంద ద్విరేఫాళియై
సూనశ్రేణులసీదళాంచితయుతై సొంపొందు నమ్మాలికన్
శ్రీనారాయణు పాదపద్మముల భక్తిన్ దా సమర్పించి త
ద్ధ్యానానూన సమాహితాత్ముఁడయి సత్యప్రాశనోపేతుఁడై 87

వ. వండియు నవ్విప్రపుంగవుండు దామోదరుం గూర్చి చని పరమానంద
పూరితుం డగుచు నయ్యంశిరేత మందిరంబు వెడలి నియతుం డగుచు
శ్రీవైష్ణవుల గృహంబులయందు మధుకరవృత్తిం జేసి యప్పంబు
సంగ్రహించుకొని నిజాశ్రమంబున కేతెంచి యందు 88

## భక్తాంఘ్రిరేణువు నిరంతరము హరిసేవా తత్పరుం డగుట

క. పరమాత్ముఁడైన హరికై
వరనుతుఁ డన్నము నివేదనము సేసి సము
త్కటుఁ డగుచుఁ బిదప భోజన
ము రచించుఁ దదీయ భక్తిపూరిత మతియై 89

వ. అందు 109

సీ. ఆరూఢతర నిర్మలాంతఃకరణమున
శ్రీధర ధ్యానంబు సేయువాని
సరసమౌ వాక్కున సరసిజాక్షుని నామ
సంకీర్తనంబులు సలుపువాని
భక్తి తత్పరమైన భావంబు గొని కాయి
కమున నచ్యుత సేవ గలుపువాని
హరి మాలికా తిరవార్ష్ణంబు దన కర్ణ
ములు నిర్మలం బొనర్చు చలయువాని

తే.గీ. పద్ధతి నితాంతనైక భాగవత వ
ణ్య పదారానుషక్తత నూనువాని
విప్రకులవర్యుఁ బరమపవిత్రచర్యు
వార్య నారాయణాఖ్యు నయ్యతివ గాంచె 110

దేవదేవి తనయగ్రజతోఁ బందెము వైచుట

ఆ.వె. భగినిఁ గూర్చి యిట్లు పలికె విలాసిని
యగుచుఁ బంకజాక్షి యన్నదియ
రూపరేఖఁ జూచి రూఢిగా నెవరేని
మోహపడరె హృదయములు కరంగ 111

ఉ. ఈ ముని రాజశేఖరుఁ డహీనతపోనిధి సంస్థితాత్ముఁ డు
ద్దామగుణుం డతామకుఁ డుదారకుఁ డింద్రియ నిగ్రహంబునందు వి
ద్యామహితాఖ్యుఁ డార్యజనతానుత సద్ధ చరిత్రశాలి వి
ష్ణు మహిళావరాంఘ్రి సరసీజ మరంద మిళిందు డున్నతిన్ 112

మ. అని యవ్వారవధూటి యిట్లు మదిలో నన్యోన్య మెంతే దృఢ
త్వ నిరూఢిన్ శపథంబులాడికొని యంతన్ బ్రేమతోడన్ సఖీ
జనకన్ నిల్పియు దేవదేవి ముని నిచ్చన్ మోహితుం జేయఁగా
మనమం దొక్క యుపాయముం దలఁచె సమ్యక్చాతురీ యుక్తయై 118

## దేవదేవి భక్తాంఘ్రిరేణువు పర్ణశాలకు వచ్చుట

సీ. వరహిమ ధామ్నుఁ బ్రాతంబు లెడవించి
తులసీ మణీ మాలికలు ధరించి
తీరుగా మృగనాభి తిలకంబు పెట్టక
నవ్య నిటోర్ధ్వ పుండ్రంబు దీర్చి
చీనాంబర శ్రేణులు విడచించి
ధాతుకాషాయ వస్త్రంబు గట్టి
శృంగార గాన విశేషముల్ చాలించి
హరినామ కీర్తనాయత్త యగుచుఁ

తే.గీ. తనరు భక్తిని వైష్ణవదాస్యమునకు
సదిరమగు వేషము వహించి చెలియ నమ్ర
భావమును గల్గు నదియునై యతిమృదూక్తిఁ
దేనియల్ చిల్క వైరాగ్యమూని యగుచు 119

క. మునిపతి నివసించున
వనమునందఁగ నేఁగుదెంచి యంచిని యరుగులం
దనుఁ బ్రోలి యార్తి దీనా
ననతై వగలొందు నంగనం గని కరుణన్ 120

తే.గీ. కులము గోత్రంబు జననంబు దెలియ నడుగ
విప్రవర్యున కంతయు విన్నవించె
నతని మోహింపఁజేయఁగా నెలపరించి
కపట వేషంబుతోడ నా కంజ నయన 121

ఆ.వె. అంత నమ్మునీంద్రుఁ డయ్యింతి లాలించి
కరము ప్రీతిఁ దుహితాసనంబు
సేచనం బొనర్చి పెట్టుటఁ బాదుల
సేయు మనుచు వాక్కు సేయుఁగాయును 122

తే.గీ. ఆ లతాంగి మునివరదానురక్తి
నాశ్రమస్థం సమ్మార్జనాదికములు
నయిన హరణాది శుశ్రూష లాచరించు
ప్రాంత యయ్యును విడువక సంతతంబు 123

క. ఆ ముని భుజించు పిదప ద
యామతి [1]నిజభుక్తశేషమును నన్న మిడన్
నేమంబున భుజియించుచుఁ
గామిని వత్సరము నరనికర సేవించెన్ 124

ఉ. అంత మునీంద్రుఁడు చిత్తము లవాంశమునైనఁ జలింపకున్న నా
కాంత తదీయసంగతికి గాఢ నిరాశవహించి దుఃఖిత
స్వాంతమునం బునర్గమనవాంఛ యొనర్చుచు నుండె నాకగే
హాంతికసీమ కయ్యెడం బాక్కు వింక్షితయౌచు నెంతయున్ 125

1 మ. నిజశేష

ఉ. అప్పుడు రంగభర్త కరుణాంబుధి దేవశిఖావతంస మా
కప్పురగంధి పుష్పమును గన్గొని యా చెలి యంతలోనె నీ
యిప్పుడ యీ ప్రతిజ్ఞ ఫలియింపఁగఁ గల్గును సంశయంబు లే
దెప్పుడుయట్ల నిందు వసియింపుము ప్రీతి వహింపఁ జెప్పినన్ 126

క. అంతటను మేలుకొని య
య్యింతియ నానాద్రి శౌరి హిత సూక్తులతున్
సంతసిలుచుఁ గైకొని కుం
భాంతరమున దాఁచియున్న యాభరణంబుల్ 127

క. మిసమిసమను సొగసులు గం
యసదృశమగు లతకు సుమము లంపదు మిసిమిన్
బిసరుహలోచన యవయవ
విసరంబునకు భూషణములు వెస నునిచెన్ 128

సీ. కంతుని బాణసంగతి మీఱు పన్నుల
 రుతతుల జనుచిత్తములు గలంప
శరదిందుచంద్రికా సన్నిభమందహా
 సంబు ప్రాణులకు మోదంబు గూర్పఁ
చాపంబు మెట్టిన పద్మంపుఁ దావిగా
 నాకదంబంబు లుబ్బారఁ దొరఁగ
[1]మధురతఁ జిల్కుడు పాటల గారికా
 సమితికి వింతగాఁ జదువుఁ జెప్పఁ

---

1 మూ. మధురంబు

తే.గీ. అంత దైవ వశమున నుదాత్తుఁ డగుచు
నిదురమేల్కాని వాకిట నిలిచి సాంద్ర
కందరంబులఁ జీకఁటి గ్రమ్ముకొనఁగ
నఖిల దిక్కులు బరికించు యదునిసురుఁడు 183

ఉ. అంతట వానచేఁ దడిసి యార్తి గరంగుచు వర్షశాలికా
ప్రాంత ధరాతలంబునను రంజిలు రావిమహీజ మూల మ
ధ్యాంతర మాపుకొన్న కమలాయతలోచనఁ గాంచి [1]తాపిత
స్వాంతుఁ జేసి లోపలకుఁ జయ్యనఁ దోకొని వచ్చె వేడుకన్ 184

దేవదేవికి ధర్మాంప్రిరేణువు వడుఁగుట

సీ. అట మున్ను వనమున కరుగుదెంచిన యప్పు
పానిసిరత్నంబు మాని చేరి
చలి నెపంబున మునిచంద్రు పాదంబులు
పట్టనే యొక వింత పలుకుఁ జేసి
యలసితా రనుచుఁ దదంఘ్రులు దన తొడ
నిడుకొని యొత్తుచుఁ గడు నివురుచు
బ్రాహ్మణోత్తము నాడు పయ్యెద దడిసిన
దని యడియకరము నందుఁ జేర్చి

తే.గీ. హావ భావాభినయమందు వాసరములు
గుబురుఁ జిలిబిలి బిల్లుల పలుకుఁ దేనెఁ
జిలుక నొగసులు దొలఁక నా కలికి విప్ర
పుంగవుని మానసంబు గరఁగఁ జేయ 185

---

1 మూ. తాపిత

ౢ ధన మిచ్చెఁ జాల కిట మా
తనయను గిలార రతి నుదారతఁ బెనఁగన్
జనదు పయిఁడిమ్ము లేకు
న్న నిపుడు వేగమె నిశేలనంబు వెదల మొగిన్, 141

క. అని యిట్లాడిన దాగ్రహ
మున వెదలి ద్వితాంతు చింతవారమైన ముసితా
ఙను దాహ్య వేదికాంతర
ము సధివసియించె దైన్యమున నా రాత్రిన్. 142

సీ. ఆ సమయంబున నఖిల లోకాధ్యక్షుఁ
డును భక్తవత్సలుండును దయాళుఁ
డును నగు రంగేశుఁ డనుమోదమున భాగ
జ్ఞానియా తన ప్రియసతినిఁ బోలి
నవ్విన నర్తకి నాథుని సదనంబుఁ
గాంచి యిట్లనియె నా కమలం పాలు
స్వామి యూరకయ హాసముఁ జేయఁ బనియేమి
వివరింపు మనిన నా విభుఁడు పల్కె.

తే.గీ. సాంద్ర విజ్ఞాన పరుఁడు జితేంద్రియుండు
భవ్య వైరాగ్య పరుఁడు మద్భక్తుఁడైన
యిట్టి భక్తాంఘ్రిరేణుఁడ యెదను సర్వ
దీయమాయా వశంగత స్థితిఁ గలంగె 143

క చెలికాని కాంచి పుష్పం
వలఁగొని మోహమున దాని వాకిలి కైటన్
దలఁచిన వేఁడక మిఁదన్
నెలకొని యున్నాఁడు నేఁడు నిరతగంధీ 144

క అతనిఁ గనుంగొని నవ్వితి
నవిలా యపుడేను నిన్ను నమ్ముని గను మం
చిరమతి నని వాంఛార్తుఁ
డితి చెప్పిన విని ప్రమోద భరితాంతరమై 145

తే గీ వారకాంతా గృహాంగణ వాటి యందు
కాలి విరహార్తి దీనుఁడై యున్నవాని
మునివరునిఁ గాంచి యా జగన్మోహని గరుణఁ
బ్రాంజలి యొనర్చి హరిఁగూర్చి పలికె నిటుల 146

సీ తనయుండు భవదీయమైన సత్కర్మంబుఁ
జేయు చుండెడి ధర్మశీలుఁ డనఘు
విజితేంద్రియు మునీంద్రు వీతరాగుని ఘను
నేకాంత భక్తి దాస్యైక భోగి
నావు పాదపద్మసుధారసాస్వాద
నాయత్త చిత్తుఁడై యలరు నిట్టి
మానుషోత్తముని కామునకుఁ జేయ నేటికిఁ
గింకరు వానిఁ గృపాపయోధి

ఆ. వె. భక్తవరద మున్ను బల్కి యుంటిని నాదు
వాక్యమునను విప్రవర్య నిటుల
జేసితివి నయంబు చేతను నా విధి
కర్త దగుని యజ్ఞహోమములందు 147

క. నీ మాయా వనధిఁ గడవ
నే మహాత్ములగు యోగ లీవరు దగుచు శ్రీ
రామరసపానములు చేత
కామాదుల నైక శక్తి గలిగిన వారే 148

ఉ. తావక పాదనావఁ గొని తథ్యముగా భవదాశ్రితుల్ సదా
భావిత మైన మాయ యను వార్ధిఁ దరింతురు గాన సర్వర
క్షావహ నీదు భక్తు పవిత్రచిత్తు నీ మునివర్యుఁ బ్రేమచేఁ
బ్రోవుము దేవదేవ సురపూజిత విగ్రహ కల్మషాపహా 149

క. అని పలికెడు రమయం దా
వనజ దళాక్షుండు లోకభర్త ప్రియముఁ జే
సి నిరుపమోక్తి వచించెన్
ఘనతర సంతోష వార్ధిఁ గదలు కొనంగన్ 150

శ్రీరంగవిభుఁడు నారాయణమునికొఱకు దేవదేవికి రత్నదసకంబిచ్చుట

ఆ. వె. అతివ నేను జేయుచున్న దంతయును వి
లాసమునకుఁ గాఁ దలంప వలయు
మహి మదేకభోగ్య మద్భక్తుఁడగు నిమ్మ
హాత్ముఁ బొంద దగుము నవ్వుదేల 151

## రంగేశుఁడు ప్రత్యక్షమై నారాయణమునిపై నిందను తొలఁగార్చుట

వ. అంతఃపురాణపురుషోత్తముండును దిరస్కృత నీలజీమూత కోమల శ్యామలతనుండును సుందరసితారవింద ప్రభాభాసుర లోచనుండును శరత్కాల సూర్యబింబ భ్రాజమాన దివ్యతేజోవిరాజితుండును సంపూర్ణ ప్రభా సంపత్పూర్ణచంద్రాననుండును వికసితకోకనదచ్ఛాయా సమంచిత పదయుగళుండును శ్రీవత్స కౌస్తుభ విస్తుల వక్షఃస్థలుండును చందన చర్చితాంగుండును వైజయంతీ వనమాలాలంకృతుండును కోటీర హారకేయూర కంకణాంగదాది భూషణ భూషితుండును శంఖ చక్ర కౌమోదకీ నందక శార్ఙ్గ ప్రముఖాయుధ శోభితుండును సముత్తుంగ విహంగ పుంగవతురంగుండును నంభోజసంభవ శంభుజంభారి ప్రభృతి సురనికర సేవితుండును జగత్పతియు నగు శ్రీరంగభర్త లక్ష్మీ సహితుండై యట ప్రాదుర్భవించి యా రాజుం గూర్చి యిట్లనియె 168

ఆ. ఈ మహీశ యీ హేమకభక్తుండు
పరమయందు నెను పూజ్యుఁ డనఁగఁ
బొల్చు నీవు నాదు పూజనీయుం డగు
నన్ను దలఁచి చింతనాత్ముఁ డగుట 159

క. [1]మాత్రర్థము లాడి కనఁ
పాత్ర మొనఁగి తిరిగి కొలుచుఁ బరమప్రీతిన్
ధాత్రీశ్వర యా పంక్తి
నెత్తరు నిది మాకు నిచ్చి నియతిం గనుమీ 160

---

1 మూ. మాత్రమునకు తల్లికి అనర్థమువచ్చెను మాత్రర్థము అని దిద్దుకొనిన మాతృతల్లి కొఱకు అను నర్థము పొసగును ఛందోభంగము నుండదు

పంచచామరము

రమా ముఖాంబుజాత మిత్ర రామచంద్ర విగ్రహా
సమాది షట్క సంపదార్య సారమానసాంతరా
యమేయ ధామ దివ్యనామ యాత్రికామరద్రుమా
క్షమా సతీ విపద్విదారి సర్వరక్షకా హరీ 174

గద్య. [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష లబ్ధ పాండిత్య ధుర్య నవరత్నావనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ స్వసముద్ఘాతకృత పటహ ధణంధణారవ విసరీత పతనక్రియా ఝల్లరీ దుందుభి ధ్వాన కోలాహల హాహాహూహూమద్ధ్వనాంత కనకదండికాప్రకర హీరకల కృతసందీపిత ప్రతాప కీర్తి ప్రతాప కోసలపం వయః పారావార రాకాసుధాకర సౌందర్య జిత కుసుమ సాయక ఐహిరి పామనాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవ పురాణంబు నందు మునివాక్యజనంబును వరంబు కావేరీ తటంబునందు మనోహరంబుగా గానంబు సేయుటయు లక్ష్మీదాసిం బనంపు రంగభర్త యువిహారు రమ్యంబు సాయుజ్యం బొసంగుటయు భక్తాంఘ్రిరేణు నామంబను సమ్మహాత్ముని గాత్రరాగ్యంబును లక్ష్మీనారాయణ సంవాదంబును నారాయణానుమతంబునంజేసి వేశ్యకుం బనంపు దేవదేవి యుద్భవించుటయు దేవదేవి నారాయణమునితో రమించుటయు శ్రీ రంగవిభుండు నారాయణమునికొఱకు దేవదేవికి రత్నపతకం బిచ్చుటయు ముని నిందాపహారణంబును హరిస్తోత్రంబును నన్నది పంచమాశ్వాసము సంపూర్ణము

---

1 మూ ఇతి

# భార్గవ పురాణము

## షష్ఠాశ్వాసము

క. శ్రీసీతా మహిళా హృద
యానంద విధాయి పన్నగాధిపశాయీ
మానిత వాగీశగిరి శౌ
రీ నిరుపమ సురపురీ గోపాలా. 1

వ. అవధరింపుము సకల గుణనికర ప్రజ్ఞాధురంధరుం డగు వరుండు
నారాయణున కిట్లనియె 2

సీ. పుణ్యంబు లతమ సంపూర్ణంబు నగు హరి
పత్రాంఘ్రిరేణుని భవ్య కథయు
నాలకించితి నే మహాత్మ పరమ పదా
వాపాపహార ముద్యాసిగాను
ప్రవణంబునను మోక్షదములౌ విష్ణుంబు
లగుచు సర్వజ్ఞుల కలిం కలిన
హారంబులగు చర్య లత్యంత ముదమున
వింటిని నేను విందుగాంగ

తే.గీ. లోక గురుండవు సద్వృత్తలోక నుతుండ
వతులిత జ్ఞాన నిశ్చలాయత్తమతివి
నిర్జరనుతాంఘ్రి కమలుండ పూర్తితాత్ముం
డవు చిరంతన మునినాథ భవవిభేద 3

క. అని నరుఁడు పల్కు వాక్యము
విని ధర్మపరాయణుండు వివిధ నిగమ సం
జనితార్థుఁడు నారాయణుఁ
డనఘుండు వచించె నిస్తులానందుండై 4

తే.గీ. విష్ణు వందు¹ వ్యస్తమౌ వ్యాప్తిగల్గి
కలన లోకంబువందుఁ బ్రఖ్యాతిఁ గాంచె
విష్ణుచిత్తుం డనెడు పేర విమల మతిని
నిఖిల ధర్మంబ యంచు నిర్ణీత యగుచు 5

క. హరిసద్మ స్తంభముండును
ధరణీసురుఁ డభిరాశ్రుతరు లాగమముల్
పురహరుని వలన నెఱ్పెన్
వారి సమ్ములమయి దర్కమూర్తిమందున్ 6

క. హరి కరుణఁ జేసి యతులం
బరుదగు నైశ్వర్య మిందు ననువందుచుఁ దాఁ
బరమ పదముఁ బ్రాపించెన్
స్థిరతరమతి నంటు¹ముందు శ్రీజవర్మఁ డాగన్ 7

క. వినుము నర యొక్క చిత్రం
బును గలిగిన దాఁద వగుచుఁ బుణ్యం బగు వి
ష్ణు నిపద్మ విష్ణుచిత్తుని
ననుపమ సూక్తిని వచింతు నాహ్లాదమ గన్ 8

---

1 మూ ల

## విష్ణుచిత్తుఁడు గరుడారూఢుఁడై జన్మించుట

క. అహరహము హైమ హర్మ్యమ్ము ని
విహములు సహకారవన నివాసి స్థిరవా
విహారముల మహిమం బై
మహియం దలరారు పాండ్యమండలమందున్ ౯

మ. అరవిందోత్పల పుష్ప మందిర మిళిందానంద పద్మాకరో
త్కరమై యాపరణంపు శృంగములఁ బ్రఖ్యాతంబుగా బ్రాలి వి
స్ఫురణంబుగాఁ సమస్తతార నిచయంబుల్ రేలు తద్వప్ర ర
[1]ప్రరముల్గా జగతిస్థలిం దవరు నీ ధన్విపురం బున్నతిన్ 10

సీ. ఏ వీటఁగల్గు నహిత రత్నాంచిత
సౌధంబు లింగిత స్థాన మయ్యె
నే యూరఁగల గభీరాయత [2]ఖేయంబు
పాతాళ సతికి నో పదమ మయ్యె
నే ప్రాంత వాసంబు నింతుల కెలుపంబు
లచ్చరపాటల పెచ్చు నడఁచె
నే పురిఁ బ్రాపించు గోపురపాళులు
గోపురి తేపగు దాప లయ్యె

తే.గీ. ధర్మసౌధ వృతా పరిభ్రాజమాన
మందిర పతాకికా సముత్పద్యమాన
పవన చలిత ఘనాఘన భావ్యమాన
దిప్తు లౌన్నత్యముఁ జెఱచు ధన్విపురము 11

---

1 మూ ర్క 2 మూ శ్రీ

క. దివ్యంబై సకలంబున
సవ్యంబై భవ్యమగుచు స్వర్గోపముగా
కావ్యంబై వైష్ణవ గణ
సేవ్యంబై ధర్మపురము చెలువొందు మహిన్ 12

క. ఆ పురమున దీపించున్
శ్రీపతి వటపత్రశాయి శ్రీరమణ మూర్తి
ప్రాపకుఁడు సకలలోక
వ్యాపకుఁ డఖిలామరర్షి వరసేవితుఁడై 13

సీ. వేద వేదాంగ సంవిజ్ఞానసాంఖ్యు
ధ్యాన వ్యాయామ తత్పరులును
స్నాన సంధ్యాద్యనుష్ఠాన నిష్ఠా గరి
ష్ఠ ప్రతిష్ఠా జ్ఞాన సంయుతులును
సకల స్మృతీతిహాస పురాణ శాస్త్రని
చయ తాత్పర్యార్థ విచక్షణులును
సమలోష్ట కాంచనాశ్మమతి ప్రసక్త వై
రాగ్య వార్థైక విరాజులును

తే.గీ. లవారహము యజ్ఞశీలురై[1] యఖిల భాగ
వత సమర్చనావర్యులఁ బరగుచుందు
రందు శతసంఖ్యలాగను సహస్రసంఖ్య
లగను హరిభక్తులగు ద్విజుల్ [2]దగుచుమంత 14

1 మూ రే 2 మూ దగుదురందు

## విష్ణుచిత్తుఁడు స్వామికిఁ బుష్పమాలికా కైంకర్యము సేయుట

ఆ. వె. అతఁడు విష్ణుచిత్తుఁ డను నామమునఁ బెంపు
జనము భట్టనాథుఁ డని వచింప
నమరియుండె విష్ణునందుఁ జిత్తము వ్రే
యెపుడు నిరతవృత్తి నెఱయఁగ నుండు 18

సీ. పరిమళం బఖిల దిగ్భాగంబులఁ బర్వఁగా
ద్రవ్యంబులైన ధూపములచేత
సుజన రంజిత తమ స్తోమంబు వారింపఁ
బ్రబలిన యష్టి దీపములచేత
మధుర శాల్యన్న సూపాపూప భక్ష్యాది
షడ్రస నైవేద్య సమితిచేత
హరికిఁ జిత్తంబునం దానందమున నొసఁగ
నమరిన వృత్తగీతములచేత

తే. గీ. సుప్రదక్షిణ వందన స్తుతులచేత
వ్యజన మార్జన [1]సౌధ లేపములచేత
నవ్యకరదీపికారోపణములచేత
విష్ణు నారాధనము సేయు విప్రవరుఁడు 19

వ. వెండియు నతండు సార్థంబులగు తీర్థయాత్రల వినీతంబులగు కం
టకంబులను వికచా[2]సాదితంబులగు తులసీ వనమాలికాదులను దద్వృత్తి
సమాప్తిత ప్రకారంబులగు చతుర్ద్వారద్వాలంకారంబులను హరిం దృష్టిఁ
జేసి యంతటం గుసుమపరిపూరిత మహీరుహంబులను దుంస్క్రుమంబు

1 మూ. శోధ 2 మూ. పా

లను బరిరంభించు పటంబు గావించి దానికిన్ జలసేచనం బొనరింపుచు
విచిత్ర మాలికా హరణంబులను దీక్షితాచరణంబులను శ్రీవైష్ణవ పూజా
చరణంబులను ననవరతంబు సమాహితుఁడై యుండె నంత 20

సీ. విరతియు నింద్రియ నిగ్రహంబును జేసి
మురహరి పరిచర్య ముఖ్య మనుచు
భావించిన నెఱింగి భట్టనాథుఁడు బహు
చేష్టాకరణములు స్థిరము గాంచు
కైంకర్యమును నమస్కారముగాఁ జేయుచు
బలిమి త్రివర్గంబును దొలంగి
శేషశేషిత్వ విశేష విజ్ఞాన సం
చిత భగవద్దాస్య జీవనుఁడుగ

తే.గీ. రూఢి [1]దాస్యత్రయోపాయ రూపమునను
హరిని లోకాధిపతిని సమాశ్రయించి
యమ్మహామూర్తియందు సన్న్యస్తభరము
నెనసి తత్త్వనివేశిత హృదయుఁ డగుచు 21

తే.గీ. నిరత మాత్మభరణమున నిర్భయుఁడుగ
నిర్భరుఁడుగ దృఢవ్రత నిర్భయుఁడుగ
సమయ మిట్టులఁ గడపుచు సరసిజాక్ష
సేవ యందుఁ బరాయణస్థితిఁ గడంగి 22

---

1 మూ. దాసపా

మ. నరసత్వంబున యోగివర్యుఁడు యథేచ్ఛాలాభసంతుష్టుఁడై
హరి పాదాబ్జ మరందపాన మధుపాయత్తాత్ముఁడై యందు వ
ర్తత ధీయం బగు పాండ్యరాజ మధురాస్థానంబుఁ బాలింపుచున్
ధర వర్తిల్లెను గీర్తిసంపదల నత్యంతుండు నై వేడుకన్ 23

## పాండ్యధరావరు వర్ణనము

సీ. ధర్మ విఖ్యాతుండు [1]తత్త్వవిజ్ఞానుఁడు
తత్త్వజ్ఞ సేవన తత్పరుండు
ప్రాలేయగిరి సీమ పర్యంత కీర్తి సం
తా వ్యాపకస్ఫూర్తిఁ దనరువాఁడు
సంతత షడ్గుణైశ్వర్య సంపన్న ప్ర
భావ మహత్త్వ విభ్రాజితుండు
సకల భూత దయారస ప్రాభవ స్ఫూర్తి
నిజవైభవమున గణింప విభుఁడు

తే.గీ. గరిమఁ గలవైన బలికిరాంతని యనందు
దుస్తరారి వితానంబు ద్రుంచు వీరుఁ
డఖిలలోక ప్రసిద్ధ విద్యాచణుండు
రాజమాత్రుండె పాండ్యధరావరుండు 24

తే.గీ. క్షితినిఁ దత్త్వ సమాకాంక్షఁ జేసి తత్త్వ
విదులఁ బాలింపుచును భక్తిపరుండు
దనరు నప్పుడు దీక్ష యాత్రాపరుండు
భూసురాగ్రణి యొక్కఁడు పుణ్యతముఁడు 25

---

1 మూ. తత్వవిజ్ఞానుండు

## పాండిత్యధురావహుఁడగు నొక యాత్రిక విప్రుని పలుకులతోఁ దత్త్వ చింత కలుగుట

తే.గీ. అమ్మహాత్ముండు తత్పురి కరిగి యతిథి
పూజితుం డగు నా రాజముఖ్యుఁ గాంచె
నృపతియును వానిఁ బురస్కరించి పూజ
లొనరఁ గావించె నిస్తులానందుఁ డగుచు 26

క. అనఘా యొండ విశేషం
బనఘా నా కెఱుఁగఁజెప్పు మవనీస్థలి ని
న్నను దత్త్వజ్ఞునిగా నా
త్మక పేర్కొని పల్కుదురు సుధీజను లర్థిన్ 27

క. అనఘుఁడు భూపతి వాక్యము
విని విప్రుఁడు నిత్యయార్థ విమలరాలో
చనఁజేసి పండితులా
నెనసి మహాత్ముఁడన యనియె నింపు దలిర్పన్ 28

ఉ. అనయము రాత్రియై పగటి యందును వృద్ధి దినాళి వర్తిలో
నెనిమిది యామముల్ పయసు నింపఁగువేళ జరా ద[1]గార్థమై
మనుఁడు పదార్థ సంగ్రహము సల్పుదురిద్దిని యుక్తి సిద్ధికై
ఘనసంపద యర్థ ప్రసంగ నొనర్పఁదగున్ వివేకికిన్ 29

క. అని ద్విజుఁ డాడిన విని య
జ్ఞుని పాలుం డతనిఁ జాల సల్పి ప్రియమునన్
దనది పురోహితుని నిలిచి
యనియె నతనిఁ గూర్చి యాదరమున సూక్తిన్ 30

---

1 మూ దరా

తే.గీ. నేను యత్నంబుఁ జేసెద నిపుణమతిఁ బ
రార్థ మౌ యైహిక సుఖంబు వ్యర్థమగుట
సాధనం బొనరించెద శాశ్వత మగు
బ్రహ్మపదము బ్రహ్మాది దుర్లభము శుభము 81

క. ఇహపరహిత కాముఁడవై
మహిఁ దనరిన యట్టి నీవు మాకు గురుఁడ వో
మహితాత్మ పలుకుము కథా
వహితముపాయంబు నేర్పవలె సమయముగాన్ 82

క. అని యిట్లు పలుకు భూపతి
పని వాక్యము విని ద్విజుండు సుగుణాంచితుఁ డం
పునఁ బ్రతి వాక్యము నుడివెను
మనమున సంతోష మంది మహితప్రౌఢిన్ 83

తే.గీ. అవనిపాలక యీ సమయంబునందు
నీకు నీ బుద్ధి యుదితంగా నెగడుఁ గాన
నిందు జనియించు పురుషుల కెట్టి మఱియుఁ
గారణము నేరదు విజ్ఞానమున విశింప 84

సీ. నిగమాంత విజ్ఞాన నిపుణులందే సుమ
నస్సుఁ జేయఁబడిన మునిని విభునిఁ
బరుని దైవతము నుపాసించి దుర్లభ
[1]యగు ముక్తిఁ జెందు నీ వనఘ యనఁడు

---

1 మూ. యముక్తి

దా మహాత్మునిఁ గూర్చి యాదాత్మ మఱియుఁ గృ
తాయిలి యగుచు సాష్టాంగ వినతి
గావించి పల్కె నో కరుణాపయోనిధీ
వేదాంత వేత్తలే విమలుఁ గూర్చి

తే గీ ధ్యాన మొనరింతు రఖిలాగమాంతవేద్యుఁ
[1](డాది మధ్యాంతరహితుం డనంతుఁ డెవ్వ)
డే మహామహుఁడు పరాపరేశ్వరుఁడు పు
రాణ పురుషోత్తముఁ డెవండు రమ్య చరిత 35

తే గీ సరవి నెవ్వని భ్రూ విలాసమునఁ జేసి
సరసిజ భవాండభాండము లిరుగుచుండు
నెవ్వఁ డెవ్వాఁడు ఎకు సుధీమతుండు
సంతతాహ్లాదయుతుఁడు ప్రశాంత ఘనుఁడు 36

క సుంసితభవ రుద్రాక్షము
సరసిజరిపు నేత్రవహ్ని సమయ సమీరా
ద్యుర నిర్జరులు లెన్నియుఁ
గర మెవ్వని యాజ్ఞ వశగుగా వర్తించున్ 37

తే గీ ఎవఁడు పరతత్త్వ మనుపేర నెసఁగువాఁడు
నిత్యుఁ డీశ్వరుఁ డెవ్వాఁడు నిగమసారుఁ
డెవనిఁ దెంచి ఋషులు పాప మెనయకుండు
రమ్మహాత్మునిఁ బల్కి నిశ్చయముఁ జేసి 38

---

1 మూ ఈ పాదము లేదు

పాండ్యధరావరుఁడు తత్త్వనిశ్చయమునకై శుల్కంబు గట్టుట

క. అని విని పలుమా ఱాలో
చనఁ జేసి ద్విజాళిఁ బిల్చి సంపదగంబాఁ
దనవుండు విష్ణుదేవుం
దనుపొందుట నిందు సంశయము లేదనుచున్ 39

సీ. అమ్మహాత్ముఁడు పరంబైన తత్త్వంబు నా
త్మాధిపుఁ డఖిల లోకాధినాథుఁ
డందురు రా త్రివిక్రమంబగు పదంబని కొంద
ఱట్లు దత్పుత్రపౌత్రాది జనము
నది నిమిత్తముఁ జేసి యవనీస్థలము గల్గు
బహువేదవేదాంత పారగులను
రావించి తత్పమస్తావనీసురులచే
నెద్ది సత్యత నిశ్చయింపఁబడును

తే.గీ. నట్టి తత్త్వంబు నీవు నిర్ధారియించి
భక్తిఁ గైకొని సాధింపు పరము పదము
ననిన మతిమంతుఁ డగు విభుఁ డధిక మతిపు
వలరెడు పురోహితుని వాక్య మాలకించి 40

చ. అలరు వసంత సంఖ్య గల యట్టి ధనం బనుపొందు పుష్కలా
ర్కములు తైన యా నృపతి పర్యుఁడు సుమ్మత తోరణం బునం
దుఁ గంయంగఁ గట్టెఁ బరితోషకుఁడై జగతీతలం బునన్
గల నిగమార్థ కోవిదనికాయములన్ గుఱియించి యర్థితోన్ 41

క. ఘనులార (¹రండు తర్కం)
అను నిశ్చయమున గానర్చి భువి నీ కల్గం
అను గౌతమని చాటింపం
గనిరె సకలదేశములం నృపాలుఁడు ఘనుఁడున్ 42

తే.గీ. ఇంల నది విని వేదవేదాంతవేత్త
లైన భూసురు లంద ఱత్యాదరమున
నరసహస్రాధికములగు (²సంఖ్యలొప్ప
రమ్య) తరమైన మధురాపురంబుఁ జేరి 43

వ. అందు రాజసభాభవనంబుఁ బ్రవేశించి యా క్షితిపతి చేతం బ్రపూజితులై తమతమ సిద్ధాంత పద్ధతులం జేసి పరస్పరంబుగా సంవాదంబుఁ జేసి రట్టి యెడ ³(శాస్త్రవాదం) బొనర్చుచు బ్రాహ్మణోత్తము లచియ పరంబుగ తత్త్వంబు నిర్ణయింపకుండుటం జేసి యమ్మహీశుండు నం యాత్మందై యుండె నా యాహాయోగి మహాత్మ్యంబు క్రమంబం అను నగు భార్గవపురాణోత్తర ఖండంబు వందలి చతుర్వింశతి తమాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు వరునకుం జెప్పి వెండియు నిట్లనియె 44

వటపత్రశాయి విష్ణుచిత్తుని పాండ్యరాజు వద్ద కరుగు మని ప్రోత్సహించుట

సీ. అప్పుడు ధన్వి పురాధీశ్వరుఁడు హరి⁴[రి]
వటపత్రశాయి(శ్రీ⁵(వా)మమందు
రమణీయ గుణ సుధారాధన తత్పరు
విమల మనస్కుని విష్ణుచిత్తు

---

1 మూ లేదు 2 మూ లేదు 3 మూ లేదు
4 మూ లేదు 5 మూ లేదు

యోగివర్యునిఁ గాంచి యోగి విలాసార్థమై
కృపచేత నా జగదీశుఁ డనియెఁ
దాంత్యభూపాల సభకుఁ బోయి బ్రాహ్మణ
పుంగవుం[1]డా నీవు పూర్ణ మతిని

తే గీ రచించి మహా[2]ప్రియమగు మత్పరత్వ తత్త్వ
మును బ్రకాశింపఁ జేసి ప్రమోదమునను
శుల్కము గ్రహింపు మనుచు విష్ణుచిత్తుల
నయతరోక్తిని రంగనాథుఁ డనఁగ 46

క కరముఁ బ్రియవృత్తియై భూ
సురుఁడు కరంబులు మోడ్చి సురనుతుఁ డౌ యా
హరితో నిట్లని విన్నవించెను
గురుతరముగ దనకు మదిని కోర్కి యనంగాన్ 48

సీ స్వామి శ్రీప్రసాద సమ్మార్జనమో కాక
యభిషేకజల ఘటాద్యాహరణమొ
మధుర సౌరభవనమాలికా కరణమో
సౌవర్ణ పల్యంకికావరణమొ
గరుడభూషిత పతాకాపరిగ్రహణమో
చర్మ రత్నకృపాతపత్రవృత్తియొ
దివ్యమంగళ కరదీపికారోపమో
లత సింహాసనాది ధారణంబొ

1 మూ లేదు 2 మూ మత్పరత్వంబు

సీ. సురుచిర దివ్యతేజోవిరాజితు దీర్ఘ
బాహు నత్యున్నతోజ్జ్వల కిరీటు
హారాఢ్య హృష్టపుష్టాంగశోభితుఁ బృథు
వక్షు విశాలాక్షు వరగుణాఢ్యుఁ
బూర్ణచంద్రాస్యు సుదీర్ఘభుజుస్మితు
సుదతర నిరమృత్తి గోర్ధ్వపుండ్రు
కంఠ శంఖాంక భుజాయుగ్ము సుకపోలుఁ
గమలాక్షు వనమాలికావరీత

తే.గీ. కంధరుని [1]సత్యగుణి జితకామరోషు
సమదమతి నియమాది గుణాళియుక్తు
హృదయ పద్మస్థ భగవదంఘ్రిక సమర్చ్య
తాశయు జితేంద్రియునిఁ గాంచి యచ్చెరువందు ౬౫

క. అంత సమాహితుఁడై దా
సంతసమున లేచి యాద్విజశ్రేష్ఠుని ర
త్నాంతరిత పీఠిఁ జేరిచి
యెంతయు సాష్టాంగ మెరఁగి యింపు దలిర్పన్ ౬౬

తే.గీ. పరమ హర్షితుఁ డగుచు నప్పార్థివుండు
క్షితి యథావిధి వరలఁ బూజింప నదటి
నిగమ నిగమాంగకోవిదుల్ విపులమతులు
తాపసులు వంద జనహితఁ బొంచి రంత 67

---

1 మూ. సత్యదుని

క. ఆరూఢిఁ బరబ్రహ్మము
నారాయణుఁ డవ్యయుండు నాథుఁడు భవా
కారుఁడు తత్త్వము పరమో
దారుఁడు దేవాదిదేవుఁ డచ్యుత ప్రభుఁడౌ 62

తే.గీ. ఇతని నామంబు సంతతం బతిశయంబు
దనరి జీవతతులకుఁ బ్రధానము నగు
హేతు వంతర్బహి[1]స్ఫూర్తి యేఁపు మీఱ
యంతటను నిండి యుండు నారాయణుండు 63

తే.గీ. అతఁడె విశ్వంబునకుఁ బతి యాత్మ విభుఁడు
సర్వశేషియుఁ బరమాత్మ సర్వతముఁడు
వశి నేత్రుండు సర్వజ్ఞుఁ డవ్యయుండు
సర్వగుఁడు సర్వవిభవుండు సర్వమయుఁడు 64

సీ. లక్ష్మి విభుండు విలక్షణుం డాద్యంత
రహితుండు శాశ్వతుఁ డహితయుండు
పురుషోత్తముఁడు గుణపూర్ణుఁ డనంతుఁ డా
తఁడు పరమంబగుఁ దత్త్వ మరయ
సత్యంబు సత్యంబు సంశయంబును లేదు
నారాయణునికంటె వేఱు గాంచ
పరమగు దైవం బభావంబు భావంబు
విశ్వంభరాధీశ విప్రవర్య

1 మూ స్ఫూర్తి

ఆ.వె. యిదియ యిదియమూర్తి వెంచి సర్వంబు సే
వ్యంబు గాఁగ నే నుదారమూర్తిఁ
దలఁచినాఁడ ననుచుఁ బరమవ్రతుం డిట్లు
హరి గుణించి మెచ్చు నవసరమున 65

## పాండ్యరాజు సభలోఁ గట్టిన శుల్కము తెగిపడుట

క. లలితమతి విష్ణుచిత్తుఁడు
పలికినదో సభయందుఁ బరఁగి సువర్ణో
ద్యచ్ఛుల్కము తెగిపడుటయు
నం పుష్పాల వృష్టి గురిసె నాకసమున పయిన్ 66

ఉ. దివి సురదుందుభుల్ మొరసె దివ్యసతుల్ నటియించి రుత్సుకిన్
భువిని సమస్త మానవులు భూషలఁ జేరి సర్వదేవతా
నివహమూర్తి యన్న శ్రీధరుఁడు నీరజనాభుఁడు లోకపాలకుం
డవిరళమూర్తి యెక్కుఁడని యానతిఁ బల్కె సుదాత్తప్రభిన్ 67

## పాండ్యరాజు విష్ణుచిత్తుని సమ్మానించుట

తే.గీ. అప్పు డారాజు నిస్తులాహ్లాద నిర్భ
రుం డగుచుఁ దచ్చరణ పంకరుహములందు
నాదరత భక్తిఁ జేసి సాష్టాంగ [1]మెఱఁగి
యతని నస్తోత్రములఁ గొనియాడి మఱియు 68

వ. మహార్ఘ్యంబులగు భూషణ వస్త్ర గంధ పుష్పమాలికాదులచేత మునీశ్వరు
నలంకృతుంగావించి యౌపవాహ్యంబగు మహానాగంబునం దధిరోహణంబుఁ
జేయించి సముత్తుంగ మంగళతూర్య ఘోష సహితంబుగాఁ బురరంగ
జనంబులతోఁ గూడఁ బురిపర్యటనం బొనరింపునప్పుడు సర్వేశ్వరుండును

---

1 మూ. దిగి

గోటికందర్పసుందరుండును మహానుభావుండునగు శ్రీవిష్ణుదేవుండు లక్ష్మీ సహితుండగుచుఁ బ్రదయాళనుండగు పతగేంద్రు నారోహించి పద్మభవ భవేంద్రాది సురముని పరి[1]వృతుండగుచుఁ దక్షిణంబున గజస్కంధాధిరూఢుండగు నమ్మునిఁ గనుంగొనుట కిచ్చగింపుచు మహాభాగవతాగ్రభాగంబు నందలి యంతరిక్షంబునందు బ్రాదుర్భవించిన నద్దేవుం గాంచి భక్తి సుహృష్ట హృదయుండగుచుఁ దదీయసౌందర్యామృతంబు గ్రోలి తన్మయీకృతచేతస్కుండగుచు నీరజాక్షుని దైవత సౌందర్యాతిశయ వేషంబులకు దృష్టిదోషంబయ్యెడునని చింతింపుచుఁ దన్నిరాసార్థంబుగా నతనికి మంగళాశాసనంబుఁ జేయుటకు ఉద్యుక్తమంతు డగుచు గళగండంబు నందుఁ దాళంబు గావించి యానంద సంప్లుతుండగుచు సామగానస్వరంబు నం జేసి యిట్లనియె ౬౯

విష్ణుచిత్తుఁ డొనరించిన మంగళాశాసనము

సీ. మంగళం బచ్యుత మధుకైటభ విదారి
మంగళం బీశ్వర మదన జనక
మంగళం బంతరాత్మక లోకనాయక
మంగళంబు రమానుషంగ వక్ష
మంగళం బాశ్రితోత్తుంగ మూర్తిప్రద
మంగళం బజ భవామరనుతాంగ
మంగళంబు సుపర్వమందార సమరూప
మంగళం బఖిలాంతరంగ నిలయ

ఆ. మంగళంబు మహాపాపభంగ చరిత
మంగళంబు సువర్ణపతంగ గమన
మంగళంబు దయారసాపాంగ విభవ
మంగళము దైత్యనాశ పతంగవాహ 70

1 ము. ప్ర  2 మూ. పా

ఆ.వె. అనుచు నిట్టు పలుక నధికసంతుష్టుఁడై
కరుణచేత నతనిఁ గాంచి శౌరి
యాత్మ పద్మ కర్ణికాగ్ర స్థలంబున
వాసిఁ జేసె భక్తవత్సలుండు 76

విష్ణుచిత్తుఁడు మహావైభవముతో ధన్వీపురముఁ జేరుట

తే.గీ. అంత బహువస్తువులఁ జేసి యధిపుచేతఁ
మానితుండయి యమ్ముని పుంగవుండు
తదనుమతిఁ గొని వేడ్కచే ధన్విపురముఁ
జేరెఁ బరివృతుఁ డగుచు సుదారలీల. 77

క. పురజను లందఱు భూమీ
సుర వైభవ మాలకించి సుస్థిర మతులై
పురవర మమలత్కృతి గనిపి
హరి నాతని సేవఁ జేయఁ బరి వెడలి రొగిన్ 78

క. ఆ పురజన పూజితుఁడై
యా పృథ్వీసురుఁడు గజ సమారూఢ గతిన్
దీపింపఁ జొచ్చె నిజపుర
మేపున భగవద్దయానమేత హృదయుఁడై 79

తే.గీ. శార్ఙ్గ ధన్వుని పద[illegible] మంది
రమునఁ బ్రవేశించి యమ్మునిరాయఁ డవ్వ
యనిఁ బరంధాము సద్మతు మర్త్యరేఖఁ
గూర్చి ప్రణమిల్లి తనమది గోర్కి దీర 80

తే.గీ. దీని నెన్నంగ వచియింతు మౌనివర్య
యాలకింపుము సృష్ట్యాదియందు శౌరి
ఘనుఁడు భగవంతుఁడగు జనార్దనుఁడు విలయ
జలమునందు మునింగిన జలధిఁ గాంచి ౭౦

ఆ.వె. ఘోర వరాహరూపముం గొని యాభూమి
నుద్ధరించు కోర్కి నొంది తా మ
హార్ణవంబుఁ జొచ్చి యట ధరణెత్తె ను
మాధవస్తుతుండు మాధవుండు ౭౧

క. అది నా భూమీసతికిన్
జలజదళాక్షుఁడు ప్రీతినర్పనతో నా
యలనామతి యా దేవునిఁ
జింతించి వచించె నిట్లు వినయతరోక్తిన్ ౭౨

ఆ.వె. వరద లోకమున భవత్ప్రీతి గల జను
లెవరు పితరుఁ డాజ్ఞ యెద్ది ప్రియము
ఘనముగా రహస్యమునకు రహస్యమౌ
దీనిఁ బల్కవలయు దివ్యమతిని ౭౩

క. అనవుడు నా భువివాక్యము
విని భగవంతుండు శౌరి విశ్వమయుం డా
వనితా మతిఁ బ్రియగాలిం
జనవున నాలింగనంబు సలిపి వచించెన్. ౭౪

## విష్ణుచిత్తుఁ డా కన్యను గృహంబునకుఁ గొని చని భార్యా సహితుఁడై పోషించుట

తే.గీ. ఈ కుమారిక గుణశాలి నీవు కరుణఁ
పోషణము చేయు మనఘ సంపూర్ణ మగుచు
దివ్యమగు పరమస్థాన మవ్యయంబుఁ
జెంద గలవు నిఖిల సంసిద్ధి గలిగి ౯౭

క. అని యిట్లాడిన వాక్యము
విని సంతోషంబుఁ జెంది విప్రేంద్రుం డా
త్మ నికేతనముఁ జేరి ముదం
బున శుభయగు పుత్రిఁ దనదు పొలఁతి కొసంగెన్. ౯౮

తే.గీ. అంత నా సతి వృత్తాంత మవనిసురుఁడు
పల్కఁ దా నప్పయోజాస్య పద్మ పగిదిఁ
దనరు పద్మాక్షి యగునట్టి తనయఁ బోష
ణంబు గావించెఁ బరమ హర్షంబు జెంది ౯౯

తే.గీ. సుతను గోదాభిధానంబుఁ జేసెఁ దండ్రి
యప్పయోజాస్య యతులితాహ్లాద చిత్తఁ
దగుచు నాలెమ సంవర్ధితాంగ యగుచు
రూపలావణ్యగుణ్యానురూఢి మించె 100

## గోదాదేవీసౌందర్య వర్ణనము

క. విమలరుచి మీఱె నానన
కమలము చనుదొక్కవలఁ బ్రకాశించె మహో
ద్యమమయ్యెఁ గుంతలాళుల
రమణికి యౌవన మనియెడు రవి యుదయింపన్ 101

ఉ వెన్నెల కాఁకకున్ మరుని వేదనకున్ మంయంపు గాంతిచెన్
గన్నియ చిత్తమందుఁ బరితాపముఁ జెందదు రంగనాయకున్
బన్నగశాయి కీర్తన మహా రసామృత మాధురీ ఝరిం
బన్నెదు గానము¹ంగాని సఖుల్ సతి నల్పి నుదంచితోన్నతిన్ 113

క ఆటలఁ బాటల మాటల
నెటులఁ బరిపాటిఁ జేసి నిరతస్తోత్రం
బోఁటి గొనియాడుచును దన
బోటి సఖుల తరుణి మోహ దారగొని పలుకున్ 114

తే గీ అమిత సౌఖ్యం ముఖ్య గుణాఢ్యయగుచు
²యౌవ నారంభ విగ్రహయైన యామె
నిరత మాధుర్య తర సుధారసము లీన
³హరి గుణము లెన్ను జనకుని తరణి ధరణి 115

మ సరసీజాక్షునియందు లీనతరమౌ స్వాంతంబు రంజిల్ల యా
యరవిందాయతనేత్ర హర్ష పరిపూర్ణాభీక్షయై తద్గతో
త్కరమౌ గానము చేయుచున్ హృదయ పద్మంబందుఁ దన్మూర్తి నా
స్థిరవృత్తిన్ దిసియించుచున్ సతత ముద్రా ప్రభావాఢ్యయై 116

---

1 మా మనం    2 మా యవ్వ    3 మా హరి గుణగుణ

చ అనయము చక్రపాణికొఱకై యనఘుం డొనరించు మాలికల్
మునుకొని తా ధరించుకొని మోదముఁ జెందుచు మందిరాంతరం
బునఁ జరియింపుచున్ ముకురమం దవలోకింపుచు నవ్వుచున్ ఘనం
బునఁ గమలేశు సంస్కరణమున్ రచియించు వచస్సు వేడుకన్ 120

చ తరమతిఁ గన్యకామణి ముదంబునఁ దాల్చిన పుష్పమాలికా
తతిఁ గొని చక్రపాణికి సుదారత నర్పణ చేయు భక్తిసం
గతి గని భట్టనాథుఁడు పరిష్కృత విష్ణుపదాంబుజాత సం
గతిఁ గొను చిత్తముం గలిగి కౌతుకవృత్తి నెసంగు నెయ్యెడన్ 121

క మాలిక దాల్చిన యా సుత
మాలిక లా విష్ణుఁ డొసంగ మానిత కరుణా
శాలికి గుణశాలిక వన
మాలికిఁ బ్రియ మయ్యె ననియు మహితస్ఫూర్తిన్ 122

క తరము గుఱ సేయ కృత్యం
తెలుఁగక సద్భక్తిచే మహీసుర వరుఁడా
హరికిఁ బరిభుక్త మాలిక
లరయ నొసఁగఁ గొల్చి దినము లరిగిన పిదపన్ 123

రంగనాథుఁడు గోదాదేవి పరిభుక్త పుష్పమాలికనా గోరుట

చ సరసిజగంధి యొక్క దివసంబున నిర్మల పుష్పమాలికో
త్కరము ధరింపనప్పటికిఁ దక్షిణమందగు భట్టనాథుఁడా
దరమున వచ్చి కాంచి వివరస్థితిఁ జింత యొనర్చి తల్లి యా
తెలుఁగు నొనర్చి కేమిటికి దేవునియందలి భక్తి గల్గెనన్ 124

క అని యా సరసులు వివిధ యా
ఘనుఁ డితరములైన మాలికలు చేసి ముదం
బునఁ జక్రపాణి కొసఁగెను
సునిశిత భక్తిప్రమోద సుస్థిర మతియై 125

సీ ఆరూఢి గోదావరోరుపావన చేత
సుత్రము¹రైనట్టి పూల సరులు
రచియించు భక్తనాథ మునీశ్వరుం గూర్చి
నవ్వుచు ముదమున నలినేత్రుఁ
డవను సి పుత్రిక యనురాగమునఁ దాల్చు
కుసుమమాలికలు మా కొసగు మనుచు
యాదరించినప్పు డయ్యచ్యుతునకు నమ
స్కారంబు చేసి యాశ్చర్య మంది

ఆ వె యాతఁడు భక్తిచేత నా పుష్పమాలంబు
లాత్మకన్యకను మురారి కర్పి
[illegible]ఁ జేయఁ దోషమం బంది యద్దేవుఁ
డవనిసుతుని తోడ ననియెఁ బ్రీతి 126

చ తరతకమూర్తివై రుచిరతం గొను నీ యరవిందగంధి సం
చితమతి నే వివాహమునుఁ జేసికొనంగల వాఁడఁ బ్రేమ నో
క్షితిసుర యంతసేపు పరికింప భవద్గృహసీమ దీని ను
ద్గతి వసియింపఁజేయు మని కంజదళాక్షుఁడు పల్కి వేడుకన్ 127

---

1 మూ. ల గొన్నట్టి

క. తరుణి పరిభుక్తములగు
సరములు హరి దాల్చుకొని విచక్షణుఁ డగు భూ
సురుఁడు గనుంగొని యా సతి
ధరణి [1]ధరణ్యాంశ గాఁగఁ దలఁపుము మదిలోన్ 128

తే.గీ. ఏను పెండ్లాడు నందాక నీ పయస్వి
యుష్మదీయ గృహంబు[2] (న) నుండని మ్మ
టంచు సంతోష లోచనుఁ డాత్మ నెసఁగ
నమ్మహాత్ముండు తోషితస్వాంతుఁ డగుచు 129

క. [3]ఆనయము దేవేశుం గని
మౌని వరుఁ డాతనికి మ్రొక్కి మోదము తోడన్
దనయను దోఁకొని తనగృహ
మునకుఁ జనియె నఖిలలోకము గొనియాడన్ 130

గోదాదేవి తన తండ్రిని యర్చావతారస్వరూపంబు నడుగుట

క. ఒక నాఁడా గోదాసతి
ప్రకటిత భక్తిని జనకుం బద తత్పరయై
సుకర మతిఁ దత్కథాశ్రవ
ణ కుతూహల యగుచు నుండి వినయతర లీలన్ 131

తే.గీ. ఆ జనకు మునినాయకు నమిత భక్తిఁ
జేరి ప్రణమిల్లి సంతోష చిత్త యగుచు
నంత నాముక్తమాల్యద యతనిఁ జూచి
పల్కె నిట్లు మృదూక్తిని భవ్యమతిని 132

1 మా. ధరణ్యాంశ గాఁదల 2 మా. బుండు
3 ఏమా ఆండేవేశుండాగిన పూర్వపద్యము నందలి వాక్యముతో నన్వయించు లేదు

సీ. దివిజవంద్యుండును దేవదేవుండునౌ
 నరవిందనేత్రు నవ్యావతార
మూలు భువనంబునఁ గల వసంఖ్యంబులు
 గా మానవులకుఁ బ్రఖ్యాతి గాఁగ
సర్వాధికము లౌట సకలంబు గులకంబు
 వలన ముక్తిదమూర్తి పొలుచు దాని
యందుఁ బ్రసిద్ధంబులై కర్తసౌఖ్యంబు
 లొసఁగు [1]వాణంబులో మనూన వృత్తి

తే.గీ. శ్రవణ మాత్రంబుచేతనే సకల జనులు
ముక్తిఁ జెందుదు రటులిలామోదులగుచు
దాని పఠియింప నముఁ గూర్చి భవ్యమతిని
ననఘ హరిభక్తి దాయక సాధుచరిత 183

క. అని యిట్లు ప్రార్థనసేతు
వనితామణి నా కుమారి వర్తించి ముదం
బున మృదు పలికి పఠించెన్
జనకుఁడు బహువాక్యములఁ బ్రశంస సలుపుడున్ 184

వ. లోకంబునందు గుప్తతమంబగు నీ [2]యధ్యాయ వ్యూహంబు సూక్తమగుట
శ్రవణంబు వలన ముక్తి దాయకంబగు దాని పఠియించెద మాకర్ణింపు
మని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర ఖండంబునందలి షడ్వింశాధ్యాయంబు భక్త పరాయణుండగు వారా
యణుండు నరునకుం జెప్పి వెండియు నిట్లనియె 185

---

1 మూ వానులలో
2 మూ యధ్యా

విష్ణుచిత్తుఁడు గోదాదేవికి పరమ క్షేత్ర విష్ణునామ తన్మాహాత్మ్యంబులఁ
దెలియఁ జెప్పుట

క. శ్రీ వైకుంఠ మహాలో
కావాసుఁడు వాసుదేవుఁ డవ్యయుఁ డార్యా
శ్రీ విభవుఁడు నిత్యావం
దావి[1]ర్భావుండు దనరు నతిశయలీలన్ 136

మ. లలితాష్టాక్షర మంత్రరాజ మననాంఘ్రి ప్రభావోదయుల్
వినుత వ్యేద తదంత పారగులు సంవిద్వార నిష్ఠా గరి
ష్ఠులు సాయుజ్య నిరూఢమూల మహిమస్ఫూర్తుల్ సదా నిత్యము
క్తులు సేవింతురు దండ నచ్యుతుఁడు వైకుంఠంబు నకుంఠస్థితిన్ 137

క. ఆమోదలోకమునఁ బర
మామోదముఁ జెందు శౌరి [2](యతిల) గుణమణి
ధాముఁడు శ్రీ సంకర్షణ
నాముఁడు వెలసిల్లు మునిజనస్తుతుఁ డగుచున్ 138

క. ఘన నిత్యప్రమోదలోకం
బునఁ బ్రద్యుమ్నుండు నిత్యపూర్ణుండు వసిం
చును భక్తవత్సలుఁడు స
న్ముని సేవితుఁ డచ్యుతుఁడు సమున్నత మతియై 139

తే.గీ. సరసిజాక్షుని సామోద పరమలోక
మందు న([3]చ్యుతుఁ డ)ని రుద్ధుఁ డగుచునుండు
నారికాపదుఁ డరుణితాప్తోక [4]తప్తుఁ
డనిశపావనుఁ డమల జీవనుఁడు నగుచు 140

---

1 మా ధావ్యుండు 2 మా (యతిల) లేదు
3 మూ లేదు 4 మూ వప్తు

తే.గీ. అఖిలలోక శిరోమణి యైనయట్టి
సత్యలోకంబు నందుల సంతతంబు
నలరు నానందమయ పరార్థ్యంగు సుభక్తు
లనుసరింప మహావిష్ణు వధివసించు 141

మ. అరయన్ భాస్కర మండలాంతరమునం దావాసియై ద్వాదశా
క్షరమంత్రార్థాలు సన్నుతింప సురలోకాప్తాహుండు లక్ష్మీయుతుం
దరవిందాక్షుఁడు భక్తరక్షకుఁడు సత్యస్వాంతుఁ డొప్పారు భా
సుర సౌవర్ణ కిరీటకుండల కటీసూత్రాద్యలంకారియై 142

క. [1]అమృతాంబుధి నడుమ భుజం
గమ ఫణి పెంపెసపునఁ గంజదళాక్షుం
డమరన్ భాసిల్లుఁడు హరి
యమరనుతుఁడు శేషశాయి యవ్యయుఁ డజుఁడున్ 143

తే.గీ. ఆల యనంతాది నిత్యముక్తులగు సూరు
లధికతరభక్తి సేవింప నందుఁ దనరు
విష్ణుఁడు నూతనుండు వర్ధిష్ణుఁ డ[2]ఖిల
భూషణాలంకరిష్ణుం డశేషగుణుఁడు 144

సీ. బ్రహ్మాది నిర్జరవ్రజార ప్రభావుండు
నారద సనక సనంద వాచ్య

1 మా. అమృతంబునిధి 2 మా. రవిం

క. పరమక్షేత్రంబై వి
స్ఫురణంబగు నైమిశమున ముక్తిదుఁ డగుదున్
హరి దగు సల్లలితువునఁ
హరి శౌనక ముఖ్య పరమముని పూజితుఁడై 147

తే.గీ. క్షితి మహాపుణ్యమగు హరి క్షేత్రసీమ
రూఢి మీఱ సాలగ్రామ రూపియగుచుఁ
వెలుఁగు దార్వాభిషేకంబు సేవనంబు
జనమునకుఁ బరమపదం బొసంగు నెపుడు 148

క. మహి మతకర్షకయందుం
రహి గంధ[1]ధూపితసంజ్ఞ రంజిలు హరి దా
మహిత స్ఫూర్తిం గైకొని
యహరహమును భక్తకోటి కభయప్రదుఁడై 149

ఉ. అంత నయోధ్య యందు మహా మహుఁడై యనుశిష్టయుక్తుఁడై
వింసిత మూర్తియైన పృథివీసుతతోడ సమస్తభోగ సం
కలిత విహారపద్ధతిఁ బ్రకాశితుఁడై భవమోక్షకారియై
యలం పరమాత్ముఁ డౌ సలయహాత్ముఁడు రాముఁ డుదారకీర్తియై 150

తే.గీ. ధర్మమతి దాతఁడు సత్కృత్ ప్రపన్న జనుల
రక్షణ మొనర్చు దీక్షగాఁ బ్రబలువాఁడు
శ్రీకరుఁడు రఘురాముఁ డస్తోక మూర్తి
స్మరణమున ముక్తి ఘనముఁ గొసంగువాఁడు 151

---

1 మూ. ధ్యుపిత

తే.గీ. ద్వారవతియందు హరియు నవ్యయుఁడు పరుఁడు
యాదవేంద్రుండు లోకరక్షాపరుండు
సర్వలోకైకరమ్యుండు సకలభక్త
వందితుఁడు శరణాగత వత్సలుండు 157

క. నందవ్రజమున యదుపతి
సుందర విగ్రహుఁడు భక్తసులభుఁడు గోపీ
బృందముతో విహరించు ము
కుందుఁడు కృష్ణుండు గోపగోయుతుఁ డెపుడున్ 158

తే.గీ. ధర మనోహరమైన బృందావనమున
నంద సూనుండు దనరు నానందముగను
నలరుఁ దద్భక్తులను దత్పరాయణులు మ
హాత్ములగు భక్తవరులు సమర్చ సేయ 159

క. అనుదినము గాళియహ్రద
మున గోవిందుండు దనరు ముని హృద్ధ్యేయుం
డనుపమ మూర్తి మహామహుఁ
డనవద్యుం డప్రమేయుఁ డవ్యయుఁ డగుచున్ 160

క. గోవర్ధనగిరి వరముగ
పాలింపగ గోపవేషధరుఁడై హరి ం
[illegible]వరుఁడు దనదు సేవను
సేవకులం బావన్ము నరక సింధువు గడవన్ 161

ఉ ఇంతఘనమ్మునందు స్మరియించిన మర్త్యులొనర్చు పాపముం
బొలియఁగఁజేయు నచ్యుతుఁడు భూరికృపారసమూర్తి భక్తవ
త్సలుఁడు ఘనమ్ము సంస్తుతుఁడు సర్వశరీరుఁ బ్రోచు నంతతో
జ్జ్వలుఁడు మహర్షి సేవితుఁడు సత్క విరాజుఁడు ముక్తిదాయియై 162

క హరి నారాయణ నిర్జర
గురుతర శోభాయమాన గోమంత మహీ
ధరమున భగవంతుఁడు హరి
సరసుఁడు సియనుఁడు మురారి శౌరి దనర్చున్ 163

తే.గీ. ఇల మహాపుణ్యము పరంబు కలుషహరము
నగు హరిద్వారమందుఁ బ్రఖ్యాతి నందు
సంతతంబు జగత్పతి సకలభక్త
జనము భక్తి నుపాసింప నంతసమున 164

సీ అలరు సితాసితంబులగు మహానది
ప్రవహంబు లిచ్చటఁ గలసియుండుఁ
బరమ పావనమునై [1]పరఁగువట్టి ప్రయాగ
మందును మాధవాద్యఖిల సురలు
పనయంబు సేవింపఁ దనరు మాధవుఁడు లో
కములకుఁ [2]దన దర్శనము వలనను
బరమపదం బిచ్చుఁ బరమాత్మ యంతఁ బ
వితంబయిన గయాక్షేత్ర మందు

---

1 మూ. ధరగు  2 మూ. దనదు దర్శనమువలన

తే.గీ. సకలలోకాధికుఁడు మహామహుండు
శర్వ[1]మతుఁడు గదాధరస్వామి గయను
లక్ష్మణాఖ్యుండు సర్వసంపత్ప్రదుండు
పావితాత్ముండు నిఖిలలోకావహుండు. 185

క. జగతిని గంగాసాగర
మగుఁ బుణ్యక్షేత్రవరమునందు నిఖిల యో
గిగణ సుపూజితుఁ డగుచున్
జగదధిపతి విష్ణుఁ డంత వనము త్రిదుఁడై 186

సీ. శ్రీకరోన్నతములై చిత్రంబులగు మహా
    శృంగంబులను బ్రకాశింపు చఖిల
పక్షమృగానేక పరికీర్ణమై వివి
    ధాటవీ శోభితంబైన చిత్ర
కూటశైలంబునఁ గోదండ దీక్షా గు
    రుండు రాముఁడు దోష్పాముండు లక్ష్మ
ణాన్వితుఁడగుచు శ్రితాభయప్రదుఁడుగా
    నహిత భయంకరుఁ డగుచు మోక్ష

తే.గీ. [2]దాతయు జగత్ప్రియుఁడు నౌచు ధన్యచిత్తు
లైన వాల్మీకిముఖులచే ననుదినంబుఁ
బూజ్యుఁడగు [3](చు) మహిజాత పుణ్యమాత
యయిన సీతను గూడి విఖ్యాత లీల 187

---

1 మూ శర్వ    2 మూ. తార    3 మూ లేదు

క. వితత జనానంద సమం
చిత వంశిగ్రామ సీమ్నిత సత్తటినిన్
గతియైన రాఘవప్పుడు
సతతము బహుభక్త మౌని సముపాసితుఁడై 168

ఆ.వె. విశ్వభావనుఁడు విశ్వ రూపియు విశ్వ
రూపుఁడైన శౌరి రూఢి గాంచి
భక్త సేవితంబు భాసురంబు నగుఁ బ్ర
భాస తీర్థమందుఁ బరగుచుండు 169

క. శ్రీకర పుణ్య సరోవర
మై కమనీయంబు నగుచు ననుమహాశ్రయమౌ
శ్రీ కూర్మంబున వర్తిల్లు
శ్రీ కూర్మాకృతి ధరుండు శ్రీధరుఁ డర్థిన్ 170

సీ. దైవర్షి యక్ష గంధర్వ కిన్నర సము
ద్యానలాళింతోత పావనంబు
నగుచు వర్తిల్లు నీలాచల క్షేత్రంబు
నందుఁ బూజ్యుండు మహామహుండు
భాసిల్లు నా బలభద్ర సుభద్రలం
తోఁ గూడి నిత్య సంతోషి యగుచుఁ
బురుషోత్తముఁడు దయాంభోధి శ్రీమంతుఁడు
పతిత పావనుఁడు సుభద్రదాయి

తే.గీ. తన్మతి సేవచేతను స్వప్రసాద
మునకుఁ బాత్రతగను జనమ్ములకు ముక్తి
నొసఁగుచు నపార దీక్షా సమున్నతాత్ముఁ
డగుచు నిస్తుల మహిమ నపాయి యగుచు. 171

తే.గీ. సింహ శార్దూల సంగతాటవీ పుణ్య
తీర్థ పరిశోభితంబుగాఁ దేజరిల్లు
సింహగిరి యందు శ్రీ నరసింహమూర్తి
యమరు నమర నికాయంబు లభినుతింప. 172

కం. అతఁ డఖిలాత్మకుఁడు నం
తతము నిఖిలలోక కర్త దైవత పరిష
న్నుత పదుఁడు శ్రీకరుం డం
చితమోక్ష ప్రదుఁడు నారసింహాత మింపున్ 173

తే.గీ. ధారుణిని దివ్యగంధ మనోరమంబు
నైన తులసీ వనంబునం దలరుచుండు
గది నమాఖ్యుండు పంకజేక్షణుఁడు శౌరి
యవ్యయాత్ముండు భగవంతుఁ డచ్యుతుండు 174

కం. క్షితిని మహా పుణ్యంబగుఁ
గృత శౌచమునందు నిందిరేశుఁడు హరి దై
వతనుతుఁడు పాపహరుఁడన
స్మృతుఁడగు లోకంబునందు ప్రకటన కతిచేన్ 175

చ. అనవరతంబు [1]స్తోత్రగిరి యందు వసించు నృసింహమూర్తి పెం
పొనవు మనంబు గైకొని గుడోదక పానముఁ జేయుచున్ ముదం
బునను సమస్త మర్త్యులకు భుక్తియు ముక్తియు నిచ్చుచున్ దన
ర్చును బుధవంద్యమాన పరిపూర్ణదయాంబుధి యగుచుందై యటన్

తే.గీ. పారమార్థ్య మహాక్షేత్ర వాసియగుచు
భక్త జనముల కెల్ల శుభం బొసంగు
నఖిల లోకైక కర్త రమాధినాథుఁ
డమరవంద్యుఁడు సాక్షినారాయణుండు 177

క. శ్రీ గోదావరి తటమున
శ్రీ గాంచిన ధర్మపురిని స్థిరతరలీలన్
యోగానంద నృసింహం
డాగమవేద్యుండు దనరు నార్తిభంగిత్రై 178

తే.గీ. దివ్యమగు కృష్ణవేణి నదీ తటమున
నుండు శ్రీకాకుళంబున నంధ్రనాయ
కుండు దనుఁగొల్చు వారలకును ముదమున
భుక్తిముక్తుల గూర్చు సంపూర్ణమతిని 179

ఆ.వె. గారుడాద్రి సంజ్ఞ గల్గిన హోబిల
మున హిరణ్యకశిపుఁ బొలియఁ జేసి
నట్టి శ్రీ నృసింహుఁ డత్యుగ్రతర రూపు
డమరుఁ బరమపావనాహ్వయుండు 180

1 మంగళగిరి

సీ. అమర చిత్తచకోర సముదయమ్ములకుఁ బ్రే
మము గూర్చు మంజుచంద్రమండలంబు
కరుణారస మరందధుర భారమ్ముగఁ
దనరారు నేత్రపద్మద్వయంబు
భక్తచయాశాంత పరిపూర్తి సల్పు న
నల్పంబగు బాహుకల్పలతలు
భరత సౌమిత్రి భాసుర విలోచనలకు
బాళితర సంపదంఘ్రి యుగము

తే.గీ. సమద లోకైక కర్త త్రైలోక్యధినాథ
రావణ క్రోధిహర్త సీతావధూమ
నోంబుజాకర భాస్కరు[1]ండనుమ దనర్చు
రామవందితుఁ డుదయాద్రి రాఘవుండు 181

చ. జాలకవాది విద్వదుల నన్నుతిఁ జేయఁ దనర్చు పాదముల్
గలిగి పవిత్ర నీరము జెలంగిన భీమరథీనది తటి
న్నెలకొని పుండరీకుని వినిర్మలఁ గొల్చిన పాండురంగ వి
ఠ్ఠలపతి సత్యమూర్తి ప్రకటప్రతిభాకృతిఁ గొల్తు నిచ్చలున్ 182

సీ. బహంతర భగరుచావహ మహోభూమ క
రంబు కుసుంగ భూతాంబరంబు
భక్తి మకరంపత్రికాభ్రమ [2]దూర్ధ్వ ప్ర
సారితగారుత్మ తోయజంబు

---

1 మూ. యదు
2 మ. దోర్ధ్వ

గగన సంగత తారకా నికాయాయిత
ఫల మహీరుహసంతాన ప్రాంతము
కలహంససారస కారండవముఖ వి
హంగ విహారపద్మాకరంబు

తే. గీ. శక్తిప్రాప్తి భరద్వాజ[1] గౌతమభృగు
కౌశిక వసిష్ఠ సిద్ధ ప్రకాశితంబు
దివ్య తీర్థ ప్రతాన దేదీప్యమాన
పుణ్య నికరంబు వేంకట భూధరంబు. ౧౮౩

తే. గీ. పరమ నష్టోత్తర సహస్ర పుణ్యతీర్థ
సంగతమ్మగు నమ్మహాశైలసీమ
నెలయుదాస్వామిపుష్కరిణీ తటమున
వెలయు లక్ష్మీసమాన్వితుం డచ్యుతుండు ౧౮౪

ఆ. వె. ఘనతరం బనంత కల్యాణ గుణపతి
పూర్ణ కంసారార్ధి పుణ్యమూర్తి
శౌరి సదా వికట పురుషుల కెప్పు డిమ్ము
లం దొసంగ గళీష్ట దాయి యగుచు ౧౮౫

మ. సరసీ నాథుఁడు శ్రీనివాసుఁడు మహోత్సాహుండు బృందారకో
త్కర సంస్తుత్య పదారవిందుఁడు కళాకారుండు శ్రీశేషభూ
ధర సంచారుఁడు వేంకటేశ్వరుఁడు సత్ప్రహాణోపేతుఁడై
సరసీజాలయలోచఁ ప్రీతి గాని తద్వాంఛయింటనం దుండు నా ౧౮౬

1 మూ. గౌతమాది కౌశిక భృగుప్రసిద్ధ

వ. అని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణో
త్తర ఖండంబు నందలి సప్తవింశాధ్యాయంబు భక్తపరాయణులగు
నారాయణులకు సనకునకుం జెప్పి వెండియు నిట్లనియె 187

క. వసుధాతలిని కరుణా రస
మున నార్ద్రమైన హృదయమున్ గల్గి యశో
ధనుఁడైన భట్టనాథుఁడు
తనయుని వినయగుణాఢ్యుని గాంచె మహిమన్ 188

క. తనయుఁడు యాదవశైలం
బున శిష్యుఁడైన యట్టి పురుషోత్తముఁడుం
డును నారాయణుఁ డను సం
జ్ఞ నంది సంతతము భక్తసముపాసకుఁడై 189

క. మరిచాచలంబున నృహరి
మరితా మాత్రంబు సేవఁ గైకొని భక్తో
త్కట మతులగు మానవులకు
పరమ నొసఁగు ముక్తి భక్తవత్సలుఁ డగుచున్ 190

సీ. పుణ్యంబు నతిరమ్యమును నగు వేగవ
తి మహానిర్ఝరి [1] తీరమందు
వెలయు యోగీంద్ర సేవితమగు శ్రీహస్తి
ధరణీధర శిఖరాంతరమునందు

---

1 మూ॥ తటము

భగవంతుఁ డచ్యుతుండు భక్తమందారుండు
ధన్యుండు శ్రిత వర దాయకుండు
కరుణాసముద్రుండు కంజాత నేత్రుండు
దివ్య స్వరూపుండు దేవరాజు

తే.గీ. సకల లోకేశ్వరుఁడు ప్రణతార్తి హరుఁడు
వార్ధిజా సహితుఁడు భక్తవత్సలుండు
వరదుఁడు పరేశ్వరుఁ డవ్యయుఁ డతి విశేష
యలర మోక్షప్రదుండు నారాయణుండు 101

తే.గీ. దివ్యమగు నప్పురమునందుఁ దేజరిల్లఁ
గమలలోచనుఁ డవ్యయుఁ డమరనుతుఁడు
భక్త పరిపాలకుండు యథోక్తకారి
హరి ఫణీంద్ర శయానుఁ డనంతమూర్తి 102

వ. ఇట్లు పరమేశ పురాత్రయందును కాంచనపురాలయ నృసింహుండును
త్రివిక్రముండును ప్రకాశవర్తుండగు దీపప్రకాశస్వామియు వెండియు
నష్టభుజసంస్థితుండును నగు వీర లందుఁ దనరుదు రని యొప్పినయ 103

క. ప్రస్తుతమగు శ్రీగృధ్ర న
గ స్థిరమునందు విజయ రాఘవుఁ డుండున్
నిస్తులతర విగ్రహుఁడు స
మస్త జనార్చిత పదాబ్జుఁడగుచు నిరతమున్ 104

సీ. భువిని మహాపుణ్యమును గాంచి హోత్రాత్ర
మాంతరంబుగ నలరారి విమల
మైన పీఠరత్న మందలి హృత్తాప
నాశన కాసార నవ్యతటిని
రహిఁదనర్చును వీరరామస్వామి లో
కైక శరణ్యుఁ డస్తోక మూర్తి
యఖిల లక్షణలక్షితాత్ముఁడు సంతత
దైవత వినుతాంఘ్రి తామరసుఁడు

తే.గీ. భక్తమందారుఁ డాశ్రితవత్సలుండు
ధర్మ సంధాయకుఁడు ముక్తిదాయకుండు
విపులలాభుండు సుందర విగ్రహుండు
సారస దళాక్షుఁ డార్తిరక్షా చణుండు 195

క. ప్రోతాద్రియందు వ
ఖ్యాత స్థితిఁ దంగరయనుఁ దను పేర జగ
న్నేత యగు వాసుదేవుఁడు
భూతలమున నఖిల భక్త పోషకుఁ డగుచున్ 196

క. ఘనతరమైన గణ స్థల
మునను గతాత్రిప్న సంఘ బొలుపొందు సదా
మునివు సంపూజితుఁడై
యనుపమ కరుణామృతాబ్ధి యగుచు హరియుఁగాన్ 197

క. ధరణిఁ బవిత్రంబగు బలి
పురమందు మహాబలుండు పొలుచు సమస్తా
మరపూజిత విగ్రహుఁడై
సరస భవప్రచయ ముక్తి సంధాయకుఁడై 198

తే.గీ. భక్తిసార మహాక్షేత్ర వాసియగు భ
ద్రార్ద్రనుండు జగత్పతి యచ్యుతుండు
సజ్జన నుతుండు దేవతా చక్రవర్తి
యాశ్రిత పరాయణుండు నారాయణుండు 199

క. ఇంద్ర క్షేత్రంబున మ
హేంద్ర ప్రముఖామరులు రహిం బూజింపన్
సాంద్రదయావంతుఁడు నిఖిల ని
స్తంద్ర కలుషహారి దైవతప్రభుఁ డలరున్ 200

క. వ్యాపిత మూర్తి మహాత్ముఁడు
గోపపురమునందుఁ దనరు గోప పతి సుర
ప్రాపకుఁడు ముక్తిదాయకుఁ
డాపద్విచ్ఛేదకుఁడు కృపాంబుధి యగుచున్ 201

క. శ్రీమంతంబై సద్వృతి
నామోదంబై మహత్త్వమై వెలసెడు నా
శ్రీముష్ణంబున శౌరి మ
హామహుఁడు వరాహరూపమై విలసిల్లున్ 202

క. విమలతరంబగు మహితా
ద్య మహా స్థానమునందు నలరారు మహో
ద్యమ మూర్తి పద్మలోచను
డమర ముని ప్రముఖ వందితాంఘ్రి యుగళుండై 203

సీ. ఆ వని కవేరకన్యా మహనీయ మ
ధ్యద్వీపమున సముదార మగుచు
శ్రీరంగ మను పేరఁ జెన్నొందు క్షేత్రంబు
క్షేత్రోత్తమంబు లక్ష్మీకరంబు
పరమ పావనము భాసుర పుణ్య మహితో
త్కర మంగళము నపూర్వ మగుట
నందు పవిత్ర ప్రణవాకారమును రత్న
మయమును గల్మషక్షయమును వధిక

తే.గీ. రమ్యమును వేద శృంగార ¹రాజితంబు
నవ్యయము నున్నతంబును నగు విమాన
మధ్యమున దనరెడు భుజంగమ పరాంగ
తల్పమధ్యమునందు సుఖాప్తి యగుచు 204

క. కామిత ఫలప్రదుఁడు హరి
శ్రీమంతుం డభిలోక చింతామణి శ్రీ
భూమి నీళా సహితుం
డై మహిత సుఖాప్తినుండు నతిశయలీలన్ 205

1 మూ. విరాజి

క. కరుణారసపూర్ణాంబుధి
పరమాత్ముఁడు విభుఁడు రంగపత్త్ర శ్రీపవనా
కరుఁ డరవింద దళాక్షుఁడు
హరుఁ డతఁ డిక్ష్వాకు వరదుఁ డచ్యుతుఁ డంతన్ 206

తే.గీ. అతఁడు సాక్షాత్పరబ్రహ్మ మఖిల భువన
నాథుఁడు పరాత్పరుండు సనాతనుండు
యోగి యోగి దృగాంచనం బాగమాంత
వాసి దీనావనహారి రుద్రూపధారి 207

క. అతఁడె పరబ్రహ్మం బా
క్షితియె పరమపదము దీప్తిఁ జెలంగెడు [1]వింటా
కృతిగా నారావెయియు
సతతం బంగారుఁ గల్గున విద్యాసిగాన్ 208

తే.గీ. అవని మోక్షార్థి సుశ్రువు నైనవాఁడు
చిరము వైకుంఠ[2]మనఁదగు సరణి ధరణి
నిమ్మహాక్షేత్రమున వసియింప వలయు
భక్తి పరిపూరితాత్ముఁ డావ్వఁ డగుచు 209

క. శ్రీమంతంబుది దివ్యము
నై మను వరపట్టణంబు నమ్మహారుఁడు సి
తా మహితా రమణుండు ద
యా మూర్తి స్మరింపఁదగు సుధాంశునుతుఁడై 210

---

1 ము. వివిా
2 మా. మన్దగు

తే.గీ. సవ్యతరమగు నాశాళ నగర మందు
నధివసించు నధోక్షజుం డచ్యుతుండు
సుర్పురావర్తకీ క్షేత్ర మొందు శౌరి
విశ్వమయుఁడు మహాత్ముండు శాశ్వతుండు 216

తే.గీ. దివ్యతరమగు మణికోటి తీర్థమునఁ ద
నర్చ్యుడు మహాప్రభుండు సనాతనుండు
విప్రవరయుగఁ దృష్టాత్మ వెలయు పురిని
నలరు శౌరి మహాశ్రేష్ఠఁ డనెడు పేర 217

క. విమలంబగు విష్ణుస్థా
నమునందుఁ దవర్చు నయ్యనంతుఁడు హరి వి
శ్వమయుండు భక్తవరదుఁ డు
కమలాసన వినుత పాదకమల యుగళంబై 218

క. అనుపమమగు విష్ణుపదం
బున వర్తిలు నచ్యుతుండు పురుహూతసుతుం
డనఘుఁడు లక్ష్మీ దారా
యణుఁడను విఖ్యాతి గాంచి యతులిత లీలన్ 219

క. నలువగు శ్వేత ద్వీపమున
నలరారును శాంతమూర్తి యని జనులను వి
ఖ్యాతి హరి సురప్రియుఁడుగాఁ
బలుకంబడ నగ్నిహోత్ర పద్ధతి నీమన్ 220

క. ఘనమగు భర్గస్థానం
బన భార్గవ సంజ్ఞఁ దగుచుఁ బద్మాక్షకులా
ళనులు భజియింపఁ దనరును
వనజాక్షుఁడు శౌరి భక్తవత్సలం మతియై 221

తే.గీ. స్థిరను వైకుంఠమును మహాక్షేత్రసీమ
బధులచే మాధవుఁడు హరి పూజ్యుఁ దగుచు
నుండు గరిమంబునగు పురుషోత్తమమున
శ్రీకరుఁడు భక్తసఖుఁడు భాసిల్లు నెపుడు 222

తే.గీ. చక్రతీర్థమునందు సుర్భాహంబుఁ
దనరును జనార్దనుండు సుదర్శనాఖ్యఁ
దగుచు భక్తజనంబు కరుణకరువు
పగిది కైవల్య దాయకై జగతియందు 223

చ. విమలము కల్మషాపహము విశ్రుత పుణ్యమునైన కుంభకో
ణమునఁ దనర్చు వత్సుతఁ దనారతుఁ డాద్యుఁడు చక్రపాణి నా
మమున ధరాతలంబున సమస్త శరీరుల కెప్పు మోక్ష ము
న్నమిత ఫలింపుచున్ భవనుతస్వపదాంబుజాతసేవ నిచ్చలున్ 224

క. భూరి కుంభమై తనరెడు
భూరి స్థానమున శార్ఙ్గి పొలుపొందు దయా
హితుఁడు ప్రభు పద్మాక్షుఁడు
పోతుల హంబుండు భక్తపోషకుఁ డగుచున్ 225

క. సుజన స్తవనీయంబై
వృజినహరంబైన యాకపిక్షేత్రము నం
దజనుతుఁడు గజార్తిఘ్నుఁడు
త్రిజగన్నాయకుఁడు దనరు దివిజస్తుతుఁడై 226

తే.గీ. చిత్రకూటం బనఁగ వాసించు శౌరి
వెలయు ననవరతంబు గోవింద సంజ్ఞఁ
దగుచు భక్తయోగిధ్యేయుఁ డగుచు సకల
జంతు ముక్తి ప్రదు[1]ండౌచు సంతసమున 227

తే.గీ. పొలుచు నుత్తమ యనుక్షేత్రమున వసించు
నుత్తమాహ్వయుఁడై పురుషోత్తముఁడు మ
హానుభావుండు విష్ణుం డనంతశయనుఁ
డవ్యయుఁడు ముక్తిదాయకుఁ డచ్యుతుండు 228

క. ఖ్యాతి విచిత్ర పురమగు
శ్వేతాచలసీమయందుఁ దనర్చెందు శుభా
న్వితుండు పద్మలోచనుఁ
దారత శుభదాయి పోషితామరతతియై 229

సీ. పాద స్థలమునందుఁ బరఁగు హృషీకేశుఁ
డేయెడఁ గైవల్యదాయి యగుచు
భక్తులచేఁ బరబ్రహ్మమనుచుఁ గొని
యాడంగఁ బడియె సుదారరల

---

1 మూ. దగుచు

గురులరంభాగు ట్పష్టకోటియందలి మధు
వైరిభక్తుని పేరులచేతఁ
పూజింపఁబడు నందపురమునఁ దగు మహా
నందుండు పరమానందమూర్తి

తే.గీ. బ్రహ్మముఖ్యార్చితుండుగాఁ బ్రబలుచుండు
వృద్ధపురియందు విలసిల్లు విష్ణుదేవుఁ
డచ్యుతుఁడు భగవంతుఁ డింపారుఁ దా ప్ర
శాస్త్ర[1](మా)ఖ్యఁ దగుచుఁ గరుణాబ్ధి యగుచు ౨౮౦

తే.గీ. కవఁగ నుత్తమ సంగమ గ్రామసీమ
నంత నారాయణుఁడు సంగమాభిధానుఁ
డగుచు భక్తులచేఁ గొనియాడఁబడియెఁ
దత్త్వకోవిదనికరమందారుఁ డగుచు ౨౮౧

క. క్షమ నుత్తమ శరణ్యగ్రా
మమునందలి యచ్యుతుఁడు రమానాథుఁడు దై
వమునీంద్ర సేవితుఁడు హరి
రమణీయాంగుండుఁ దగు శరణ్యాఖ్యుండై ౨౮౨

క. పౌరి సిద్ధసేవితంబై
స్థిరసంపద గళ్ళావట్టి సింహక్షేత్ర
స్థిరయందు మహాసింహుఁడు
పరఁగు సురజనవంద్యమాన పదపంకజుఁడై ౨౮౩

---

1 మూ లేదు

క. పంచ పవిత్రము శ్రీమ
ద్వర గుణ సుక్షేత్ర సీమఁ దనరుచు హరి శ్రీ
కర గుణుఁడు నాథ సంజ్ఞుఁడు
పరమాత్ముఁడు నిత్య భక్త పరిసేవ్యుండై 239

క. కురు కాఖ్యం బనగ మహా
పురియందు రమా సఖుండు పొలుపొందు సదా
దురితాటవి పవన సఖుఁడు
పరిపోషిత శరణుఖుండు భక్త సుముఖుఁడై 240

క. శ్రేష్ఠ తరంబై తగు నా
గోష్ఠీపురమందు వెలయు గురుతన మతుఁడై
గోష్ఠీపతి ముని హృదయా
ధిష్ఠితుఁడు సువర్ణ గణ మతి పద్మాంకుండై 241

సీ. అవయంబు పావనంబగు ధర్మ యనంబు
నందు రామప్పుఁడు శయనమునఁ దనరు
ధన్వి మంగళశర స్థలాన్వితుఁడగు శౌరి
పద్మ నేత్రుఁడు జగత్పతి దనర్చు
నమర కైమంతంబు నగు శ్రమర స్థలి
బ్రహ్ముఁడు బలాఢ్యుండు పరిఢవిల్లు
నల లోకమంగళంబగు కురంగమునందుఁ
బూర్ణేందు వదనుండు పూర్ణుఁ డొప్పు

మ ఇతర సర్పాకృతి విష్ణుభక్తులు స్రగ్గంధాంబరాలంక్రియల్
దరియింపంగఁ దదర్చితాన్నము భుజింపంగల్గుఁ బుణ్యాత్మకుల్
దురతిక్రాంతమునైన మాయ నెఱిమిం దోఁత్రోన నిర్జించి త
త్పరమస్థానము యోగిదుర్లభ మొగిన్ ప్రాపింతు రత్యంతమున్ 245

క ఏయే స్థానంబులను ను
ధాయతి సర్పాకృతులను దర్శించఁగ నౌ
నా యా స్థానమె పరమం
బై యొప్పును సతతె పరము నగు విష్ణుఁ డగున్ 246

తే.గీ. అరయ సర్ప స్వరూపియై యలరు హరికి
బరమధామా విరక్తై పంగు హరికి
నూనతాధిక్యభేద మింతైన లేదు
వరల సిద్ధాద్రి నల్లాలవేద్రి పుత్రి 247

మ సులభత్వ స్థరి మోక్షదున్ సెలల చతుర్గమ్య సర్పాకృతిం
గల విష్ణున్ విభు నెవ్వఁడే నిలఁ దిరస్కారంబు గావించు వాఁ
డల ధర్మంబును సర్వమున్ మఱియుఁ గామాదుల్ దగం బొందకన్
ధిం వృత్తిన్ నరకంబు నొందు నిది విఖ్యాతంబు లోకంబునన్

వ కావున సర్ప స్వరూపియును వాత్సల్యకారియునగు హరికి నొనర్చిన
కైంకర్యంబు సద్యోమోక్ష ఫలసాధనంబని [1]దుస్తరంబగు సంసారసాగ
రంబు లను దరియింప నిచ్ఛయించు బుధులు సర్ప స్వరూపియగు హరి
నర్చింతురు దౌర్బిక్షిత్ నాథికుండును మహాత్ముండును విశ్వసృష్టి

---

1 మూ. దుస్తరంబగు

కరుండును దత్పుత్రుండును నగు బ్రహ్మదేవుండును సర్వ విగ్రహ
సమర్చనంబు సుందరంబగు మోక్షసాధనం బని యుపదేశించిన శ్రీరంగేశ్వరుం
త్రికాలంబునం బూజించు కేశవుండును నటులం బను గాయుండు గిరీశా
వహాండగు మాధవ దేవున్ గంధ పుష్ప ధూప దీప నివేదనాద్యుపచార
విధుల సత్కృతుండుగాఁ బూజించు మహేంద్రుండును నైర్మల్యంబును
స్థలంబున శిలాస్ఫురి యును పెరుగుండెను వని నిలిపి సంప్రీతిఁ
బూజించి యంతటఁ బ్రతిష్ఠాపంబునకుం జను మాయయును సనకాదులగు
యోగీశ్వరులును నారదాదు[1]లగు దేవర్షులును వసిష్ఠాదులగు బ్రహ్మర్షులును
బ్రహ్మవాదులగు భూసురులును నందఱు భరతఖండంబునందు ఎల్ల
కాలంబులందును సర్వోపాసకులగు వారిని నిరంతరం బను త్రికాలంబుల
నారాధింతురు నీవును నిత్యంబును సర్వ విగ్రహరూపియగు నద్వైతదేవు
నానావిధంబులగు గంధ కుసుమ తులసీ నైవేద్యాదుల బూజింపు మని
పలికె నీ దివ్యంబగు సర్వాస్థానంబుల నెవ్వరేనియు నవహితంబు
వాక్కులం బఠియింతురు శ్రోత్రంబుల శ్రవణంబు గావింతురు మనంబున
స్మరియింతు రట్టి పుణ్యాత్ములు నితరదుర్లభంబగు విష్ణుదేవు పరమ
పదంబుఁ బ్రాపింతురని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును
నగు భార్గవ పురాణోత్తమం బందంబు నందలి షష్టవింశాధ్యాయంబు భక్త
పరాయణుండగు నారాయణుండు (సదుపకృతం) చెప్పెను 249

మ. పరతత్త్వార్థ పరిష్కృయాభిరతి సంతర్పణ్య భూమండలే
శ్వరు సద్వైష్ణవతా విధాయి కరుణాంచద్భక్తపాదార్క సో
దర లీలా చిదచిద్విశిష్ట మతసిద్ధాంత స్ఫురద్ధర్పణాం
తర విద్యోతిత విష్ణు విగ్రహ సమర్చాపరానుగ్రహా 250

---

1 మూ. లను

౬ చేడి న్నవ తారాంతర
గోదావిరుక్త ముక్త కుసుమ సముదయ
శ్రీ దామ సమాలంకృతి
పాదాన్వితహృదయ భక్తముక్తికరదయా 251

తోటకం శరణాగత సాదర చక్రకరా
కరుణారస సాగర కంసహరా
చరణార్జ సముద్ధరశైలధరా
కురునాథభయాకర గోపవరా 252

గద్య [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య ధుర్యానవరతావధానదక్షాయిత సామ్రాజ్య ధౌరేయ స్వసమర్థ తాకృత పటహ ధణంధణారావ విపరీత పతనదిల్లిజాధీశ దుంద భిధ్వాన కోలాహల హయామధ్వజాంక కనకదండికృత హింకణీ ఘాత సందీపిత ప్రతాప కీర్తి ప్రభావ కోసలవంశపయః పారావార రాకాసుధాకర పీతాంబరనాయక పౌత్ర తిమ్మనాయకాంక పుత్ర లక్ష్మమాంబా గర్భ శుక్తి ముక్తాఫల రాఘవ భూ నాయకాభిధాన సౌందర్య జిత సుమబాణ సహిత పెమనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు విష్ణుచిత్తు జననంబును నతం దారామ రక్షణంబు సంతేసి స్వామికిఁ బుష్పమాలికా కైంకర్యంబు సేయుటయును విష్ణు చిత్తులకుఁ దులసీవనమందు భూదేవి గోదా స్వరూపంబునఁ గన్యకయై ప్రాదుర్భవించి ప్రసన్నయగుటయు నతండు గృహంబునకుం గొని చని యా కన్యకను భార్యాసహితుండై పోషించుటయును నా యమ రంగస్వామియందుఁ బ్రేమం జేసి యర్చాస్వరూపంబు లడిగిన నతండు సకల క్షేత్రంబులయందు నెలకొన్న విష్ణు నామంబులను దివ్యమాహా త్మ్యంబును జెప్పుటయును నను కథలుం గల షష్ఠాశ్వాసంబు సంపూర్ణము

---

1 మూ ఇతి

ఆ.వె. చిత్రమందు నిలచి చింతనంబు దొలంగి
యమ్ముల ప్రియయు లనుచు దివ్య
...ల నా ప్రబంధములచేత శౌరిని
సంస్మరింపుచుండెఁ జంద్రవదన 6

సీ. అఖిలంబులైన యర్చావతారంబులు
శ్రీమంతములుగ భాసిల్లునట్టి
యాధార రంగనాథాకారమేయము గ
టంచుఁ దలంచి యాహ్లాదవృత్తి
నా రంగభర్తయే యాత్మభర్త యటంచుఁ
దలచుచు నెనేఁ దత్పరతను
రంగనాయకు నంతరంగంబునను జేర్చి
యెంతయుఁ దచ్చింత నేమఱకయుఁ

తే.గీ. దన్మయస్ఫూర్తి నాతి గోదావధూటి
సకల శృంగారరస పేటి సత్కుమేటి
యతను శరకోటి ఖరకోటి గతిని పాటి
రాఁ యమాటోటి దగుచు మోహంబు కోటి 8

సీ. సప్తసెలాంతర స్థానంబు గనుఁగొన్న
శ్రీరంగగృహమంచుఁ జిత్తమందుఁ
దిగు హంసతూలికా తల్పంబు గనుఁగొన్న
శేషశయ్య యటంచు బుద్ధి నుంచు
పూల వితానముల్ పద్మశ్రీలఁ గనుఁగొన్న
నాభిపద్మ మటంచు నలువుగాంచుఁ
గుసుమరాగ పరాగ విసరముల్ గనుఁగొన్న
హేమాంబర మటంచుఁ బ్రేమఁ జెందు

తే. గీ. వారి యా రీతి శ్రీరంగనాథు రావ
సంపదం రీతి వినియున్కిఁ జాలఁ బ్రీతిఁ
జాదినట్టయి తోఁచు నా సూచనలకుఁ
గలఁతఁ జెందును నిజముగాఁ గాకయున్న 7

వ. మఱియును 8

సీ. వలపుచే హరిమీఁది తలఁపుచే దనతోడి
చెలులతో నాడదు కలికికంటి
రాగిచే మదిలోని జాలిచేఁ బెంపుడు
రాచిల్కఁ బిలువదు రాజవదన
భ్రాంతిచే మోహవిభ్రాంతిచేఁ గెరలాడు
హంసలఁ గూడదు హంసయాన
కూర్మిచేఁ దాపంబు పేర్మిచే సరస స
ల్లాపముల్ సేయదు లాలితాంగి

తే. గీ. యంతరంగ తరంగితాత్యంత రంగ
రమణ సాంగత్య వాంఛాపరంపరలను
దనరుఁ జెలువంపు దీవి నెత్తావిక్రోవి
యైన గోదామహాదేవి యఱసరివి 9

క. పలుకదు పిలిచినఁ దన దయఁ
జిలుకయు చెలిమీఁద వింతసింగారమ్మున్

తే॥ కువలయాంగణఁ గువలయగురు నికంబుఁ
గువలయేక్షణ గోడి సద్గుణ వినోద
వాదరించెదఁ గరమొల సేదఁ దేర్చి
నే ననెడు రీతిఁ గువలయహితుఁడు దోఁచె 14

క॥ అంతట విమల గవేదన
నెంతయుఁ బరితాపమందు నింతిని సకియల్
గాంత లతాంత వితాంత వ
వాంతమునకుఁ దోడుకొని రయంబున నరుగన్ 15

చ॥ మరునికి నంతకాంతిక సమాహరి గంధవహోత్కరంబు నం
చరునికి నవ్వనస్థలి నెసంగుచు పెంపుల నేఁచునట్టి పె
మరునికి నెంతయేన్ గుముద మార్గముఁ దెంపు ఘటింపు వా నిశా
చరునికి భీతిఁ జెంది సతి సందియ మందగఁ గాంచి యంతటన్ 16

మ॥ విమలోద్యాన వనంబుఁ జేరి సఖితోఁ దెంపొందఁగా నాడు త
త్కమలాస్యల్ చెలి మోహముం దెలిసి యాకంబార నేత్రున్ మహో
ద్యము నారాయణు రంగభర్తను సముద్యల్లీల దివ్యప్రభం
ధములం బాడిరి తచ్చరిత్రములు చిత్రస్ఫూర్తి వేద్యంబుగన్ 17

క॥ శ్రీరంగవరుఁడు రక్షిత
సారంగ వరుండు ప్రోచు సంగతి నిన్నో
సారంగ నయన మది చే
సారంగను వందలందు సదయుండు సుమీ 18

సీ. ప్రేమచె మను సత్యభామకు వశుఁడయి
    ధరణిని బారిజాతంబు తేఁడె
మత్స్యయంత్రము నేసి మహిపాలుర జయించి
    లక్షణఁ దేఁడె సులక్షణముగఁ
గాళిందితటియందుఁ గమలాప్తనందనఁ
    గాంచి మోహింపఁ గాంచ యుండఁడె
పుంగవావలి నృపపుంగవావలిఁ దోలి
    యం సుదంతను వివాహంబు గాఁడె

తే.గీ. పరఁగ రాధిక చెప్పిన పనులు చేసి
యొసఁగ మే నత్త మేనత్త సేయఁకొండె
వారి కిటు లోఁబడైనట్టి వాఁడు నేఁడు
రామ వరియింపఁడే నిన్ను రంగశాయి ౨౨

క. ఉల్లాలుగ నేఁడె మో
హోల్లాసం బెసఁగ సముచితోత్తుం జేరన్
ఫుల్లసలిం గుసుమశరుని
భల్లగతిన్ బెంయు దానిఁ బ్రార్థనతోరన్ ౨౩

చ. అలయుల విల్తుఁ డెంతటి సమర్థుఁడు చందురుఁ డెంతవాఁడు మి
క్కిలి చలిగాలి యెంతటిది కేపంమున్ రొదసేయుఁ దింక గుం
పుల యలమొంత పేర్కుఁ బరిపూర్ణ మనస్థితిఁ జేసి నిన్ను నీ
యలరుచు లోదనుండు సరసస్థితి భామినిఁ గాఁగ నెంచినన్ ౨౪

ఉ అమ్మహితాత్ము సుందరుం డాతని వైభవ మా ప్రభావమున్
సమ్మతిఁ జేసి యె పురుష నంతటికైనను గన్గఁదా మమం
దిమ్మహి నిన్ను భామినిగ నేలిన ఏదు పురాకృతైక పు
ణ్యమ్ము గణింప శక్యమె సమస్త జగంబులయందు సుందరీ 25

క తరుణీ పురుషులలోపల
సరసిరుహాక్షుండు రుచిరసౌఖ్యం బగుటన్
వరియింపఁగ నాతండు నినుఁ
బరిణయమం గనుట కన్న భాగ్యము గలదే 26

ఉ చక్కనివాఁడు సర్వగుణసంఘములోపలఁ దారుణార్తిఁ జెం
పెక్కనవాఁడు నా ఘనుఁ దహీనమతిన్ విరహార్తిఁ జేసినన్
మక్కువతోడుతన్ దనరు మానినిగాఁగ వరించినప్పుడే
చక్కఁదనమ్ము నీ సుకృత సౌఖ్యము నెన్నఁగ శక్యమౌనటే 27

క ఈ మహిలో రంగేశుం
బ్రేమముతో భర్తగాఁగఁ జేకొని యుంటన్
యామని నెఱఁగుదు మో క
న్యా మాతోఁ జెప్పరాదె యవ్విధి చేర్కన్ 28

## గోదాదేవి రంగనాథుని నిందాపూర్వకముగా స్తుతించుట

మ అని రంగేశ్వరు దివ్యమంగళ చరిత్రానేకముల్ చెప్పినన్
విని గోదాంగన యంతరంగమున నానిర్వార సమ్మోద య
యుక్తిని నిందాస్తుతి పూర్వకంబుగను మోహోద్రేకయై రంగరా
ట్పుని నానా గుణముల్ సఖుల్ వినఁగ నెంతో వింతగా నిట్లనెన్ 29

క రంగేశు చర్యలను మీ
రింగిత గతి నెన్నెదరు సఖి(?) చినముగా
సంగనం దాఘనుం దే
సంగతి రక్షించినాఁడు రామముఖులారా 80

చ రహి వనవాయమైన తపరాము రమామణి న్ విరోహితా
సహగతిచే విజంరపురి వంచనఁ జేయఁడె యప్పుడాని మీ
రహరహ మీ ప్రబంధముల నద్భుత లీల నన్నుతింపఁగా
విహితము వందితాత్మకులఁ జేర్చిన వారల నేమనం దగున్ 81

మ హరచాపంబు హరించి సీతను వశఖ్యాతన్ గుణోపేత సు
స్థిర యత్నంబున నెండ్లి యాడి వనదాద్రి భాగసంచార వి
స్ఫురణం బాపెడుఁ గూర్చినట్టి కఠిన స్ఫూర్తిన్ విదంబించు నా
హరి మీ రంగదము సుందరీ సదయుఁగా నారన్ రహిన్ బాడియె 82

క ఆ రుక్మిణీ సతీమణిఁ
గేరదముల వల్కి వెరలఁ గిరించిన యా
వారిజలోచను ప్రైభరి
గారుడ చర్యాప్తి గాదె కామినులారా 83

సీ బాల్యమున నాఁడ తోలత్వమును మించ
    నాఁడు వాటికిఁ గొంత మరల గోరిపి
చిత్ర వస్త్ర హార విచిత్ర రత్నాంబర
    సైకరంబుఁ దాలఁ బట్టు చేసి

చ. సరసిజగంధి మన్మథవిషాదము పొత్తున మించి సోఁకినన్
విరహ తపస్సమాధిఁ గొని విశ్రాంత కీర్తి ధురంధరున్ మహో
త్కర మతి యైన రంగవిభుఁ దన్ముఖయోగ్యుఁ దన నాథుఁగాఁగ వే
మఱుఁ దలపోయుచుండెను సమస్తము విడి యవేరవృత్తిగాన్ 64

మ. వనమాలంబులయందు మోపి సెలువం బొప్పారెన్ దాఁటి యుంతార ని
స్వనముల్ వీనుఁ జొచ్చి కుట్టుకురుఁ బ్రదీప్తం బాది కన్నీరు వె
ల్లి నిజక్రొత్తవు తాపమున్ దొరఁగి మేల్కొన్ నిందుకోఁ బ్రాణ సేఁ
వున నిల్చెన్ సతి తద్భ్రమం బాదవ సంపూర్ణైక మోహ స్థితిన్ 65

## విష్ణుచిత్తుఁడు రంగనాథునికి గోదాదేవిస్థితిఁ దెలుప శ్రీరంగమున కరుగుట

క. అంతటఁ గాంత లతాంత శ
రాంతర హృత మానసయై మహాంతపు మదిలో
వెంతయుఁ గోరిన దని విని
చింతిలి యవ్వేళ విష్ణుచిత్తుఁడు మదిలోన్ 66

సీ. శృంగారమున కిరవు దలఁచు లక్ష్మీదేవి
వక్షంబునం జేర్చి మనుచువాఁడు
రసమునఁ దగు భూమి రత్నగర్భాదేవి
పిఁడుపు తరియించి వెలయువాఁడు
లీలాసుగుణపేటి నీలావధూటిని
వంకవరి ఘటించి యేలువాఁడు
మోహించు దేవకాంతాజనమ్ము లింఁ బుట్టు
వారితోఁ గూడ నింపారువాఁడు

సీ. శ్రీరంగపురి కంఠహార లీలఁ దనర్చు
నుభయకావేరికాభ్యుదయ మెంచి
రంగభర్తకు విహార వనంబునాఁ దగు
మహనీయ కణ్వాశ్రమంబు గాంచి
కలుష హరంబులై కావేరిలో నుండు
దశ మహా పుణ్య తీర్థములఁ జూచి
శ్రీ నిధానంబు విమాన సంజ్ఞకమైన
యా క్షేత్రమునకుఁ బ్రదక్షిణించి

తే.గీ. సప్త భువనాళి రాజ్య రక్షణకుఁ బోల్పు
సప్త దుర్గంబులను గోట జగతి నొసఁగు
సప్త సాలంబుల దరించి సన్నుతించి
విష్ణుచిత్తుండు భక్తివరిష్ఠుఁడగుచు ౬౩

చ. ఘనతర రత్నకుట్టిమ నికాయ వితర్దికలందు రంగ నా
థుని మణిహేమ సౌధములు దోఁప నటం బ్రతిగేహ సీమలం
దనయము దన్ముకుందుఁడు నిజాలయ పంక్తులతోడ నింట నిం
టను గనుపట్టు వేడుక ననందగు వీథు లసర్గళంబులై ౬౪

సీ. విరజాప్రవాహ నిరసించు ధవళోర్ధ్వ
పుండ్రముల్ నుదుట విస్ఫూర్తి మించ
నరయువారి యఘంబు హరియించు భుజములం
దగు శంఖ చక్ర చిహ్నంబు లలర

మకరకుండలములు మహిత పీతాంబరం
బులు హరి సారూప్యకమునందలుప
ద్రవిడ ప్రబంధముల్ దగు వేదశాస్త్రంబు
లాస్యంబులందు ముక్త్యాప్తి నెఱప

తే.గీ. నిత్య యుక్తుల సంగతి నిచ్చవెల్లి
శ్రీమదష్టాక్షర ద్వయ స్థితి నెసంగు
వైష్ణవుంచేత నెప్పుడు వర్తిల్లునైన
వైష్ణవశ్రేణిం గాంచె నవ్వైష్ణవుండు 65

ఉ. కంకధరాధరంబు నరిగల్గిన గాత్రముబాని నాత్మ శా
శ్వతనియతిం బద్మనాభ నిబంధనాలతైం బొలింపు దానిం దన్
గనుగొను వారి కెల్లను ననంత పదస్థితిం గూర్పు ప్రవర్తే
యనిం దొలుతన్ దలంచి నుగుణోన్నతి నాగ్రంథి మ్రొక్కి యంతటన్ 66

ఉ. ధన్యులవారుకూలంబు నుదార మహత్త్వము గూర్చు విశ్వ మూ
ర్ధన్యుని సర్వశక్తి యుతునా పరితాపము బాపునట్టి సౌ
జన్యుని దివ్యమంగళ విచక్షణ లక్షణ లక్షితాత్ముండౌ
సైన్యకటిం దలంచి సరసస్థితి సంబలించు యన్వయంబునన్ 67

క. చండ ప్రచండులను మా
ర్తాండ నద్యుతి తేజుల నుదారమతుల నా
ఖండలవిభవుంగని ద్విజ
మండను ధర్మిన్ నుతించి మహాత్ముండై 68

వ అట్లగు నమ్మహానుభావుం గూర్చి యమ్మహీసురుండు నిగమ నిగమాంత
సూత్రంబుం గొనియాడి నిటలతట ఘటితాంజలియగుచు మఱియును 73

## విష్ణుచిత్తుఁడు రంగనాథునిఁ బ్రార్థించుట

క నరసింహరంగ రంగా
నిరుపమకరధృతరథాంగ నీలఘనాంగా
గరుడవరపక్షితురంగా
కరుణాళీవనతరంగ కలుషవిభంగా 74

క అని యద్దేవుని నెన్నుచు
మనుఁ దాభూసురుఁడు పల్కెఁ గంజదళాక్షా
విను బ్రార్థించెద నా మన
విని విని మను బ్రోవుమయ్య విజ్ఞానమయా 75

ఉ సలుపగ నా కుమారిక యొనర్పుతపం బది యెట్టిదో కదా
తెలియఁగరాదు మాకు బహుదివ్యములైన ప్రబంధ సూక్తులన్
జలజదళాక్ష నిన్ను నరసన్నుతిఁ జేర్చెని సన్నుతింపుచున్
బలుకుచునుండు నామెదగు భావము నీ వెఱుంగ నేర్తువే

క మా భాగ్యములందు లే
దే భాగ్యము గాని పంకజేక్షణ యాపా
ద్వ్యాయతలోచన దంకా
నే వెత స్మరియించు నిన్ను నిర్వాణగతిన్ 77

సీ. నలినాక్షదామ మున్నతి వేము ధరియింపఁ
దాఁ బద్మహారంబు దాల్చుచుండు
నే మూర్ధ్ని చంద్రకముఁ బ్రాముకొనుటయుఁ దాఁ
గరిమఁ గస్తురి తిలకంబుఁ దీర్చు
నవయంబు మేము దివ్యప్రబంధోక్తిని
నిను బల్కఁ దానిన్ను సంధసేయు
నాయ్యన మే[1]ముత్తరియ్య కయ్య గొనుటఁ
బఠింపఁ దాఁ గవ్వపొన్నుఁ దెందు

తే.గీ. మేము దృఢతర తనువులమై మెలంగఁ
దాఁ గృశాంగిగ నుండు మద్భామ వృత్తి
నమ్ముగాక రుచింప యె గానుభూతి
మాకుఁ దెలియంగరాదు లోకైకదాత 78

శా. ఆ కాంతామణి యందు యోగమున కో యబ్జాక్ష యేనాఁటికిన్
నీకేమో దయరాదు గాన నిక నిర్దేశ్యత్వముం బాని య
స్త్రీక స్ఫూర్తిని దానిఁ బ్రోవుము మహోత్కృష్టంబు వాటిల్లఁగా
లోకంబందుల నీ సమానుండు వేల్పుల్ లేరుగాఁ జూడఁగాన్ 79

క. మును నీ వొసఁగిన వాక్యం
బునఁ జేసి నిరంతరంబు పూఁబోఁడి నినున్
మనమునఁ దలఁచెని యోగం
బున నున్నది భక్తిఁ గొని సమున్నత మతియై 80

---

1 'ఉత్తరియ్య' మసాధువు, కాని ప్రాసయతియందుఁ బ్రయుక్తము 'ఉత్తరీయ' శబ్దము సాధువు

## రంగనాథుఁడు సపరివారంబుగా ధన్విపురంబున కేఁగి గోదాదేవిని పరిణయ మాడుట

క. ఈ రీతిని గోదా క
న్యా రత్నం బెన్నుచో ననంతుఁడు భువనా
ధారుఁడు సముదారుఁడు శ్రీ
పేరి నిలయుండు రంగవిభుఁడు ముదమునన్ 86

సీ. అనుదినంబు మహాత్ములగు నిత్యయుక్తులు
బ్రహ్మరుద్రాది నిర్జరచయములు
బ్రహ్మర్షులును సిద్ధపన్నగ చారణ
గంధర్వ లప్సరోగణము లర్థి
సేవింప సంతోషచిత్తుఁడై వంది సం
స్తూయమానుఁ డగుచుఁ దోరములగు
మహితాతపత్ర చామరములు తోడుతఁ
బరిశోభితుఁ డగుచు బరిఢవిల్లి

తే.గీ. వైనతేయునిపై నెక్కి పంకజాక్ష
కారి తూర్య స్వనములుఁ బొల్పార నతిశ
యంబయిన ధన్విపురమున కరుగుదెంచె
నవని గోదాసతిఁ బెండ్లియాడుకొఱకు 87

చ. ఘనతర దేవదుందుభి నికాయ నినాదము లభ్రకాండమేఁ
ఘనఁ బరవంగ సర్వజనసంఘముఁ గొలువంగ నట్టి సెలంగ సొం
పున దనరంగ రంగపతి మోదముతోఁ దన కన్యకై రయం
బునఁ జనుదేరఁగా నరసపూరిత భూరితరానురాగుఁడై 88

క. ఘనుఁడు మహాయోగీంద్రుం
డనుపమమతి విష్ణుభక్తుఁ డవ్వాడు శౌరిన్
దనుఁ గొలువంగ నెదురుగాఁ
గని పలుమరు నతి యొనర్చె సంహృష్టుండై ౪౮

వ. అంత ౪౯

చ. ఘనతరు భక్తవత్సలుని, గరుడగాముని విష్ణుం క్షణా
ధ్యుని రమణీయ వైభవ సముజ్జ్వల గాత్రుని రంగభర్తఁ దా
వినయము చేసి తోడ్కొని యభీష్టమతిన్ సురరాజమందిరం
బునకు సమానమైన యొక పుణ్యగృహంబునఁ జేర్చి యచ్చటన్

తే.గీ. యోగ విద్వరుఁడగు భూసురోత్తముండు
భాసురంబగు కనక సింహాసనంబు
నందు శౌరినిఁ జేర్చి పాద్యాదులను స
పర్య గావించె నిగమోక్త పద్ధతిగను ౫౦

తే.గీ. అంతట సుగంధ పుష్పాక్షతాదులను స
లక్షణంబుగ వేది నలంకరించి
యందు వహ్నిఁ బ్రతిష్ఠించి యాగమోక్త
సరణి హోమంబుఁ జేసె భూసురవరుండు ౫౧

చ. ఉరుతర హాటకంబుల సముజ్జ్వల భూషణ భూషితాంగగాఁ
బరఁగిన కావ్యతామయిని భాసురహా[1] (మముఁ జేర్చి సన్నిధిన్
పరగుణయుక్తుఁ) దోడుకొనివచ్చి సుమంత్ర పురస్కృతంబుగా
గరిమ నొసంగె భక్తజన కల్మషహర్తకు రంగభర్తకున్ ౫౨

---

1 మూలము కొంత శిథిలమగుటచే భ్రష్ట భాగము పూరింపఁబడినది

తే గీ అంతరంగేశ్వరుండు గోదాబ్జపాణి
పాణిఁ [1]బాణిని విడుకొని ధర్మమతినిఁ
గలయఁగా [2](బాణి) హోమాదికము సమస్త
మును యథావిధిగా సల్పి ఘనత నెంది 95

క పరమాలంకృతి సతితో
నిరుపమ మతి నగ్నిహోత్రునిఁ బ్రదక్షిణముం
గఱపి ప్రమోదంబొందెను
సరసీజాక్షుండు రంగశౌరి శుభముగాన్ 96

చ పరమదయాఢ్యు నచ్యుతు వివాహముఁ జూడఁగ వచ్చు నా సరో
వరముని ముఖ్య పద్మభవ వారిజవైరికిరీట శక్ర ది
గ్వరులను విష్ణుచిత్తుఁడు హితాంతరోక్తిని సమ్మతించి యం
దఱుఁ బరితృప్తులన్ సలిపె ధాత్రిపయిన్ జను లెంచ నయ్యెడన్ 97

మ సురకాసార మునిప్రపత్సత్యవర [3]సంస్తోత్రాఢ్యుఁడైనట్టి శ్రీ
హరి రంగేశ్వరుఁడాత్మ భృత్యతతితో నవ్విష్ణుచిత్తున్ శుభో
త్కరు సద్ధాత్రి వసింప నాజ్ఞయిడి గోదాదేవితో నేర్పుతోఁ
బరమప్రీతినిఁ జేరి కావపటవీరంగంబు శ్రీరంగమున్ 98

వ అంత 99

సీ లలితాత్ముఁ డగుచు నీళా పద్మ కన్యకా
గోదాంగనలతోడ గురుమనీషఁ
గై కొని నిత్య సూత్రీలఁ బెంపొంది
కంతు సామ్రాజ్యైక గరిమఁ జెంపు

---

1 మూ బాణిన 2 మా లేదు 3, మూ సంస్తూయాఢ్య

రంగనాథుఁడు ఫణిరాజ శయానుఁడై
యలయఁ గావేరికా నిలయుఁడగుచు
నందు నుండు జనుల కందఱికిని దయా
రసముచే మోక్ష మొసంగుచుండు

తే.గీ. సమ్మహాత్మకుఁ డాది మధ్యాంత రహితుఁ
డవ్యయుం డప్రమేయుం డనంతుఁ డజుఁడు
నిత్యముక్తాదినుతపాదనీరజుండు
సమ్య ఫలదాయకుండు నారాయణుండు 100

వ. అంత మహాభాగుండును రంగ [1]భూపతి శ్వశురుండును నగు విష్ణుచిత్తుండు
దత్కైంకర్యపరుండును దాస్యైకజీవనుండును నగుచు నం దధివసించెఁ
గలికల్మషాపహంబును ముక్తిప్రదంబును నగు శ్రీవిష్ణుచిత్తయోగి
యేతచ్చరిత్రం బేసరులేనిఁ బఠియించుచున్ వినుచున్ వ్రాయుచున్
బొల్తు రా నరు లిహపరైశ్వర్యంబు లనుభవించి యంతంబున శ్రీశౌరిపదంబుఁ
జెందుదు రని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబును నగు భార్గవ
పురాణోత్తరఖండంబునందలి యేకోనత్రింశాధ్యాయంబు భక్త
పరాయణుండగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం
జెప్పి వెండియు నిట్లనియె 101

తే.గీ. పరమహాభాగ శ్రీమంత గురుతరాఖ్య
యపరకథ యేను జెప్పెద నాలకింపు
వినెడు వారల కద్భుతంబును దనర్పు
దాని నేకాగ్ర మగునట్టి మానసమున 102

1 మూ. భూపతీశ్వరుండును

## హరిశార్ఙ్గాంశమునఁ బరకాలుఁడు జన్మించుట

క. పరకాల మహాయోగిం
కోరి దుష్ట సుకర్మములను నొసఁగుట నిత్యం
బరయఁ గథ నీవు విను శ్రీ
హరి భక్తారాధకముల నయ్యేడు దానిన్ 103

సీ. రమ్యంబులై యనురాగంబులగుఁ జోళ
దేశంబునందు సుక్షేత్ర మగుచు
లలితమై తగుఁ గమలాపూర్వనగరంబు
మణి మందిరంబుల మణి విచిత్ర
తోరణంబుల మణిద్వార వేదుల మణి
కుట్టిమంబుల మణిగోపురముల
మణిసాలముల మణిమంటపంబుల మణి
[1]చంద్రశాలల మణి సౌధములను

తే.గీ. నిర్మలోదక కాసార నికరములను
సరస పుష్పప్రసవవన సంతతులను
ధర్మ విజ్ఞాన పురుష ప్రతానములను
నఖిల లక్ష్మీ విభవము నలర నుండు 104

క. సురుచిరమగు హరివర పం
జరుహాణిమునఁ గార్తికమున జనించెన్
బరకాల సంజ్ఞుఁడగు ముని
హరిశార్ఙ్గాంశగుఁడు కృత్తికార్క్షమునందున్

1 మూ. చంద్రశాలల

క భగవత్ప్రియుఁడగు నా మనుఁ
డగణిత మతి వృద్ధిఁ గాంచి యప్పుడు పరత
త్త్వగుఁ డయ్యె య గణ్యుఁడుఁ
డగు సత్యధర్మ వేత్తయగు తనయుండున్ 106

సీ ధర్మజ్ఞుఁడును దయాతత్పరుండును నీతి
శాస్త్ర విశేష విశారదుండు
సనయుండు సర్వశస్త్రాస్త్ర విదుండును
సంగర మార్గ విచక్షణుండు
విమల గుణుండును సకలలోక ప్రియుఁ
డను కీర్తి పరుఁడును (¹మను విహితుఁడు
సఫలిత చిత్తుండు సముదిత) మంత్ర వి
చక్షణ రతుఁడును సత్యవాది

తే గీ యగు పరాంతక మౌని యత్యాదరమున
దక్షుఁడగు దోర్ధరునిపాలి రాజ్య
భార మెల్లను దనదు ప్రభావమున స
హింపుచుఁ దనర్చె జనముల కింపుగాఁగ 107

క నిరతం బాదోర్ధరమహి
పతునకుఁ బ్రియమైన మంత్రివర్యుఁ డగుచు సు
స్థిర మతిని వెలయు చుండును
గరుణాకరుఁడగు పరాంతక మునీంద్రుఁ డొగిన్ 108

---

1 మూ లేదు

క. ఆ సమయంబున నాగ పు
రి సాన్నిధ్యమునఁ దవరు శ్రీకర వలిపి
వాసము బంధూల్లాగము
కాసారము శ్వేత సంబ్జికము భాసురమై 109

మ. అరవిందంబులఁ గైరవంబుల సముద్యల్లీలమై ప్రోయు ను
త్కరమౌ భృంగనికాయ మంబురమ వాలంబాడ్కఁ గాపించి యం
బరమున్ వెన్నుని పోఁకఁ గా నతఁడు ప్రేమం గౌఁగిటన్ జేర్చెవాఁ
బరగెన్ బింబిత పుష్కరంబగుచు నప్పద్మాకరం బున్నతిన్ 110

సీ. కల్హార ధూళికా కల్పిత భూరుహ
పటలి ప్రవాళ విభ్రమము మెసంగ
మ్మల గంధార్థ సమాగత భ్రమరాళి
కరరమాసిత మణి సరము నగుచు
సరసీరుహావాస చక్రవాకోన్నతి
రస దేవతా కుచ ప్రతిభ మించ
రాజిత శ్రీంకార రాజహంసచ్ఛట
[1]ప్రాదుర్భవార్ణవ పటలి గాఁగఁ

తే గీ. దనరుఁ జందన కుంద మందార పీవ
జంబు జంబీర ఘుసృణ రసాల సాం
పనస వంజుళ ముఖ తరు భాసమాన
దైన నికరంబు శ్వేత సరోవరంబు 111

1 మూ. ప్రాదుర్భవాతార్వ

### భాగవతాగ్రణికిఁ గుముదవల్లి యను కన్య లభించుట

క. వికసిత కల్హార జాత
ప్రకరంబగు నా సరోవరమునందు సము
త్సుకముగ కుముదాంతరమునఁ
బ్రకటమతిం దొరకె నొక్క బాల సలీలన్. 112

చ. ఘనతర పద్మరాగ రుచి గల్గిన హస్తపదోదరంబులం
దనరి పయోధర స్థితి నొనర్చు తటిల్లత ము త్రియౌచు ని
జ్జనముల కద్భుతం బొదవఁ జారుతర ప్రతిభన్ రసాతలం
బునఁ గల నీరజస్థలిని బొల్చిన దైవతి యంచు సుందరిన్ 113

క. వనరుహ పత్ర విశాలా
క్షిని యరుణాధరను భృంగచికురను సుకరన్
గని యొక భాగవతాగ్రణి
యనపత్యుఁ డపత్యాంశ ననుమోదితుఁడై, 114

క. నెవరున నట్టులం గాని
ఘనతరమతి నతఁడు నిజనికాయంబునకున్
గొని భార్య కొసఁగె నప్పు డా
వనితామణి దానిఁ బ్రోచె బాంధవపరయై 115

ఉ. దిన దిన మా తలోదరి యుదీర్ఘతర ప్రతిభా సు[1]గణ్యయై
యనుపమ సుందరత్వమున నాస్పదమై తనరారె మోదం
బునఁ గని తల్లిదండ్రులు ప్రపూర్ణ మనస్కులై నుండి రర్థితో
నెవయుఁగ దాము గాంచు ధన మీ సుదతీమతిగాఁగ నెన్నుచున్ 116

---

1 పు గుణ్య

సీ తన కైశికమురీతి ననయంబు విఖ్యాతి
నింద్రనీలంపు జాతి నీసడింపఁ
తను కన్నుఁగవతీరు ఘనతర ద్యుతిమీరు
సారసంబుల దాయ గేరడింపఁ
తన మేని తీగసంచు వనుపమంబుగ మించు
ఘనగతంబగు మించు ఘనత డింపఁ
తన మోము సిరిసొంపు ననురాగమునఁ బెంపు
గల యిందుకలంగుంపు గతుకు నింపఁ

తే.గీ తనరు వనమాన సుందరతా నిదాన
మధురతర గానవిపుల సమ్మద విధాన
మత్తగజయాన భాగ్యాయమాన మాన
వైభవానూన యా రాణ వసుధలోన 117

ఉ అడుగుల తేఁటిగుంపులకు దానలు పెట్టును మోముదగ్గు నే
ర్పడఁగఁ జకోరపంక్తి కనురాగ మొనర్చును గైతకద్యుతుల్
కడుఁ బ్రియమున్ ఘటించు జనహారి తిగిగా వగగాఁగ నెమ్మికి
పడఁతుకఁ దోం కి జగతిపెఁ గల భామలు కింద తేసియున్ 118

క మొగమా యీ కన్నుం గో
యగమా రాజీవతతి సమంచిత కోకి
యుగమా చన్నవ యసితో
రగమా నాఁగారు నద్దిరా మానినికిన్ 119

క. కరములు తమ్ములు కమలా
కరములు పొక్కిలి విశాలకంఠాక దిశా
కరములు వెమ్మోము కథా
కరములు చూడ్కులు శశాంకకరములు సవ్వుల్. 120

ఉ. పలుకులు పంచదారలు విలాసిత హాసవిలాస మిందుకా
దళుకులు వాలుఁజూపులు మదారతి మించిన పద్మబాణు పూ
ములుకులు మేనికాంతులు సమున్నతి జాతి సువర్ణవర్ణముం
గులుకులు గబ్బి సీ కలికి గుబ్బలు గుబ్బలు లబ్బురంబుగాన్ 121

సీ. పగడాల జిగరాల చిగురాకుఁగాఁ బోలు
వాలారు పాదప్రవాళరుచులు
బలితంపు మునుకెంపుగంబొంపుల హసింపు
నింపుఁ బెంపగు నధరంపు సిరులఁ
దొగరెన్నుఁ దొగరెన్ను నొగి మున్నుగాఁ బన్ను
మిన్న కగ్గము గొన్న కన్ను గవల
జిగిచేలు వగ వారు సొగసూరఁగాఁ బోరు
టెదఁ బొల్పారు మూగారు నిగల

తే.గీ. నలరుఁ గల్యాణి రుచిర లీలాహసేశ
పృథు తరోల్లాస సుతర దాంపేయదాసు
మహిత సౌందర్యగుణపేటి మదనపేటి
గురు జనామర తరువల్లి కుముదవల్లి 122

క. ఈ విధమునఁ దనరారెడు
నా వామాక్షిమణి మహాసుందరతా
భావిత శీలాది గుణము
లావిష్కృత పారిజాత మాలించియటన్ 120

ఆ.వె. ఆ మృగాక్షియందు నాసక్త మగు మది
గలిగి సత్వరంబుగా నతండు
నన్ను సుఖదమైన నాగపురంబున
కేగుదెంచె నవ్వు డింపెనంగ

తే.గీ. అందుఁ గొన్నాళ్ళుండు నరవిందగంధి
జనకుఁ గూర్చి [1]పరాంతక ముని ద్వితీయ
కన్య మా కిమ్ము టంచుఁ బ్రార్థించ మతిని
యాచనము చేయఁగా నమ్మహాముఖుండు 125

క. ఇల నవ్యాసన పుష్పం
బులను బరాంతక మునీంద్రుఁ బూజించి నేను
జ్వలిత మనస్కుం డగుచున్
బలికెఁ గరాబ్జములు మోగిచి భక్తియుతుండై 126

చ. అనయము నెవ్వఁడేనిఁ గమలాయతలోచన భక్తుఁడైన వా
రిని నాకు వేయుమంచిని దర్శి తిమింపఁగఁ జేసెనేని యా
ఘనునకు నంబు చక్ర పరికల్పిత బాహున కే నొసంగెదన్
మనమున సంతసించి యనుమానము సేయక కన్యకామణిన్ 127

---

1 ము. పరాంతకమున

చ. సురుచిర ధర్మకాంక్ష నగుచున్ ముని నే నొనరించువర్ణి ను
స్థిర యగు నీ ప్రతిజ్ఞ మునిశేఖర నీమదిఁ దట్టైనేని ని
ర్భరమతి నర్తనేను నలుపంగలవార పటించుఁ జేసి యా
తరుణిని విష్ణుభక్తి గల తామరసాస్యను సంగ్రహింపుమా. 128

తే.గీ. శిక్షిత గుణానుభూత నయ విచార
విభవరేఖా సమాఖ్యాత శుభసమేత
భాగ్య విఖ్యాత నిస్తులభావ జాత
నీ తరుణిఁ గొమ్ము మునివేత యింపుదేర 129

## పరకాలుఁడు దాసచేసి కుమారవల్లిని పెండ్లాడుట

క. అని పరమ భాగవతమణి
యనుపమ గుణియైన యాతఁ డాడినదో న
మ్మునివర్యుండు పరాంతకుఁ
డనియెన్ గపటోక్తిఁ జేసి యా ఘనుతోడన్ 130

తే.గీ. ఇంపు మీఱంగ నే దాస యిత్తు నీకు
పాలింపుము నా వాక్య మనవరతము
నంబుజదళాక్ష భక్త సహస్రకంబు
నెంచి భుజియింపఁ జేసెద సిద్ధచరిత 131

క. నే వాడిన వాక్యంబు లో
పౌరస్వర సత్యము సమంచితగతి నీ
యావనమునఁ దలఁచి నీ
సూనము నా కొసఁగు మతులశోభనసంపన్ 132

స్వభార్గవ నీ యోగంబగుగాక యని సంస్మరింపుచు ననవరతం బట్టివే గావింపుచుఁ దదీయదాస్య నిరతుండును సంప్రాప్తమానసుండునునై మహా భాగుండును మహా భాగవతోత్తముండును నగు పరశాలుం డివ్విధంబున మహాత్ములగు భాగవతులకు గైంకర్యంబు చేయుచున్న యెడఁ జోళమహీశ్వరుం డవ్వృత్తాంతం బరసి యు నతింగ నన్నుల్లంఘించి నిబంధనంబు వైష్ణవం బొసంగుచున్నవాఁడని క్రోధసంరక్తలోచనుం డగుచుఁ బరాంతకుని మదంతికంబున కతి రయంబున దోకొని రండని దూతల నాజ్ఞాపింప వారు వేగంబునం బని నృపాగారం బతని కెఱింగింప నతండు వారి నిరాకరింప నా దూతలు మగుడ నరుగుదెంచి నృపున కెఱింగించిన

## చోళమహీపాల పరాంతకుల సంగరము

క. ఆత్రిపతి క్రోధార్కుండై
చతురంగ బలంబులతోడఁ జయ్యనఁ బని యు
ద్ధతిఁ బరశాలపురంబు న
తిత విక్రముఁ డగుచు గదిసి ముట్టెను దలఁగన్ 187

క. భావిత భేరీ బంభా
రావంబులు తూర్యముఖ నినాదంబులు హే
షావహ తురంగ సంఘం
ధావనములు మ్రుగ్గింబు దంగ్గఁగఁ జేసెన్ 188

క. పింయార్ణవ మొప్పొంగిన
నలుపునఁ జోళాధినాథు నానాసైన్యం
బులు పరశాలుని నగరము
నంగొని భైర్యంబుఁ జేసి నట్టిల్లకటన్. 189

చ. తనపురిఁ జుట్టుముట్టిన యుదగ్ర బలాఢ్యులఁ గౌరవభూపతిన్
విని పరకాలుఁ డాగ్రహ నివేశిత మానస మూర్తి యౌచుఁ దెం
పున వెడలెన్ మహోగ్రబలయుం గొని తాను నృపాలుతో రణం
బున నలువంగ సర్వజనముల్ వెఱగందఁ బ్రతాపశాలియై 140

మ. శాతి నిష్ఠార పంపరారవ సముద్యత్కలమై క్రొవ్వు మ
ద్ధత కంఠీరవ రావముం గలుగ యుద్ధామ ప్రతాపోద్ధతుఁడై
క్షితినాథోత్తమ వాహినీనికర పుంఖీభూత ధాత్రీస్థలిన్
ధృతిమైఁ గొల్చె బరాంతకుండు పటుదర్పోద్ధూత చేతస్కుఁడై 141

సీ. అర్థిహేషంబు లిట్టట్టుగా నిందు హే
షారవంబులు గల సైంధవములు
సర్వ సర్వంసహా చక్రముఁ దలకిందు
పదమట్టనము గల భద్రకరులు
మధ్యందినాదిత్య మండలం బొరయు కే
తన పతాకల నొప్పు స్యందనములు
ప్రళయరుద్రుని రీతిఁ బటు వీరహుంకృతిఁ
గైకొని పంకించు కాల్బలంబు

తే.గీ. తరుపడిందు పంటా గాటి నొక్కమొగిని
దాఁకుచోఁ బరకాలుఁ డుదగ్రమూర్తి
యగుచు వాహినీదాని యత్యద్భుతముగ
దాన సింహనినాదముఁ జేసి యపుడు 142

క. తురగములఁ గూల్చి నిష్ఠుర
కరికుంభంబులఁ బగుల్చి గాఢతర రథో
త్కరము దెమల్చి పొరల్చెం
బరకాలుఁడు నృపతిబాలబలముఁ జలించెన్ 143

వ. అమ్మహాబలంబు బలంబునం జేసి విద్యాధర గంధర్వ బృందంబును విరం
గిత మదగంధ సింధురంబును విభిన్న స్యందన సందోహంబును విదీర్ణ
వాహ పదాతి విధానంబును నగు సముత్తుంగ సంగరాంగణం బాలోకించి
నింగిపెంపునం గుంపుగొని దివిజులు సొంపువాటింప నప్పు డా ఘోర
మహిపాలుండు హతాశ్వరథతురగపదాతియగుచుం బిఱుదీయక పటుహ
భేరీ మురజ కాహళ ఢక్కానాదంబు లుఱుంబుఁ బర్వఁ జెప్ప యంత
కాకృతియగుఁ బరాంతకునితోఁ దొసంగి యనుపమంబగు యుద్ధంబు
గావింప నప్పు డయ్యిరువు రన్యోన్య శరలాఘవ కరలాఘవంబునం జేసి
వియచ్చరమార నిర్ఘాత ఘాతంబుల రెగ్గుగావించు నమోఘాస్త్రశస్త్ర సంఘా
తంబులచే బ్రఫుల్ల నితాంత వసంత సమాగత కింశుకాశోక మహీరుహం
బుల చాడ్పున రక్తసిక్తాంగులగాఁ దోరాడుచుఁ గృతప్రతికృతంబులగు
వక్రధ్వజ చాపాసి కుంతంబులం గల్గి మహావీరు లగుచు నుభయకాలంబు
యుద్ధకుశలు లగుచు యుద్ధంబుఁ జేయుచుండి రనంతరంబ, 144

చ. అవనివిభుండు బాణనివహంబులఁ బిట్టుఁ దాఁకఁ గండ పై
శ్రవుని పురోధరన్ నిలువ శక్తుఁడు గాక పరాఙ్ముఖుండునై
జవమునఁ దాటిపోయి తనస్థానముఁ జేరి ధరాధిలోక ము
ఖ్యవహ మనీషఁ జింతఁగొని [2]యాఁప్తుంఁ గూర్చి నిజార్చు దూర్చుచున్

1 మూ చాపాసి కృంతనంబులం 2 మూ యాపుఁ

తే.గీ. అనియె నిట్లు పరాంతకుం డంత దాను
భవములార యుపాయంబు గాది పరాంత
కుని నిటులఁ దోడుకొనిరండు గురుతరోక్తి
నమదు సంప్రదాయమున వార లట్ల చేయ 146

పరాంతకుఁడగు చోళమహీపతి వరకాలు కడకు ధనమునిమిత్తము
మంత్రుల నంపుట

వ. అంత 147

క. అరియఁ దన పురికి వచ్చిన
గురుతరమతి యగు పరాంతకుని కడకు సద్
ధురులగు సచివులఁ బనిచెన్
నరపాలసుతుండు చోళరాయకుఁ డర్థిన్ 148

చ. పనిచినఁ బోయి యా పరమ భాగవతోత్తముఁ గూర్చి వార లి
ట్లనిరి పరాంతకా నరవరాగ్రణి ధర్మముచేత మాకు రాఁ
దవలిన ద్రవ్య మంతయు నుదారత నివ్వ మటంచు మమ్ము నెం
పునఁగొని పంచె నీ కడకు భూరితరాద్భుత చిత్తవృత్తియై 149

తే.గీ. అనుడు మంత్రులవల్ల ధరాధినాథ
వార్త మాలించి పరకాల వైష్ణవాఢ్యుఁ
డిదియె ధర్మంబుచేత నే నివ్వఁ దగిన
ధనము నిచ్చెద మటుగాన వినుఁడు మీరు 150

క. అనయంబు వైష్ణవారా
ధనమునఁ దన్నిమిత్తమైన ద్రవ్యంబు [1]వ్యయం
బు నగుట నెటి ట్లైనను
ధనము నృపున కొసఁగఁగ సుదార స్థితిగాన్ 151

---

1 మూ. వ్రయం

## వరతాలునకు హస్తిగిరీశుఁడు ప్రసన్నుఁడై సాక్షాత్కరించుట

సీ. అని యివ్విధంబున నమ్మునివర్యుండు
చింతఁ జేయుచు నిద్రఁ జెందియుండ
కలని స్వప్నంబునఁ దామరసాక్షుండు
హస్తిగిరీశ్వరుం డచ్యుతుండు
ప్రత్యక్షమూర్తియై పాణిపల్లవమున
నతని స్పృశించి మహా[1]యశస్క
రమ్యమౌ కాంచీపురమ్మున కిమ్ము మ్రొక్కి
ఏఱుఁ దోకాని దివ్య పవిత్రతం

తే.గీ. బ్రహ్మ మంతయు నీ కిచ్చెదను బ్రియంబు
తోడ నని పల్కి యప్పు డంతర్హితుండాయె
నత్రుఁ డంత జాగ్రత్తుం డౌట నిర్మలాత్ముఁ
డతఁడు వెల్గొని తోషిత స్వాంతుఁ డగుచు 152

తే.గీ. ఆపఁ బరాంతకుఁ డవ్వసుధాధినాథు
నచివముఖ్యుల తోడుత నత్వరమున
మహిత దీప్తిప్రభాభాసమాన మగుచు
నలరఁ జెన్నొందు కాంచికాపురముఁ జేరి 153

ఉ. వరదుని భక్తవత్సలుని వారణశైలనివాసు నిందిరే
శ్వరుని దయాసముద్రుని నివారితకల్మషుఁ గాంచి భక్తితో
ధరణి శిరంబు సోఁకఁగను దండముఁబెట్టి ముదంబుఁజేసి ని
ర్భరతరరోమకంచుకిత భవ్యశరీరుఁడునై యుదారతన్ 154

---

1 మూ. యశస్త

ఆ.వె. వసుధయందు వైష్ణవ ద్వేషి యగువాని
ముఖము చూడఁదగదు పుణ్యులకును
గాన [1]మనసు నొందు కరఁ జేరి వైష్ణవా
రాధనంబుఁ జేయ రమ్యమతిప 159

చ. ఘనుకొని చోరవృత్తిన నమున్నతిగాఁ గొని పట్టి నట్టి యా
ధనము నిషిద్ధ మేనియును దామరసాక్షుని భక్తకోటికిం
బునఁ బవిత్ర్యము గూర్పుటయుఁ బుణ్యముగాన నవైష్ణవావని
గొని ద్రవిణంబు కల్మషముఁ బాపుచు కాపురమౌ కళోదరీ 160

తే.గీ. విష్ణు చిహ్న విహీనుని విష్ణు పాద
భక్త విద్వేషి నన్యదంబుఁ బల్కు వాని
ముఖ విలోకన సల్లాపములు సమస్త
నరక హేతువు లరయంగ సరసిజాక్షి 161

క. క్షితి యందు వైష్ణవాగ్రణి
పతి యాశ్రయ మర్థి వైష్ణవ ద్రోహికి దు
ష్కృతిఁ గూర్చు వాని సంగతి
యతివా కొఱగాఁడు సజ్జనాళి కెపుడున్ 162

ఆ.వె. మొదట నెనరుఁ జేసి యదపఁ జుల్కనఁ జూచు
నరుఁడు విష్ణుభక్తుఁడైనఁ గాని
యనయ మున్నతి వాక్యఁ దగువాని వైష్ణవ
ద్వేషిఁ జేరఁ దగదు శిష్టులకును 163

---

1 మూ. మనంబొందు, 'మనంబు' పాఠమయందు విలక్షణము

వ అనర్గళం బగు మార్గం బావరించి కొని యుండి విప్రు దిప్పు ఏహీనులగు
పథికులవలని రత్నాదికంబగు ధనంబు గైకొని తద్ద్రవ్యంబునంతయు
యనవరతంబు మహోత్కటంబగు వైష్ణవ సహస్రకంబున కారాధనంబు
గావింపుచు సంపూర్ణ హృదయుండై యుండె నంత నొక్క సమయంబున
వైష్ణవ ప్రియుండును బలియుండును నగు వరకాలుండు ధనార్థి యగుచుఁ
దా రాత్రియం దొక్క నగరంబుఁ జేరి యందుఁగల వైష్ణవ ద్వారో
పాంతంబునం దధివసించి యున్న యెడ నా గృహిణి స్వర్ణపాత్రంబు
హస్తంబునం గొని గృహంబు వెడలుటం గని ప్రహృష్టచిత్తమానం
బున దస్కరిష్టంబగు భక్త భాజనంబు సంగ్రహించి నవ్వుచు యతిశ్రేష్ఠ
గురుత్వము నెమ్మ యని పల్కి వెండియుఁ గృహంబుఁ బ్రవేశింప నవ్వాకిటంబు
నంతేన యా [1]తస్కరేంద్రుండు భయాతురుం డగుచు నిరి వైష్ణవ
ద్రవ్యంబు క్రమ్మఱ నా పాత్ర నా ద్వారంబునం దునిచి యంద యధి
వసించెను

క ఆ కాంతారత్నంబు భ
యాతుం డిత్తమున సర్వ మాత్మేపన క
స్తోత్ర నెఱుఁగఁ జెసిన
నాతనం మనియు తోషితాయత్తుండై 168

తే గీ చిత్త మిగురొత్త నవ్వైష్ణవోత్తముండు
తనదు సతి పల్కినట్టి వృత్తాంత మాం
కించి మానిని నాకు లక్షించి చూడఁ
దెలియఁగా నొట డిని చేఁ రేటపఱుతు 169

1 మూ చతుష్కపిండప్రిండు [2] నాలుగు విధములుగు దొంగతనములు
చేయువాఁ డనియూ[2]

క. సుతరుండై యాఁకలి గొను
సకలశ్రీ వైష్ణవుం గొనంగును నవ్వం
బతిలంకి గుణుండు పరాం
తక మోహింద్రుండు భక్తి తత్పరమతియై 185

ఆ.వె. ఆ మునుండు శ్రీకృష్ణారాధనముకొఱ
కయనమున వసించి యఖిల దిశల
నరయు చుండె రాత్రి రసుల దొలంగి యా
తని వాంఛ వాసి యతుల మతిని 186

తే.గీ. అంతఁ బ్రియశిష్యు దైన్యపు యా మునీంద్రు
హృదయశుద్ధి దెలిసి జగదీశ్వరుండు
శౌరి సంతుష్టుఁ డగుచు నుదార సరణి
దృష్ట కృపదాయి యగుచు భాసించుచుండి 187

సీ. [1]ఆమలులౌ నిత్యముక్తా ద్యనంతాదుల
వనము మానసుల సూరి ముఖ్య
యోగివర్యుల మహాభాగుల సనకాది
మునులను బ్రహ్మణ పురహరాది
దైవతంబుల గొల్వఁ దామరసాక్షుండు
మంగళ ప్రదుఁడు శ్రీరంగధరుడు
జగములకును మాతయగు రమాదేవితోఁ
గూడఁ దార్క్ష్యారోహణుండు నగుచు

1 మూ. అమలురా

తే.గీ. సకల భూరుహ సముదయ ప్రకటమగు మ
హా గహనమునఁ గల్గ పరాంతకాం
యంబుఁ గూర్చి చనుదెంచు నమ్మహితుండు
భక్తుల కనియె సంతోష భరితుఁడగుచు 188

క. ఇతఁడు పరాంతక[1]తాపస
పతి వెలవడఁ దిరుగు నాదు ప్రాణం బగుటన్
సకలము మిత్రియుంతు సఖ
హిత మతుఁగు వేంబుపంపి వీడు నన్నంబున్ 189

క. దినదినము వైష్ణవా
ధన మొనరింపకయుఁ బరమ ధార్మికుఁ డగు స్వాం
గనతోడ భుజింపఁడు దా
ననుపమ మతిఁ జేసి యా మహాత్ముఁడు భక్తిన్ 190

క. ఈ విధమున బహురీతుల
ని వైష్ణవభోజనం బభీష్టముగా న
ద్భావమున మదర్పితముం
గావించుచు నుండు భక్తి గలవాఁడగుచున్ 191

మ. తన మార్గంబున రాకయుండు బహుసంతానంబువచ్చిన్ ధనం
బును లేకుండుటఁ జేసి బెంబేలి యసంపూర్ణాత్ముఁడై నిష్ఠచే
లను మద్భక్తుల పూ పేయుట కనుత్సాహంబు వాటింప నీ
యనఘ శ్రేష్ఠుఁ దపార్చ్యగం బట నిరాహారుండుగా వర్తిలున్ 192

---

1 మూ. తప.

తే.గీ. తనువు నప్పుడుంపుచును వాని దక్షిణమగు
కర్ణమందున తారకంబుగాఁ దనర్చు
మంత్ర మష్టాక్షరంబు సేయును బ్రజల
వర్ప్రలం దుపదేశించు భవ్యుఁ డగుచు 199

క. విమలంబై శుభమై సిరి
నమరిన యష్టాక్షరాఖ్యమగు మంత్రమునే
సుమహితుని మహాత్ముని య
య్యమలం బడఁ గృతార్థుఁ జేసి యచ్యుతుఁ డంతన్ 200

క. తనదు స్వరూపం బాతని
గన్పఁ గొనఁగాఁ జేసె వేడుకం గాని నారా
యణుఁడు పరాయణుఁ డాత్మర
జన పతిసెలాఁ దవ్వియుఁడు ప్రసన్న హృదయుఁడై 201

సీ. సజల పయోధర శ్యామ విగ్రహుఁడు పీ
తాంబర ధరుఁడు జనార్దనుండు
నవరత్న మణిమయోన్నత కిరీటుఁడు ది
మకర కుండల ధారి మాధవుండు
భాసిత వైజయంతీ వనమాలికా
భ్రాజమానుండు శుభప్రదాయి
జగదీశ్వరుఁడు కోటిమారసమానసుం
దరుఁడు శ్రీహరి భక్త వరదుఁ డతఁడు

తే. గీ. నిత్యముక్తుఁ డతిస్పృహుండు నీరజాస
నాగ నిద్రకనుత్తుఁడు సురక్షి ముఖ్య
వంద్యుం డప్రరోగణ వారయుతుఁడు
గా సముల్లాసి యగుచు నుద్గాథ మతిని 202

క. నామాంతస్థిత లక్ష్మీ
భూమీ నీళాదులైన భామలతో న
ద్దామ స్థితిఁ గైకొని హరి
కామరసాముండు సకల ధర్మాస్పదుఁడై 203

వ. వాలుష్మణన పర్యంత విశాల భవనాతపత్ర పరిశోభితుండును వేదాంత
వేద్యుండును గోటి భాస్కర ప్రభాభాసమానుండును నగు భగవంతుండు
దృగ్గోచరుండగుచు యష్టాక్షరాత్మకుండగు నా జగదీశ్వరుఁ గాంచి
యత్యంతవ్యగ్రేవరుండు వివిధ నిగమోక్త సంస్తవంబులఁ గొనియాడి
మహనీయ హర్షప్రాదుర్భ వ్యుండుచు నానంద్రాశ్రు పరిప్లుతుండును
నగుచు దేవదేవుండగు శార్ఙ్గి యనుగ్రహంబునం జేసి యాయుః ప్రబంధయాయా
గావించిమహానుభావుండగు నారదవున కర్పణంబు సేయ నా మురాంతకుండు
గృపాపూర్ణావలోకనంబున నతనిం గనుంగొని గౌఁగిటం జేర్చి గారవించి
పరమంబగు నిజధామంబు గూర్చి నతియె నని మహాయోగి మాహాత్మ్యంబును
శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబునందలి ద్వాత్రింశా
ధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు సకల ప్రజ్ఞా ధురం
ధరుండగు నరునకుం జెప్పె వెండియు నిట్లనియె 204

## వరకాలుఁడు శ్రీహరి దివ్యక్షేత్ర యాత్ర సల్పుట

క. అంతట శ్రీమంతుండు న
రాంతక మౌనీశ్వరుం డుదగ్ర వలాద
ధ్వాంత దివాకాంతము న
త్యంత సుఖనిరాంత ముపవనాంతము నగుచున్ 205

క. పరఁగెడు శ్రీరంగము న
య్యరవిందాక్షాంతరంగ మాశ్రితజన హృ
ద్వరసీరుహ సారంగము
గురుతర మతిఁ జేరి భక్తిఁగొని యతఁ డంతన్ 206

తే.గీ. అందుఁ దనరారు రంగనాయకునిఁ గాంచి
హర్ష నిర్భర హృదయుఁడై యతనిపాద
పంకరుహ యుగళముఁగూర్చి ప్రణతిఁజేసి
యాత్మారాముండు పరమయోగివరుఁడు 207

తే.గీ. మహిని వర్ధిష్ణు నాపాద మస్తకంబు
సంస్పృశింపుచు భక్తి సంసక్తచిత్తుఁ
డగుచు గద్గద నిస్స్వనుఁ డగుచుఁ బ్రీతి
హృష్ట రోమాంచలుఁ డగుచు నింపు మీఱ 208

క. నిగమ నిగమాంత సూత్రం
భగవంతుని సన్నుతించి పరమానందా
జగతిం గాన్నా ర్పించెన్
జగదీశ్వరు పాదసేవ సలుపుచు భక్తిన్ 209

తే.గీ. అంత శ్రీ వేంకటాధీశ వరదుఁ గొలువఁ
గోర్కె గావింపుచును మునికుంజరుండు
పారసదయాక్షుఁ డగు రంగశౌరి యాజ్ఞఁ
బడసి శ్రీశైలమున కేగె భవ్యమతిని 210

ఆ.వె. అంత నతనియాలయముఁ జొచ్చి నరసింహుఁ
డయిన విభునిఁ గూర్చి ప్రణతిఁజేసి
యమున కరిగి యాఘ నద్యుతు భక్తిఁ వ
ర్వలని వరదుఁ గాంచి సంతసమున 217

క. దివ్యస్తోత్రంబుల నా
రవ్యుం గొని యాడి మ్రొక్కి పరమద్యుతి సం
భావ్యగు శ్రీగిరి నా
సవ్యగుణాఢ్యుండు మౌనినాయకుఁ డరిగెన్ 217

క. సేవించి భక్తిఁ గాని శ్రీ
శైలారోహణముఁ జేయ శంకింపుచు న
న్నేకం దమ్మది దర్పద
మూలంబగు భక్త తీర్థమున వసియించెన్ 218

క. అందు దినత్రయ మతి భ
క్తిం దలకొని పంచబాణు విజ్ఞాకృతి సం
క్రందన ముఖవినుత పదర
విందుఁ జతుర్భుజుని విష్ణు వినుతించు కతిన్ 219

సీ. శ్రీశైలవాసుండు శ్రీనివాసుఁడు జగ
న్మయుఁడు పోషిత భక్త మండలుండు
పృథుల వక్షుఁడు దివ్య పీతాంబరధరుండు
దురిత హారకుఁడు చతుర్భుజుండు

సమదర్శకుఁడు శంఖ చక్ర గదా ధరుం
డతి సుందరాంగుఁ డనంతశాయి
హారకేయూర కోటీర మణి స్వర
కుండలాంగద భూషణుండు దివ్య

తే.గీ. గంధలిప్తాంగి కారుణ్య కలితబుద్ధి
శ్రీ సతీ భూమి నీళావిశిష్టుఁ డగుచు
తనదు భక్తునిఁ గనుగొను తలఁపుఁ జేసి
వచ్చి కౌఁగిట వాతనిఁ గ్రుచ్చి యెత్తి 220

క. జనకుని తెరతిఁ గరాంబుజ
మున గాత్రము నివిరి యతనిఁ గ్రౌఁగిటఁ బట్టి నా
మన సలరఁగుఁ దమ్ముం దెలిఁగి
యనుపమ మతిఁ దొగరెదె నా పరాంతకుఁ దల్చిన్ 221

వరదాయుఁడు శ్రీరంగమున గోపుర సప్తప్రాకార
నిర్మాణము గావించుట - శిల్పాంతు మోక్షమొసంగుట

వ. ఇట్లు స్తుతియించి యమ్మహాత్ము వసుమతిం బడసి దివ్యంబులగు హరి క్షేత్రంబు లన్నియుం గలయం దిరిగి యందందుఁ గం మూర్తులం గొని యాదిక్రమ్మఱ శ్రీరంగంబున కేతెంచి యా శ్రీరంగ భర్తకు పొం సప్తకంబు గావించెదనని మనంబున సంకల్పించి శ్రేయోపార్జితంబులగు వస్తువులం జేసి శిల్పులచేత దివ్యతుంగ వృణనహరంబులను సగోపురంబులను నగు సప్త ప్రాకారంబు లుదారంబులుగాఁ గావింప నా సమయంబునం దభావం బగుటం జేసి ద్రవ్య వ్యసన చింతా పరుఁ డగుచు జనంబులచేత నాగపురంబునందుండు స్వర్ణమయమగు జైన

ప్రతిమ గాలించి నిజ భావంబుతోఁ గూడఁ దా నందుఁ బని ప్రహృష్టుం
డగుచు బహువిధోపాయంబులం జేసి దానిం గైకొని రంగక్షేత్రంబున
కరుగుదెంచి శిల్పుం డతి యొకరంగి దృఢంబులును నాయతంబులును నగు
గాంచనంబులు సంపూర్ణంబులుగాఁ గట్టించి వెండియు నారఁజేసి మూప్పరి
రెండు మంటపంబులు నిర్మింపంజేసి యప్పురాంతకుండు ధనంబు
యాచింపుచు నా శిల్పులకై ధనం బెటుల నివ్వఁ గలను పరమంబగు
కైవల్యం బొసంగెద నదియే ఉత్కృష్టకర్మ సమంబని చిత్తంబున నిశ్చ
యించి వారల నావయం జెక్కించి యగాధంబగు కవేరికా విమల సలి
లంబు నందు మునుంగంజేసి శిల్పులకు శాశ్వతి యగు ముక్తి నొసంగు
మని శ్రీపతి యగు హరిం బ్రార్థించె నివ్విధంబున భక్త వత్సలుండగు
భగవంతుం డతనిచేతఁ బ్రార్థితుం డగుచు వారి కందఱికి నొసఁగి దుర్లభం
బగు నపవర్గం బొసంగ నా శిల్పు లందఱు మఱి బ్రహ్మమానంబులగు
విమానంబులతోఁ గూడ నిరీక్షింపుచున్న దివిజ జనుల కాశ్చర్యంబుగాఁ
బరమ పదంబుఁ గూర్చి రని రనంతరంబు 222

పరకాలుఁడు తైలమున ప్రతిమయను దైవగురుని జేయించుట

సీ. మహి సువర్ణ ప్రతిమా రోయనిఁగ నప్పు
రాంతకుఁ డెఱిఁగి రయంబు తోన
నరిగి [1]శైవ మనుష్యులందఱు సర్వంబు
భూపతి కెఱిఁగింప భూరి బలుఁడు
పాండ్య భూపాలుండు వారి వాక్యము విని
కనుచు దూతలచేత ననుప తోచ
నప్రియుఁ బరకాలు నయశాలి రావింప
నా మనుం డామనుజాధినాథు

---

1 మూ. బౌద్ధ

భక్తిం జేసి వినుచుందురు వారు అధిక సంపదల నొంది పిదప నీశ్వరుండగు
హరి యుత్తమాశ్రయ నిలయంబు చెందుదురని మహాయోగి మాహాత్మ్యం
బను శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి
త్రయస్త్రింశాధ్యాయము భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల
ప్రజ్ఞాధురంధరుండగు నరునకుం జెప్పెను 227

శా ఆదిత్యాంతరవర్తి భక్త నికర స్వాంతాంబుజ క్రీడ నా
పా దామోదర భారతీశ గిరిశన్యాధీశ దృగ్భృంగరా
స్వాద స్వాంఘ్రి పయోజయుగ్మ కరుణాపాథోనిధీ శ్రీధరా
గోదామానస విహార శరధీ గోపాలచూడామణీ 228

క [1]జయనవిమతహారా శ్రీక
వి యశోక్త మతప్రహార విపులరవచ
భయ పరకాల మునీశ హృ
దయ పంకజ భృంగ రంగ దైత్యవిభంగా 229

మాలిని సరస హృదయశీలా సర్వభక్తానుకూలా
నిరుపమ గుణజాలా నిర్జితారాతి పాలా
భరిత భువనజాలా భవ్యగాంగేయ చేలా
విరచిత కుశలీలా వేణుగోపాల బాలా 230

గద్య [1]ఇది శ్రీ రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణ సంలబ్ధ పాండిత్య
ధుర్యావధరణావనీమండలాఖండ సామ్రాజ్య ధౌరేయ న్యసమర్థతా కృత
పటహ ఢమంఢమారవ విపరీత పతనక్రియా ఢిల్లికాధీశ దుందుభిధ్వాన
కోలాహల హనుమద్ధ్వజాంక కనక దండీకృత హీరకంఠభూష నందిపిత

1 మూ జయని మతహార 'జైన'శబ్దమునకు బర్యాయముగా 'జయని'శబ్దము
ప్రాసస్థానమున ప్రయుక్తము మూ ౨ ఇతి

ప్రతాపకీర్తి ప్రభావ కౌసుంవంశ పయః పారావార రాకా సుధాకర పేరాంబర నాయక పౌత్ర రమణ భూపాలక పుత్ర లక్ష్మమాంబా గర్భశుక్తి ముక్తా ఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్యకలిత సుమసాయక విహారిపాట నాయక ప్రణీతంబైన శ్రీ మహాభార్గవపురాణంబునందు గోదానది విరహంబును విష్ణుచిత్తుండు శ్రీరంగంబున కేగుటెంచి శ్రీ రంగనాథుఁ బ్రార్థించుటయును నమ్మహానుభావుండు సపరివారంబుగా ధన్విపురంబునకుం బోయి విష్ణుచిత్తుం గన్నీటం బరిపాయించుటయుఁ గాంచుటయుఁ బరతాం బననంబును గుమదవల్లి వివాహంబును శ్రీరమహీకాంత పరాంతక నంగరంబును బరకాలుండు స్త్రీయోపార్జిత విత్తంబునం జేసి నిరంతరంబు వైష్ణవారాధనంబు సల్పుటయు రంగస్థల గోపుర ప్రాకార నిర్మాణంబును శిల్పమోక్షోపాదానంబును దివ్యకవి మతవిభంగంబును విష్ణుతత్త్వ సిద్ధాంతంబు వను కథలుంగల సప్తమాశ్వాసము సంపూర్ణము

# భార్గవ పురాణము

## అష్టమాశ్వాసము

క. శ్రీగోదావరియ దేవర
యాగమన కుముదచంద్ర యురుతర విభవా
భాగనగరివాసా శ్రీ
రీ గురుతరలీల సురపురీ గోపాలా 1

తే.గీ. అవధరింపుము దేవ నారాయణునకు
భీం విద్యాధురంధరుండైన నరుఁడు
పలికెఁ బ్రణిపత్తిఁ జేసి సంభావ్యమౌని
భక్తి దయతోత్త నిర్మల సూక్తి గదుర 2

తే.గీ. సకల భూతాల జన్మ ప్రపంచమునందుఁ
బల్కరించి శివ ప్రేమచేఁ బలకరాకు
రూపభేదమ్ములనుఁ జేసి రూఢి కెక్క
శేషభూతుండుగా నెంచు శేషుఁ డెవఁడు 3

క. ఏమని మగు నరని యపరా
రము బల్కుటలేదు మౌనిరాయ మహాత్మా
యేమంటివి యని పలికెదు
కమనీయాకృతిని గూర్చి కౌతూహలియై. 4

క. నారాయణముని యాత్రికి
పారాయణముని పఠించె భవ్యమతీ నీ
కారూఢి దీనిఁ దెల్పుట
కై రంజిల నారదముని గమంచికలించెన్ ౬

## శ్రీ పృథుపుర వర్ణనము

క. వినుము సావధానమున నో
మునివర యిప్పుణ్యచరితమును నీకు నయం
బున వివరించెద వినఁగో
రిన వారల కల్మషము హరింపగ జగతిన్

సీ. సంతతం బభ్రస్రవంతికి దీటుగా
పొదలెడు నిర్మల నదులు గల్గి
పాకశాసన వన ప్రతిభఁ జెంపొందుచు
సమితంబుగు నందనములు గల్గి
యమరావతికి సరియై దివ్య సంపదఁ
దనరారు పట్టణతతులు గల్గి
భృగువశిష్ఠాత్రేయ ఋషి సమానస్కంధు
లైన విప్రులసంచయములు గల్గి

తే.గీ. యమర ద్రావిడ దేశంబునందు సర్వ
భూతమంతు మనోహరంబుగఁ దనర్చు
సంతతాళిం భాగ్యైక సరణిఁ బొల్చు
పృథివి విభవాస్పదంబు శ్రీ పృథుపురంబు. ౭

చ. అనుపమ తర్కరత్న ఖచితాలయ గోపురరాజి గల్గి నం
దనతతి మల్లసిల్లి సముదంచిత నిర్మల నీర సారమై
తనరు సరళ్ప్రయంబున సుదారమునై ద్విజరాజరాజి శ్రీ భూ
ద్ర రుచిరశోభ సంస్థితి విధాయకమౌ పృథువట్టణంబునన్ ౮

సీ. తనరు నిర్మల మనం బనయంబు గమలాక్ష
పదపద్మమునకు బంధరము గాఁగఁ
దనరు మూర్ధ్నంబు సొంపుగాని వనమాలి కం
ధరమున కలువలదండ గాఁగఁ
దనరు హస్తంబులు దామోదరునకు నం
తుష్టంబులైన పాదుకలు గాఁగఁ
దనరు కర్ణంబులు వసుధానాథ కథామృ
తమునకు విపులకూపములు గాఁగఁ

తే.గీ. దన యభిప్రాయ మితరమత ప్రకాండ
గాఢ తామిస్రమునకు భాస్కరుఁడు గాఁగఁ
దగు మహాసూరి వంశ వర్ధనుఁడ నునుఁడు
వైష్ణవాగ్రేసరుఁడు కేశవ ద్విజుండు ౯

శేషుఁడు రామానుజుఁడుగా నవతరించుట

క. ఆ వైష్ణవున కనంతాం
శావిర్భవుఁ డమితతేజుఁ డగు తనయుఁడు నం
భావిత విశిష్టమత ర
క్షా వహుఁడు దనర్చు విపులకౌతూహలియై, 10

వ చైత్రమాసంబునందలి శుద్ధదినంబునందు మంగళ ప్రదంబగు నార్ద్రా నక్షత్రంబు నందలి శుభలగ్నంబునందుఁ బ్రాదుర్భవించిన యమ్మహాను భావునకు జనకుండు ముదంబునం జేసి రామానుజుండని నామంబు గావించె 11

సీ ఘనతరాత్ముం డగు జనకుండు తనయునిఁ
పంచసంస్కార సంపన్నుఁ జేసి
యుపనీతుఁ గావించి యపరిమితములుగాఁ
దనరారు వేదశాస్త్రములు చెప్పి
రూఢిగాఁ బ్రహ్మ స్వరూపునిఁ గావింప
ధన్యుఁ డాతఁడు తన తండ్రివలనఁ
బ్రాజ్ఞుఁ డౌటయుఁ బరికించి రమ్యత
యగు కాంతి మతి మహాహర్షమొంద

తే.గీ. యౌవనస్థితిఁ జెంపొందు నాత్మజున్నుఁ
గాంచి జనకుండు బంధు సంతతియుఁ దగుచుఁ
బరిణయముఁ జేసి నిగమోక్త సరణి గాఁగ
నిరతిశయ సుఖ శాంతిఁ బరగు మదిని 12

రామానుజుఁడు కాంచిపురికిఁ జని వరదుని స్తుతించుట

క అంతట రామానుజముని
కాంతుఁడు ప్రస్థానశీల గౌతూహలియై
సంతత ధర్మావృత గృహ
సంతతి గల కాంచిపురికిఁ జని యచ్చోటన్ 13

చ. వరగుణ సమస్తలోకవిభు భాస్కరకోటి సమప్రభున్ ప్రభున్
వరదుని భక్తవత్సలుఁ గృపామృతవారిధి దివ్యభాంబరా
భరు నసితాభ్రవర్ణుని విభాసితసుందరగాత్రు దైత్యసం
హరు వనమాలికాధరు నుదారచతుర్భుజుఁ గౌషితశ్రవణున్ 14

సీ. శ్రీవత్స కౌస్తుభాంచిత మహోరస్కుని
సతతప్రసన్న ముఖారవిందు
సారసాక్షుని దివ్యచందనచర్చితు
భుగభరణాపాంగు సుందరాంగు
శ్రీ భూమి నీళాది సేవితపార్శ్వు
శార్ఙ్గ కౌమోదకీ శంఖ చక్ర
నందకధారి ననంతాది నిత్య ము
క్తవర పూజితుఁ గమం బాదు

తే.గీ. హారకేయూరరత్నకోటీర కుండ
లాంగదాది విభూషితు నబ్జగర్భ
శర్వ శక్ర సనక ముఖ్యజనమతాంఘ్రి
పద్మ పద్మాక్షు వీక్షణం బగుచుఁ గాంచి 15

క. మనమున సంతోషంబునఁ
బ్రణతి నలిపి నిగమసంస్తవ[1] ఫణితులను ద
ద్వనజాక్షుని బొగడి మరం
బున భక్తింగొని కరాబ్జములు మొగిడి యటన్ 16

1 ఫణితుంబు

క. శ్రీమన్నారాయణ హరి
సామజగిరినిలయ నీరద చరణాంబుజ ఘ
ర్మాముగతి శరణా వాక్ప్రద
భూమీధర శౌరి నిఖిల భువన శరణ్యా ౧౭

సీ. విశ్వశరీరాయ శాశ్వతవిభవాయ
యిందిరేశాయ యాత్మేశ్వరాయ
శ్రీవత్సినే సర్వశేషిణే సర్వ ని
యంత్రే విభూతిద్వయాధిపాయ
నిఖిలలోకత్రిధర్మిణే త్రిలోకేశాయ
పుండరీకాక్షాయ బుధనుతాయ
జన్మసంస్థితి వినాశన కర్మధారిణే
తే నమోనమ యని దివ్యమతిని

ఆ.వె. పొగడు వాఁడ నిన్ను భగవంత గుణవంత
శాంత వార్ధి రాజ్ఞకాంత మౌని
కాంత హృదయ పంకజాంతరవాస య
నంతకాయ వైభవానపాయ ౧౮

తే.గీ. మనుఁడ వగునట్టి నీవు లోకములకెల్ల
రక్షకుఁడ వౌదు సత్ప్రతి రమ్యమూర్తి
జగములకుఁ గారణములుగాఁ దగిన యరుప
దేరు తత్త్వంబులకు రాజవిద్ధ చరిత. ౧౯

సీ. ఐంతాక్ష యస్త్ర భూషణ రూపధారివి
పరమాత్ముఁడవు పరాత్పరుఁడ వగు
హరి పరబ్రహ్మంబు వక్షానుత పరం
జ్యోతివి శౌరి దామోదర హరి
విశ్వమూర్తి సహస్రమూర్ధ విశ్వాత్మ స
హస్రాక్షుఁడవయి సహస్రపాదుఁ
డవయి భాసింతు మాధవ సర్వగతుఁడవు
యజ్ఞస్వరూపివి యజ్ఞపతివి

తే.గీ. యజ్ఞభోక్తవు నిత్యుండ వజ్ఞనాథ
లోకలోకివి లోకత్రిలోచనుఁడవు
సధ్వర హవిస్సు వగుదు వనంతశాయి
శాశ్వతుండవు గురుఁడవు చక్రపాణి 20

తే.గీ. అచ్యుతుండవు సర్వలోకాధిపతివి
యవం శ్రీమదనంత కల్యాణగుణ సు
ధాంబురాశివి కృష్ణుండ వంబుజాక్ష
శాశ్వతుండవు సంతతైశ్వర్య ధనివి 21

వ. దేవా నీ వకారవాచ్యుండవు శ్రీభూనీళాది నాయకుండవు ప్రభుండవు
గాన నీవ విశ్వంబుఁ బాలించి యత్యతిష్ఠద్దశాంగుళం బనెడు శ్రుత్యర్థమూర్తివి
గదా పురుషోత్తమా నీవ యమ్మూలంబున నీశ్వరుండవు వ్యాపకంబునగు
మంత్రంబు లివయగు తతన సనాతనుండవు వాసుదేవుండ వాదిమధ్యాంత

రామానుజుఁడు యాదవప్రకాశుని కడ శాస్త్రపఠన మొనర్చుట

క. ఈ మాడ్కి దేవదేవుని
స్వామి నఖిల లోకనాథు వరదు మహాత్మున్
రామానుజ మునివర్యుఁడు
ప్రేమఁ గొలిచి యంత నం దభీష్టత నుండన్ 24

తే.గీ. అందు నిగమాంత శాస్త్రంబు నధికరింప
యాదవునిఁ జేరి యాంక్ష్మతాఖ్యమౌని
యతని వద్దను దద్భాష్య మమల మతిని
పఠనచేయుచు నచట నావాస మొంది 25

క. నిరతంబు శ్రీకరిధరా
ధరవరు వరదాయి భక్తతతి మందారున్
పరమప్రీతి భజింపుచు
నెరయగ లక్ష్మణ మునీంద్రుఁ డలరారు తఱిన్ 26

ఉ. నిరుపమమూర్తి చోళధరణీవరు పుత్రిక బ్రహ్మరాక్షసుం
డురుతర వేగముంగొని సమున్నతి సోఁకియు ధాత్రిఁగల్గు నె
వ్వరుముల చేత నేనిఁ బరిపూరిత మంత్ర విధాన పద్ధతిన్
గరము దొలంగకుండెఁ బరికల్పిత దుష్టమదోగ్ర వృత్తిమై 27

తే.గీ. రమ్యమతిఁ జేసి మంత్ర తంత్రముల చేతఁ
దొలఁగగా నెవ్వఁడేని శక్తుండు గాక
పోవుటయు రాజు లక్ష్మణముని సమేతుఁ
డైన యాదవుఁ బిలిపింప నా ఘనుండు 29

## చోళరాజపుత్రికి సోఁకిన బ్రహ్మరాక్షసి యాదవప్రకాశుని దూలనాడుట

చ ధరణి సమస్త విశ్వసంహారణయుగఁ దత్పురిఁ జేరవచ్చి ని
ర్భరగతి బ్రహ్మరాక్షసుఁడు పట్టిన యానృపపుత్రిఁ గాంచి వి
స్ఫురితుఁడు తైన భిక్షుకుఁడు దూర్జటియుండు సమస్తమంత్రముల్
నిరుపమమైన ప్రజ్ఞఁ గొని నేర్చిన వాఁడగుటన్ మదంబునన్ 29

తే.గీ. ఉగ్రభీకరంబైన నొప్పు నుగ్ర
మంత్రముల నభిమంత్రించు మౌనివరుని
యాదవుని బ్రహ్మరాక్షసి యరసి లెక్కఁ
గొనక దుర్వారమూర్తిఁగైకొని రయముగ 30

తే.గీ. అందు గంభీర బ్రహ్మఘోష నెరి
గణవసేయక దుర్మద కలితయగుచు
నభిల జన్మంబు లెఱిఁగిన యట్టి పెలుచఁ
బలికె యాదవ యతిఁ గూర్చి యలఘుమతిని 31

క గురుతరుఁడగు శ్రీశైలే
శ్వరు యాత్రకు సతత మరుగు జనతతుల రవ
స్ఫురణం బంతట నిండిన
నరనస్థితి దాని విమదు సంరంభము గాన్ 32

వ విశాలంబును మనోహరంబునునగు సముత్ఫుల్ల కుముదకైరవ నికర పరిమళాస్వాదనమత్త మధుకర ఝంకార నిరాఘాటంబగు తటాక సమీపంబు నందలి వల్మీకంబునం దీవు పూర్వంబునం దురుమ వగుచు పతితులగు వైష్ణవుల భుక్తశేషాన్నభక్షణంబు గావలన నీదృశంబగు రూపంబు గైకొంటివి భిక్షుకా మత్తున్మంబు విడింపెద వదెట్లంటేని 33

క. మును నేను మహాయజ్ఞం
బును మనుకొని యాజకత్వమును జేయఁగ నా
కును మంత్రలోప పాపమునఁ
బెనుపొందెను రాక్షసత్వమును యతివర్యా 84

సీ. ఈ దృశంబ యయిన యీపాపు నవ్వారింపఁ
గా సమర్థుండవు గావు యతివ
యఖిల చేతన రక్షణార్థమై శేషాంశ
మున నవతీర్ణుఁడై పొలుపుమీఱు
కారుణ్య జలధి యీ ఘనుఁడు రామానుజ
ముని దర్శనీయుఁడే పురుషుఁడేని
నాదగు నీచ జన్మము బాపఁగాఁ జాలఁ
డిమ్మహామహుఁ డాజ్ఞ యిచ్చెనేని

తే.గీ. బీ యుక్తిఁ బాసిపోయెద నేనటంచుఁ
బలికి లక్ష్మణముని పాదపద్మములను
వ్రాలి నప్పుడు చోళభూవరుఁడు యాద
వప్రకాశయతియు వదాన్యమతిని 85

## రామానుజుఁడు చోళరాజకన్యను బ్రహ్మరాక్షస విముక్తం గావించుట

వ. సర్వంసహాలంకృతుం డగు లక్ష్మణమునిం బ్రార్థింప నమ్మహానుభావుం డీ
బ్రాకృత శరీరంబు బాసి ముక్తిం జను మని యాజ్ఞ యొసంగిన యెడ నా
బ్రహ్మరాక్షసి యా గాత్రంబు దొలంగి సకలజనులు చూచుచుండఁ బర
మంబగు వైష్ణవ లోకంబుఁ గూర్చి చనియె నంత రామానుజుండు నయార

నుండుగా రాజుచే బాలుం డగుచుఁ గ్రమ్మఱఁ గాంచీపురంబున కేఁగు దెంచి శ్రుతస్మృతిపూర్వవాదియగు వయ్యాదవుం బరిత్యజించి సర్వోత్తరాదరం బులం జేసి యనయం బతిశయంబుగా వరదు సేవింపుచు నం దధివసించె నని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమతంబును నగు భార్గవపురా ణోత్తర ఖండంబు నందలి చతుస్త్రింశాధ్యాయంబు భక్తపరాయణుం డగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞా ధురంధరుం డగు నరునకుం జెప్పె నంతియు నిట్లనియె 36

తే.గీ. అంత నమయంబు నను మహా న్నిధియైన
లక్ష్మణార్యుఁడు భూసుర లక్షణుండు
పండితుండు మహాపూర్ణ పాదపంక
జద్వయం బాశ్రయించె సుత్సాహి యగుచు

క. అని నారాయణముని వ
ల్కిన పల్కులిండి నక్తికేవం మతియై
ఘనుఁడు నరుఁడు కేలు మొగిడి
వినయంబున నతని కనియె విమలతరోక్తిన్ 38

తే.గీ. ఇల మహాపూర్ణముని యెవ్వఁ డెవ్వ రతని
దేశికుం డే ఘనుని యంశఁ దేజరిల్లె
సమస్తంబు నాకు నీ వెలుఁగఁ జేయు
మతి కరుణఁ జేసి నారాయణాఖ్య మౌని 39

క. అని నరుఁడు వేఁడుకొనుచో
ననురాగంబునఁ గృపారసాయత్తుం డై
జనమతిలేఖుండు చిరం
తనముని నారాయణుం డుదారత ననియెన్ 40

## మహాపూర్ణ వృత్తాంతము

మ. నానారత్న విచిత్ర గోపురమునై నారాయణ గ్రామ మా
ద్యానోపేతమునై కవేరతనయా పాంతస్థమై యొప్పు నం
దానమ్ర స్థితి నీశ్వరాఖ్యుఁడు యోగాభ్యాసిన్ విడంబించు మున్
శ్రీనారాయణ పాద నీరజ యుగాళీ ప్రధానాత్ముఁడై 41

తే.గీ. భూసురాగ్రణి వైష్ణవ పుంగవుండు
ఘనతరుం డీశ్వరాహ్వయ ముని దనర్చు
మహిత మతియు విష్వక్సేన మంత్రియగు గ
జాననుని యంశమునఁ బుట్టి నట్టివాఁడు 42

క. నాథమునినాథుఁడు రమా
నాథ పదాంభోజ యుగ్మ నందిత మధురి
మాథ సమన్వితుఁడై దివ్య
నాథార్చితుఁడై తనర్చె నన్వయుఁడంతై 43

క. సుతుఁడుం డా నాథమునికి
విదితామోఘుండు గల్గి వృష్ణి గర్భాం
తజుఁ డీశ్వరాభిధానుఁడు
ద్విజవర్యుఁడు ధర్మవేది దీపిత మతియై 44

క. పరతత్త్వ విదుఁడు వైష్ణవ
పరివారారాధనైక పరుఁడు సతత వి
శ్వర నిగమాంత విశారదుఁ
డురుతర కీర్తిప్రదాతుఁడొప్పు ధరిత్రిన్ 45

క. ఆ నందనుతోఁ గూడ న
దానందుఁడు నాథముని మహాత్ముఁడు పెక్కా
నేక క్షేత్రములం 48
దానమ్రుండై దివ్యత్రయంబుండి యటన్

క. యమునా నదీ తటమునం
దమరెడు గోవర్ధనాద్రియందు మదిని యో
ద్యమ యోగనిద్ర నై కొని 47
సుమహిత సామాధ్యలానుభ ఫలింపుచుఁదాన్

సీ. నిరతంబు సద్ధ్యాన నిరతుఁడై యమ్ముని
చిరకాల మందు వసించి యంతఁ
బద్మనాభుని యాజ్ఞ వడసి వెంబడియును నా
రాయణ పురమున కరుగుదెంచి
యఖిలంబు లీనమై యంగారు ద్రావిడ
ప్రతి నిర్వహింప నారూఢి మించి
కురుకాంతమున కేఁగి గురుతరంబుగ నందు
విలసిల్లు తింత్రిణీ వృక్ష మూల

ఆ.వె. మాశ్రయించి పెద్దయగు తపోమౌని నా
యతుఁ బరాంకుశుని సుదారభక్తిఁ
దానుపాసనంబు గావింప శరకోప 15
మునివరుండు ప్రేమఁ దనరు మదిని

క. అతని పురోభాగమునం
దతిశయ మగు దీప్తిఁ దోఁచ నమ్ముని గని యం
చిత భక్తి భూమి సోఁక మ
హితమతి నాథర్షి మ్రొక్కి యిష్ట మెసర్పన్ 59

ఉ. అమ్మునిరాజవల్లను సమస్తము ద్రావిడ వేదముం గ్రమో
దమ్మున సంగ్రహించి మునివాదరితం బెఱఁగాపు న్యాసయో
గమ్ము నొకప్పుడేనిఁ బలుకన్ శుభదమ్ము ను ముక్తిదమ్మునై
నమ్మతిఁ దొల్పదాని సరసస్థితిఁ గైకొని యంతవేడుకన్ 60

క. క్షమరక్షదుప్పారబ యా
క్రమువల్ల సమస్తకలాపతతిఁ దొలఁగను ను
ద్యమము రహస్యము న్యాసము
విమలమతిం దనరు శిష్యవితతి కొసంగెన్ 61

వ. అంత

క. సరసు జయత్సేనాంశజ
స్ఫురితాత్మకుఁ బుండరీకమునివర్యు ఘనున్
గురుకేశాంశజ యోగీ
శ్వరు నిలుపుచు యోగవిదుని ధన్యవిచారున్ 62

వ. అయ్యురువురం బిలిచి ప్రసన్నహృదయుం డగుచు నా నాథమునీంద్రుం
డిట్లనియె

సీ. అద్భుత సింహాసనాంశ సంజాతుఁడౌ
పుత్రుఁ డయ్యెడు నీకుఁ బుత్ర వాని
ధామాధి యామునాహ్వయమున నీ వొనరింపు
మరఁదు మత్ప్రియుఁడుగా నలరుచుండుఁ
బుండరీకాక్ష నీవును నాదు పౌత్రుఁడౌ
యోగీంద్రునకు న్యాసయోగ మర్థి
ద్రావిడాగమము నుదారత నుపదేశ
మిమ్ము ప్రేమను కురుకేశ నీవు

తే.గీ. యోగ విద్య నొసంగు మనూన వృత్తి
ననుచు నివ్విధమున వారి నాజ్ఞ గఱపి
నపవర్గ శరంబు గనిన పిదప
నాథముని పూర్వయోగ సంధానుఁ డగుచు ౬౬

వ. నిజశరీరము దొలఁగి పరమంబగు విష్ణుపదంబుఁ బ్రాపించె నంత పుండరీకాక్షుండు కురుకాధాంశ సంభవుండును శ్రీరామ మిశ్రాఖ్యుండును నగు శిష్యుంబిలిచి ప్రహర్షితుండగుచు రహస్యమైన యష్టాక్షర వ్యాసంబును ద్రావిడామ్నాయంబులను నుపదేశించి యాళ్వారాఖ్యమునికి శ్రీమంతుండును సింహాసనాంశజుండును వేదవిదుండును మహామునియు నగు పుత్రుండు గాఁగలండు శ్రీరామమిశ్రార్య సర్వజ్ఞుండును మహాత్ముండును నగు వానికీవుఁ ద్వరితంబుగా ద్రావిడాగమంబు నుపదేశం బొసంగుము మహాత్ముఁడగు నయ్యామునమునికి నేవురు శిష్యు లయ్యెద రనుం దలం దక్ష గావింప నవంతరంబున గురు దాశార్య సంభవుండగు మహాపూర్ణుండును దత్త్వవిదుండును మహానుభావుండును హరిప్రియుండును సుముఖాంశజుండును

నగు శ్రీశైల పూర్ణుండును కంచి పట్టాంగ సంజాతుండగు కాంచీపూర్ణ సంయమియును విజ్ఞాతుండును బంధరీకాంగ సంభవుండును నగు గోష్ఠీపూర్ణుండును ఐ మానాంతుండును మహానీయుండును నగు శ్రీమాల్యధరనామకుండును నగు పీఠంబందలి యామున శిష్యులగుచు సర్వజ్ఞులును మహామహులును తత్త్వకోవిదులును నగుట వారు హరిక్షేత్రంబులయం దధివసింపుచు మనుజులం బవిత్రులం గావింపుచు తమ్ము మహాపూర్ణుండు నిరంతరంబు గురునిం గూర్చి యను వర్తింపుచు నతనిచేత బోధింపంబడిన యశేషరహస్యార్థంబు గల వారయ్యె యామునమునీంద్రుండు సకలసమయంబులు నిర్జించి కుమారు రాజ్యస్థాపితుం జేసి విష్ణునందు భక్తిగల వాం డగుచు భిక్షుకాశ్రమం బాశ్రయించి మహాపూర్ణ సహితుం డగుచు రంగక్షేత్రంబునం దావాసంబు గావింప లక్ష్మణమునీంద్రుండు కాంచీపూర్ణ మహాత్ముల వలన దేవరాజ సందిష్టుం డగుచు వరుణుండగు సమ్ము మహాపూర్ణు నాశ్రయించి సేవ మహాత్ముండగు ఎతండు యామునార్యు నిక్షిప్తంబగు రహస్యం బంతయు శిష్యుండగు రామానుజార్యున కొసంగె నని మహాయోగి మహత్త్వంబును శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి పంచత్రింశాధ్యాయంబు భక్తపరాయణుండగు నారాయణుండు నిఖిల ప్రజ్ఞాధురంధరుండగు వరుణునకుం జెప్ప వేఁడియు నిట్లనియె

## రామానుజుండు భిక్షాశ్రమము గొనుట

తే. గీ. అంత లక్ష్మణయోగి పద్మాక్షు వరద
రాజ గురు విష్ణు భగవంతు రమ్యమూర్తి
సన్నిధిని దాన భిక్షుకాశ్రమము గొనియె
నిగమ నిగమాంతతత్త్వార్థ నిపుణమతిని 67

సీ. అట యోగివరుఁడు రామానుజార్యుఁడు సర్వ
వేదవిదుం డను మోదకుండు
కాంచి యం దధివసియించినచో సుప్ర
తిష్ఠాంశకుఁడు సముదీర్ణ గుణుఁడు
సత్పురుషుండు దాశరథి సఖ్యుఁడు మహా
మహుఁడు నిష్కల్మష మానసుండు
శర్వనేత్రాంశ సంజాతుఁడు శ్రీవత్స
మిశ్రాహ్వయుఁడు గంభీరజలధి

తే.గీ. యనెడు నిర్జర హస్తి ధరాధినాథ
ధామమున కేఁగుదెంచె నంతసముతోడ
నంచుఁగం యయ్యతీశ్వరు నాశ్రయించి
దరవిచే పంచసంస్కృతు లగుచు నెసఁగి ౫౮

క. యతిరాజ పదాంబుజములు
సతతము సేవింపుచును విచక్షణమతులై
చతురామ్నాయ షడంగ
స్థితి భగవన్నిష్ఠ గలిగి చెలఁగిరి భక్తిన్ ౫౯

## రామానుజుఁడు యాదవప్రకాశు ననుగ్రహించుట

క. అంతట నయ్యాదవయతి
నెంతయుఁ గని యతని జనని యిటనియె హారీ
స్వాంతంబుఁ జేసి నుత యో
వింతగ నీ వున్న యట్టి విధ మనుదినమా. ౬౦

క. శరణాగతవత్సలుం డని
పరమన్నుఁ బవిత్రుఁగాఁగ భావింపుము నీ
కరుణ నని పల్కి చేయుచు
వరమునఁ బెద్దఁ గాని వినుతిఁ జేసె యతీంద్రుఁడున్. ౮౫

క. తలఁపఁ నపారస్తోత్రం
బుల లక్ష్మణదేశికుఁ గూర్చి పొగడినతో నం
క్కలి యరని యెదలఁ గరుణా
కలితుఁ డగుచు యతికులాగ్రగణ్యుం డంతన్. ౮౬

తే.గీ. పంచ సంస్కారములచే సుదంచితముగ
యాదవుని సంస్కృతునిఁ జేసి యవలఁ గ్రమము
వల్ల సురపీఠుఁ గావించి యుల్ల మలర
ఘనిఁ ద్రిదండినిఁ జేసె సంపూర్ణమతిని 87

రామానుజుఁడు శ్రీరంగము చేరి రంగనాథుని స్తుతించుట

వ. అంత శ్రీరంగనాథుండే నారాయణమూర్తి యగుచు మహనీయంబగు
నాక్షేత్రంబుఁ జేరి పుణ్యమూర్తి నిషేవితయును భయహరస్థ దివ్యాశ్రమ
సమాలంకృతయు నమ్మతోపమాన నిర్మలజలపూరితయుఁ ద్రిదశ గంధర్వ
కిన్నర కింపురుష పరిశోభితయు బృందారకనందన బృంద నిష్యందయు
నిరంతర సురనికర రమమాణ ప్రభావయు దైవర్షి సిద్ధ సాధ్య విద్యా
ధరాప్లుత జీవనయు నిర్మలోత్పల కల్హార సారస నికాయ ప్రవర్ధమానయు
వికసిత కుముదసముదయ పరిశోభితయు కుసుమనికరపరాగ పరిమళాంత
రయు విపులస్వచ్ఛ వాలుకా మాలికయు నానాప్రసూన సమూహ కృమత్త
మధుకర ఝుంకారసంకులయు రాజహంసకలహంస చక్ర కారండవ

ద్వారకాశ విహర్యమాణ ప్రకారయు మరకతీర్వాయాన పాయి శైవాల జాలయు జహూతరావర్త కలపిత నికర గంభీరన్యవయు మత్స్య కచ్ఛ, ప నక్రాద్యనేక జలచర పరివృతయు ధర్మార్థకామమోక్ష చతుర్విధాభిలేష్ట ప్రదయు దర్శన స్పర్శన స్నానంబులవలన నరుల కలుష కులం బొనంగు దాని నవలోకించి

క. జలధము విధ్యుక్తముగా
నలిపి పరమ మైత్రయుక్తి జపమొనరించి య
వ్వల శ్రీరంగమునకుఁ జని
జలజాక్షున్ ముక్తిదాయి సామజవరదున్. ౬౯

సీ. శేషాధిపత్ర సింహపీఠ మణిశ్యాము
ఫణిరాజఫణితల్ప పద్మనాభు
విలసితమకరకుండల భానుకోటి సం
కాశ కిరీట కంకణ సువర్ణ
హారకేయూరాంగదాది భూషణ భూషి
తాంగు భాసిత కనకాంబరధరు
దీపితవైజయంతీవనమాలికా
కలితుని శ్రీవత్స కౌస్తుభమణి

తే.గీ. పక్షగుని దేవదేవుని వాసుదేవు
దీర్ఘ చాపవిరాజితు దివ్యవదనుఁ
బుండరీకాయతేక్షణుఁ బుణ్యచరణు
సకలలోకైక శరణు భాస్వత్ప్రభావు, 70

వ. వనస్పతి ఓషధి చంద్ర నక్షత్ర గ్రహార్క వివిధ భూతంబుల
యం దంతట సంస్థితుండవగు విష్ణు స్మృతి పరబ్రహ్మంబుగాఁ బల్కు
చుండు శ్రుతివచ్ఛ్రుతి యనెడు ప్రత్యక్షంబునం జేసి హిరణ్మయ స్వరూప
యజ్ఞ స్వరూపుండ వగుటఁ బరయగు శ్రుతి నిన్నుఁ బరమాత్మగాఁ బ్రశం
సింపు చున్కి నీవ యోంకారుండవు నీవ వషట్కారుండవు నీవ యజ్ఞ
హవిస్స్వరూపుండవు నీవ సర్వజ్ఞుండవు సర్వేశ్వరుండవు సనాతనుండవు
పుండరీకాక్ష సర్వశేషివగు నీవు సత్పురుషుండవుఁ బతి వగుట
సర్వ జగంబుల కీవ జనయితవగు సుహృద్విభుండవు గాన
లోకంబుల కీ వుపాస్యుండ వగుదు వరించెడు నుపాసకు లగుట
భూతంబులు ధరింపుచున్న నీవు సర్వభూత నియంతవు భూతకర్తవుంగా
వలయు కతన నీ వనంతగుణ సంయుతుండవు ననంతార్క ప్రకాశవంత
వగుట మహాత్మా శంఖ చక్ర గదా ధరుండ వగుచు దివ్యరూపంబు
గైకొన్న మహానుభావుండవు నిగమంబులు నవిశేషుండ వగు నిన్ను నిరు
పాధికంబును బరాత్పరంబును జగదీశ్వరంబును నగు పరబ్రహ్మంబుగాఁ
బల్కుచున్నవి రమేశా నీవు నిత్యులకు నిత్యుండవు చేతనులకుఁ జేతనుండ
వనేకుల కీవ ముఖ్యుండవగుచుఁ గోర్కు లొసంగు పుణ్యపురుషుండ
వగుటం జేసి భవదుపాసకులగు ప్రపన్నులు నిన్నుఁ బ్రశంసింపుచు మొదట
నిన్నె లక్ష్యంబుగాఁ జేసి పిదప బాణరూపం బగు నాత్మ నోంకారంబను
ధనువునం దెక్కువెట్టి ప్రమత్తరహితాత్ములగుచు లక్ష్యంబగు నా
బ్రహ్మంబు నిరీక్షింపుచుఁ దత్స్వరూపులగుదురు నీయం దుంచఁబడిన
బాణని లక్ష్యదార్ఢ్యంబు వెండియు నిట్టిదియె 79

తే. గీ. శేషపర్యంకశాయి లక్ష్మీనివాస
పద్మనాభ పయోరుహభవ కర్త
విమల చరణారవింద శ్రీ విష్ణుదేవ
నీకు దండ ప్రణామంబు నే నొనర్తు 60

సీ. సంకర్షణాయ కృష్ణాయానిరుద్ధాయ
వాసుదేవాయ వరప్రదాయ
నారాయణాయ సురారిసంహరణాయ
హరయేచ్యుతాయ రమాధిపాయ
దురితదూరాయ ప్రద్యుమ్నాయ రామాయ
శాశ్వతాయ సమస్తజనసుతాయ
గోవర్ధనధరాయ గోవిందరూపాయ
లోకైకవేద్యాయ మనతరాయ

తే.గీ. దివ్యభూషణభూషాయ దివ్యగంధ
లిప్తదేహాయ సంతతవ్యాప్తయే మ
హా కుసుమ ధారిణే సుందరాంగిణే న
మో నమో యని నిన్ను నేఁ బొగడుదాఁడ 81

మ. నిగమాధీశ్వర నీకు దండము రమానేతా మురారాతి ప
న్నగ లోకేశ్వర శాయి నీ చరణ మౌన్నత్యంబుగాఁ బొల్తు న
ర్వగ శ్రీరంగ ధరాధినాథ భవదూరా నీకు జోహారు హే
య గుణాతీత ముకుంద నీకు నతి బ్రహ్మస్తోత్ర పాత్రక్రియా 82

తే.గీ. అంచునాను ప్రసన్నుఁడ వగుము దేవ
దేవ ప్రత్యక్షవగు రమాధీశ శౌరి
మనవిని యనుగ్రహింపు జగన్నివాస
రమ్యు కరుణాసముద్ర శ్రీరామభద్ర 83

క. అని యా బ్రాహ్మణ కల్పక
మునుగాఁ దనరారు రంగభూపతి వినుతిం
గొని యా లక్ష్మార్యుచే
గొనియె విభూతి ద్వయైక గుణ వైభవముల్, ౮౪

సీ. యతిశేఖరుండు రామానుజాచార్యుఁడు కలి
పయ మగునట్టి సమయమునందు
రంగధామ పాదరాజీవ సేవా
వ్రతియై యధివసించి పిదపఁ
బుధ్యాత్ముఁడగు మహాపూర్ణుని ప్రేరణం
బునను గోష్ఠిపూర్ణ బుధవరేణ్యు
చెంత రహస్య మర్థాంతరంబుగాఁ దెలి
యు కొలఁకు భయభక్తు లుప్పతిల్లఁ

తే.గీ. గొలుచు కురుకేశ దాశరథులను శిష్యు
లధికముగు భక్తిఁ తనవెంట నంటిరాఁగ
నమ్మహాముని కడ కేఁగి యతుల దీక్షఁ
దగుచు దండప్రణామంబు లాచరించి ౮౫

తే.గీ. అమ్మహాత్మునివల్లఁ దత్త్వార్థ మెఱిఁగి
దివ్యమతి నందఱికి నుపదేశ మిచ్చి
బ్రహ్మణను నమ్మునీంద్రుని కడకు వచ్చి
వినతుఁడై యతివర్యుఁ డిట్లనియెఁ బ్రీతి ౮౬

క. గురునాజ్ఞ విడి ఈ పర
తర గోప్యార్థము వేఱుకొం జెప్పితి నర
రతికిఁ బ్రకటంబుగా నే
గురుమతి వారలు దరింపుకొఱకు మహీంద్రా 87

క. కలుషాకరు నపరాధం
బెలమి సలుపు శిష్యు నన్ను నిట శిక్షింపం
దలఁపుమతి ననుఁడు నమ్ముని
తలఁకుఁడు తరలౌకిక కృప దీపించి యటన్ 88

## రామానుజుఁడు యజ్ఞమూర్తిని జయించుట

వ. సంతుష్టహృదయుండై నీవు సర్వజనరక్షకుండవని పల్కి యతని నాలింగనంబుఁజేసి మాటిమాటికిం బ్రశంసించె నంత రామానుజాం దకవిదే దాజ్ఞఁబడసి శ్రీ మాన్మధరయోగి న్యాశయించి యతనివలన రహస్యంబులగు ద్రావిడాగమంబుల సంగ్రహించి క్రమ్మఱ శ్రీరంగంబుఁజేరి శాస్త్రాలురగు శిష్యులతో నరులంబుగు వేదాంతశాస్త్రంబుఁ జెప్పుచు నందధివసించె పశ్చాంబుయిన నాతింద్ధవరుండును నప్రతిద్వంద్వ వాదియు నేకదండియునగు యతి శాస్త్రవరంబువలన నేగుదెంచి లక్ష్మణయతీంద్రుతోఁగూడ నద్వైత ప్రసంగంబు గావింప నమ్మహాను భావుండు నిఖిల నిగమాంత శాస్త్ర నిరుపమ వ్యాసోక్తులంజేసి యజ్ఞ మూర్తిన్ జయించి యతని రహస్యార్థానువేదియుఁ ద్రిదండియు నాత్మ నమ శిష్యుంగా సంరక్షణంబు గావించెనని మహాయోగి మాహాత్మ్యంబును శ్రీమంతంబునగు భార్గవ పురాణోత్తరఖండంబు నందలి ప్రవర్తింపా ధ్యాయంబు భక్తసహాయకంబగు నానాయశంబు నిఖిల ప్రశ్నాధురం ధరుండగు వరునకుం జెప్పి పెండియు నిట్లనియె 89

తే.గీ. శాంతసంతోషి యగుచు నాచార్యముగ మ
హా ప్రదక్షిణము రచింప నింపుమీఱ
గణన మించిన శిష్యవర్గంబుతోడ
వెడలె నా యతిరాజవర్యుఁడు రయమున ౮౦

### రామానుజుఁడు విష్ణు స్థానంబుల సేవించుట

సీ. విశ్వేశ్వరుండగు విష్ణుని స్థానముల్
సేవింపుచును భక్తి చెన్ను మీఱ
యందందుఁగల పండితాళిఁ బూజింపుచుఁ
గుమత మతంబులు గూల పుచ్చి
మహనీయమైన స్వమతము స్థాపింపుచు
వంతట కాశీ ప్రయాగ మధుర
లందు నయోధ్యయందలి రమ్యమగు ద్వార
వతియందుఁ బుణ్యమౌ బదరియందు

తే.గీ. రమణఁ బెంపొందు నైమిశారణ్యమందు
ధన్యసేవితమగు హరిద్వారమందు
గయ మొదలుగాఁగ నెయ్యవి గల్గు పూజ్యఁ
దైవ హరిదేశముల యందు నాఘనుండు ౮1

### శారదా పీఠమున శారదాదేవి రామానుజుని శ్రీ భాష్యమును గొనియాడుట

క. తనశిష్యులను నిలిపి యం
తను నా యతివిభుఁడు శారదాపీఠము గ
న్గనుఁ నిగమాంతపారము
ఘనతరమతిఁ జేరె దుష్కృతాంతశరణున్ ౮2

క. అట నెదురు వచ్చి శారద
పటిమఁ దనుం బూజసేయ భవ్యయశుం డు
త్కటమతి నాపె కొసంగెన్
స్ఫుటముగఁ దాఁ జేయు భాష్యమున్ నిరుపమమున్ 63

క. భారతి యా భాష్యంబుఁ దొ
లారఁగ గ్రహియించి శిరమునం దిడుకొని శ్రీ
కూరేశ దాశరథి హృ
త్పూరణ రవి లక్ష్మణార్యునిన్ గొనియాడెన్ 64

## రామానుజుఁ డష్టోత్తర శత హరిక్షేత్ర స్థాపనంబు గావించుట

వ. అంత నతఁడు సంచారుండగుచు శ్రీమంతంబగు పురుషోత్తమంబున కేఁగుదెంచి
సర్వేశ్వరుండును బరాత్పరుండును మహాంతుండును విభుండును నీలమేఘ
నిభశ్యాముండును సహస్ర తరణిమండల ప్రకాశసన్నిభుండును దివ్య
భూషణ భూషితుండును గాంచనాంబరధరుండును దివ్యచందనలిప్తాం
గుండును వనమాలావిభూషితుండును బలభద్ర సుభద్రా సమన్వితుండును
సురబ్రహ్మర్షి సనకాది వినుత పాదారవిందుండును నగు జగన్నాథుం
గనుంగొని తత్పాదంబుల కెఱంగి నిగమ నిగమాంతసూక్తుల నిట్లని
స్తుతియించె 65

క. శ్రీ మన్నీలాచలం దా
సా మోదితా త్రివాస జగదీశ వరం
ధామ శరణ శరణ్యము
లి మఱియు భవత్పదముల యనయము మాకున్ 66

సీ. శ్రీశాయ విభవాయ యోగీశవినుతాయ
నిఖిల భువన సాక్షిణే పరాయ
సర్వభూతాత్మనే సర్వేశ్వరాయ స
ర్వాయ తే శత్రుసంతాపాయ వాక
దుఃఖ సంహారిణే తుభ్యం జగద్దేహి
నే జగన్నాథాయ నిర్మలాయ
సారస నేత్రాయ సర్వాగమాయాద్య
తాయావికారిణే దైవతాయ

తే.గీ. శౌరయే పురుషోత్తమ పూరణాయ
పరమ సుఖదాయినే యోగిపాలనాయ
[1] తే నమోస్తుటంచును సముత్కీర్తవతిని
విష్ణు మదిలోన భావింతు నిశ్చయముగ 97

క. హరయే పరాత్పరేశా
య రమాపతయే మురాంతకాయ సుమనసే
పరమాయ నమో నమ యని
గురుతరమగు భక్తి నిన్నుఁ గొని యాడుదునో 98

వ. ఆకాశ వాయు తేజస్సలిల పృథివీమయంబగు విశ్వంబు విశ్వధారివగు నీవలన నుత్పత్తి యగుచు వృద్ధిఁబొందుచుండు రుద్రులును నింద్ర ప్రజాపతులును నాదిత్య వసువులును మరుద్బృందంబులును నను నీ సమస్తంబులు నీ వలన నుద్భవంబగుచుండు నీచేత సృష్టంబగుచు స్థావర జంగమంబగు నీ జగంబంతయు నీచేత నిరంతరంబు సంరక్షింపఁ బడుచు నీ యందు లీనంబగుచుండు ప్రాణంబులును సకలేంద్రియంబులును

---

1 మూ. తే నమోస్తు యటంచు సుకీర్త

నీవలన నుత్పన్నంబు లగుచుండు బ్రహ్మ రుద్రాదులగు నిర్జరులు నీకుఁ బ్రియతములగు దాసులగుదు రధతీర్థ్యంబగు సమస్తంబునం దీవ వ్యాప్తుండ వగుట మహాత్మునకు మహత్తవు నణువున కణీయుండవు నగుట జంతు సంతాన స్వాంత నితాంతుండవగు నీవు సనాతనుండవు నిష్కళంకుండవు నిరాభాతుండవు శుద్ధుండవు నొక్కరుండ వగుట నారాయణదేవుండ వగు నీకంటె రెండవ దేవుం డొక్కఁడేనిఁ గల్గనేరఁడు చతుర్వ్యూహ చతురాత్మ స్వరూపుండవగు నీకొఱకు నమస్కరించెద నని మఱియును 99

తే.గీ. పంచకాలాత్మనే తుభ్యం దండిరాయ
రుద్రవినుతాయ పంచస్వరూపకాయ
తే నమోనమ యని నిన్ను దీర్ఘభక్తి
వినుతిఁ జేసెద నెవ్వేళ విశదవర్తిం 100

సీ. పంచకాలజ్ఞులు భవ్యులు యోగులు
పరమార్థ విదులౌ ప్రసన్ను లెపుడు
నిర్మలాత్మకునిగా నిన్నుఁ భావింపుదు
రర్థ పంచక తత్త్వ మరయువారు
సరసులు పంచ సంస్కార సంస్కృతులు ని
త్యంబు నీ రూపంబు నరయుదుండ్రు
పటిమ చతుర్వాత్మ పరిపూర్ణములగు నీ
పదములు దెలుతురు భావిదులు

తే.గీ. నమ్మహాత్ములు నీ దాసులైన భూమి
సురులు సకల భువనముల్ ప్రోతురు ముదమున
విశ్వరూపంబు గాంచ నీకు వినతిఁ జేతు
వెదవేద్య పొగడువాఁడ వేడ్క నిన్ను 101

తే.గీ. వాసుదేవుండ వగు నీకుఁ బ్రణతిఁ జేతు
కృష్ణదేవుండ వగు నీదు కీర్తనంబు
సల్పువాఁడ జగద్ధామ శార్ఙ్గి శుద్ధ
సత్త్వ హరి నీకు మ్రొక్కెద జలజనాభ 102

క. విష్ణు స్వరూప మాధవ
విష్ణువయిన నీకు నేను వినతి యొనర్తున్
గృష్ణ నిఖిలాత్మ దైవ వ
రిష్ఠుఁడ వగు నిను నమస్కరింతు ముకుందా 103

తే.గీ. పంకజాక్ష జగన్నాథ భక్తవరద
లోకధారి మహాత్మక పాకశాస
నాది వందిత మౌనిజనాంతరస్థ
నీకు జోహారు గావింతు నిగమ రూప 104

సీ. కైవల్యదాయివై ఘనతర మూర్తయే
యాదవేంద్రాయ దయామయాయ
యమునాశ్రితే సచ్చిదానంద రూపాయ
యిందిరా భూమి నీళేశ్వరాయ

నిరుపమాకారాయ నిత్యముక్త్యైక భో
గ్యాయావికారాయ హరనుతాయ
విద్యాయ శుద్ధాయ సర్వ స్వరూపాయ
పరమాత్మనే విశ్వపాలనాయ

తే.గీ. కారయే హేతుహేతవే సకల విబుధ
పోషకాయ విరించన పూజితాయ
తే నమోనమ యని నిన్ను దివ్య మతిని
సన్నుతించెద నెప్పు డుత్సాహలీల 107

క. త్రిగుణాతీతుఁ డవగు ని
న్నగణిత మతి వందనంబు నర్పించెద నే
నిగమాంత రూప శాశ్వత
జగదీశ యనంత మూలశక్త్యాధారా. 108

వ. మహాత్మా విదగ్ధలోపాధిస్వరూపుండవు మహాత్ముండవు జగజ్జనకుండవు నీలాద్రి నాయకుండవు సుభద్రా ప్రాణవల్లభుండవు బలభద్రసమేతుండవు జగన్నాథుండవు సర్వప్రత్యపన్న జన రక్షకుండవు ప్రవరధారిణి కోటి కందర్ప లావణ్య నిధివి యనంత కల్యాణ గుణ పరిపూర్ణుండవు బ్రహ్మ స్వరూపుండవు వియాతి ద్వయాది పాలకుండవు సర్వశేషి వగు నీకొఱకు నమస్కరించెద పురుషోత్తమ [1](మా)నికేతనా లక్ష్మీశ్వర వరాహయుండవు నీవు నాకొఱకుఁ బ్రసన్నుండ వగుచు నీవు ప్రపన్నుండ నగు నన్నుఁ జరి పాలింపు మని లక్ష్మణాఖ్యుండు వినుతించె నని మహాయోగిమాహాత్మ్యంబును శ్రీ

1. మూ లేదు.

మంతంబు నగు భార్గవ పురాణోత్తర ఖండంబు నందలి సప్తత్రింశాధ్యా
యంబు భక్త పరాయణుండగు నారాయణుండు నిఖిల విద్యాధురంధరుం
డగు దరునకుం జెప్పె వెండియు నిట్లనియె 107

క. అని యిట్లు భగవన్నాథుని
వినుతించి యతీశ్వరుండు విమలుండు కృపా
వనధియగు నతనిచే మఱ
మున సంభావింపఁ బడి రయమ్మున్నత మరిత్రు 108

తే.గీ. అంత శ్రీకూర్మమున కేగెఁ యందుఁ గల్గు
కూర్మనాథుని భక్తిఁ గొలిచియాదు
వంటనాథునిఁ బ్రణతించి యాపునందు
నవం సింహాసనంబున కరుగుదెంచి 109

ఉ. అచ్చట నుండు నచ్యుత మహా మహా భక్తుం డెల్ల దౌత్యమ్ములం
దొత్తెము లేక నిచ్చ గుణపూర్ణ నృసింహ పదారవిందముల్
మెచ్చిన భక్తిచే గొలిచి యింపు దలిర్పఁగ నబ్బి గాత్రుఁ డు
ద్యచ్చరితుండు వైష్ణవకులాగ్రణి యమ్మణి యోగి యంతటన్ 110

క. సింహాద్రి యందలి రుచా
న్వితుని నరసింహు విశ్వవిభుఁ గొలిచి గుణా
న్వితుని నారాయణుఁ బ్ర
ఖ్యాతుని శ్రీ పెరుమాళ్ళ హరి గాంచి యటన్ 111

వ. అహోబిలంబున కేగుదెంచి యందు గల పానకాఖ్యయుండగు శ్రీ
నృసింహుం గొనియాడి యతిపుంగవుండు వేంకట మహీధరంబున కేగు
దెంచి మున్ను పరకాలాదుల శేష రూపంబగు నగ్గిరి నారోహణంబు
సేయకుండుట దెలిసి దాని నారోహణంబు సేయకుండి యంత నందు గల
నీల కిమ్మంబేర మాటి మాటికిం బ్రార్థించు దగుచు నా ఘనుండు నరులం
కశేషపాపంబుల బాపు నట్టి శేషనగేంద్రం బెక్కి యందు దనరు శ్రీశైల
పూర్ణమునిం గూర్చి వినయాన్వితుండగుచు దండంబు పెట్టి కల్మషాప
హంబును ముక్తిదంబును సార్థకంబును నగు స్వామి పుష్కరిణీ తీర్థంబు
నందు స్నానంబు చేసి రమ్యంబగు దక్షిణంబు నందు బరమంబగు
జపంబు జపియించి భూవరాహునకు బ్రణమిల్లి పిదప శ్రీనివాస మంది
రంబు గూర్చి చని యందు గల శ్రీపతి యగు హరిం గనుంగొని ॥ 112

సీ. భాస్కర కోటి ప్రభా భాసమానుని
ఘనతర సౌందర్య కలితాంగు
శ్రీవత్స కౌస్తుభ శ్రేష్ఠ విభు వక్షు
దారు శరత్పుల్ల సారసాక్షు
నాహితారాతుల శంఖచక్ర గదాసి
శార్ఙ్గధారిఁ బలారి జనవిదారి
జగదభీష్టద దివ్య చందన స్రగ్విరా
జిత చతుర్భుజు సమున్నత శుభాంగు

తే.గీ. రక్తపంకజ పద యుగ్మ రమ్య గాత్రు
హారకేయూర కోటీర దారు కుండ
లాంగదా విభూషితు నమల చరితు
హరిఁ బరాత్పరుఁ బరమేశు నమరవినుతు 118

క. పరమాత్ము జగద్రక్షకుఁ
గరుణానిధిఁ గూర్చి మ్రొక్కి ఘనుఁ డతఁడు నమ
స్కారుఁ డగుచుఁ దనదు కన్గవ
నరసానందాంబువారి సముత్తరంగాన్ 114

వ. కృతాంజలి పుటుండై యప్పురుషుం గూర్చి యిట్లని వినుతించె 116

సీ. శ్రీశైలగిరినాథ శ్రీనివాస జగత్ప్ర
తే విమలార్కక దివ్యతేజ
నళినోదరుండవై నారాయణుండవై
పూర్ణుండవై జగంబులను బ్రోవ
నలరు నోంకారార్థమైన నీకొఱ కేను
దండంబు సల్పెద ధన్యమూర్తి
తారకుండవు లక్ష్మీ కాంతుఁడవగు నీకు
జోహారు గావింతు సుందరాంగ

తే.గీ. రక్షకుఁడవగు నినుఁ గూర్చి రమ్యమతిని
సేవఁ జేసెద నో సర్వశేష శౌరి
యీశ యంచేలు మంగళాధీందిరా వి
కాంత విస్తీర్ణ వక్ష భాస్వత్కటాక్ష 118

వ. అనర్ఘ్య దాసస్వరూప మహాత్ముండ[1]వగు నాకుఁ బ్రభుండవు నరక్రి
తరుండవు గురుండవగు నీవు దక్క నన్యగతి లేదు గాన నే నను:
శరణ్యుండ నగుచు నీ చరణంబులం గూర్చి మిక్కిలి శరణంబుగా మమత
దొలంగి యహంకార విముక్తుండ నగుచుఁ బ్రపత్తిఁ గావించెద మహాత్మా

1 మూ వగు

సరసీరుహాంబక శివ గతి వగుట నీగతిఁ జేసెద [1]దాసుండయిం దయనం
బగుమని వేండియు 117

క. జగము నిఖిలాంతరాత్మ
మిగ వర్తిలు నట్టి నిన్ను మేలగు భక్తిన్
దొగడి నమస్కృతిఁ జేసెద
భగవంత సుశాంత భక్తవత్సల శౌరి 118

తే. గీ. నాకు గైంకర్య మొసఁగుము నలిన నాభ
నీ కృపాదృష్టి నాయందు నిగుడఁజేయు
మనఘ వాత్సల్య వారాశి వగుట నీకు
మ్రొక్కు గావింతు సంతోషమున మహాత్మ 119

తే. గీ. మంత్రరాజాయ సుగుణాయ మంత్రమూర్త
యే ప్రపన్నార్తి హరణాయ యిందిరేశ్వ
రాయ తే [2]నమో యని నిన్ను రమ్యమతిని
భక్తి భావన గావింతుఁ బరమపురుష 120

తే. గీ. ఏమిఁ జదివిన్న యంబుగు నీ సమస్త
జగంబు కానంగనై యున వగుచునుండు
దాని యంతర్బహిస్సుం జూనిగాని వ
సింతు నీకై నమస్కృతిఁ జేయువాఁడ 121

---

1 మూ. దాసుం 2 మూ. నొమి

క. హరి యీ జగము గ్రహించి యు
దరమునఁ జేర్చుకొని పెద్ద దడవునకును వి
స్ఫురణము గల్పాది సృజిం
చు రసికు సద్దేవు నిన్ను సుభగు నుతింతున్ 122

సీ. శాశ్వత స్వరూపాయ విశ్వముఖాయ తే
సుముఖాయ విశ్వతస్స్వకరాయ
విశ్వపాదాయ తే శాశ్వతయాపాయ
తుభ్యన్నమో యని దురితహారి
వగు నిన్నుఁ గొలుతు సహస్ర పాదుఁడవు స
హస్ర నేత్రుఁడవు సహస్రశీర్షుఁ
డవు పురుషుండవు భవనాశివగు నీవు
ఘనతర స్ఫూర్తి లోకములఁ గూర్చి

తే.గీ. యత్యతిష్ఠద్దశాంగుళం బనెడు నిగమ
సూక్తి గైకొని వ్యాపించి సొంపుఁ బొంది
దివ్యమగు నీదు మూర్తి నుతింతు నాదు
పద్మదళనేత్ర బుధమహా పద్మమిత్ర 123

వ. అన్యతత్త్వంబున కీశానుండ వగుట దేనివలన [1]మొగతియుండెడి వ్యాపింపని
వాఁడవు గాకున్కి భూతంబెట్టి భవ్యంబెట్టి తత్సమస్తంబు మాధవా ని
యందుఁ గల్పటంజేసి విశ్వంబున కీవ పతివి జగంబునఁ గల్గు ప్రాణుల
కీశ్వరుండవు ప్రభుండవు నీవ హిరణ్మయుండవు భగవంతుండవు పరమా
త్మవు భువన మిత్రుండవు చరాచరంబున కీ వొక్కరుండవు శిక్షకుండ
వగుట ధ్యానంబునం జేసి పరమయోగ గతి వీక్షింప రమేశ్వరుండవగు

---

1 మూ దగతి

నీ వకారగర్భితార్థుండవుగా మహామంత్ర మగుచు నడుమఁ బడుదువు
వేదాంతమునందీవ పరుండవు మహేశ్వరుండవు దేవుండవుంగాఁ బ్రతి
ష్ఠింపఁ బడుదు వీవ పరమేశ్వరుండవు విరూపిద్వయనాయకుండవు యజ్ఞ
స్వరూపుండవుగ సర్వహంతుండవగుట నీవలన ఋక్కులును సామములును
సర్వంబులును గోపులును బురుషాదులును సముత్పన్నంబు లయ్యె భవన్ముఖం
బాహూరుపదంబులవలన బ్రాహ్మణ క్షత్ర విట్శూద్రులు జన్మించిరి పాదం
బులవలనఁ బృథివియు శిరంబువలన దివియు మనంబువలనఁ జంద్రుండును
జక్షువువలన సూర్యుండును ముఖంబువలన నగ్నిమహేంద్రులును
ప్రాణంబువలన మారుతంబును నాభివలన బ్రహ్మాంతరిక్షంబును
శ్రోత్రంబువలన దిశలును బ్రాదుర్భవించె నిఖిలలో
కసముద్భవంబగు జగంబంతియు నివ్విధంబున సృష్టియించి నీవ గ్రమ్మఱ
గ్రసియింపుచు సూర్యనాభికరణి నంటి యుండినట్లుండు నాదిత్యవర్ణుండ
వగుచుఁ దమంబునకంటెఁ బరంబగు జ్యోతిస్స్వరూపుండ వీవ యగుట
సయద్యుతుండవు నీవ యథార్థ విభూతంబగు జలంబునందు మాయా రూపఁ
బగు నశ్వత్థపత్రంబునందు నంఘరిత జగన్నిబద్ధు వగుచు సదాశ
మంతవుగా శయనింపుచు నప్పటి వొక్కరుండవు నారాయణుండవు విష్ణు
స్వరూపుండవుగా నగుదువు బ్రహ్మరుద్ర దైవర్షి మానవులును రోదసీ
కుహరాంతరాళంబును సూర్యచంద్రులును నగ్నిలోకంబులును నక్షత్రా
దులును లేకున్న మఱియు నీచేతన సకలలోకంబులు సృష్టియింపంబడియె.
నీకు బ్రహ్మరుద్రులచేత దానభూతంబగు సమస్త భువనంబు నిర్మింపఁబడి
నాధారమై తేని నీలోకంబు లెట్లు ప్రవృత్తంబు లగు నని యట్లనియె 124

ఆ వె. నీవు సేరిన నిరతి నేరవు వర్ధ సా
క్షీవి పవిగ్రహుండవు దేవ నీవు
సారసారుండవు విచక్షణుండవు పుర
షోత్తముండవు లోక పూజితుండవు. 126

## రామానుజుఁడు మరల శ్రీరంగమున కరుదెంచి యందే యధివసించుట

సీ. భువన నివాస మాధవ విశ్వపాలక
  శౌరి నారాయణ సర్వశేషి
వేంకటేశ్వర భక్త వినుత నిరంతర
  యోగిరాట్చిత్త పయోజ సంస్థి
తములు శరణ్యంబు లమలంబులగు నీదు
  పాద పద్మములంటఁ బ్రజాళిఁ జేరు
నా కివి దక్క వస్త్వంబగు వస్తు యు
  పాయంబు లేదు సర్వాంతరాత్మ

తే.గీ. కలువ నీ పాదములు గాని సరసిజాక్ష
యేమియును దోఁచ దీయెడ నీదు కరుణ
నా యెదఁ జేర్చు మరవిందనాభ దనుజ
ఖండ మాతంగ హర్యక్ష నిశాంత కాంత 129

వ. ఇట్లండె పరంబగు తత్త్వంబు నీవె పరమంబగు పదంబు నీ క్షేత్రంబువకంటెఁ బరంబు లే దితనికంటెఁ బరంబగు దైవంబు లేదని మాటిమాటికి నిగమ సూక్తుల సత్త్వంబుఁ గొనియాడి యంత రామానుజ మునీంద్రుండు కొండు మూఁడుదివసంబు లుండి శ్రీశైలపూర్ణువలన శ్రీమద్రామాయణ రహస్యం బెఱింగి యతని యనుజ్ఞ వడసి యుత్తమంబగు సేతువున కేఁగియందందుగల నిఖిల హరిరూపంబులగు విగ్రహంబుల సేవించి సకల సమయంబుల జయించి హరి మతంబు స్థాపనంబు గావించి క్రమ్మఱ శ్రీరంగ నికేతనంబున కేఁగుదెంచి యనవరతంబు వ్యాపకుండగు రంగనాయకు సేవింపుచు నందయధివసించి సర్వదేశన వాత్సల్యంబువలనఁ

పరిపూర్ణ కృపాంభోధి యగుచు నపార పాషండ దుష్ట తర్కితదేవ కుదృష్టులచేతఁ గుయుక్తులం జేసి కల్పింపంబడియుఁ బ్రాప్తంబులగు నాసుర శాస్త్రంబులు సమస్త జగంబునకు నివిడంబు లగుచు హరి వైభవంబు గాన రాకుండఁ గప్పికొని లోకంబు సంకరంబు గావింప వైష్ణవం బుద్ధరింపు కొఱకు మహానుభావుండగు లక్ష్మణార్యుం డుత్తమంబగు శ్రీభాష్యంబు గావించి పాషండ బౌద్ధ చార్వాక మాయావాద్యుక్తతాదికంబులగు కుత్సిత మతంబుల నణఁచి లోకాది విష్ణుప్రియులమంబును మహనీయంబును నగు పారాశర్య ముని మతంబు లోకంబునఁ బ్రకటంబుగావించి యనంతరంబు

సీ. ధర యందుఁ గూరేశ దాశరథార్యుం
ప్రముఖులగు శిష్యవర్యులచేత
పూజితుఁ డగుచు సంపూర్ణ మనస్కుండు
రామానుజార్యుండు రమ్య గుణుఁడు
సారస నేత్రుని సత్పాదయుగములు నను
దినము వారల కుపదేశ మిచ్చి
శ్రీకల్పభూమైన శ్రీరంగనాథుఁ గైం
కర్యంబు సేయుచు ఘనత మించి

తే.గీ. యచ్చటి ప్రాణసమానుఁడౌచు సఖుల కమల
కథిత సుభరూప ముగుచున్న యమృత మొసఁగు
చుండు వసియించె నిర్మల స్వాంతుఁ డగుచు
ననుదినంబును యోగసమాధినుండి 181

## రామానుజుఁడు యోగంబు గైకొని పరమపదంబున కరుగుట

వ. ఇట్లు చిరకాలంబు గడపి యతిపుంగవుండు సముత్తుంగయోగంబు
గైకొని సుషుమ్నా నాడి నిష్క్రమించి పరమపదంబుఁ బ్రాపించె నిగ
మాంత శాస్త్రకారుండగు లక్ష్మణ మునీంద్రుని యేతత్కథ యెవ్వండు
విను నతండు భాగవత భక్తి మహోత్తమశ్రీఁ జెంది విధి శివ సనకాది
దుర్లభంబగు నచ్యుత పదంబుఁ జేరు నని మహాయోగి మాహాత్మ్యంబును
శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తరఖండంబు నందలి యష్టత్రింశా
ధ్యాయంబు భక్త పరాయణుండగు నారాయణుండు నిఖిల విద్యాధురంధ
రుండగు వరునకుం జెప్పె వెండియు నిట్లనియె,

## హర్యర్చావతార ప్రభావము—భాగవత పూజా ప్రభావము

మ. అల పన్నిద్దరు సూరు లిజ్జగమునం దానంద సంధాయులై
కలయన్ భాగవత ప్రధానులగుచున్ గౌరూపహాలస్వాంతులై
యల నస్మత్పరమ ప్రియాఢ్యులుగ నెంతే నిష్ఠ వర్తిల్లుచో
లతి మత్ప్రీతి సమాన మూర్తుల సుధీ లక్షింపఁగాఁ బ్రతతా 188

సీ. పంకజ సంజాత పార్వతీనాయక
జంభారిప్రభృతి నిర్జరులకంటె
సంతతాధోక్షజ సంస్మృతి రతులై
తనరారు సనకాది మునులకంటెఁ
ఘనతర యోగంబు గల్గు సర్వజ్ఞులౌ
తాపస ముఖ్య సంతతులకంటెఁ
బరము విశాల యోగధ్యాన మూర్తులై
స్ఫురణించునట్టి భూసురులకంటె

తే.గీ. ధాత్రియం దెక్కఁ దగుదు రాధన్యమతులు
వినుము బ్రాహ్మణులు లేక విమల హృదయ
శ్రీధరుం గంటె వారికంటె ... వార
లధికు లగుదురు మర్త్యులు నగుఁజేసి 184

క. వినుఁ బూజించుటకంటెను
ననవరతంబును వారి పూజ గావించినఁదోఁ
ననుపమ సద్యోమోక్షం
బును గల్గు మనుష్యులకు సమున్నతి గాఁగన్ 185

తే.గీ. ఎవ్వరి భాగవతుల మహీతలమున
గొలుచువారలు హర్ష సంకలితు లగుచు
దుర్లభము సమ్మతియు సంతోషకరము
నగు పరమపద మొందుదు రమలమతిని 186

చ. కలుగదు కర్మయోగమునఁ గల్గదు జ్ఞాన విచార పద్ధతిం
గలుగదు యజ్ఞదానములఁ గల్గదు నాశాంతమైన భక్తిచేఁ
గలుగదు వందనార్చనలఁ గల్గదు సంస్మరణానుభూతిచేఁ
గలుగును ముక్తివారలకు గౌరవమొప్పఁగ గొల్చిరేనియున్ 187

క. అని యిట్లు మహాభాగుఁడు
ఘనమతి నారాయణుండు కరుణానిధి వ
ల్కినతో వరుఁడు ప్రమోదుండై
యనియెన్ దన్మహిమ వినుతమై సద్భక్తిన్ 188

తే.గీ. ఇమ్మహాభాగవతులను నెక్కొంరక్తిఁ
జేసి శ్రీ విష్ణుపదంబుఁ జెందిరట్టి
వారల పఠింపుమయ్య మర్త్యుఁడవగుట
నిన్ను వేఁడెద నిప్పుడు నిర్మలాత్మ 139

ఉ. శ్రీహరి భక్త భక్తుల విశిష్ట చరిత్రము సర్వకల్మష
వ్యూహ విభేదనంబు సతతోర్జిత భాగ్యదమంబు దుష్టవి
ద్యా హననంబు ముక్తి కొఱకై తగుదాని వినంగ నిష్ఠ నా
కీవ ఘటించి వేడ్క వచియింపు మహాత్మ యటన్న నిట్లనెన్ 140

## దుష్టుని చరితము

ఆ.వె. పటిమ మున్ను విప్రబంధుండు దుష్టుఁ
డనెడు వాఁడు నొక్కఁడుండెఁ గలుష
చార హింసయందు సొంగొందువాఁడు కా
ముకుఁడు క్రూరుఁడగుచుఁ బాలుచు నెపుడు 141

సీ. బ్రహ్మహత్యయు సురాపానంబు గోవధ
యును స్త్రీల వివనంబును గొనుటయు
మొదలుగాఁ గల కర్మములయందు దక్షుఁడై
మెలఁచువాఁ డనృతంబు దలఁచువాఁడు
దుష్టుఁ డత్యంత దోషకుండగుచుఁ గాం
చి విరూప యౌవనశ్రీఁ దనర్పు
వనరుహాక్షిని నిషాదిని సతిగా నేలి
కరము నిషాద సంఘముల గూడ

తే.గీ. నటవిఁ దిరుగుచు మార్గమం దరుగువారి
ద్రవ్యముల సంగ్రహింపుచు దగ్రవృత్తిఁ
బ్రాణి కల్మషముల కెల్ల మూలమగుచు
రహిని ఘోరత్వమున నిట్లు బ్రతుకుచుండె 142

వ. అంత 143

చ. క్షితి నరఁ డొక్కకాలమున శేషనగేంద్రము నుండి ద్రము
న్నతి రచియింపుచుం బథమునం జనుదెంచు మహాత్ములన్ సమం
చితులను దివ్యమూర్తులను శ్రీహరి భక్తుం దాపరించి యు
ద్ధతిఁ గొని వారి ద్రవ్యము లుదారతఁ గైకొనియెన్ మదాంధుడై 144

తే.గీ. అప్ప రదైత్యపులు భ్రాంతులగుచు నవ్వ
యుని సధోక్షజు స్మరియింపుచును మనోహ
రంబులగు వాక్యములఁ దస్కరవరు కిట్టు
లనిరి విజ్ఞాన కోవిదు లగుటఁ జేసి 145

సీ. దు రాయము ఘాతుకత్వంబ నిర్వంబ
నగు శరీరంబుఁ ద్రోవఁగఁ దలంచి
దుష్టాత్మ నీ విట్టి దొంగతనంబునఁ
బ్రజల నవేశుల బాధపెట్టి
ధనము గైకొని దేల తస్కర వరకాలు
కరణి భక్తి భాగవత పూజ
నల్ప కేలిని సద్గతిఁ బ్రాపింపఁ
గంపు జనార్దనకథయు గల్గి

తే.గీ. మూర్ఖ యేరీతి శోకసముద్ర మీవు
దాటఁ గంటివి పల్కుఁడు తద్వచనము
విని మగుడ వారంతు నిట్టు లనియె దుర్మ
దాంధుఁ డగుచున్న దుర్మేధుఁ డతిరయమున 146

తే.గీ. ప్రాణమంతంబె నెక్కుడై పరఁగి సూడ మో
సంబు నిల్లాలి నెరయఁగాని సరసులైన
యాత్మజాల విడి భాగవతార్చనంబు
నెట్లు సేయంగఁ గలయు మునీంద్రులార 147

క. అని పల్కు మూర్ఖవాక్యము
విని భాగవతోత్తములు గభీరోక్తిం దిం
పుమగాని నవ్వుచు మూఢా
త్మునిఁ గాంచుచుఁ గూర్చి యనిరి తోషము లగుచున్ 148

ఆ.వె. దుఃఖ మొసఁగునట్టి తొయ్యలిని సుఖంబు
నిచ్చుదాని గాను నీవు దలఁచె
దెట్లు మోహ మడిగి యాశింపు స్త్రీ శరీ
రము రాగిప్పితం బరాగ మగుట 149

వ. చర్మమాంసాస్థి మేదోరుధిర విణ్మూత్ర నఖరోమ మజ్జాశుక్లాది పూర్ణమును హేయంబును దుర్గంధ సంయుతంబును నగు స్త్రీ శరీరంబు సుఖరూపంబని చెప్పరాదు శ్లేష్మసదనంబగు వదనంబును నుద్గీర్ణ దూషికా పాత్రంబులగు నేత్రంబులును నిశ్వాస నిర్గమాంతస్థ సింఘాణావభాసికయగు నాసికయు

జిహ్వా దండస్థ స్పంది రారాజాలాధరంబగు వదనంబును పిర గ్రంథి
విహార స్వేదనిరయ ధురంధరంబులగు ఎముకలంబులును మూత్ర
సంక్లిన్న నితాంతంబగు మదన నిలయంబును పూయ మలపరంపరా
వితంబంబును నగు నట్టి కాంతావయవంబులు మహాత్ములచేత నింద్యత
లగుట లోకంబులందుఁ గాంతలయందుఁ గోర్కి గలవాఁడ వీవు బుద్ధి
యుక్తిమంతుం డెవ్వండు మోహితుండు గాకుండు వస్త్ర భూషాది సంస్కృతంగు
బాహ్యభ్రమావాసగుహాంతరతి దరుణులని కందర్పకారాగారం బనఁ దగుట
శ్రేయస్కారంబగు వారాకపృతేని స్త్రీలయందు మెలఁగ్గంగారు మం
మూత్రప్రహరంబగు ప్రమదలఁ గన్నుంగవేని బిలిపెద దార్ఢ్య దార్ఢ్యం
భావంబులయందు గురుండగు తండ్రికిఁ బాకావమానంబు గావింపుదు
భూరిరంబునందుఁ గృతఘ్నులగు పుత్రులయం దొక్క సమయంబునం దె
మహాత్ము లనురంజనంబు సేయరు దుశ్శీలాయాకర్షణ రక్షణ నాప్య
యంబులందేత దుఃఖంబు లొసంగు ధనంబుల యందేని మతిమంతులు
మోహంబు నొందరు యాసక్తత్రయంబు ద్యజియింపవలయు నని యిట్లు మహా
భాగవతుఁడు పల్కినవ్వి దా చేయండు ప్రశాంత చిత్తుం డగుచు వాసుదేవ
వైష్ణవులం గూర్చి ప్రణమిల్లి యిట్లనియె 160

## దుశ్శీలుండు మృత్తికతో వాసుదేవాకృతిం దీర్చి పూజించుట

సీ. పరికింపఁగా నేను పాపిష్ఠుఁడను మహా
భాగుఁడు మీరు కృపారసజ్ఞు
లార్తుల పక్షపాతులు మీవద యాప
దుడుగుట దుఃఖ సంకలిత జలధి

చ. విరివి నధీతవేదుఁ డగు విప్రవరోత్తము కన్న నెన్నఁగా
స్థిర వనధీతవేదుఁ డగు శ్రీహరిభక్తుఁడు చాల ముఖ్యుఁడం
దరఁగును భక్తిహీనుఁడు ద్విపాత్ర్యమెప్డు తగుఁగాన నెన్నిటన్
హరిపదభక్తి యుక్తుఁడగు వాఁడు శ్రేష్ఠతముండు మిక్కిలిన్ 178

ఆ.వె. అవని శూద్రుఁడైన హరిభక్తుఁడగునేని
యరయ భక్తిరహితుఁడైన వేద
విదునికన్న నెక్కుఁ డదిగాక హరిభక్తి
[illegible] ర్చుఁ దధముఁడగు శ్వపాకికన్న 179

కం. భగవద్భక్తి విహీనుం
డగువాఁడె క్రియా[1]లోపర్పు నవి యెల్లను బెం
పుగ రాక్షస[2]కర్మము లవి
నిగదిత మగు వాఁడు చెందు నిరయం బందున్ 180

తే.గీ. స్థిరముగా విష్ణుబింబ ప్రతిష్ఠకన్న
నిల మహాత్ముఁ డగు వైష్ణవుం బ్రతిష్ఠ
నలరఁ గావించు నతఁడు శతాధికమగు
ఫలముఁ బ్రాపించునని బ్రహ్మవాదు లనిరి 181

సీ. బ్రాహ్మణాదిక చతుర్వర్ణజాఁగు వారు
హరిలాంఛనాంచితు లగుచు నెపుడు
నఖిల ,యందగు హరియందు నస్తాత్మ
సద్వర్ష్మ లగుచున్న సాధులైన

1 మూ. లోపర్పు 2 మూ. కర్మంబని

వారు భాగవతులు వారికన్నను మఱి
పరవేద విదులైన వారు గారు
శ్వేత మృత్పుండ్ర భాసిత శంఖచక్రాది
చిహ్నాదు ఘనతలంటి పయోరు

తే.గీ. తోషమూర్ధ్వద్వయాంచితుఁడైన పుణ్యుఁ
జూచి నారాయణుని వారిఁ జూచినట్లుఁ
బూజ గావింప వలయును బూని పరమ
భక్తి తోడుత సంతోష భరితుఁ డగుచు 182

## భగవద్భాగవత సేవాఫలము

క. భగవచ్చిహ్నాంచితుఁ
డగు విప్రునిఁ బూజసేయఁ డాదృతి నెవ్వం
డాగి వానికి దక్షిణమున
విగతము గు నష్టమ్ము పృతపుణ్య మింకన్ 183

క. హరి లాంఛనుఁ డగు వైష్ణవు
నిరతము పూజింపఁ జేయ నియతుఁడు సాక్షా
ద్ధరికిని భోజన మిడినటు
లరయఁగ నటులౌని యధ్వరాదుల నైనన్ 184

తే.గీ. అంత వైష్ణవ సందోహములను జూచి
యారయఁ బ్రదక్షిణపు నమస్కారములను
నెవ్వఁ డొనరుపఁ డా బుద్ధిహీన జనుని
కొఱకు నారాయణుఁడు తాఁ గుపితుఁ డగును 186

క. తులసీకానన మొనరిచి
యిలసేకాదులఁ బ్రియ మొనఁగఁ బోషింపన్
దలకొను నెవ్వఁ డతనిచే
నల హరి పూజితుఁడు నైన యటులగు విధిచేన్ 186

చ. వారిని బ్రతిష్ఠఁ జేసి నియమాయతిఁ బ్రాఙం సత్ప్రవంబులన్
స్థిరమతి నెవ్వఁ డర్చనలు సేయు నతండు పితామహాధికా
మరరతిచేర నిత్యము సమర్చితుఁడై చెలువొంచి వెండియున్
బరమపదంబు నంది పరమంబుగు మోదమునొందు నెంతయున్ 187

శా. శ్రీ సీతా భరతీ శరోజముఖులన్ శేషున్ విహంగేశ్వరున్
సేనేశున్ మఱియున్ ముకుంద పరిషత్సేవ్యాళిన్ మహాభక్తి భ
క్తానేకంబుఁ బ్రతిష్ఠఁజేయు మతి యుద్యద్విష్ణు వెల్గుఁడు ని
త్యానందంబునఁ బొందు వాఁడు వారితో సత్యంతమున్ గూడుచున్ 188

తే.గీ. అమల కోమల తులసీ దళావళులను
బార్థభక్తి సాలగ్రామ పూజ సేయు
నెవ్వఁ డతనికి లక్ష్మి లక్ష్మీశ్వరుండు
నాతిదంపతు లట ప్రీతు లగుదు రెలమి 189

క. గురుఁడే సాక్షాద్ధరి యగు
గురుని ప్రియమె హరిప్రియంబు గురుభక్తతచే
హరి ప్రసన్నుం డగుఁ గావున
గురుపూజ యొనర్పవలయుఁ గోరి నరుఁ డిలన్ 190

ఆ.వె. వాఁడు త్రిదండధరుని విజ్ఞానసాధనున్
యతినిఁ గని ప్రణామ మాచరించి
పూజ సేయ వలయు భువి వరుం డందుచే
మహిత విష్ణుభక్తిమంతుఁ డగుచు 191

వ. సర్వమంగళ మాంగల్యంబును సర్వశ్రేయః ప్రదాయకంబును మహా
యోగి మాహాత్మ్యంబును ముక్తిప్రదంబును నాయుష్యంబును శ్రీకరంబును
పుత్రదంబును యశస్యంబును విజయావహంబును ధర్మ్యంబును పవిత్రంబును
పాపఘ్నంబును నారోగ్యకరంబును సుస్వప్నంబును నగు నీ పురాణంబు వి
నిన వినిపించిన సతతం పఠించిన ఫలంబును సర్వయజ్ఞ ఫలంబును
బొంది హరికిఁ బ్రియతముం డగు మఱియుం బుత్రకాముండు
పుత్రులను ధనార్థియగు నతండు ధనంబును సంపత్కాముండు సంపద
యును ముక్తికాముండు ముక్తియుం గాంచు వివాహంబున సర్వార్థసిద్ధిం జెంది
యనంతరము నం బరమపదంబునం బ్రాపించు నదియునుంగాక యేతత్పు
స్తకంబు లిఖియించి మహాత్ముండగు వైష్ణవునికొఱకు నొసంగిన
కృతార్థుని గృహంబున నిత్యంబు ననపాయినియై సిరి వసించు నిద్ధ
పు మురదనాథుండగు విష్ణుదేవునకు నతిప్రియులగు ద్వాదశ మహాయోగి
చరిత్రము విని నిశ్చయించు వారలను చిరకాలంబున నుండి పాయని
ప్రకృతివలన విముక్తులం గావించును మహాయోగి మాహాత్మ్యంబును
శ్రీమంతంబును నగు భార్గవ పురాణోత్తమ ఖండంబు నందలి చతు
ర్వింశాధ్యాయంబునుం గూడ బారాణంబు సమగ్రంబుగా భక్తపరాయణుం
డగు నారాయణుండు విధి ప్రజ్ఞా ధురంధరుండగు నరునికిం జెప్పెనని
సూతుండు శౌనకాదులకుం జెప్పి వారిం గృతకృత్యులం[1]గావించె
192

1 మూ. గావించ

చ. జలచర కూర్మ కోల మృగనర్త్రమ వామన భార్గవాద్వయో
జ్జ్వల రఘువీర సీరధర సౌగత సాదిముఖ స్ఫుటాకృతీ
నలినభవాది దేవమునినాథ నుతి స్ఫురణా కృతాదృతీ
సంలిత భక్త రక్షణ విచక్షణ సాధు కటాక్ష సంగతీ 193

క. రాజీవదళ విలోచన
రాజీవభవాండ భాండ రక్షా నిపుణా
రాజీవధ్వజ జనకా
రాజీవగృహా మనోజ్ఞ రాజీవకరా 194

మాలిని. దురితవన కుఠారా ధూర్జటి స్తోత్రసారా
పరమపద వినోదా భక్తలోక ప్రసాదా
దరన దనుజారా సర్వ దేవాదిదేవా
విరచిత సత్కీర్తి వేణుగోపాల మూర్తీ 196

గద్య. [1]ఇది శ్రీమద్రాజగోపాలకృష్ణ కరుణా కటాక్ష వీక్షణాలబ్ధ పాండిత్య ధుర్యానవరతావనీమండలాఖండ సామ్రాజ్యధౌరేయ స్వదమర్దితాకృత పటహధణంధణారావ విపరీత పతన క్రియా ఝల్లికాధీశ దుందుభి ధ్వాన కోలాహల హనూమద్ధ్వజాంక కవచ దండీకృత హీర పటీకృత నంది పత ప్రతాప కీర్తి ప్రభావ కోసల వంశ పయః పారావార రాకాసుధాకర హీరాంబర నాయక పౌత్ర రమణ భూపాలక పుత్ర లక్ష్మమాంబా గర్భ శుక్తి ముక్తా ఫల రాఘవ భూనాయకాభిధాన సౌందర్య శీల సుమసాయక విహారి సామనాయక ప్రణీతంబైన భార్గవ పురాణంబునందు యయిరాజ

---

1 ము ఇతి

సంతసంబును వరదరాజస్తవంబును లక్ష్మణుండు యాదవప్రకాశుం
ననుగ్రహించుటయు పరం అష్టోత్తరశత హరిక్షేత్రస్థాపనము
గావించుటయు విశిష్టమత సిద్ధాంతంబును యజ్ఞమూర్తి పరాజయ విభంగం
బున సెలంగు రామానుజాచార్యానుగ్రహంబు గాంచుటయు యతీంద్రుండు
శ్రీరంగమునం దధివసించుటయు నమ్మహాత్ముండు పరమపదంబున
కరుగుటయు సూర్యావతార ప్రభావంబును భాగవతపూజావిశేషంబును
నన్నది యష్టమాశ్వాసము సర్వము సంపూర్ణము

అనుబంధము - I

# చతుర్థాశ్వాసము

[182వ, పేజిలో "గ్రంథపాతము" అనుచోట 8వ, పద్యము నుండి ఈ క్రింది భాగము చేర్చుకొనునది ]

తే.గీ. ఆ పురవరంబు బాలించు నధికయశుఁడు సత్కులీనుఁడు దుర్లక్షకార్యరాశి
ప్రాజ్ఞుఁడును వేదవేత్త ధర్మ స్వరూపి సత్యసంధుండు బహుబలశాలియగుచు

క. ఆ రాజు యుషికి నందనుఁ డారూఢిం గలిగెఁ గొస్తు భాంశజుఁ డగుచున్
వేద కులశేఖరుఁ డనం ధారుణి మాఘుండనను యవర్యసుతారన్

సీ. అతఁడు జనించిన దాదిగా రామాంఘ్రి తామరస ధ్యాన తత్పరుండు
వేద వేత్తయు ధనుర్వేదజ్ఞుఁడును సర్వ శాస్త్రవేదియు సిరికాలి ధర్మ
వత్సలుండును బలవంతుఁడు శుభగుణ కలితు(డి)ష్టా పూర్త కర్త నకల
రాజమాన్యమతి తేజస్వి మూర్ధాభిషిక్తుండు సదయుండు శూర దాత

తే.గీ. దైవత ద్విజ శేషతోర్ధ్వాహవంతుఁ డేకపత్నీవ్రతపరుండు శ్రీకరుండు
రమ్యమతి శరణాగతరక్షకుండు నగుచు ధర్మంబుచే నతఁ డవని నేలె

తే.గీ. దివ్యములగాఁ దనర్చు శ్రీదేవదేవు రూపము లనంతముఁ దగుచు నారూఢి భజన
ము నరింపుచు జనకసురాధినాథ పాదపంకజ భృంగమై ప్రబలుచుండి

క. అతం గుణుండయి సదుపాసక సకలాగ్ర్యవతార సమ భక్తుండై
క్షితి నంబాద్రిపు విశేషత శ్రీరంగేశుపూజ సలిపి ముదముతోన్

వ. ఇట్లద్భుతావతార విశ్వార్చనా పరుండై నిరతంబును దద్భక్తులం బూజించుచుఁ
దద్గతచిత్తుండును తత్పరాయణుండునునై శరీరార్థప్రాణంబులు వారికి సమర్పించుచు
నిజరాజ్యం బంతయుం దదధీనంబు గావించె నమ్మహీపతి యిట్టిధంబున రాజ్యంబు
భాగవతాధీనంబుగావించి యున్నయెడ నొక్కనాఁడు భగవద్భక్తులును మహాత్ములును
గరుణాకరులును శమదమశమావరులును విగత రాగులును బలా(ట) మ(ధ్యఘటి)త
శ్వేత ద్విద్రోర్ధ్వపుండ్రధారులును దన్మధ్య సువర్ణరేఖా సమాన హరిద్రా చూర్ణ ..ం

యుతులును దంటి సరసీరుహాక్ష మాలికా బంధురకంధరులును భుజామూల ప్రాంత బాహాయుత శంఖచక్ర చిహ్నులును (ద్వయమం) త్రానుసంధాన దరితాధరులును దరహాసానుభవానంద పులకితాంగులును పవిత్రకాంతశరీరులును జితేంద్రియులును భగవద్దాస్య యోగైకభోగులును నాచార్య నిష్ఠాగరిష్ఠులును నిజపాదకమల ధ్యా(సంబు)న నవని ధరణీ మండలంబు పావనంబు సేయ నమ్మహానుభావులు స్నేహప్రసన్న హృదయంబున భగవద్దాసానుదాసుండగు నారాజు గృహంబు పూర్వంబు గాఁ ప్రవేశించిన

క వారల మంత్రి ప్రేరణ వారించుచు క్షేత్రములను వారిం గని దా
వారిరుల నల్పి యత్తతి నారూఢిం బల్కి రిట్టు లజ్ఞజనమూర్తి

తే.గీ ఇప్పు డంతఃపురమున మహీశ లేరు దువిదతోఁ గూడ సుఖగోష్ఠి నున్న వాఁడు
చనుఁడు వైష్ణవులార భూజాని నరకు వచ్చి నప్పుడు మీ రిందు వత్తు రనుడు

సీ అది విని భాగవతాగ్రణు లాఁగాక యని వైష్ణవ గృహాంగణాధివసతి
యొగి కీటములు కావ మంత్రిదం బగునని యన్యోన్య వాక్యము లాడుకొనుచు
వేదికయందు నివేశించి రటుగాన క్షితి భగవద్దాస్యశీలు రైన
సత్త్వవంతులను రోషము గల్గి నేర్పున యంత నా ధరుణీకాంతుఁడు వరి

తే.గీ వార ముఖమున వైష్ణవజన విరోధనంబు విని సత్వరమున శరణంబు గాంచు
శయనమునంద లేచి వైష్ణవుల కకట యీ విధంబు విరోధంబు లెందు గలవె

క అనిరుద్ధ భక్తులంగు వార నియుద్ధులు! చేసితి నీ యపరాధము నే
నని చింతించి మహీపతి చని వారి సమీపమునకు సాధ్వసమతియై

ఉ వారి పదారవిందములు వ్రాలి నమస్కరి లేచి పాణిపం
కేరుహముల్ మొగిడ్చి నృపకేసరి పల్కె దయానిధుల్ క్షమా
సారుల మీరు మిమ్ము నుఁగఁ జాలి మంత్రి కృతాపరాధమున్
నేరి క్షమింపరే శరణుఁ జెందితి దాసుఁడ నందు వేఁడినన్

# అనుబంధము - II

# ఛందస్సూచి

| క్రమ సం ఛందస్సు | ఆశ్వాసము | | | | | | | | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | | |
| 1 ఆటవెలది | 9 | 12 | 6 | 2 | 14 | 7 | 11 | 8 | — | 69 |
| 2 ఉత్పలమాల | 3 | 4 | 4 | 8 | 8 | 4 | 7 | 4 | — | 42 |
| 3 ఉత్సాహవృత్తము | — | 1 | — | 1 | — | — | — | — | — | 2 |
| 4 కందము | 47 | 62 | 43 | 67 | 66 | 108 | 89 | 66 | — | 621 |
| 5 చంపకమాల | 17 | 6 | 9 | 14 | 3 | 15 | 27 | 10 | — | 108 |
| 6 తేటగీతి | 33 | 42 | 36 | 39 | 33 | 35 | 29 | 41 | — | 323 |
| 7 తోటకము | — | — | — | — | — | 1 | — | — | — | 1 |
| 8 పంచచామరము | — | — | — | — | 1 | — | — | — | — | 1 |
| 9 భుజంగప్రయాతము | — | — | — | 1 | — | — | — | — | — | 1 |
| 10 మత్తేభము | 14 | 5 | 3 | 10 | 9 | 11 | 10 | 8 | — | 65 |
| 11 మాలిని | 1 | — | 1 | — | — | — | 1 | 1 | — | 4 |
| 12 శార్దూలము | 1 | 2 | — | 4 | 3 | 1 | 5 | 2 | — | 18 |
| 13 సీసము | 21 | 25 | 19 | 38 | 37 | 36 | 29 | 34 | — | 224 |
| 14 వచనము | 35 | 29 | 24 | 16 | 11 | 9 | 22 | 26 | — | 172 |
| మొత్తము | 181 | 173 | 144 | 196 | 174 | 262 | 280 | 196 | — | 1649 |

# పద్యసూచి

# అనుబంధము - III (b)

## వచన సూచి

# అనుబంధము - IV

# ఉపయుక్త గ్రంథసూచిక

తెలుగు


1 అవరాత్మతా పరిణయము – కిరీటి వేంకటాచార్యులు

2 ఆంధ్రకవి సప్తశతి – బులుసు వేంకటరమణయ్య

3 ఆచార్యరత్నహారము – వంగల సీతారామాచార్యులు

4 ఆచార్యసూక్తి ముక్తావళి – వంయారి కేశవాచార్యులు

5 ఆముక్తమాల్యద - శ్రీ కృష్ణదేవరాయలు

6 ఆముక్తమాల్యదా సౌందర్యము – డాక్టర్ టి కోటేశ్వరరావు

7 దాశరథి చరిత్ర - నంబెరుమాళ్ల పురుషకారి కేశవయ్య
పరిష్కర్త వల్లపురెడ్డి బుచ్చారెడ్డి

8 పరమయోగి విలాసము – తాళ్లపాక తిరువేంగళనాథుడు

9 మరుగుపడిన మాణిక్యాలు - డాక్టర్ బి. రామరాజు

10 విశిష్టాద్వైత దర్పణము - కుంటిమద్ది శేషశర్మ

11 శఠకోప చరిత్ర - శ్రీధరమల్లె

12 శ్రీమదాంధ్ర భాగవతము – పోతన

13 శ్రీ మహాభక్తవిజయము–గురుపరంపరా ప్రభావము-మేడేపల్లి వేంకటరమణాచార్యులు

14 శ్రీ రామానుజ తిరుమొళి - సంపాదకులు శ్రీ త్రిదండి రామానుజ జీయర్

15 సమగ్రాంధ్ర సాహిత్యం, 12వ సంపుటం - ఆరుద్ర

16 సూర్య సిద్ధాంత సౌరభము – సప్తమ ఖండము - పరమహంస పరివ్రాజకాచార్య శ్రీ అనుభవానందస్వాములవారు

17 సిరినోము – బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు

సంస్కృతము

18 అమరకోశః - అమరసింహుడు

19 ఋగ్వేదః

20 ఛాందోగ్యోపనిషత్

21 తైత్తిరీయారణ్యకమ్

22 దివ్యసూరి చరితమ్ - గరుడవాహన పండితుడు

23 నారద భక్తి సూత్రాణి

24 ప్రపన్నామృతమ్ - అనంతాచార్యులు

25 భక్తిరసామృతసింధుః - రూపగోస్వామి

26 భార్గవ పురాణమ్

27 మహాభారతమ్

28 రఘువంశః

29 రామాయణమ్ - వాల్మీకి

30 విష్ణుపురాణమ్

31 వేదాంతదేశిక స్తోత్రాణి

32 శాండిల్య భక్తి సూత్రాణి

33 శ్రీభాష్యమ్ - భగవద్రామానుజాః

34 శ్వేతాశ్వతరోపనిషత్

35 స్తోత్రరత్నమ్

కన్నడం

86 నగరవాసదర్శన – మహాకవి లక్ష్మీశాచన సంఘ సురపుర। సంపాదకులు బిక్కపట్నం కృష్ణమాచార్య

87 సురపుర సంస్థాన ఇతిహాస – కపటరాళ కృష్ణరావు

88 సురపుర సాంస్కృతిక ఇతిహాస – పండితరత్నం పెరుమాళ్ గుండాచార్యులు

తమిళం

89 గురుపరంపరాప్రభావమ్ - పిన్బళగియ పెరుమాళ్ జీయర్

*English*

1 A Seminar on Saints

2 Complete works of Swami Vivekananda

3 Early History of Vaishnavism in South India - D N K S Krishna Swami Ayyangar

4 History and the Culture of the Indian People - Dr D C Sarcar

5 History and the Culture of the Indian People – K M Munshi

6 History of Religion, Thought and Life in India - Prof Monier Williams

7 History of Aurangajeb - Prof Jadunatha Sarcar

8 Indian Philosophy - Dr S Radha Krishnan

9 Introduction to Vedanta - Dr P Nagaraja Rao

10 Materials for the study of Early History of the Vaishnava Sect Prof Hemachandra Roy Choudhuri

11 Narada Bhakti Sutra – Swami Sivananda

12 Outlines of Hindu Philosophy - V T Srinivasa Ayyangar

13 Reign of Realism - Dr R Nagaraja Sarma

14 Ramananda to Ramatirtho - Dr Nicole

15 The Brahma Sutra - Dr S Radha Krishna

16 The Cultural Heritage of India Swami Thyagesa namda

17 The Great Acharya - Prof M Ranga Charya

18 The Great Acharyas Dr K Krishnaswami Ayyangar

19 The History of Sri Vaishnavas - Prof T A Gopinath Rao

20 The Life of Ramanuja Swami Rama Krishnananda

21 Vaishnavite Reformers of India Prof T Raja Gopala Chariar

Journals

1 Aradhana

2 Prabuddha Bharata

3 Vedanta Kesari

✿



# A P Govt O M L & R I
# Publication Series

| No. | Title | Rs Ps |
|---|---|---|
| 1 | Seeta Kalyanamu (Telugu)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 2 | Sringara Padamulu (Telugu)<br>*by Unkown poets of antiquity* | 4-40 |
| 3 | Indumatee Parinayamu (Telugu)<br>*by Tenali Ramabhadra Kavi* | 4-00 |
| 4 | Sree Geeta Govindam and Sree Geeta Sankaram (Sanskrit in Telugu Script)<br>*by Sri Jayadeva Kavi &*<br>*by Sri Pancharatnakavi Anantacharya* | 3-75 |
| 5 | Radha Vamseedhar Vilas Natak (Hindi)<br>*by Sri Shahajee Maharaja Bonsle* | 3 75 |
| 6 | Enugula Veeraswamy's Journal (English)<br>(*Kasiyatra Charitra translat d into English*) | 14 00 |
| 7 | Sree Virupaksha Sreerama Copper Plate Inscriptions (1576-1644 A D) | 50 00 |
| 8 | Vaikrita Chandrika (Telugu grammar in Sanskrit)<br>*by Manchella Vasudeva Kavi* | 38 00 |
| 9 | Naradeeya Puranamu (Telugu)<br>*by Alladu Narasimha Kavi* | 65 00 |
| 10 | Kavi Chintamani (Telugu)<br>*by Vellanki Tatambhattu* | 25 00 |
| 11 | An Alphabetical Subjectwise Index of Telugu Manuscripts in A P G O M L & R I | 47 00 |
| 12 | Udayanodayamu (Including Vanamali Vilasamu)<br>*by Narana Surana* | 153 10 |

13 Arsha Kutumbamu — 47-00
*by Sri Vasireddy Durgasadasiveswara Prasad*

14 An Alphabetical Subjectwise Index of Sanskrit Manuscripts available in A P G O M L & R I, Vol *I* — 26-00

15 Tarakabrahmaraajeeyamu — 34-00
*by Chintalapudi Ellanarya*

16 An Alphabetical Subjectwise Index of Urdu Etc Manuscripts — 39 00

17 Alankara Makarandah (Sanskrit) (Telugu Script) — 33 00
*by Rajasekhara Sudhi*

18 Nahush Natak (Hindi) — 36 00
*by Giridharadas*

**Latest Publications**

19 Vajragiri Narasimha Satakamu — 17 00
*by Asakanuri Rangadhama Kavi*
Ramaraja V[illegible]ee Satakamu
*by Kotikilapudi Kodanda Kavi*

20 Yoga Saktaparinayamu (Telugu Poetry) — 67-00
*by Maddipatla Appana Sastry*
and
*Kotra Venkata Rama Kavi*

21 Bhargava Puranamu (Telugu Poetry) — 95 00
*by Bahiri Rama Nayakudu*

22 Mustalhat i Thaggi (Urdu) — 93 00
*by Akbar Ali Alhabadi*

23 Telugu Descriptive Catalogue Vol *I* — 56 00

24 „ , Vol *II* — 56 00

